శ్రీమద్యామున మునయే నమః



శ్రీయామునులు అనుగ్రహించిన

# స్తోత్రరత్నమ్

**(పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానం – ఆంధ్రానువాదం)**



**ఆంధ్రానువాదం:**

పండితరత్న, ఉ.వే.శ్రీమాన్

ఈయుణ్ణి అళగియ శింగరాచార్యులు

**కీ.శే.ఉ.వే.శ్రీమాన్ వోలేటి కోదండ రామానుజాచార్యులుగారి పవిత్ర స్మృతి పుష్పము**

24 అక్టోబరు 2021

శ్రీయామునమునులు అనుగ్రహించిన

**స్తోత్రరత్నమ్** - పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానం

ఆంధ్రానువాదం:

పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

ప్రతులు : 300

ప్రథమ ముద్రణం : 2021

ముఖచిత్రం : నమ్బెరుమాళ్, శ్రీరంగం

ప్రతుల కొరకు : Sri Voleti Ravikumaracharyulu,
Villa# 599, Symphony Park Homes,
Patancheru Town, Patancheru Circle,
Sangareddy District - 502319
Mobile#: 9959600015

అక్షరయోజనము : శ్రీమతి జయలక్ష్మి, తిరుపతి

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్

ఈ గ్రంథం శ్రీమాన్ వోలేటి కోదండ రామానుజాచార్యస్వామివారి స్మృత్యర్థం, వారి కుటుంబసభ్యులచే భగవద్భాగవతాచార్య కైంకర్యరూపంగా ముద్రింపబడినది.



# విషయ సూచిక

శ్రీమతే రామానుజాయ నమః

# పితృదేవో భవ

**ఆత్రేయాన్వయసంజాతం రంగాచార్యగురోస్సుతమ్ ।**
**రఘునాథార్యసచ్ఛిష్యం కోదండరామమాశ్రయే ॥**

శ్రీ మన్మధనామ సంవత్సరం, శ్రావణమాసం, కృత్తికా నక్షత్రం తేది: 12.08.1955న శ్రీమతి & ఉ.వే.శ్రీమాన్ వోలేటి రంగాచార్యులు, లక్ష్మీగోదా గార్ల జ్యేష్ఠ పుత్రుడిగా మా పితృపాదులైన **ఉ.వే.శ్రీమాన్ వోలేటి కోదండ రామానుజాచార్యులు** గారు జన్మించారు. బాల్యం నుంచే ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొని, కుటుంబ బాధ్యత తనమీద వేసుకుని, తాను స్థిరంగా నిలవడమే కాక అటు చెల్లెళ్ల వివాహ బాధ్యతలు నిర్వహించి, ఇటు తమ్ముడికీ జీవనాధారం కల్పించడంలో సఫలీకృతులయ్యారు.

కాలక్రమేణా దైవ సంకల్పం మేరకు వారి ఆశయాలకు తగ్గ ధర్మపత్నిగా శ్రీమతి & ఉ.వే.శ్రీమాన్ మరింగంటి యాదగిరాచార్యులు, వెంకటమ్మ గార్ల ద్వితీయ కుమార్తెయగు **గోదాదేవి**ని తిరువేంగడముడయాన్ (తిరుమల క్షేత్రం) సన్నిధిలో స్వీకరించారు. తదనంతరం, ఆ శ్రీనివాసుని మంగళాశాసనములతో మాకు (వోలేటి రవి కుమారాచార్యులు, వోలేటి అనిల్ కుమారాచార్యులు, వోలేటి లక్ష్మణ్ కుమారాచార్యులు) జన్మ ప్రసాదించారు. చిత్రమేమిటంటే, ఇంతమంది చెల్లెళ్ళ బాధ్యత తనభుజస్కందాల మీద ఉన్నప్పటికీ, తనకూ ఒక ఆడపిల్ల కలగాలని చాలా కోరుకున్నారు. కానీ, దైవ నిర్ణయంగా భావించి, ముగ్గురు కుమారులతో సంతోషంగా జీవనం గడపసాగారు.

సూర్యాపేట పట్టణంలో మెడికల్ ప్రాక్టీషనర్‌గా వృత్తి జీవితాన్ని ప్రారంభించి తదుపరి మిర్యాలగూడ పట్టణమునకు సమీపములో గల దామరచర్ల మండలంలో స్వతహాగా **శ్రీ రవి మెడికల్ అండ్ జనరల్ స్టోర్** వ్యాపారం ప్రారంభించి, మా అమ్మగారికి, అలాగే మా పినతండ్రి గారైన ఉ.వే.శ్రీమాన్ వోలేటి వెంకటాచార్యులు గారికి వ్యాపార నిర్వహణలో శిక్షణ అందించి, **మెడికల్ షాప్ చారి గారు** గా వాసికెక్కినారు. పలుమార్లు స్వలాభాపేక్ష లేకుండా పేదలకు ఉచితంగా వైద్య సేవ, ఔషధ సేవను కూడా అందించి, చుట్టుపక్కల గ్రామాల ప్రజల తలలో నాలుకై మెలిగినారు. ఇలా ఉండగా, గుడుగుంట్లపాలెంలో ప్రభుత్వ ఉద్యోగిగా (ఉపాధ్యాయుడిగా) సేవలు కొనసాగిస్తున్న మా పితామహులైన ఉ.వే.శ్రీమాన్ వోలేటి రంగాచార్యులు గారు పరమపదించారు. తానొకటి తలిస్తే దైవం ఒకటి తలచిన రీతిలో, మా తండ్రి గారికి వ్యాపారం మీద ఎంతో ఆసక్తి ఉన్నా, కుటుంబ బాధ్యతలు, పెద్దల సూచనల మేరకు, మా తాతగారి పరమపద అనంతరం, ప్రభుత్వ ఉద్యోగాన్ని స్వీకరించవలసివచ్చినది. కాకతాళీయంగా వ్యాపారం నిర్వహిస్తున్న దామరచర్ల మండలంలోనే మండల ప్రజా పరిషత్ లో జూనియర్ అసిస్టెంట్ గా బాధ్యతలు స్వీకరించారు.



అటు తన చెల్లెళ్ళ బాధ్యత నెరవేర్చటమే కాక, తనను దరిచేర్చుకుని ఆదరించిన మా మాతామహులైన ఉ.వే.శ్రీమాన్ మరింగంటి యాదగిరాచార్యులుగారి పరమపదానంతరం, మిర్యాలగూడ పట్టణంలోని ఆంజనేయస్వామి వారి దేవాలయ ప్రధాన అర్చకులుగా అదనపు బాధ్యతలు స్వీకరించి, తన మరదలు (మా అమ్మగారి చిన చెల్లెలు జయశ్రీ) వివాహము కూడా జరిపించి, కృతకృత్యులైనారు. మా తండ్రిగారి ఉదారత్వానికి ఇది నిదర్శనం.

సుమారు **28** సంవత్సరముల సుదీర్ఘ ప్రభుత్వ ఉద్యోగ ప్రయాణములో ఎన్నో అవార్డులు, రివార్డులు, ఉత్తమ సూపరిండెంట్ సత్కారములతో సహా, పలు ప్రభుత్వ గుర్తింపులతో ఇంఛార్జి మండల అభివృద్ధి అధికారిగా (MPDO) మోత్కూరు మండలములో పనిచేసి, పలు రాజకీయ ప్రముఖులు, సహోద్యోగులు మరియు ప్రజల ఆదరాభిమానముల మధ్య

నవంబరు 30, 2014లో పదవీ విరమణ చేశారు.

శేష జీవితమును మిర్యాలగూడ ఆంజనేయస్వామివారి భక్తులు, అలాగే కమిటీ సభ్యుల అభ్యర్థన మేరకు, మరల 2019 నుండి ఆంజనేయ స్వామి దేవాలయ ప్రధాన అర్చకులుగా కైంకర్యము సాగిస్తూ, ఆలయాభివృద్ధికి తోడ్పడ్డారు. ఇహ లోకములో మా తండ్రిగారి కైంకర్యమునకు సంతసించిన ఆ రామభక్తుడు, తను స్వామి వేంచేసి ఉండే పరమదమునకు పంపదలచినాడో ఏమో అన్నట్లుగా..2020 నవంబర్ 5వ తారీఖు ఉదయం హఠాత్ గుండెపోటుతో పాంచభౌతిక శరీరమును విడిచినారు.

## చిరస్మరణీయులు:

ప్రతి మనిషి జీవితంలో ఎన్నో తీపి జ్ఞాపకాలు, ఎన్నో అనుభూతులు, మరెందరెందరివో ఆదరాభిమానాలు, అలాగే సుఖ దుఃఖాలు పంచుకుని కావాల్సిన సహాయ సహకారాలు అందించిన కొందరు చిరస్మరణీయులు... మా నాన్నగారి మాటగా...

మా తండ్రిగారి అభ్యున్నతికి అలాగే మాయొక్క ఈ స్థితికి కారకులైన పరమకారుణికులు ఉ.వే.శ్రీమాన్ **మరింగంటి యాదగిరాచార్యులు గారు** మా తండ్రిగారి జీవన ప్రస్థానములో మూలస్థంభం లాంటివారు.

చదువుకోవాలని ఎంతో ఆసక్తి ఉన్నా...కుటుంబ పరిస్థితులు తోడ్పడక పోవటంతో వారాల కొరకు మా మాతామహులైన ఉ.వే.శ్రీమాన్ **మరింగంటి యాదగిరాచార్యులవారిని** మా పితామహులు కోరగా...అప్పటికే ఆరుగురు ఆడ పిల్లలు ఇద్దరు మగ పిల్లలతో సంసారాన్ని నడిపిస్తూ కూడా... మా పితామహుల వారాల అభ్యర్థనకు కళ్ళు చెమర్చేలా బాధపడి, మా తండ్రి గారిని తన సంతతిలో ఒకరిగా ఆదరించి, ఎనలేని సహాయము చేసిన కరుణామూర్తియైన మా మాతమహులకు ఆజన్మాంతము ఋణపడి ఉంటాము.



కుటుంబ పాలన విషయంలో మా తండ్రిగారి వెన్నంటే ఉండి ముందుకు నడిపించిన వారి మేనమామగారైన ఉ.వే.శ్రీమాన్ **చించాపట్టణ గోమఠం కేశవాచార్యుల గారి** ఋణము తీర్చుకొనలేనిది. అలాగే ఉద్యోగ విషయమున సహకరించి, ప్రోత్సహించిన ఉ.వే.శ్రీమాన్ **చిలకమర్తి వెంకటాచార్యులు (రంగప్ప)** గారు చేసిన ఉపకారము చిరస్మరణీయము.

వ్యాపారం నిర్వహిస్తున్న సమయంలో మా తండ్రి గారికి సహకరించిన శ్రీ **గడగోజు శశిధర్** గారు, శ్రీ **చేపూరి దయానంద్** గారు, మరియు **డాక్టర్ విశ్వనాథం** గార్లకు సదా కృతజ్ఞులుగా ఉండవలెనని మా తండ్రిగారు పలుమార్లు మాకు చెప్పిన మాటలు నేటికీ మా మదిలో సుప్రతిష్ఠితములు.

జీవన ప్రయాణములో మా తండ్రిగారికి పలు మార్గదర్శనములు చేసిన ఉ.వే.శ్రీమాన్ **మరింగంటి రామానుజాచార్యులు (నేరేడుచర్ల)** మరియు ఉ.వే.శ్రీమాన్ **మరింగంటి శ్రీనివాసాచార్యులు (క్యాంప్ శ్రీనివాసాచార్యులు)** గార్ల ఉపకారము ఆజన్మాంతము గుర్తుంచుకొనదగినది.

మా తండ్రిగారు చిన్నతనంలోనే తల్లిని కోల్పోయినా.. తల్లిలేని లోటును తీర్చినటువంటి మా నానమ్మగారి చెల్లెళ్ళైన **పుష్పమ్మ గారు, సీతమ్మ గారు మరియు శిరీష (గోపి)** నానమ్మగార్లు చూపించిన ఆదరాభిమానములు, ప్రేమ ఆప్యాయతలు, అలాగే మాకు తాతగారులైన ఉ.వే.శ్రీమాన్ **ముడుంబై రామానుజాచార్యులు (జీయర్ తాతగారు)** మరియు ఉ.వే.శ్రీమాన్ **ముడుంబై శేషు కుమారాచార్య** తాతగార్లు ఆదరించిన తీరు మరువలేనిది.

వీరితో పాటు, వెనువెంటే ఉంటూ, అన్నివేళలా సహకరించిన పెద్దలకు, బంధువులకు, మిర్యాలగూడ భక్త కోటికి శతాధిక వందనములు.

## కోదండమాల

విశేషమైన ప్రతిభా పాటవములు లేకున్ననూ... యధామతి, యధాభక్తి పూర్వకముగా మాతండ్రి గారికై సమర్పిస్తున్న ఈ **కోదండమాల** (మొదటి అక్షరములు కలుపగా మా తండ్రిగారి పేరు వచ్చేట్లుగా వ్రాయడమైనది):

**వోలేటి** వంశంబుననొకనాడు..

**కోటి** వరముల ఫలము తొలిచూరు కాన్పుగా, పెద్దకొడుకైబుట్టె రంగలక్ష్మలకు

**దండ**మ్ము చేబూని మంచినడవడినేర్పి, వెుదటి గురువైమమ్మునాదరించె

**రాగ** మాలికయైన గోదమ్మ పతిగా, ముచ్చటగ పుత్రత్రయమునొసగె,

**మా** పాలి దైవమిక హనుమంతుడేయనుచు, ఆర్తితోడ మరలజేరి మారుతి సేవజేసె,

**నుడి**వె మంచి మార్గము మాకు, భక్తిప్రపత్తులెముక్తి మార్గమనుచు,

**జాలి** గుణముననతడు దరిజేర్చెనెందరినో, అమ్మ చెల్లిలి పెండ్లిచేసె తండ్రివోలె

**చా**చి ఎరుగరు చేయి పరసాయమడుగగా, గగనమంతటి గాంభీర్యమున శోభిల్లెనెపుడు. ఆ

**ర్యు**లెందరోనతని ఆదరముననజూచి, ప్రేమతోడుగ బిలిచె మా "కోదండ" మనుచు

**లుప్త**మయ్యెను నేడు వారి దర్శనమిలలోన, శ్రీహరి నిజపాద సేవనమునకేగె గనుక.



మా తండ్రిగారి స్మృతిలో ఒక గ్రంధము వెలువరించవలెనను మా కోరికను కృపతో మన్నించి, మా జన్మ సార్ధకమగునట్లు చేసిన ఉ.వే. శ్రీమాన్ డాక్టర్ ~~ఈ~~యుణ్ణి అళ్గ శింగరాచార్య స్వామివారికి దాసోహ సహస్రములు సమర్పిస్తున్నాము.

భాగవత పాద రేణువులు:
ఉ.వే.శ్రీమాన్ వోలేటి రవి కుమారాచార్యులు,
ఉ.వే.శ్రీమాన్ వోలేటి అనిల్ కుమారాచార్యులు,
ఉ.వే.శ్రీమాన్ వోలేటి లక్ష్మణ్ కుమారాచార్యులు

ఆళ్వార్, ఎంబెరుమానార్, జీయర్ దివ్య తిరువడిగళే శరణం



శ్రీమద్యామున మునయే నమః
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# పురోవాక్

సంస్కృతంలో స్తోత్ర వాఙ్మయం చాలా ప్రాచీన మైనది. అది వేద కాలంలోనే ఆవిర్భవించింది. వేదాలలో మొదటిది అయిన ఋగ్వేదంలోని పలు సూక్తాలు, పలువురు దేవతలను కీర్తించే స్తోత్ర రూపాలుగా విలసిల్లుతున్నాయి. క్రమంగా ఈ స్తోత్ర సాహిత్యం ఇతిహాస, పురాణాదిసాహిత్యంలో కూడా విస్తరించింది. శ్రీ రామాయణంలో, భారతంలో, ఇంకా పలు పురాణాలలో, ఆగమ సంహితలలో పలు విధాలైన స్తోత్రాలు మనకు గోచరిస్తాయి. వీటిలో కేవలం ఆయా దేవతలకు సంబంధించిన వర్ణనలు, ప్రార్థనలే కాక వేదాంత విషయాలు కూడా చోటుచేసుకున్నాయి. ఈ విధంగా విస్తరించిన స్తోత్రసాహిత్యం అనేక సంప్రదాయాలకు సంబంధించిన పూర్వాచార్యులు రచించిన స్తుతుల వల్ల మరింత అభివృద్ధి చెందింది. ఈ స్తుతులలో పలు సిద్ధాంతాలకు సంబంధించిన అంశాలు ప్రస్తావించ బడ్డాయి. మన పూర్వాచార్యులు రచించిన స్తుతి ప్రబంధాలలో కులశేఖరాళ్వారుల 'ముకుందమాల' మొదటిది కాగా, '**స్తోత్రరత్నం**' రెండవది.

శ్రీవైష్ణవ పూర్వాచార్య పరంపరలో విశిష్టమైన స్థానాన్ని శ్రీయామునాచార్యులవారు అలంకరిస్తున్నారు. పరమాచార్యులుగా ప్రసిద్ధి చెందిన ఈ మహనీయులకు 'ఆళవందార్' అని పేరు. భగవద్రామానుజులు తమను వీరి ఏకలవ్య శిష్యులుగా సంభావించుకున్నారు. శ్రీయామునులు అనుగ్రహించిన స్తోత్ర గ్రంథాలు రెండు. వాటిలో 'కాంతా చతుఃశ్లోకి' లక్ష్మీ వైభవాన్ని వర్ణిస్తున్నది. 'స్తోత్రరత్నం' భగవద్ వైభవాన్ని తెలుపుతున్నది. ఈ స్తోత్రరత్నం వేరు వేరు వృత్తాలలో రచింపబడిన **65** శ్లోకాలను కలిగినది. ఇది



శ్రీ వైష్ణవ సంప్రదాయ విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వాలను సంపూర్ణంగా, మనోహరంగా తెలుపుతున్నందున స్తోత్రాలలో రత్నంగా పేరు పొందింది. ఆసేతు హిమాచలం ప్రచారం పొందిన శ్రీ వైష్ణవ పూర్వాచార్యస్తుతులలో ఇది ప్రథమగణ్యం. ఇతర సంప్రదాయాలకు చెందిన అప్పయ్య దీక్షితులవంటి ప్రసిద్ధ పండితులు ఈ స్తోత్రరత్నంలోని శ్లోకాలను తమ ఆలంకారిక గ్రంథాలలో ఉదాహరించడం దీనిని సూచిస్తుంది. ఈ స్తుతి వైభవాన్ని గూర్చి ప్రస్తావించడానికి ముందుగా యామునుల వైభవం సంగ్రహంగా తెలుపబడుతున్నది.

**భగవద్యామున వైభవం:**

**తిరునక్షత్రతనియన్ శ్లోకం**

**శుచౌ మాస్యుత్తరాషాఢాజాతం యామునదేశికమ్ ।**
**శ్రీరామమిశ్రచరణసరోజాశ్రితమాశ్రయే ॥**

(ఆషాఢ (ఆడి) మాసంలోని ఉత్తరాషాఢా నక్షత్రంలో అవతరించినవారు, శ్రీరామమిశ్రులనే మణక్కాల్‌నంబి శ్రీచరణాలను ఆశ్రయించినవారైన ఆళవందార్‌ను ఆశ్రయిస్తున్నాను)

**నిత్యతనియన్ శ్లోకం**

**యత్పదాంభోరుహధ్యానవిధ్వస్తాశేష కల్మషః ।**
**వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్॥**

(ఎవరి పాదపద్మాల ధ్యానంవల్ల నా సమస్త పాపాలు తొలగిపోయాయో, సత్తను పొందానో, ఆ యామునులను నేను నమస్కరిస్తున్నాను)

మణక్కాల్‌నంబి అవతరించిన **47** సంవత్సరాల తరువాత ధాతృనామ సంవత్సరంలో (క్రీ.శ. **976**వ సం॥లో) ఆడిమాసం పౌర్ణమి, ఉత్తరాషాఢా నక్షత్రంతో కూడిన శుక్రవారంనాడు నాథమునుల కుమారులైన

ఈశ్వరమునులకు వారి ధర్మపత్ని శ్రీరంగనాయకి వల్ల వీరనారాయణపురంలో యామునులు అవతరించారు. నాథమునుల ఆజ్ఞానుసారం వారికి **"యమునైత్తుఱైవర్"** (యామునులు) అనే పేరు పెట్టారు. సకాలంలో అన్నప్రాశన అక్షరాభ్యాస చౌలోపనయనాది సంస్కారాలను పొందిన యామునులు ఏకసంధాగ్రాహి అయినందున వేదాధ్యయనాన్ని ఆనతికాలంలోనే పూర్తిచేశారు. సర్వశాస్త్రాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. తగిన వయస్సులో వీరికి వివాహమైనది.

యామునులు మహాభాష్య భట్టర్ దగ్గర శాస్త్రాభ్యాసాన్ని చేశారు. ఆ సమయంలో రాజపురోహితుడైన 'ఆక్కియాళ్వాన్' అనే పండితుడు చాలా గర్వంతో ఆ రాజ్యంలోని పండితులను కప్పాన్ని చెల్లించమని నిర్బంధించి తీసికొనేవాడు. అతడొకనాడు కప్పం చెల్లించమని మహాభాష్యభట్టు దగ్గరకు తన భటులను పత్రం రాసి పంపాడు. భట్టర్ కప్పాన్ని చెల్లించలేక నిస్సహాయంగా చూచారు. దీనిని గమనించిన యామునులు ఆ పత్రాన్ని చించివేశారు. ఈ సంగతిని విన్న ఆక్కి ఆళ్వాన్ "పత్రాన్ని చింపిన వ్యక్తి కవియా, లేక మీమాంసాది శాస్త్రజ్ఞుడా! తెలిసికొని రండి" అని తన సేవకులను పంపాడు. అపుడు యామునులు **"న వయం కవయస్తు కేవలం న వయం కేవల తంత్రపారగాః, అపి తు ప్రతివాదివారణ ప్రకటాటోపవిపాటవక్షమాః"** (మేము కేవలం కవులము కాము, కేవలం శాస్త్రపండితులమే కాము. ప్రతివాదులనే ఏనుగుల కుంభస్థలాలను పగులగొట్టడంలో కూడా సమర్థులం) అనే శ్లోకాన్ని రాసి పంపించారు. ఈ సమాధానాన్ని చూచి, ఆక్కి ఆళ్వాన్ ఆశ్చర్యపడ్డాడు. ప్రభువు యామునులను వెంటనే రాజసభకు రమ్మని పత్రం రాసి పంపించాడు. ఆ పత్రాన్ని కూడా యామునులు చింపివేశారు. ఈ సంగతిని విని ప్రభువు "వీరు సామాన్యులు కారు" అని గ్రహించి, మళ్ళీ యామునులను గౌరవంగా స్వాగతిస్తూ పల్లకిని పంపాడు.

యామునులు ఆ పల్లకిలో రాజసభకు విచ్చేసి, **"ఆశైలాదద్రికన్యాచరణ కిసలయ న్యాసధన్యోపకంఠాత్ ఆరక్షోనీతసీతా ముఖకమల సముల్లాసహేతోశ్చ సేతోః, ఆచప్రాచ్య ప్రతీచ్య క్షితిధరయుగళాదర్క సోమావతంసాత్ మీమాంసాశాస్త్రయుగ్మ శ్రమవిమలమనా మృగ్యతాం మాదృశోన్యః"** (పర్వతపుత్రి అయిన పార్వతి చిగురుటాకువంటి పాదాల న్యాసాలతో ధన్యమైన కొండచరియలను కల హిమవత్పర్వతం నుండి రాక్షసుడైన రావణునిచే అపహరింపబడిన సీతాదేవి ముఖకమలానికి సంతోషం కల్గడానికి కారణమైన సేతువువరకు, చంద్రసూర్యులిద్దరు శిరోభూషణంగా కల ఉదయపర్వతం, అస్తపర్వతాల వరకు గల దేశంలో పూర్వోత్తరమీమాంసా శాస్త్రాలలో గొప్ప పరిశ్రమలవల్ల విమలమైన మనస్సును కల నావంటివారు ఇంకొకరు ఉన్నారేమో? చూడండి) అనే శ్లోకాన్ని లిఖించారు. తరువాత రాజు అభ్యర్థనపై ఆక్కియాళ్వాన్‌తో వాదయుద్ధానికి సిద్ధమయ్యాడు.

"ఆళ్వాన్! నేను మూడు వాక్యాలను పల్కుతాను. మీరు దానిని ఖండించాలి. అపుడు మీరు పండితులని నేను ఒప్పుకొంటాను" అని యాములన్నారు. ఆక్కియాళ్వాన్ దానికి అంగీకరించారు. అపుడు యామునులు - "(1) మీ తల్లి గొడ్రాలు కాదు, (2) ఈ ప్రభువు పాపరహితుడు, (3) ఈ రాణి పతివ్రత" అనే మూడు వాక్యాలను పలికారు. "ఈ మూడు వాక్యాలను ఖండించండి" అని యామునులు అన్నారు. ఆక్కియాళ్వాన్‌కు ఏమీ తోచలేదు. తాను తన తల్లికి కుమారుడై పుట్టినపుడు ఏవిధంగా కాదనడం? రాజు పాపాన్ని కలవాడని కాని, రాణి పతివ్రత కాదని కాని ఏవిధంగా అనడం? అని తికమకపడ్డాడు ఆ పండితుడు.

అపుడు ప్రభువు "రాజ పండితుడు వీనిని ఖండించలేక పోతున్నాడని అంగీకరిస్తాను. కాని, మీరు జయించారని నేను ఒప్పుకోవాలంటే, మీరా వాక్యాలను ఖండించాలి" అని అన్నాడు. అపుడు యామునులు శాస్త్రప్రమాణ పూర్వకంగానే వాటిని ఈ విధంగా ఖండించారు.

1. ఒకే పుత్రుని కన్నతల్లి గొడ్రాలుతో సమానమని శాస్త్రవచనం. అంతేకాదు, ఎవరు సత్పుత్రుని పొందిందో ఆమె మాత్రమే సంతానవతి. ఈ విధంగా ఇతరుల దగ్గర కష్టాన్ని నిర్బంధించి తీసికొనే దుష్టస్వభావాన్ని కల్గిన వానిని ప్రసవించిన తల్లి, తల్లి కానేకాదు. ఆమె వంధ్యయే.

2. ఈ రాజు ధార్మికుడే. ఇతడే పాపాన్ని చేయలేదనేది వాస్తవమే కాని, ప్రజలు చేసే పాపాలలో ఆఱవ భాగం రాజుకే చెందుతాయి - అని శాస్త్రం పల్కుతున్నది. అపుడు ఈ రాజుకు ఎంత పాపం చేరి ఉంటుంది? మఱి రాజు ఏవిధంగా పాపం లేనివాడని అనగలం? అందుచేత ఈ రాజు పుణ్యాశాలి కాడు.

3. ఈ మహారాణి మహారాజును మాత్రమే వివాహమాడినది నిజం. కాని, శాస్త్రక్రమాన్ని చూస్తే, రాజు ఈ కన్యను వివాహమాడడానికి ముందు ఈ కన్యను కొంతమంది దేవతలకు దానమిచ్చి, ఆ తరువాతనే రాజుకు వివాహం జరిపారు. అందువల్ల రాణికి పాతివ్రత్యం - ఒకేవ్యక్తికి మాత్రం దానమివ్వ లేదనే విషయం శాస్త్రసిద్ధం.

ఈ విధంగా సామాన్యంగా వాదాన్ని జయించిన యామునులు ఆక్కి ఆఝ్వాన్‌తో శాస్త్రవిషయాలలో కూడా వాదించడం ఆరంభించారు. అతనితో "ముందు మీ తత్త్వాన్ని ప్రతిపాదించండి. దానిలో లోపాలను నేను తర్వాత చూపుతాను'' అని అన్నారు. అపుడు ఆఝ్వాన్ ఉపనిషత్ వాక్యపురస్సరంగా తన సిద్ధాంతాన్ని తెలుపడానికి ఆరంభించాడు.

**"ఏకమేవాద్వితీయమ్"** అనేది ఉపనిషద్వాక్యం. బ్రహ్మం ఒక్కటే ఉన్నది. రెండవది లేదు - అని దీనివల్ల తెలుస్తున్నది. బ్రహ్మం తప్ప ఏ తత్త్వం లేదు. ఆ బ్రహ్మానికి కూడా పేరు, రూపం, అవయవాలు, గుణాలు, సొత్తు ఏమీ లేదు. నిర్విశేషచిన్మాత్ర రూపమైన బ్రహ్మమే తత్త్వం - అని ఈ ఉపనిషత్ వాక్యం తెల్పుతున్నందున అదే తత్త్వం. అనేకం ఉన్నట్లుగా భాసించడం అంతా భ్రాంతియే'' అని ఈవిధంగా ఆక్కి ఆఝ్వాన్ అద్వైతమత ప్రతిపాదనను చేశాడు.



యామునులు దీనిని విన్నారు. ప్రభువుతో "రాజా! నేనొక వాక్యాన్ని పల్కుతాను. ఈ వాక్యానికి ఏమి అర్థమో నీవే చెప్పు. దాని తర్వాత వీరి వాదాన్ని గురించి ఆలోచించవచ్చు'' అన్నారు. ప్రభువు సరే అన్నాడు. అపుడు యామునులు "ఈలోకంలో చక్రవర్తి నీవు ఒక్కడవే. రెండవవారు లేరు'' అని అన్నారు. దీనిని విని ఆ రాజు ఆనందంతో "ఈ వాక్యానికి ఏమి అర్థం అని నేను చెప్పాలా! అందఱికి తెలుసు కదా! 'లోకంలో నేను ఒక్కడనే చక్రవర్తి. నాకు సమానమైన లేక మించిన ప్రభువు లేరు' అని కదా దీని అర్థం'' అని అన్నాడు.

"కాని నీ ఆస్థానపండితుడు ఈ వాక్యానికి ఆ విధంగా అర్థాన్ని గ్రహించినట్లు లేదు కదా! 'చక్రవర్తి నీవొక్కడవు మాత్రమే. రెండవ వాడు లేడు' - అంటే నీకు పేరు, రూపం, సంతానం, పరిజనం, సొత్తు, రాజ్యం ఏమీ లేదు - అని కదా ఈ పండితుడు అర్థాన్ని పల్కుతున్నాడు'' అని యామునులన్నారు. రాజు "ఆవిధంగా అర్థం ఏ విధంగా వస్తుంది? నేనొక్కడనే చక్రవర్తి. ఇంకొకరు లేరు - అంటే నావంటివారు ఇంకొకరు లేరు - అని అర్థం తప్ప, 'నాకు ఏదీ లేదు' అనే అర్థం రాదు కదా! నాకు ఏమీ లేకపోతే, నేను ఏవిధంగా చక్రవర్తిని కాగలను?'' అని అన్నాడు.

(ఇక్కడ యామునుల సిద్ధిత్రయంలోని సంవిత్ సిద్ధిలో గల ఈ కారికలను పరికించాలి. **"తేనా ద్వితీయో బ్రహ్మేతి శ్రుతే రర్థోయ ముచ్యతే, ద్వితీయగణనాయోగ్యో నాసీదస్తి భవిష్యతి, యథా చోళనృపః సమ్రాట్ అద్వితీయోద్య భూతలే. ఇతి తత్తుల్యనృపతి నివారణపరం వచః. న తు తత్ భృత్యతత్పుత్ర కళత్రాదినిషేధకమ్"** (అందువల్ల "అద్వితీయం బ్రహ్మ" అని శ్రుతికి గల అర్థం తెలుపబడుతున్నది. ఇక్కడ రెండవవానిగా లెక్క పెట్టదగినవాడు గతంలో ఇపుడు లేడు. ఇక ఉండబోడు - అని అర్థం. చోళరాజు

అద్వితీయుడంటే, అతనితో సమానమైన రాజు ఉన్నాడనే దానిని కాదనడమే. అంతే తప్ప, అతనికి భృత్యులు. పుత్రులు, భార్య మొదలైనవారు లేదని అర్థం కాదు) అనే ఈ కారికలను **"ఏకమేవాద్వితీయమ్"** అనే అద్వితీయ శ్రుత్యర్థంతో సమన్వయిస్తే, బ్రహ్మానికి సాటి వచ్చేది, లేక, మించినది ఇంకొకటి లేదు - అనే అర్థమే వస్తుంది.)

ఉపనిషత్తే **"న తత్ సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"** (పరమాత్మతో సమానమైన, మించినది ఏదీ లేదు) అని అన్నది. నమ్మాళ్వార్లు **"ఒత్తార్ మిక్కారై ఇలైయాయ్ మామాయా"** (సాటి, మించినవారిని ఎవరినీ లేనివాడా!) అని ఈ అర్థాన్ని పలికారు. బ్రహ్మం తప్ప వేఱొక వస్తువు ఏమీ లేదు - అనే భావమే ఈ వేదవాక్యాలకు ఉంటే, బ్రహ్మానికి సమానమైనది, మించినది లేదని చెప్పనవసరం లేదు కదా!

వేదంలో ఇంకా మఱికొన్ని పరికించదగిన వాక్యాలున్నాయి. **"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా"** (భోక్త అయిన జీవుని, భోగ్యవస్తువు అయిన ప్రకృతిని, ప్రేరకుడైన ఈశ్వరుని తలచి) అనే ఒక వాక్యమున్నది. ఇక్కడ భోక్త, భోగ్యం, ప్రేరిత - అనే ఈ ముగ్గురిని ఎవరు తెలిసికొంటున్నారో అతడే అమృతత్వాన్ని, అంటే మోక్షాన్ని పొందుతున్నాడు - అని ఈ వాక్యం తెల్పుతున్నది. దీనివల్ల బ్రహ్మకంటే వేఱయిన వస్తువులున్నాయని వేదమే పల్కింది కదా! కనుక బ్రహ్మం తప్ప వేఱేమీ లేదనడం సరికాదు. పరతత్త్వం ఒక్కటే ఉన్నది అంటే - అది వాస్తవమే. పరతత్త్వం ఒకటే. అనేకం లేవు. అయితే, ఆ తత్త్వానికి పేరు, రూపం, గుణాలు, సొత్తులు అన్నీ ఉన్నాయి అనేదే మా సిద్ధాంతం'' అని అన్నారు యామునులు.

ఈ మాటలను విన్న ప్రభువుకు చాలా తృప్తి, ఆనందం కల్గింది. యామునులే వాదవిజేతగా ప్రకటించాడు. ఎవరు వాదంలో జయిస్తారో వారికి తన రాజ్యంలో సగభాగాన్ని ఇస్తానని ఇంతకు ముందే రాజు మాట ఇచ్చాడు. ఆ విధంగానే ప్రభువు యామునులకు అర్థరాజ్యాన్ని ఇచ్చాడు. రాజపత్ని



కూడా ఆనందించి యామునులను **"ఆళవన్దీరో!"** (మమ్మేలను రక్షించడానికి వచ్చారా!) అని పల్కి, చిన్న బాలుడైన యామునులను దగ్గరకు తీసికొన్నది. **"ఆళవందార్"** అనే పేరును పెట్టింది. వాస్తవానికి యామునులు రాణినే కాదు, శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని కూడా రక్షించడానికి అవతరించారు యామునులు. చోళప్రభువు ఇచ్చిన రాజ్యాన్ని యామునులు పాలించసాగారు.

యామునులు జన్మించడానికి ముందే వారి పితామహులైన నాథమునులు పరమపదించారు. వారు పరమపదించేటప్పుడు తమ శిష్యులైన పుండరీకాక్షుల (ఉయ్యక్కొణ్డార్)తో తమ మనుమడైన యామునులను దర్శన నిర్వాహకునిగా తీర్చిదిద్దవలసినదిగా నియమించారు. యామునులు అవతరించిన కొద్దికాలానికే పుండరీకాక్షులు కూడా పరమపదించే సమయం వచ్చింది. అప్పుడు వారు తమ శిష్యులైన శ్రీరామ మిశ్రుల (మణక్కాల్‌నంబి)ను పిలచి యామునులను దర్శన ప్రవర్తకులుగా తీర్చిదిద్దమనే తమ ఆచార్యుల ఆజ్ఞను తాము జీవించి ఉన్న కాలంలో నెరవేర్చలేక పోయినందున, ఆ కర్తవ్యాన్ని పూర్తి చేయవలసినదిగా వారిని కోరారు. శ్రీరామ మిశ్రులు కూడా తగిన సమయం కోసం ఎదురు చూడసాగారు. అయితే యామునులను సమీపించడం వారికి వీలు కాలేదు. యామునులను కలసికొనే ఉపాయం ఏమున్నది? - అని నంబి ఆలోచించారు. చివరకు ఒక ఉపాయం తోచింది. ఆళవందార్‌కు ఇష్టమైన ముళ్ళ ఉస్తెకూరను ప్రతిదినం వంటశాకకు తీసికొనివచ్చి ఇవ్వడం ఆరంభించారు. ఆళవందార్ దీనిని ప్రతిదినం ప్రీతితో భుజించారు. కాని, ఆ కూరను ఎవరు 'తీసికొనివస్తున్నారు?' అనే సందేహం ఏనాడూ వారికి కలుగలేదు. నంబి అపుడు ఆలోచించి, ఒకనాడు ఆ కూరను ఇవ్వడం మానివేశారు. యామునులకు ఆనాడు ముళ్ళ ఉస్తెకూర పెట్టనందున వంటచేసేవారిని దానికి కారణాన్ని అడిగారు. ప్రతిదినం ఎవరో ముళ్ళ ఉస్తెకూరను ఇస్తున్నారని, ఆనాడు తీసికొనిరాలేదని వారు బదులు చెప్పారు. "ఆ కూరను ఆ వ్యక్తి ఎందుకోసం తీసికొని వచ్చి ఇస్తున్నారు?'' అని

యామునులు అడిగినపుడు ఆ విషయం తెలియదు - అని సేవకులు బదులిచ్చారు. "మళ్ళీ తీసికొని వస్తే వారిని నా దగ్గరకు పిలుచుకొని రండి'' అని యామునులు సేవకులను ఆజ్ఞాపించారు. మఱునాడు మణక్కాల్‌నంబి యథాపూర్వం ఉస్తైకూరను తీసికొని వచ్చి ఇచ్చారు. అపుడు సేవకులు వారిని యామునుల దగ్గరకు తీసికొని వెళ్ళారు. నంబిని చూచి యామునులు "ప్రతిదినం మీరు స్వయంగా ఉస్తైకూరను ఎందుకు తీసికొని వస్తున్నారు? మీకేమి కావాలి?'' అని అడిగారు. "మీ తాతగారు నా దగ్గర ఒక అపూర్వనిధిని దాచి ఉంచారు. దానిని మీకు అప్పగించాలి. అందుకోసం తగిన అవకాశం లభించాలని ఈ విధంగా చేశాను. నాకు ప్రతిదినం కొంతసేపు మీతో కలిసే అవకాశాన్ని మీరు ఇవ్వాలి'' అని నంబి అన్నారు. యామునులు అంగీకరించారు.

నంబి ప్రతిదినం యామునుల దగ్గరకు వెళ్ళి గీతలోని అపూర్వాలైన రహస్యార్థాలను వారికి బోధించడం ఆరంభించారు. భగవానుని పొందడానికి ఆ భగవానుడే ఉపాయంగా ఆశ్రయించాలి తప్ప వేఱు దారిలేదు - అనే విషయాన్ని **"సర్వధర్మాన్"** అనే చరమశ్లోకానికి అర్థంగా మణక్కాల్‌నంబి యామునులకు ఉపదేశించారు. యామునులు దానిని వినినప్పుదు వారికి ఆనందబాష్పాలు ధారగా స్రవించాయి. వెంటనే ఆ భగవానుని సేవించాలనే త్వర వారికి కల్గింది. నంబితో "భగవానుని వెంటనే సేవించే అవకాశం లేదా?'' అని అడిగారు. నంబి "లేకేమి! మీరు రాజ్యభారాన్ని వదలిపెట్టిరండి. మీ తాతగారు దాచి ఉంచిన నిధిని మీకు చూపిస్తాను'' అని అన్నారు. యామునులు వెంటనే రాజ్యాన్ని వీడి నంబి వెంట వచ్చారు. నంబివారిని శ్రీరంగనాథుని సన్నిధికి తీసికొనిపోయి, స్వామిని దర్శింపజేశారు. "మీ తాతగారు దాచి ఉంచిన అపూర్వనిధి ఇదే సుమా!'' అని అన్నారు.

యామునులు ఆనందంతో శ్రీరంగనాథుని కళ్ళార సేవించి తన్మయులయ్యారు. తరువాత వారు సన్న్యాసాన్ని స్వీకరించి, నంబి దగ్గర



సకల సంప్రదాయార్థాలను గ్రహించారు. శ్రీరంగంలోనే స్థిరనివాసం ఏర్పాటు చేసికొని విశిష్టాద్వైత సంప్రదాయ నిర్వాహాన్ని చేయడం ఆరంభించారు. చాలా చిన్నవయస్సులోనే ఆక్కియాళ్వాన్ వంటి మహాపండితుని ఓడించగల్గిన పాండిత్యాన్ని సంపాదించిన యామునులు తాము మహారాజు అయినా, ఏ అహంకారం, దర్పం లేకుండా నంబి సన్నిధిలో శుశ్రూష చేసి సకలార్థాలను వినడం వారి వ్యక్తిత్వ గౌరవానికి పరాకాష్ఠ. ఎంత సామర్థ్యం ఉన్నా, పాండిత్యం ఉన్నా, సంప్రదాయార్థాలను ఆచార్యుల సన్నిధిలో క్రమానుసారంగా నియమానుసారంగా వినాలి - అనే క్రమాన్ని స్వయంగా ఆచరించి చూపారు.

నాథమునులు యోగవిద్యారహస్యాలను తమ శిష్యులలో ఒకరైన 'కురుకైకావలప్పన్' వద్ద నిక్షిప్తం చేశారు. నాథమునులు భగవానుని యోగం ద్వారా దర్శించేవారట. దానిని పుట్టబోయే తమ పౌత్రునకు అందించమని కూడా కురుకైకావలప్పన్‌కు చెప్పారు. ఈ విషయాన్ని నంబి ఆళవందార్‌కు తెలిపి, ఆ యోగవిద్యను కురుకైకావలప్పన్ వద్ద అధికరించమన్నారు. ఆళవందార్ ఆవిధంగానే కురుకైకావలప్పన్ దగ్గరకు వెళ్ళారు. ఆ సమయంలో కురుకైకావలప్పన్ యోగంలో భగవానుని దర్శిస్తూ ఆనందిస్తున్నారు. ఎంత సేపటికి కురుకైకావలప్పన్ కళ్ళు తెరవనందున కొంచెం దూరంలో ఉండే యామునులు అడ్డుగా ఉన్న మొండి గోడ వెనుక నుండి కాలివేళ్ళపై నిలబడి మెడవంచి చూచారు. అపుడు ఉన్నట్లుండి కురుకైకావలప్పన్ కళ్ళు తెఱచి, "ఇక్కడకు మా ఆచార్యకులమైన 'శొట్టై' కులానికి చెందినవారెవరైనా వచ్చారా?'' అని అడిగారు. యామునులు వెంటనే వారి ముందుకు వచ్చి, "ఆ దాసుడను నేనే'' అని పల్కి, నమస్కరించారు. "యోగంలో కళ్ళు మూసికొని ఉండే మీకు నా రాక ఏ విధంగా తెలిసింది?'' అని యామునులు ప్రశ్నించగా, కురుకైకావలప్పన్ "భగవానుడు, నేను ఏకాంతంగా ఉండే సమయంలో, లక్ష్మీదేవి ప్రక్కన ఉన్నా, ఆమె వైపు కన్నెత్తి కూడా అతడు చూడడు. అయితే ఇపుడు అతడు తటాలున నన్ను పక్కకు గెంటి, తలను పైకెత్తి మాటిమాటికి

ఎవరికోసమో చూస్తున్నాడు. అందువల్ల, ఆచార్యులైన నాథమునులకు చెందినవారెవరో ఇక్కడకు వచ్చి ఉండాలని నాకు తోచి, ఈ విధంగా అడిగాను'' అని అన్నారు. అపుడు ఆళవందార్ తమ కోరికను వెల్లడించగా, ఒక నిర్దిష్టసమయాన్ని తెలిపి, అపుడు వస్తే ఆ యోగాన్ని ఉపదేశిస్తానని అప్పన్ అన్నారు. ఆళవందార్ శ్రీరంగానికి తిరిగి చేరారు. కొంతకాలం గడిచింది. ఆ సంగతిని ఆళవందార్ మఱచిపోయారు.

కొంతకాలం తరువాత శ్రీరంగంలో శ్రీరంగనాథుని అధ్యయనోత్సవం జరిగే సమయంలో అరైయర్‌స్వామి పాశురాలను గానం చేస్తున్నారు. **"కెడుమిడరాయ వెల్లామ్"** అనే దశకం ఆలపించే ఆ సమయంలో **"అనన్తపురమ్ నడమినో నమర్కళుళ్ళీర్"** (దాసులారా! తిరువనంతపురానికి వెళ్ళి సేవించండి) అనే సూక్తి ప్రస్తావనకు వచ్చింది. "భగవానుడు మనలను తిరువనంతపురానికి వెళ్ళి, అక్కడ వేంచేసి ఉండే పద్మనాభస్వామిని సేవించమని అన్నారు. మనం ఆ స్వామిని సేవిద్దాం రండి అని తిరువనంతపురానికి వెళ్ళి పద్మనాభస్వామికి మంగళాశాసనం చేశారు. కేరళదేశ యాత్ర ముగిసే సమయంలో కురుకైకావలప్పన్ చెప్పిన సమయం వారికి గుర్తుకు వచ్చింది. కాని, అపుడు వారుండే చోటుకు అప్పన్ ఉండే చోటుకు మధ్య ఉండే దూరం చాలా ఎక్కువగా ఉన్నదని తెలిసిన యామునులు "అయ్యో! ఇపుడొక పుష్పక విమానం ఉంటే ఇపుడే అప్పన్ దగ్గరకు వెళ్ళగలిగి ఉండేవాడనే!" అని క్లేశపడ్డారు. చేయగల్గినది లేక విచారంగా శ్రీరంగానికి చేరారు. ఆ విధంగా నాథమునుల యోగవిద్య కురుకైకావలప్పన్ తో అంతరించి పోయింది. ప్రపత్తివిద్య మాత్రం పరంపరగా కొనసాగింది.

ఆళవందార్‌కు పలువురు శిష్యులు ఉన్నారు. వారిలో - పెరియనంబి, తిరుక్కోట్టియూర్ నంబి, తిరువరంగ ప్పెరుమాళ్ అరైయర్, తిరుక్కచ్చి నంబి, శొట్టైనంబి మొదలైనవారు ప్రముఖులు. వీరు ఆళవందార్ వద్ద రహస్యార్థాలను శ్రవణం చేశారు.



ఆళవందార్ కాలం నుండే దివ్యప్రబంధ పాశురాలలోని అర్థాలను గూర్చి విచారణం చేయడమనేది ఆరంభమైనదని వ్యాఖ్యానాలలోని ఐతిహ్యనిర్వాహాలను బట్టి తెలుస్తున్నది. ఒక పర్యాయం, నమ్మాళ్వార్ అనుగ్రహించిన **"ఉణ్ణుమ్ శోఱు"** అనే తిరువాయ్‌మొళిలోని దశకం, తిరుమంగై ఆళ్వార్ల **"కళ్వన్ కొల్"** అనే పెరియ తిరుమొళిలోని దశకం గూర్చి ఆళవందార్ కాలక్షేపగోష్ఠిలో చర్చకు వచ్చింది.

రాత్రివేళ తనతో పాటు పరుండిన పరాంకుశనాయకి కొంతసేపటికి కన్పించకపోవడంతో ఆమె తల్లి కలవరపడింది. చివరకు **"తిణ్ణమ్ ఎన్నిళమాన్ పుకుమూర్ తిరుక్కోళూరే"** (నా చిన్నది వెళ్ళే ఊరు నిశ్చయంగా తిరుక్కోళూర్ దివ్యదేశమే) అని నిశ్చయించుకొని పల్కింది - అనేది **"ఉణ్ణుమ్ శోఱు"** దశకంలోని విషయం.

ఈ విధంగానే రాత్రివేళ పరకాలనాయకి తల్లి, తనతో పాటు శయనించిన పరకాలనాయకి కొంత సమయం తరువాత కన్పించనందున కలవరపడింది. ఇంతరాత్రి వేళ భగవానుడు వచ్చి ఆమెను తీసికొని పోయాడని ''వారిద్దరు తిరువాలి దివ్యదేశానికి వెళ్ళి ఉంటారా?'' అని ఆమె సందేహిస్తున్నట్లుగా **"కళ్వన్ కొల్"** దశక ప్రమేయం ఉన్నది.

**"ఉణ్ణుమ్ శోఱు"** దశకంలోని పరాంకుశనాయకి ఒంటరిగా, తిరుక్కోళూరులోని నాయకుడైన భగవానుని దగ్గరకు చేరాలని బయలుదేరింది. కాని, **"కళ్వన్ కొల్"** దశకంలోని పరకాలనాయకి నాయకునితో కలసి తిరువాలి క్షేత్రానికి బయలు దేరింది. ఈ ఇద్దఱిలో ఎవరిని గూర్చి మిక్కిలి ఎక్కువగా భయపడాలి?'' అని కొందఱు ప్రశ్నించారట. దీనికి ఆళవందార్ గోష్ఠిలోని కొందఱు, నాయకుని సహాయంతో బయలు దేరిన పరకాలనాయకిని గూర్చి భయపడనక్కరలేదు కదా! కాని, రాత్రివేళ ఒంటరిగా నాయకుని దగ్గరకు వెళ్ళాలని బయలుదేరిన పరాంకుశనాయకిని గూర్చే కదా ఎక్కువగా భయపడాలి?'' అని అన్నారట.

దీనిని విన్న ఆళవందార్ సరసంగా "ఆ విధంగా కాదు, పరకాలనాయకి భగవానునితో కలసి కదా వెళ్ళింది. ఈ విధంగా వెళ్ళిన ఇద్దఱు ఒకరిపై ఇంకొకరికి అంతులేని ప్రీతిని, వ్యామోహాన్ని కలవారు. అందువల్ల, ఆ ప్రేమ పిచ్చిలో ఎదురుగా ఏ ఆపద వచ్చినా వారు గుర్తించలేరు. అందుచేత వారు ఎక్కడకు వెడతారో, గమ్యం చేరతారో లేదో! ఏ ఆపదలో అయినా వారు చిక్కుకొనే ప్రమాదం ఉన్నది. కాని, ఒంటరిగా వెళ్ళిన పరాంకుశనాయకి, ఆమెకు భగవానునిపై (నాయకునిపై) గల వ్యామోహాతిశయం చేత, తప్పక అతని వద్దకు చేరకుండా ఉండదు. కనుక, భయం లేదు. ఇద్దఱుగా కలసి వెళ్ళిన వారిని గూర్చే భయపడాలి. ఒంటరిగా వెళ్ళిన వారిని గూర్చి భయపడనక్కరలేదు." అని అన్నారట. ఇక్కడ తిరువాయ్‌మొழி పాశురంలో **"తిణ్ణమ్ ఎన్నిళమాన్ పుకుమూర్ తిరుక్కోళూరే"** (నా పుత్రిక చేరే చోటు నిశ్చయంగా తిరుక్కోళూరే) అని నిశ్చయార్థకంగాను, పెరియతిరుమొழி పాశురంలో, **"అణియాలి పుకువర్‌కొలో?"** (అందమైన తిరువాలిక్షేత్రాన్ని ఈ నాయకీ నాయకులు చేరగలరా?) అని సందేహాస్పదంగాను, భయంగాను పల్కడంలోని స్వారస్యాన్ని బట్టి ఈ విధంగా ఆళవందార్ అర్థనిర్వాహాన్ని చేసి ఉండవచ్చు.

ఇంకొక సమయంలో, యామునుల కాలక్షేపగోష్ఠిలో ఒక విషయం ప్రస్తావనకు వచ్చింది. "భగవానుని కఠినమైన పదాలతో దూషించిన శిశుపాలుడు పరమపదాన్ని పొందాడు కదా!" అని కొందఱు అడిగారు. దానికి ఆళవందార్ "నిజానికి అతడు పొందిన ఫలం పొందదగినది కాదు. భగవానుని పొందాలి- అని ఆశ పడి, ఆ భగవానుని అనుగ్రహంవల్ల అతనిని పొందడమనేది క్రమం. ఈ రీతిలో శిశుపాలుడు మోక్షాన్ని పొందలేదు. "శిశుపాలుడు ఇంకా ఈ లోకంలో ఉంటే తన వలెనే ఈ లోకాన్ని మార్చగలడు. ఈ లోకంలోని వారు అతనివలెనే క్రూరులు కారాదు" అనే భావంతోనే భగవానుడు. వేఱే దారి లేక, అతడు పరమపదాన్ని చేరేటట్లు తన చక్రాయుధంతో అతని



శిరస్సును ఖండించాడే తప్ప, శిశుపాలుని అనుగ్రహించి, పరమపదాన్ని ఇవ్వలేదు" అని చమత్కారంగా అన్నారట. ఆళవందార్ నిర్వహించిన ఈ విధమైన పలు సరసమైన నిర్వాహాలు వ్యాఖ్యానాలలో గోచరిస్తాయి.

'నాయనార్ ఆచ్చాన్‌పిళ్ళై' రచించిన చరమోపాయనిర్ణయమనే గ్రంథంలో ఒక అద్భుతవిషయం తెలుపబడింది. కాంచీపురంలో యాదవప్రకాశులు ఉపనిషత్ వాక్యాలకు అపార్థం చెప్పగా, దానిని శ్రీరామానుజులు సరిచేశారు - అనే సంగతిని యామునులు విన్నారు. వారికి వెంటనే 'శ్రీరామానుజులను చూడాలి' అనే ఆశ కల్గింది. కంచి వరదరాజస్వామి కోవెలలో దర్శనం కోసం వచ్చి, కరియమాణిక్క ప్పెరుమాళ్ సన్నిధిలోని మెట్టుపై ఆళవందార్ కూర్చున్నారు. అపుడు యాదవప్రకాశులు తమ శిష్యగణంతో కోవెలకు వచ్చారు. ఆ గోష్ఠిలో రామానుజులు ఎవరు? అని తమ శిష్యులైన తిరుక్కచ్చినంబిని అడిగారు. తిరుక్కచ్చినంబి రామానుజులను చూపించారు. రామానుజులను చూచిన యామునును తమ కన్నులను మూసికొని ఆలోచించి చూచారు. తాము ఆరాధించే భవిష్యదాచార్యరూపం, రామానుజుల రూపం ఒకటిగానే ఉండడం గమనించిన వారికి చాలా ఆనందం, తృప్తి కల్గింది. 'భగవానుడు ఇకపై వీరి ద్వారా సంప్రదాయరక్షణను చేస్తాడు. విచారించనక్కరలేదు' అనే ఆశ్వాసం వారికి కల్గింది. తమ చల్లని మనస్సుతో **"ఆముదల్వన్"** అని శ్రీరామానుజులను కటాక్షించారు. **("ఆముదల్వన్" - అంటే వీరు సంప్రదాయ ప్రవర్తకులు కాగలరు అని అర్థం)**

సదాచార్యకటాక్షం పడితే అంతకుమించి మంచికి ఇంకొక హేతువు అక్కరలేదు కదా! **"ఏకయైవ గురోః దృష్ట్యా ద్వాభ్యాం వాపి లభేత యత్, న తత్ త్రిసృభిరష్టాభిః సహస్రేణాపి కస్యచిత్"** అని అంటారు వేదాంతదేశికులు. ఒక కంటితో ఆచార్యులు వీక్షించినా చాలు. ఆ కటాక్షంతో మూడు కళ్ళను కల శివుని కటాక్షంగాని, ఎనిమిది నేత్రాలను బ్రహ్మకటాక్షం గాని, వేయి కళ్ళను కల భగవానుని కటాక్షం గాని సాటిరాదు - అని దీని తాత్పర్యం.

ఆచార్యుని రెండు నేత్రాలంటే - బాహ్యచక్షువు ఒకటి, ఆంతరనేత్రం ఇంకొకటి. ఆచార్యుడు బాహ్యనేత్రంతో కటాక్షించినా చాలు. ఆంతరనేత్రంతో కటాక్షిస్తే ఇక చెప్పనక్కరలేదు. అది చాలా విశేషఫలితాన్ని ఇస్తుంది. అటువంటి విశేషకటాక్షాన్ని యామునులు శ్రీరామానుజులపై ప్రసరింపజేశారు. శ్రీరామానుజులకోసం యామునులు వరదరాజస్వామి సన్నిధిలో శరణాగతి చేసి, వారిని త్వరగా సంప్రదాయ నిర్వాహకులుగా చేయాలి - అని వరదరాజస్వామిని ప్రార్థించారు. భవిష్యదాచార్యులు శ్రీరామానుజులే అనే సంగతిని గుర్తించినందున ఆవిధంగా వారు ప్రార్థించారు.

**"యస్య ప్రసాదకలయా బధిరః శ్రుణోతి పంగుః ప్రధావతి జవేన చ వక్తి మూకః, అంధః ప్రపశ్యతి సుతం లభతే చ వంధ్యా తం దేవమేవ వరదం శరణం గతోస్మి"** అనే శ్లోకంతో యామునులు వరదరాజస్వామిని ప్రార్థించారు. "వరదరాజస్వామి కృపతో చెవిటివాడు వినగలడు. కుంటివాడు పరుగెత్తగలడు, మూగవాడు వేగంగా మాట్లాడగలడు, గుడ్డివాడు చూడగలడు, గొడ్రాలు కుమారుని పొందగలదు. అటువంటి ఆ వరదరాజస్వామిని శరణువేడుతున్నాను'' అని ఈ శ్లోక భావం.

శ్రీరామానుజుల విషయంలో ఇవి అన్నీ సంభవించాలని యామునులు ప్రార్థించారని తిరుపతి వాస్తవ్యులు 'శ్రీవైష్ణవ సింహ' ఉ.వే.శ్రీమాన్ టి.వి. కృష్ణమాచార్యస్వామివారు ఈ శ్లోకాన్ని సరసంగా వివరించారు. వినకూడని విషయాన్ని వినేవాడు చెవిటివాడు. వినదగిన విషయాలను వినడమే చెవి ఉన్నందుకు ప్రయోజనం. ఇన్నాళ్ళు శ్రీరామానుజులు యాదవప్రకాశుల వద్ద తగని అర్థాలను విన్నారు. ఇకపై వారు సత్సంప్రదాయార్థాలను వినేటట్లుగా అనుగ్రహించాలి - అనేది ఇక్కడ ప్రార్థింపబడింది. పెరియనంబి, తిరుమాలైయాణ్డాన్, తిరుమలైనంబి, తిరుక్కోట్టియూర్‌నంబి, తిరువరంగప్పెరుమాళ్ అరైయర్ - అనే తమ శిష్యుల దగ్గర వినాలి - అనేదే ఇక్కడ తాత్పర్యం. ఇది **"బధిరః శ్రుణోతి"** అని సూచింపబడింది.



కుంటివాడు ఎక్కడికీ వెళ్ళలేక, ఒక చోటనే ఉంటాడు. ఇంతకాలంగా శ్రీరామానుజులు కంచిని దాటి ఎక్కడకూ వెళ్ళలేదు. ఆ విధంగా కాకుండా అంతటా దిగ్విజయయాత్ర చేసి, దివ్యదేశాలను అన్నిటిని సందర్శించి, అంతటా దర్శననిర్వాహాన్ని చేయాలి. ఒకే చోట ఉంటే ఇది కుదరదు కదా! ఇపుడు, ఒకే చోట ఉండే శ్రీరామానుజులు అన్ని చోట్లకు వెళ్ళేటట్లు అనుగ్రహించాలి - అనేది **"పంగుః ప్రధావతి"** అనే సూక్తిలోని తాత్పర్యం.

మూగవాడు నోరు తెరచి పలుకలేడు. యాదవప్రకాశుల వద్ద ఇపుడు రామానుజులు మూగవానివలె కదా ఉన్నారు. ఆ విధంగా కాకుండా వీరు అన్ని చోట్లకు పోయి, ప్రతివాదులతో వాదించి గెలిచి, సిద్ధాంతాన్ని సుస్థాపించాలి - అనేది **"జవేన చ వక్తి మూకః"** అనే దాని తాత్పర్యం. ఈ ప్రార్థనాఫలంగానే శ్రీరామానుజులు తొండనూర్‌లో వేయిమంది జైనులతో ఒక్కరే వాదించి గెలిచారు.

గుడ్డివాడు కన్ను తెరచి చూడలేడు. శ్రీరామానుజులకు దర్శనతత్త్వాలన్నీ స్పష్టంగా దర్శించగల్గిన శక్తి కలగాలి. శ్రీభాష్యం రచించే అవధికి ఆంతరదృష్టి కలగాలి. దీనిని వరదరాజస్వామి కల్గించాలి - అనేది **"అంధః ప్రపశ్యతి"** అనే ప్రార్థనలోని తాత్పర్యం.

ఆచార్యులు శిష్యులను పొందడం అనేది సంతానం పొందడం వంటిదే. ఇంతవరకు రామానుజులకు శిష్యులు ఎవరూ లేరు. ఇకపై, వీరికి వేలాది శిష్యుల అభివృద్ధి కలగాలి; వారి ద్వారా సంప్రదాయాన్ని వ్యాపింపజేయాలి - అని వరదరాజస్వామిని ఆళవందార్ ప్రార్థించారు. దీని ఫలంగానే 12 వేల మంది శిష్యులు శ్రీరామానుజులకు ఏర్పడ్డారు. ఇది **"సుతం లభతే చ వంధ్యా"** అనే సూక్తి భావం.

ఈ రీతిలో, భగవద్రామానుజులు సంప్రదాయార్థాలను వినాలి,

దిగ్విజయ యాత్ర చేయాలి, వాదులను చేసి జయించాలి, పలు శాస్త్రాలను అధికరించాలి, వేలాది శిష్యులను పొందాలి, ఆ విధంగా నీవు కటాక్షించాలి- అని యామునులు వరదరాజస్వామి అర్థించారు. ఈ ప్రార్థనా ఫలంగానే వరదరాజస్వామి శ్రీరామానుజులను విశ్లేషించడానికి సిద్ధమయ్యాడు.

శ్రీరామానుజులతో సంభాషించే అవకాశం యామునులకు లభించలేదు. శ్రీరంగానికి తిరిగి వెళ్ళిపోయారు. కొంతకాలానికి యాదవప్రకాశులను రామానుజులు విడచిపెట్టిన సంగతి యామునులకు తెలిసి, వారిని తమవద్దకు తీసికొని రమ్మని పెరియనంబిని పంపారు. పెరియనంబి రామానుజులను పిలుచుకొని శ్రీరంగానికి చేరే సమయానికి ఆళవందార్ పరమపదించారు. వారి చరమదేహాన్ని మాత్రమే శ్రీరామానుజులు దర్శించగలిగారు. వారి చేతివేళ్ళు ముడుచుకొని ఉండడాన్ని చూచి, దానికి కారణాన్ని అక్కడున్నవారిని రామానుజులు అడిగినపుడు, యామునులకు మనస్సులో మూడు కొఱతలుండేవి - అని, ఆ మూడు కొఱతలను సూచించడం కోసమే ఈవిధంగా మూడు వేళ్ళు ముడుచుకొన్నాయని వారన్నారు. అపుడు రామానుజులు 'భగవత్కటాక్షం ఉంటే వాటిని తాము పూర్తి చేస్తా'మని ప్రతిజ్ఞ చేయగా, ఆ మూడు వేళ్ళు యథాస్థితికి వచ్చాయి. ఆ కోరికలు మూడు ఏమంటే - (1) బ్రహ్మసూత్రభాష్య రచన, (2) వ్యాసపరాశరుల జ్ఞాపకంగా ఏదయినా చిరకాలం గుర్తుగా ఉండేటట్లు చేయడం, (3) తిరువాయ్‌మొழி వ్యాఖ్యానం రచించడం - అనేవి. శ్రీరామానుజులు శ్రీరంగనాథుని సేవించకుండానే కంచికి తిరిగి వచ్చారు.

యామునులు **సిద్ధిత్రయం, ఆగమప్రామాణ్యం, స్తోత్రరత్నం, చతుః శ్లోకి, గీతార్థసంగ్రహమనే** గ్రంథాలను రచించారు. ఇవి ఇపుడు లభిస్తున్నాయి. ఇంకొక గ్రంథం 'మహాపురుష నిర్ణయం' మాత్రం దొరకడం లేదు. శ్రీరామానుజులకు యామునుల సిద్ధిత్రయం శ్రీరామానుజుల శ్రీభాష్యరచనలో, వేదార్థసంగ్రహ, వేదాంత దీపసారాల రచనలో చాలా



ఉపకరించింది. గీతార్థసంగ్రహం గీతాభాష్యరచనలో తోడ్పడింది. స్తోత్రరత్నం, చతుఃశ్లోకి శ్రీరామానుజులకు గద్యత్రయ రచనలో సహకరించాయి.

యామునులు పల్కిన వార్తలు సుమారు పన్నెండు వార్తామాల గ్రంథంలో లభిస్తున్నాయి. "దరిద్రునకు గొప్ప నిధి లభించినట్లుగా మనకు ద్వయం లభించింది" అని ఆళవందార్ అనేవారని 138వ వార్త తెల్పుతున్నది. "నమ్మాழ்వార్ల వైభవాన్ని చూస్తే తిరుక్కుఱుఙ్గుడి నంబియే ఆழ்వార్లుగా అవతరించారని చెప్పవచ్చు" అని ఆళవందార్ అనేవారు - అని 188వ వార్త తెల్పుతున్నది.

తిరుమంత్రంలోని మొదటి పదం అయిన ప్రణవం స్వరూపజ్ఞానాన్ని కల్గిస్తున్నందున భగవత్ సంబంధమనే రాజు కులాన్ని, నమః పదం ఉపాయాంతరశూన్యతను కల్గిస్తున్నందున ప్రపత్తి విద్యానిష్ఠను, మూడవ పదమైన **"నారాయణాయ"** అనే పదం కైంకర్యాన్ని తెల్పుతున్నందున భగవద్భాగవత కైంకర్యమనే సత్ప్రవర్తనను జీవునకు కల్గిస్తున్నవి - అని ఆళవందార్ నిర్వాహం - అని 36వ వార్త తెల్పుతున్నది. ఈ విధంగానే **84, 204,209, 303, 394, 403, 441, 446** వార్తలు కూడా యామునులను గూర్చినవే.

ప్రమేయరత్నమనే గ్రంథంలో - "కరణత్రయం కలవడం ఆర్తలక్షణం. వాటిలో ఒకటి కూడడం దృప్తలక్షణం. తత్తత్ ప్రాయశ్చిత్తాలలో నివర్తించుకోదగిన సకలపాపనివృత్తికి తదేకోపాయాధ్యావసాయం ప్రపత్తి" (మనస్సు, వాక్కు, శరీరం అనే మూడు కరణాలూ కలవడం ఆర్త ప్రపన్నుని లక్షణం. వాటిలో ఒకటి కూడడం దృప్తప్రపన్నుని లక్షణం. ఆయా ప్రాయశ్చిత్తాలతో పోగొట్టుకోదగిన సకల పాపాల నివారణకు భగవంతుడే ఉపాయమనే స్థిరమైన నిశ్చయాన్ని కలిగి ఉండడమే ప్రపత్తి) - అని ఆళవందార్ అనేవారని 3వ ప్రకరణంలో తెలుపబడింది.

పెరియాళ్వార్ తిరుమొళిలోని **"ఎమ్మనా! ఎన్ కులదైవమే! ఎజ్ఞళ్ నాయకనే" (5-4-3)** అనే ఈ మూడు సంబోధనలు జ్ఞానవిరోధి, ఆశ్రయణవిరోధి, మోక్షవిరోధి తొలగడాన్ని తెల్పుతున్నాయి'' అని ఆళవందార్ అన్నారు-అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్య. దివ్యప్రబంధవ్యాఖ్యలలో కూడా సుమారు 50 సందర్భాలలో శ్రీయామునుల అర్థనిర్వాహాలు గోచరిస్తాయి. కొన్ని చోట్ల శ్రీరామానుజుల నిర్వాహాలకు, శ్రీయామునుల నిర్వాహాలకు తేడా ఉన్నా, వాటిని **"న హి నిందాన్యాయం"** లో అన్వయించి, వివిధ సరసార్థాలను తెలిపే ప్రకారాలుగా గమనించాలి తప్ప, సిద్ధాంతంలో వాటి మధ్య పరస్పర వైరుధ్యం ఉన్నదని భావించరాదు.

## స్తోత్రరత్నం - శ్రీ రామానుజులు:

యామునులు రచించిన స్తోత్రరత్నం భగవద్రామానుజులకు చాలా ఇష్టమైనది. దీనికి వారి చరిత్రతో విడదీయరాని సంబంధం ఉన్నది. శ్రీరామానుజులను ఉద్దేశించి ఈ స్తోత్రరత్నాన్ని యామునులు రచించారని పెద్దల అభిప్రాయం. నాథమునులు నమ్మాళ్వారుల వద్ద తిరువాయ్ మొళి ప్రబంధాన్ని ఉపదేశంగా పొందిన సందర్భంలో, ఆ ప్రబంధంలో **"పొలిగ పొలిగ పొలిగ....కలియుమ్ కెడుమ్ కండుకొణ్ మిన్"** అనే పాశురం ప్రసక్తం అయినప్పుడు, ఈ పాశురంలో నిర్దేశింపబడిన మహాపురుషుడు భవిష్యదాచార్యుడిగా అవతరించబోతాడు అని, ఆ మహాపురుషుని నాథమునులు పౌత్రులు అయిన యామునులు కటాక్షిస్తారని నమ్మాళ్వారులు నాథమునులకు తెలియజేశారు - అనే విషయం పూర్వాచార్యుల శ్రీసూక్తి వల్ల ప్రసిద్ధమైనది. ఆ భవిష్యదాచార్యులను ఉద్దేశించే "గోష్పదంలో నీరు తాగితే ఒక పిచ్చుక దాహమే తీరుతుంది. వీర నారాయణ పురంలోని చెరువులో నీరు తాగితే దేశం దాహం అంతా తీరుతుంది'' అని నాథమునులు మాటిమాటికి అనేవారట. ఇక్కడ వీర నారాయణ పురంలోని చెరువు అంటే



శ్రీ రామానుజులే. శ్రీరామానుజులను ఆశ్రయిస్తే జగత్తు అంతా తరిస్తుంది అని దీని భావం. ఈ విధంగా నాథమునులు భవిష్యదాచార్యులైన శ్రీరామానుజులను వీర నారాయణ పురంలోని చెరువుగా భావించి పలికిన దానిని అనుసరించే భగవద్రామానుజులు కూడా ఆ చెరువు నుండి నీరు ప్రవహించే 74 తూములవలె సంప్రదాయ ప్రచారం కోసం 74 మంది సింహాసనాధిపతులను నియమించారు - అని కూడా పెద్దలు అంటారు. ఎంబార్ అనే ఆచార్యులు రచించిన **"లక్ష్మీనాథాఖ్య సింధౌ"** అనే శ్లోకంలో శ్రీ రామానుజులు నియమించిన సింహాసనాధిపతులు చెరువు నుండి నీరు ప్రవహించే తూములుగా రూపింపబడడం ఈ విషయాన్ని సూచిస్తుంది.

ఈ విధంగా జగత్తు అంతా తరించడం కోసం అవతరించిన భవిష్యదాచార్యులైన శ్రీరామానుజులను కటాక్షించి, వారిని దర్శన స్థాపకులుగా తీర్చిదిద్దాలి - అనే నాథమునుల అజ్ఞ ఉయ్యక్కొండార్, మణక్కాల్ నంబి అని ఇద్దరు ఆచార్యుల ద్వారా శ్రీ యామునులకు చేరింది. నమ్మాళ్వారులు ప్రసాదించిన భవిష్యదాచార్య విగ్రహం, వారి లక్షణాలు శ్రీయామునులకు లభించాయి. వాటిని బట్టి శ్రీయామునులు కాంచీపురంలో యాదవప్రకాశుల దగ్గర అద్వైత వేదాంతాన్ని అధ్యయనం చేస్తున్న రామానుజులే నమ్మాళ్వారుల చేత తెలుపబడిన మహాపురుషులు అని గ్రహించారు. వారిని దర్శన స్థాపకులుగా తీర్చిదిద్దడం కోసమే శ్రీయామునులు స్తోత్రరత్నాన్ని రచించి వరదరాజ స్వామి సన్నిధిలో తమ కోరిక తీరడం కోసం ప్రార్థించారుకూడా.

తరువాత, పెరియ నంబి ద్వారా ఈ స్తోత్ర రత్నాన్ని శ్రీ రామానుజులు ఆలకించేటట్లు చేసి, వారిని ఇందులో ఆసక్తులు అయ్యేటట్లు చేసి, శ్రీయామునులు నాథమునుల కోరికను సఫలం చేశారు - అనే విషయం బహు ప్రమాణ సిద్ధం. శ్రీరామానుజులు కూడా గద్యత్రయం మొదలైన తమ గ్రంథాలలో ఈ స్తోత్ర రత్నంలోని శ్లోకాలను ప్రచురంగా ప్రస్తావించడంవల్ల

వారికి ఈ స్తుతిలో పట్ల ఉండే ప్రీతి, గౌరవం స్పష్టమవుతున్నది. వైకుంఠ గద్య ప్రారంభంలో కనిపించే **"యమునార్యసుధాంబోధి మవగాహ్య యథామతి, ఆదాయ భక్తియోగాఖ్యం రత్నం సందర్శయామ్యహమ్"** అనే శ్లోకం కూడా రామానుజులకు ఈ స్తుతిపై గల గౌరవం, అభినివేశం ఎటువంటివో తెలియజేస్తున్నది.

## స్తోత్రరత్నం శ్రీరంగనాథుని ఉద్దేశించి రచింపబడింది:

తన పట్టాభిషేక మహోత్సవాన్ని సేవించడానికి వచ్చిన వానరవీరులను, రాక్షస వీరులను శ్రీరామచంద్ర మూర్తి తగిన రీతిలో సత్కరించాడు. ఆ సందర్భంలో అతడు విభీషణునకు తరతరాలుగా తమ వంశంలో ఆరాధింపబడే శ్రీరంగనాథుని అర్చామూర్తిని బహుమానంగా ఇచ్చాడు. ఈ సందర్భాన్ని ప్రస్తావిస్తూ వాల్మీకి మహర్షి **"లబ్ధ్వా కుల ధనం రాజా లంకాం ప్రాయాత్ విభీషణః"** అని అన్నాడు. ఇక్కడ **"కుల ధనమ్"** అనే పదం శ్రీరంగనాథుని నిర్దేశిస్తున్నదని పెద్దల వ్యాఖ్యానం. శ్రీయామునులు కూడా స్తోత్రరత్నంలో తాము స్తుతించే మూర్తిని గూర్చి **"కులధనం కులదైవతమ్"** అని చెప్పినందున ఈ స్తుతి శ్రీరంగనాథుని ఉద్దేశించి రచింపబడినది - అని సంప్రదాయజ్ఞులైన అభిజ్ఞుల అభిప్రాయం.

## స్తోత్రరత్నంలో ఆళ్వారుల సూక్తుల భావాలు:

ఈ స్తోత్రాన్ని పెరియ వాచ్చాన్ పిళ్ళై అందమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. వారు వ్యాఖ్యానించేటపుడు అవతారికలోనే తిరువాయ్ మొ***ழி*** ప్రబంధం సారాన్నే ఈ స్తుతిరూపంగా అనుగ్రహించారు అని తెలియజేయడమే కాక, పలు సందర్భాలలో ఈ రెండిటికీ మధ్య ఉండే సామ్యాలను వివరించారు.

**"ధిగశుచిమ్"** అనే **47** వ శ్లోకంలో యామునులు భగవంతుని



గొప్పతనాన్ని, తమ పూర్వ వృత్తాంతాన్ని చూచి గమనించి, బ్రహ్మాదులకు కూడ పొందడానికి సాధ్యం కానిది, సంసార సంబంధం లేని నిత్యసూరులు ఆశపడేది అయిన భగవత్కైంకర్యాన్ని పొందాలని తాము ఆశ పడడం రాజు భుజించే అన్నాన్ని విషపూరితం చేయడం వంటిదే అని తలచి తమను నిందించుకొన్నారు. నమ్మా*ழ*్వార్లు కూడా ఇటువంటి భావాన్నే తిరువాయ్ మొ***ழி*** ప్రబంధంలోని **"వళవే*ழ*ులకు''**(1-1-5) అనే దశకంలో స్పష్టం చేశారు అనే అంశాన్ని పెరియవాచ్చాన్ పిళ్ళై తమ వ్యాఖ్యానంలో తెలియజేశారు.

**"తవ దాస్యసుఖైకసంగినామ్"** అని 55వ శ్లోకంలో యామునులు భగవంతుని అనుగ్రహం వల్ల తమకు లభించిన భక్తి వైభవంచేత భగవచ్ఛేషత్వంలో మాత్రమే నిలువకుండా, భాగవత శేషత్వాన్ని పొందాలని ఆశ పడ్డారు ఈ విధంగా వారు ఆశ పడడం - నమ్మాళ్వారులు తిరువాయ్ మొ***ழி*** ప్రబంధంలో **"కణ్ గళ్ శివందు"** దశకంలో భగవత్ తత్త్వాన్ని భావన చేసి, తర్వాత, **"కరుమాణిక్కమలై"** అనే దశకంలో అనన్యశేషత్వాన్ని భావించి, అందులోని మాధుర్యం కారణంగా అంతటితో నిలువకుండా, **"నెడుమాఱ్కడిమై''** అనే తరువాత దశకంలో భాగవత శేషత్వాన్ని ఆశపడడంవంటిదే అని కూడా పెరియవాచ్చాన్ పిళ్ళై తమ వ్యాఖ్యానంలో వివరించారు. ఈ విధంగా స్తోత్రరత్నానికి తిరువాయ్ మొ***ழி*** ప్రబంధానికి మధ్య ఉండే అర్థ సామ్యాలు పలుచోట్ల వివరింపబడ్డాయి.

ఇంతేకాక, పలువురి ఆళ్వార్ల సూక్తులతో స్తోత్ర రత్నం సూక్తులకు ఉండే సామ్యాలను కూడా పెరియవాచ్చాన్ పిళ్లై వివరించారు. **"నిరాసకస్యాపి"** అనే **26**వ శ్లోకంలోని **"రుషా నిరస్తోపి శిశుః స్తనంధయో న జాతు మాతుశ్చరణౌ జిహాసతి"** (కోపంతో తల్లి తనను దూరం చేసినా చంటి బిడ్డ ఆ తల్లినుండి దూరంగా పోవడానికి ఇష్టపడదు) అనే యామునుల ప్రయోగం కులశేఖరాళ్వార్ల పెరుమాళ్ తిరుమొ***ழி***లోని **"అరిశినత్తాల్ ఈన్ఱ తాయ్ అక*ற்ற*ిడినుమ్ మ*ற்ற*వళ్ తన్ అరుళ్ నినైందే అళుమ్ కు*ழ*వి**

అదువేపోన్టిరుందేనే" అనే సూక్తిని తలపిస్తున్నదని అన్నారు.

"న ధర్మనిష్ఠోస్మి న చాత్మవేదీ" అనే శ్లోకంలో యామునులు తాము కర్మ యోగం, జ్ఞాన యోగం, భక్తి యోగం మొదలైన ఉపాయాలను వేనిని ఆచరించలేదని అన్నారు. ఈ శ్లోకాన్ని వ్యాఖ్యానించేటప్పుడు పెరియవాచ్చాన్ పిళ్లై, తిరువాయ్ మొழి ప్రబంధంలోని "నోற்ற నోన్బిలేన్ నుణ్ణఱివిలేన్" అనే పాశురాన్ని ప్రమాణంగా చూపించినందున యామునుల శ్లోకానికి మూలం ఈ నమ్మాழ்వార్ సూక్తియే అని తెలుస్తున్నది. అంతేకాక, తొండరడిప్పొడి ఆழ்వార్ల 'తిరుమాలై' ప్రబంధంలోని "కుళిత్తు మూన్డనలై" అనే పాశురాన్ని, గోదాదేవి 'తిరుప్పావై' ప్రబంధంలోని "కఱవైకళ్ పిన్ శెన్రు" అనే పాశురాన్ని ఉదాహరించినందున ఈ సూక్తుల భావాలు కూడా యామునుల ఈ శ్లోకంలో ప్రతిబింబిస్తున్నాయి అని వ్యక్తమవుతున్నది.

అంతేకాక, నంబిళ్లై, పెరియవాచ్చాన్ పిళ్లై మొదలైన పూర్వాచార్యులు తమ దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో పలుచోట్ల ఈ స్తోత్రరత్నంలోని శ్లోకాలను ప్రమాణీకరించడం చేతకూడా ఈ స్తుతికి, దివ్యప్రబంధ సూక్తులకు మధ్య ఉండే అర్థసామ్యం స్పష్టమవుతున్నది. ఈ అంశం వల్ల పూర్వాచార్యులపై యామునుల స్తోత్రరత్నం ప్రభావంకూడా స్పష్టంగా గోచరిస్తుంది.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధానికి "వాన్ తికழும్" ఇత్యాది తనియన్ పాశురాన్ని అనుగ్రహిస్తూ పరాశర భట్టర్, ఆ ప్రబంధం మొత్తం శ్రీరంగనాథుని ఉద్దేశించి రచింపబడినది - అని తెలియజేశారు. స్తోత్రరత్నం తిరువాయ్ మొழி ప్రబంధానికి సారమైనపుడు, ఆ స్తోత్రంలో కీర్తింపబడిన మూర్తి శ్రీరంగనాథుడు కావడంలో ఆశ్చర్యం లేదు కదా.

ఉపక్రమ ఉపసంహారాలలో తిరువాయ్ మొழி ప్రబంధానికి, స్తోత్రరత్నానికి మధ్య ఉండే సామ్యం కూడా గమనించదగినది. తిరువాయ్ మొழி ప్రబంధంలో నమ్మాழ்వార్ మొదట "ఉయర్వఱ" అనే దశకంలో



శ్రీమన్నారాయణుని పరత్వాన్ని ప్రతిపాదించారు. చివరలో తమను స్వీకరించమని "ఉణ్డిట్టాయ్ ఇని ఉండొழியాయ్" అని అర్థించారు. యామునులు కూడా స్తోత్రరత్నం ఆరంభంలో "స్వాభావిక" అనే శ్లోకంలో భగవంతుని పరత్వాన్ని ప్రతిపాదించి, చివరలో "ప్రసీద మద్వృత్త మచింతయిత్వా" అని తమను స్వీకరించమని ప్రార్థించారు. ఈ విధంగానే స్తోత్రరత్నం మధ్యలో కూడా యామునులు తిరువాయ్ మొழி ప్రబంధంలోని పలు దశకాలలోని అర్థాలను ఆయా శ్లోకాలలో అనుసంధించిన రీతిని వ్యాఖ్యాత పెరియవాచ్చాన్ పిళ్ళై సూచించారు. అందువల్ల ఈ స్తోత్రం మూర్తీభవించిన తిరువాయ్ మొழி ప్రబంధం అనేది స్పష్టం అవుతున్నది ఇంతేకాక, ఈ స్తోత్రంలో యామునులు శారీరక మీమాంసలోని అర్థాలను కూడా ప్రతిపాదించిన రీతిని పెరియవాచ్చాన్ పిళ్ళై "త్వాం శీలరూప" ఇత్యాది పదిహేనవ శ్లోకాన్ని వ్యాఖ్యానం చేస్తూ అవతారికలో సూచించారు. ఈ విధంగా ఈ స్తోత్రం ఉభయ వేదాంతార్థ ప్రతిపాదకం. ఇటువంటి విలక్షణమైన స్తుతిరచనా విధానాన్ని తరువాతి కాలంలోని పూర్వాచార్యులు అందరూ ఆదరించి అనుసరించారు.

ఇటువంటి అద్భుతమైన స్తోత్రానికి మణిప్రవాళ శైలిలో పెరియవాచ్చాన్ పిళ్లై, సంస్కృతంలో దేశికులు వ్యాఖ్యానాలను వెలయించారు. పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానం ఉభయ వేదాంత సమన్వయ క్రమంలో సాగింది. దేశికుల వ్యాఖ్యానం శాస్త్రీయమైన రీతిలో రచింపబడింది. ఈ వ్యాఖ్యానాలు చాలా కాలం క్రితమే ముద్రింపబడినవి. కానీ అవి ప్రస్తుతం దొరకడం లేదు. అందువల్ల వీటిని మళ్లీ ముద్రించవలసిన అవసరం కలిగింది.

శ్రీయామునుల వ్యాఖ్యానంలోని విశేషాలను వివరిస్తూ కొంతకాలం క్రితం విజయనగరం వాస్తవ్యులు, సుప్రసిద్ధ ఉభయ వేదాంత విద్వాంసులు శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామివారు 'యామున స్తోత్ర సౌరభం' అనే పేరుతో ఒక గ్రంథాన్ని అనుగ్రహించారు. కానీ, పెరియవాచ్చాన్ పిళ్ళై

వ్యాఖ్యానం మాత్రం ఇంతవరకు తెలుగులో అనువదింపబడలేదు. ప్రస్తుతం ఆ వ్యాఖ్యానం తెలుగు అనువాదంతో పాటు ముద్రింపబడి, సంప్రదాయ పాఠకుల సన్నిధిలో సమర్పింపబడుతున్నది. ఈ గ్రంథ ముద్రణకైంకర్యాన్ని చేసుకోవడం కోసం ముందుకు వచ్చి, అందుకోసం తమ పవిత్ర ద్రవ్యాన్ని వినియోగించిన సహృదయులు, ఉ.వే. శ్రీమాన్ వోలేటి రవి కుమారాచార్య స్వామివారిని, వారి కుటుంబ సభ్యులను నేను మనసారా అభినందిస్తున్నాను. వారు ఈ గ్రంథముద్రణను తమ పితృ పాదుల పవిత్ర స్మృతిగా చేయాలని సంకల్పించడం వారికి తమ పితృపాదుల విషయంలో ఉండే భక్తిని, గౌరవాన్ని తెలియజేస్తున్నది. వారికి కల ఈ సంప్రదాయ శ్రద్ధ మరింత అభివృద్ధి చెందాలని, పెద్దల కటాక్షాన్ని వారు పరిపూర్ణంగా పొందాలని నేను కోరుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసి సహకరించిన శ్రీమతి జయలక్ష్మి (జయలక్ష్మి గ్రాఫిక్స్, తిరుపతి) గారికి కృతజ్ఞతలు. ఈ గ్రంథ ముద్రణ సంప్రదాయ పాఠకుల ఆదరణను పొందుతుందని నమ్ముతున్నాను. స్వస్తి.



భాగవతవిధేయుడు,
ఈయుణ్ణి అళగ శింగరాచార్య దాసుడు





# స్తోత్రరత్నవైభవమ్

- ఈయుణ్ణి అళగ శింగరాచార్యులు

**1)** యత్ స్తోత్రేషు ప్రధానం సురుచిరపదవిన్యాసభంగ్యా మనోజ్ఞం
తాత్పర్యార్థే చ సామ్యం శఠజిదుపనిషత్ గ్రంథరాజేన ధత్తే।
ఏతత్ శ్రీయామునార్యాః అనుదినమనుసంధేయ మత్యంతభోగ్యం
చక్రుః శ్రీస్తోత్రరత్నం సకలగుణరసాలంకృతీద్ధస్వరూపమ్ ॥

స్తోత్రాలలో ముఖ్యమైనది, అందమైన పదాల ప్రయోగాలతో మనసును ఆకట్టుకునేది, నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంతో తాత్పర్యార్థంలో సామ్యాన్ని కలిగినది, ప్రతి దినం అనుసంధించదగినది, చాలా భోగ్యమైనది, అన్ని గుణాలతో, రసాలతో, అలంకారాలతో ప్రకాశించే స్వరూపాన్ని కలిగినది అయిన స్తోత్రరత్నాన్ని యామునులు రచించారు.

**2)** వ్యాచక్రే కృష్ణసూరిః గురుకులతిలకః తత్త్వయాథాత్మ్య మస్య
వ్యాఖ్యాతౄణాం చ సమ్రా డనితరసుకరవ్యాఖ్యయా ద్రావిడోక్త్యా।
వ్యాఖ్యాం హృద్యానవద్యా మిహ విలిఖతి తాం శింగరాచార్య ఆంధ్ర్యాం
సౌగుణ్యాన్యద్విదాం చ ప్రవిమలమనసాం నందనాయాస్తికానామ్ ॥

ఆచార్య తిలకులు, వ్యాఖ్యాన చక్రవర్తి అయిన శ్రీకృష్ణ సూరి అనే పెరియ వాచ్చాన్ పిళ్ళై, ఇతరులకు సాధ్యం కాని గొప్ప వ్యాఖ్యానాన్ని ద్రావిడ భాషలో ఈ స్తోత్రానికి రచించారు. అందమైన, ఏ దోషం లేని ఆ వ్యాఖ్యానాన్ని శింగరాచార్య దాసుడు గుణాగణాలను తెలిసిన, పరిశుద్ధమైన మనస్సు కలవారి ఆనందంకోసం ఆంధ్రీకరిస్తున్నాడు.

3) స్తోత్రే శ్రీయామునార్యైః స్ఫుటమిహ కథితం తత్త్వరూపం హితం చ
ప్రాప్యం చేతి త్రయం యత్ శ్రుతివచన తదంగేతిహాసాదికోక్తమ్ ।
సూరీణాం గీతికాభిః సుమధురవిధయా బృంహితం చాసకృత్ యత్
తత్సర్వం కృష్ణసూరిప్రవరవరకృతౌ దర్శితం సప్రమాణమ్ ॥

ఈ స్తోత్రరత్నంలో యామునాచార్యులువారు వేదవాక్యాల చేత చెప్పబడినవి, వేదాంగాల చేత, ఇతిహాసాదుల చేత, అందమైన రీతిలో ఆళ్వారుల పాశురాల చేత మాటిమాటికి వివరింపబడినవి అయిన తత్త్వ హిత పురుషార్థాలను ప్రతిపాదించారు. వానిని అంతటిని శ్రీకృష్ణసూరి తమ వ్యాఖ్యానంలో సప్రమాణంగా వివరించారు.

4) యా రామానుజదర్శనే సువిదితా వేదాంతయుగ్మాత్మికా
శైలిః యామునసత్కృతా విహ నయే వ్యక్తా సితాక్షీరయోః ।
సైషా సుష్ఠు నిరూపితా హి వివృతౌ శ్రీకృష్ణసూరేర్గురోః
యాఽన్యాఽఽర్యైః బహుధాఽఽదృతా చ యతిరాట్ కూరేశభట్టాదిభిః ॥

భగవద్రామానుజ దర్శనంలో ఉభయ వేదాంత సమన్వయ శైలి సుప్రసిద్ధమైనది. ఆ శైలి పాలు-చక్కెరలు కలసిన రీతిలో ఈ స్తోత్రంలో యామునులచే చక్కగా అనుసరింపబడినది. ఆ విషయాన్ని శ్రీకృష్ణ సూరి తమ వ్యాఖ్యానంలో చక్కగా నిరూపించారు. ఈ సమన్వయ శైలిని యామునులకు తరువాత భగవద్రామానుజులు, కూరేశులు, పరాశర భట్టర్ మొదలైన పూర్వాచార్యులు అందరూ ఆదరించారు.

5) అసంఖ్యాకా సంతు స్తుతయ ఇహ లోకే భగవతః
పరంత్వేతత్ స్తోత్రం విలసతితమాం యామునకృతమ్ ।
యదాలంకారజ్ఞైః నిజకృతిషు దృష్టాంతిత మిదం
ప్రభావోఽచింత్యోఽస్య ప్రథితనుతిరత్నాభిధజుషః ॥

ఈ లోకంలో స్తోత్రాలు అనేకం ఉండవచ్చు. కానీ, వాటిలో అన్నిటిలో ఈ స్తోత్రరత్నం చాలా గొప్పగా వెలుగుతున్నది. ఈ స్తోత్రరత్నంలోని శ్లోకాలను అలంకారికులు పలువురు తమ గ్రంథాలలో దృష్టాంతంగా గ్రహించారు. స్తోత్రరత్నం అనే ప్రసిద్ధమైన పేరు కలిగిన ఈ స్తుతిప్రభావం భావించడానికి సాధ్యం కానిది.



6) స్తోత్రాణా మపి కూరనాయకముఖైః సమ్యక్ కృతానా మిదం
మూలం భాతితరాం న సంశయలవోఽత్రాఽస్తీతి సూక్తి ర్విదామ్ ।
తత్తత్సంస్తుతిటీకనేషు బహుధా వ్యాఖ్యాతృభిః దర్శితం
హ్యేతత్ విజ్ఞవిమర్శకైశ్చ పదతః సామ్యం తథార్థేఽపి చ ॥

కూరేశులు మొదలైన పూర్వాచార్యులు రచించిన స్తోత్రాలకు ఈ స్తోత్రరత్నం మూలంగా భాసిస్తున్నది. ఇందులో ఏ సందేహం లేదు - అని అభిజ్ఞుల సూక్తి. ఆయా స్తోత్రాల వ్యాఖ్యానాలలో కూడా వ్యాఖ్యాతలు స్తోత్ర రత్నానికి, మిగిలిన పూర్వాచార్యుల స్తోత్రాలకు మధ్య ఉండే శబ్దార్థసామ్యాలను నిరూపించారు. విజ్ఞులైన విమర్శకులు దీనిని వివరించారు కూడా.



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



పరమకారుణికనాన పెరియవాచ్చాన్పిళ్ళై అరుళిచ్చెయ్‌త

# స్తోత్రరత్న వ్యాఖ్యానమ్

శ్రీమత్కృష్ణ సమాహ్వాయ నమో యామునసూనవే।
యత్కటాక్షణలక్ష్యాణాం సులభ శ్రీధరస్సదా ॥

**అవతారికై:**

సర్వేశ్వరన్ ఆఴ్వారుక్కు త్తన్నుడైయ స్వరూపరూపగుణ విభూతికళై "మయర్ వఱమతినలమరుళినన్" (తిరువాయ్-1-1-1) ఎన్గిఱపడియే నిర్హేతుకకృపైయాలే కాట్టిక్కొడుక్క, అన్ద జ్ఞానమ్ భక్తిరూపాపన్నమాకైయాలే పరభక్తియుక్తరాయ్‌క్కొణ్డు భగవద్గుణానుభవత్తై ప్పణ్ణి, అతినుడైయ

---

# ఆంధ్రానువాదము

**అవతారిక:**

సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు, తన స్వరూపాన్ని, రూపాన్ని, కల్యాణగుణాలను, ఉభయవిభూతులను నమ్మాఴ్వార్లకు, "మయర్వఱ మదినలమ్ అరుళినన్" (భ్రమ విప్రలంభాదులు లేని, భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని తన సహజకృపతో అనుగ్రహించాడు) అని నమ్మాఴ్వార్లు పల్కినట్లుగా, తన నిర్హేతుకమైన కృపాగుణంతో దర్శింపజేశాడు. ఆ జ్ఞానం,



విపాకదశైయాన పరజ్ఞానమ్ పిఱన్దు, అతడియాక పరమభక్తి పిఱన్దు, అత్తాలే "పరఞ్జ్యోతిరుపసమ్పద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛాందో-7-12-2) ఎన్ఱుమ్, "పరమం సామ్య ముపైతి" (ముండకోపనిషత్-3-1-3) ఎన్ఱుమ్, "తమ్మైయేయొక్కవరుళ్ శెయ్‌వర్" (తి.మొ. 11-3-5) ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే స్వస్వరూపత్తై ప్పెఱ్ఱు, భార్యైక్కు ప్పతి శుశ్రూషణమ్పోలే "వఴువిలావడిమై శెయ్యవేణ్డు నామ్" (తిరువాయ్-3-3-1) ఎన్ఱుమ్, "అవావఱ్ఱు వీడుపెఱ్ఱ" (తిరువాయ్-10-10-11) ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే ప్రాప్తిఫలమాన కైఙ్కర్యత్తై ప్పెఱ్ఱ ఆఴ్వారుడైయ ద్రమిడోపనిషద్రహస్యత్తై ప్పెరియముతలియార్ ఆఴ్వారుడైయ ప్రసాదత్తాలే లభిత్తు, పిన్పు ఆచార్యోపదేశక్రమత్తాలే ఆళవన్దార్ అన్ద ద్రమిడోపనిషత్ప్రసిద్ధమాన తత్వహితఙ్గళై లభిత్తు, అత్తై త్తాము

---

భక్తిగా పరిణమించినది కనుక, ఆఴ్వార్లు పరభక్తిని "దర్శనం పరభక్తిః స్యాత్" - అనే విధంగా సాక్షాద్దర్శనసమానాకారమైన భక్తిని కలవారై, భగవద్గుణాల అనుభవాన్ని (దర్శనాన్ని) పొంది, దాని పరిణతి (పండిన) దశ అయిన పరజ్ఞానాన్ని పొంది, దానివల్ల పునర్విశ్లేషానికి భయపడే దశ అయిన పరమభక్తిదశను పొందారు. దీనివల్ల "పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ముక్తపురుషుడు పరంజ్యోతిస్స్వరూపుడైన పరమాత్మను పొంది, తన సహజస్వరూపంతో ప్రకాశిస్తున్నాడు) అని, "నిరంజనః పరమం సామ్య ముపైతి" (అంజనమనే సంసారసంబంధం తీరినవాడు పరమాత్మతో గొప్ప సామ్యాన్ని పొందుతున్నాడు) అని, "తమ్మైయేయొక్క అరుళ్‌శెయ్‌వర్" (పరమపురుషుడు ముక్తునకు తనతో సామ్యాన్ని అనుగ్రహిస్తాడు) అని పల్కినట్లుగా స్వస్వరూపాన్నిపొంది, భార్య భర్తృసేవను పొందినట్లుగా, "వఴు విలా వడిమై శెయ్యవేణ్డుమ్‌నామ్" (ఏ ఆటంకం లేని దాస్యాన్ని భగవంతునకు చేయాలి) అని, "అవావఱ్ఱు వీడుపెఱ్ఱ" (ఆర్తి తీరి పరమపదాన్ని చేరిన) అనేటట్లు, మోక్షప్రాప్తిఫలమైన భగవత్కైంకర్యాన్ని పొందారు. ఈ నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన ద్రమిడోపనిషత్ అనే తిరువాయ్‌మొఴి

కామ్యకర్మానుష్ఠానం భోగస్య. సాఙ్గానుష్ఠిత కర్మసాధ్యజ్ఞానయోగాది ఆత్మప్రాప్తేః జ్ఞానకర్మానుగృహీతభక్తిః ప్రపత్తిశ్చ భగవత్ప్రాప్తేః.

**(ఉదారః)** సంసారికళ్ పక్కల్ అర్థిత్వమాతల్, ప్రయోజనమాతల్ నినైయాతే, ఇవర్కళనర్థపరిహారమే. ప్రయోజనమాక ఉపకరిత్తల్లతు నిఱ్కమాట్టాత మేఘమ్బోలే ఉపకరిత్తవన్.

**(సన్దర్శయన్)** సంశయవిపర్యయ రహితమాక ప్రత్యక్షిప్పియా నిన్డుకొణ్డు.

**(నిరమిమీత)** "అన్దాతిమేలిట్టఅవిత్తేనాழ் పారుళై" **(4-తిరువ-1)**

---

ఉపాయాలై ఉండేవాని భేదాలను - అని భావం. వీటిలో, నిత్యనైమిత్తికకర్మల అనుష్ఠానం భోగానికి, సాంగంగా (అంగాలతో పాటుగా) ఆచరించిన కర్మలచేత పొందడానికి వీలయిన జ్ఞానయోగం, భక్తి, యోగం మొదలైనవి ఆత్మప్రాప్తికి (కైవల్యానికి) జ్ఞానయోగ, కర్మయోగాల ద్వారా సిద్ధించే భక్తి, ప్రపత్తియోగాలు భగవత్ప్రాప్తికి ఉపాయాలు.

**(ఉదారః)** - సంసారులు తనను అర్థించాలని గాని, తాను వారిని అనుగ్రహించేటపుడు ఏదో ఒక ప్రతిఫలాన్ని ఆశించిగాని భావించకుండా, వీరికి కలిగే అనర్థాన్ని తీర్చడమే ప్రయోజనంగా భావించి, ఉపకారం చేయకపోతే నిలువలేని మేఘంవలె ఉపకారం చేసేవారని భావం.

**(సందర్శయన్)** - సంశయం, విపరీతజ్ఞానం అనేవి కలుగకుండా ఉండే రీతిలో వారికి కల్గిస్తూ,

**(నిరమిమీత)** - **"అన్దాది మేలిట్టు అఱివిత్తేన్ ఆழ்పొరుళై"** (గంభీరమైన అర్థాలను అన్దాది ప్రబంధంద్వారా తెలియజేశాను) అనే విధంగా తెలియుడానికి కష్టంగా ఉండే వేదార్థాలను అల్పమైన గ్రంథం



ఎన్గిఱపడియే దురవగాహమాన వేదార్థత్తై అల్పగ్రన్థత్తాలే పణ్ణినాన్- ఎన్రై.

**(పురాణరత్నమ్)** పురాణమావతు- "సర్గశ్చ ప్రతిసర్గశ్చ" **(అమరకోశ)** ఇత్యారభ్య "పురాణం పఞ్చలక్షణమ్" (నరసింహ పురాణమ్) ఎన్గిఱపడియే పఞ్చలక్షణోపేతమాన గ్రన్థజాతమ్. "పురాపి నవమ్- పురాణమ్" ఎన్నుమామ్. అతావతు- స్వరసత్తై ఎన్డుమొక్క ఒరువరాలழிక్కవొణ్ణాతిరుక్కై.

**(రత్నమ్)** అర్థప్రకాశకమాయుమ్, సుగ్రహమాయుమ్, ఆపద్రక్షకమాయుమిరుక్క; ఇన్ద పురాణత్తై అధికరిత్తవన్ కాల్కీழే లోకమడఙ్గ విழுమ్బడియాయిరుక్కై.

**(మునివరాయ)** తనక్కు వరఙ్గొడుత్త వసిష్ఠపులస్త్యాదికళుక్కు

---

(శ్రీవిష్ణుపురాణాన్ని) ద్వారా రచించారని భావం.

**(పురాణరత్నమ్)** - పురాణమంటే **"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ, వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్"** (సృష్టి, ప్రతిసృష్టి, వంశాలు, మన్వంతరాలు, ఆవరణాలలో పుట్టిన పలు రాజుల చరిత్ర- అనే అయిదు విధాలైన విభాగాలను కల్గినది - పురాణం) అనే రీతిలో అయిదు లక్షణాల (అంగాలను) కల్గిన గ్రంథసమూహం. (లేక) ప్రాచీనమైనది అయినా, కొంత్తగా తోచేది **("పురాపి నవమ్- పురాణమ్")** అని కూడా భావం. అంటే- తనలో ఉండే స్వారస్యాన్ని ఒకే విధంగా, ఎవరిచేత పోగొట్టడానికి వీలుకాకుండా ఉండే రీతిలో కల్గినది.

**(రత్నమ్)** - (రత్నసామ్యం ద్వారా) తనలో ఉండే అర్థాన్ని వ్యక్తం చేసేదై, సులభంగా పొందదగినదై, ఆపదలో రక్షించేదై ఉన్నదని భావం. (లేక) ఈ పురాణాన్ని తెలిసినవాని కాలికింద లోకం అంతా మొక్కేటట్లు (స్వాధీనం అయేటట్లు ఉంటుంది) అనికూడా భావం.

**(మునివరాయ)** తనకు వరాన్ని ఇచ్చిన వశిష్ఠుడు, పులస్త్యుడు

ముద్రితాముద్రిత ప్రముద్రితనాయ్, అత్తాలే అవర్కళ్ పడియైయుడైయవన్-ఎన్నుతల్. "మునీనాం వరణీయాయ" ఎన్గిఱపడియే అవర్కళుక్కాదరణీయనెన్నుతల్.

**(పరాశరాయ)** పరరాకిఱార్- బాహ్యకుదృష్టికళ్. అవర్కళై ప్రమాణశరఙ్గళాలే హింసిత్తు. వైదికమర్యాదైయై స్థాపిత్తవన్- ఎన్నుతల్. ఇన్ద్రియజయత్తాలే రజస్తమస్సుక్కళై జయిత్తిరుక్కుమ్-ఎన్నుతల్.

**(యః ఉదారః చిదచిదీశ్వరతత్స్వభావ భోగాపవర్గ తదుపాయగతీః తత్త్వేన సందర్శయన్, పురాణరత్నం నిరమిమీత, మునివరాయ తస్మై పరాశరాయ నమః)**

---

మొదలైన వారికి ముద్రిత- అముద్రిత- ప్రముద్రితుడై, అందువల్ల వారి స్వభావాన్ని కలవాడని అర్థం. **"మునీనాం వరణీయాయ"** (మునులకు వరణీయుడు - పూజ్యుడు) అనేవిధంగా మునులు ఆదరణీయుడని భావం.

**(పరాశరాయ)** - పరులంటే వేదబాహ్యావాదాలను, కుదృష్టివాదాలను చేసేవారు. వారిని, ప్రమాణాలనే శరాలతో హింసించి (ఓడించి), వైదికమతాన్ని స్థాపించినవారని భావం. (లేక) ఇంద్రియాలను, రజస్తమస్సులనే గుణాలను జయించేవారని భావం.

**"యః ఉదారః చిదచిదీశ్వర తత్స్వభావభోగాపవర్గతదుపాయగతీః తత్త్వేన సందర్శయన్, పురాణరత్నం నిరమిమీత, మునివరాయ తస్మైపరాశరాయ నమః".**



**5శ్లో ॥** మాతా పితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

**వ్యా:- (మాతేతి)** ఇన్ద జ్ఞానమ్ అధికృతాధికారమాయ్పోకామే సర్వాధికారమాప్పడి ద్రామిడమాన బ్రహ్మసంహితైయై **"మయర్వఱ మతినల మరుళినన్" (తి-వాయ్-1-1-1)** ఎన్గిఱ భక్తియాలే వాసితమాక్కి, **"మరఙ్గళు మిరఙ్గుమ్ వకై" (తి-వాయ్-6-4-9)** ఎన్గిఱ తమ్ముడైయ ఆకర్షకమాన ఈరచ్చొల్లాలే అరుళిచ్చెయ్కైయాలుమ్, పెరియముతలియారుక్కు ఇన్ద జ్ఞానత్తుక్కు ఉపాదానమ్ ఆఴ్వార్ తిరువడికళిల్ సంబంధమాకైయాలుమ్, ఇవర్తిరువడికళిలే విఴుకిఱార్. **"ఎత్తిఱమ్" (తి-వాయ్-1-3-1)** ఎన్టుమ్, **"నెయ్యుణ్ వార్త్తైయుళన్నైకోల్ కొళ్ళ" (తి-వాయ్-5-10-3)** ఎన్టుమ్, **"ఎల్లామ్**

---

**5శ్లో ॥** (మాతేతి) ఈవిధంగా పరాశరమహర్షివల్ల కల్గిన జ్ఞానం నిర్దిష్టమైన యోగ్యతను కల్గిన వారికి మాత్రమే పొందడానికి వీలయేటట్లుగా కాకుండా, అందఱికి పొందదగినట్లుగా ఉండే, ద్రావిడభాషామయమైన బ్రహ్మసంహితను (తిరువాయ్మొఴి ప్రబంధాన్ని) **"మయర్వఱ మదినలమరుళినన్"** (భ్రమవిప్రలంభాది రహితమైన, భక్తిగా రూపొందిన జ్ఞానాన్ని అనుగ్రహించాడు) అనే రీతిలో భక్తితో పరిమళింపజేసి, **"మరఙ్గళుమ్ ఇరఙ్గుమ్ వకై"** (వృక్షాలు కూడా ద్రవించే రీతిలో) అందఱిని ఆకర్షించే తమ ఆర్ద్రవచనాలతో అనుగ్రహించినందున, నాథమునులకు ఈ ద్రావిడబ్రహ్మ-సంహితరూపంలోని జ్ఞానానికి ఉపాదానం (మూలకారణం) నమ్మాఴ్వార్ శ్రీచరణసంబంధం అయినందున, ఈ ఆఴ్వార్ల శ్రీచరణాలలో యామునులు నమస్కరిస్తున్నారు. **"ఎత్తిఱమ్"** (శ్రీకృష్ణుడు రోటికి బంధింపబడి, రోదించిన సన్నివేశంలోని సౌలభ్యం ఏరీతిలోనిది? ఆహా!) అని, **"నెయ్యుణ్ వార్త్తై యుళన్నై కోల్ కొళ్ళ"** (శ్రీకృష్ణుడు నేతిని ఆరగించడాని

కణ్ణన్" (తి-వాయ్-6-7-1) ఎన్నుమ్ పెరియముతలియారైయుమ్, శ్రీపరాశరభగవానైయుమ్బోలే ఇవరుమ్ కృష్ణగుణ విద్ధరాయిరుక్కుమ్బడియై నినైత్తు ఆళ్వార్ తిరువడికళిలే శరణమ్ పుకుకిఱార్.

**(మాతా)** ఉత్పత్తిక్కు మున్నే వరమ్ కిడన్దు, పెఱుకైక్కు వరున్ది, పత్తుమాసమ్ గర్భధారణమ్ పణ్ణి, ప్రసవవేదనైయై అనుభవిత్తు, అశుద్ధికళైయుమ్ మతియాతే, బాల్యదశైయిలాదరిత్తు వళర్త్తు, పక్వనానాలుమ్ ఇవన్ పరుషభాషణమ్ పణ్ణప్పొఱుత్తు, అకల విశైయాతే అవన్ ప్రియత్తైయే వేణ్డియిరుక్కుమ్ తాయైప్పోలే ఉపకారకనాయిరుక్కై.

**(పితా)** అవళుమ్ పాత్రమాత్ర మెన్నుమ్బడి ఉత్పాదకనాయ్, ఎన్ఱుమొక్క హితపరనాన పితా పణ్ణు ముపకారత్తై ప్పణ్ణుమవరెన్నై. "గరీయాన్

---

విని, యశోద అతనిని దండించడంకోసం బెత్తాన్ని తీసికొనగా) అని, "ఎల్లామ్ కణ్ణన్" (ధారక,పోషక, భోగ్యాలన్నీ శ్రీకృష్ణుడే) అని అభినివేశాన్ని పొందిన నాథమునులు కూడా, శ్రీపరాశరభగవాన్‌వలె, శ్రీకృష్ణుని కల్యాణగుణాలకు ఆకర్షితులై ఉండే రీతిని తలచి, వారి శ్రీచరణాలలో నమస్కరిస్తున్నారు.

**(మాతా)** - బిడ్డ జన్మించడానికి ముందే వరాన్ని పొంది, బిడ్డను పొందడానికి శ్రమపడి, పదినెలలు గర్భంలో శిశువును ధరించి, కనేటపుడు ప్రసవవేదనను అనుభవించి, బిడ్డ మలమూత్రాది మాలిన్యాదులను చూచి ఏవగించుకోకుండా, బాల్యదశలో ఆదరించి, పెంచి, అతడు పెద్దవాడైన తరువాత ఆ కుమారుడు తనను పరుషంగా దూషిస్తే, దానిని సహించి, అతనిని విడచిపెట్టడానికి ఇష్టపడకుండా, అతని ప్రియాన్ని మాత్రమే కోరే (లోకంలోని) తల్లివలె (నమ్మాళ్వార్లు) ఉపకారకులు - అని భావం.

**(పితా)** - (ఇంత గొప్ప) తల్లికూడా (మోసే) పాత్రవంటిది మాత్రమే - అనే విధంగా పుత్రునకు ఉత్పాదకుడై, ఎల్లప్పుడు అతని హితాన్ని మాత్రమే ఆలోచించే (లోకంలోని) తండ్రి చేసే ఉపకారాన్ని చేసేవారు - అని భావం.



బ్రహ్మదః పితా" ఎన్నక్కడవతిఱే.

**(యువతయః)** ఇరువరైయుమ్ మఱన్దు విరుమ్బుమ్ యువతికళైప్పోలే నెఞ్జుక్కినియరాయిరుక్కై.

**(తనయాః)** "ప్రసవాంతం చ యౌవనమ్" ఎన్గిఱపడియే అవర్కళుడైయ యౌవనత్తై యళియమాఱి ప్పెఱ్ఱవరాయ్, బాల్యత్తిల్ సుఖకరరాయ్, పక్వదశైయిలే రక్షకరాయ్, ఆముష్మికత్తిలే నిరయనిస్తారకరాన పుత్రర్కళ్ పణ్ణుముపకారత్తై ప్పణ్ణుమవరెన్నై.

**(విభూతిః)** విభవమిల్లాతపోతు ఇవై యెల్లా మసత్సమమాయిరుక్కైయాలే ఇవఱ్ఱై నన్దాక్కుమ్ ఐశ్వర్యమ్బోలే ఉద్దేశ్యరాయిఇరుక్కుమవర్.

---

**"గరీయాన్ బ్రహ్మదః పితా"** (జ్ఞానాన్ని అనుగ్రహించే తండ్రి, శరీరాన్ని ఇచ్చిన తండ్రి గొప్పవాడు) అని జ్ఞానాన్ని ప్రసాదించినవాడు తండ్రిగా చెప్పబడుతున్నాడు.

**(యువతయః)** - ఈ తల్లితండ్రులను ఇద్దఱిని మఱచిపోయి, ప్రేమించే యువతి (భార్య) వలె మనస్సుకు భోగ్యమై ఉండేవారని భావం.

**(తనయాః)** - తమ **"ప్రసవాంతం చ యౌవనమ్"** అనే విధంగా భార్యల యౌవనాన్ని పోగొట్టి జన్మించేవారు, బాల్యంలో సుఖాన్ని కల్గించేవారు, ముసలితనంలో రక్షించేవారైన పుత్రులు చేసే ఉపకారాన్ని చేసేవారు - అని భావం.

**(విభూతిః)** - సంపద లేకపోతే పూర్వం ప్రస్తావించినవారంతా అసత్సమంగా (లేనివారుగా) తోస్తారు. కనుక, వీరిని (తల్లి, తండ్రి మొదలైనవారిని) అనుభావ్యులుగా చేసే సంపదవలె ఆదరణీయులు - అని భావం.

(సర్వమ్) అనుక్తమాన సర్వభోగఙ్గళుమాయిరుక్కై. అతావతు- మోక్షోపాయముమ్, ముక్తప్రాప్యముమాయిరుక్కై.

(యదేవ) అవధారణత్తాలే "శేలేయ్ కణ్ణియరుమ్" (తి-వాయ్-5-1-8) ఎన్ఱిరుక్కుమ్ ఆழ్వార్నినైవొழியవేఱొన్ఱిక్కేయిరుక్కై.

(నియమేన) నిత్యేన; ఎన్ఱు మొక్క అవరుక్కు ప్రియమెన్ఱు పోరుమతొழியప్రామాదికమాకవుమ్ పుఱమ్బు పోకక్కడవతన్ఱిక్కే యిరుక్కై.

(మదన్వయానామ్) "విద్యయా జన్మనా వా" (భోజ.చంపూ-కి-10) ఎన్గిఱ ఉభయసన్తానజాతర్క్కుమ్.

---

(సర్వమ్) - ఇంతవరకు చెప్పబడని సమస్తభోగాల యొక్క రూపమై ఉండేవారు. అంటే - మోక్షోపాయం, ముక్తప్రాప్యమై ఉండేవారు - అని భావం. (మోక్షాన్ని పొందడానికి ఉపాయంగాను, ముక్తిని పొందినవారికి పరమపదంలో ప్రాప్యమై- సేవించదగినవారై - ఉండేవారని భావం)

(యదేవ) - ఇక్కడ ఉండే "ఏవ" అనే అవధారణవాచకం ద్వారా "శేలేయ్ కణ్ణియరుమ్" (అందమైన చేపలవంటి కన్నులను కాంతలు, గొప్పసంపద, ఇంకా తల్లి, తండ్రి అంతా ఆభగవంతుడే) అని తలచిన ఆழ్వార్లను గూర్చిన భావన తప్ప వేఱొక విషయాన్ని గూర్చిన చింతన లేకుండా ఉండడం తెలుపబడింది.

(నియమేన) - నిత్యంగా. సదా వారికి (ఆழ్వార్లకు) ప్రియమని (భగవంతుడు మొదలైన వారిని) ఆదరించడంతప్ప, పొరబాటుగా కూడా, ఆழ్వార్లను తప్ప అన్యులను భావించకుండా ఉండడం.

(మదన్వయానామ్) - "విద్యయా జన్మనా వా"- (విద్యచేగాని, జన్మతో గాని) అనే రీతిలో విద్యావంశానిక, చెందినవారికి కాని, జన్మతః సంబంధించిన వంశంలోనివారికి కాని - అని భావం.



(ఆద్యస్య) వైష్ణవసన్తానత్తుక్కు ప్రథమాచార్యరాయిరుక్కై.

(నః కులపతేః) స్త్రీక్కు భర్తృకులమ్పోలే గోత్ర ఋషికళుమ్ అవరే యెన్గై.

(వకుళాభిరామమ్) తిరుమకిழ் మాలైయాలే అలఙ్కృతమాయిరున్దుళ్ళత్తై. మకిழలఙ్కారమాన తిరువడికళ్. ఇత్తాల్ తిరువడికళిల్ పరిమళత్తాలే వన్ద భోగ్యతై చ్చొల్లుకిఱతు. తిరుత్తుழாయాలే అలఙ్కృతమాన భగవచ్చరణారవిన్దఙ్గళై వ్యావర్తిక్కిఱతు. "నల్లడి మేలణి నాఱు తుழாయ్" (తి-వాయ్-4-2-2) ఎన్నక్కడవతిఱే.

(శ్రీమత్) వైష్ణవశ్రీయోడే నిత్యసంయుక్తమాయిరుక్కై. "అన్తరిక్షగత

---

(ఆద్యస్య)- వైష్ణవ సంతానానికి ప్రథమాచార్యులు - అని అర్థం.

(నః కులపతేః) - స్త్రీకి భర్తయొక్క వంశమే తన వంశమైనట్లు, మాకు గోత్ర ఋషులు కూడా నమ్మాழ్వార్లే - అని భావం.

(వకుళాభిరామమ్) - వకుళపుష్పాల మాలికతో అలంకరింపబడిన వారిని - అని అర్థం. వకుళపుష్పాలతో అలంకరింపబడిన శ్రీచరణాలు. దీనిద్వారా శ్రీచరణాలలో పరిమళం (సువాసన) వల్ల కల్గిన భోగ్యత తెలుపబడింది. ఈ ప్రయోగంద్వారా, తులసితో అలంకరింపబడిన భగవంతుని చరణారవిందాలకంటే ఆழ్వార్ల శ్రీచరణాలకు కల ప్రత్యేకత తెలుపబడింది. భగవచ్చరణారవిందాలు "నల్లడిమేలణి నాఱుతుழாయ్" (గొప్ప శ్రీచరణాలకు అలంకారమైన, సువాసనను కల తులసి) అని తులసితో అలంకరింపబడతాయని చెప్పబడుతున్నది కదా.

(శ్రీమత్) - శ్రీవైష్ణవశ్రీతో (భగవంతుని పట్ల ప్రీతితో) నిత్యం కూడినది - అని అర్థం. (ఇక్కడ "మతుప్" ప్రత్యయం నిత్యయోగాన్ని తెల్పుతుంది). "అంతరిక్షగతః శ్రీమాన్" (అంతరిక్షంలో ఉండే, శ్రీరామునిపట్ల

శ్రీమాన్" (రా-యు-16-17), "స తు నాగవర శ్రీమాన్" (వి-ధ), "లక్ష్మణో లక్ష్మిసమ్పన్నః" (రా-బా-18-29) ఎన్ఱు భగవత్ప్రత్యాసత్తియై ఐశ్వర్యమాక చ్చొల్లక్కడవతిఱే. ఎన్నుడైయ సమ్పత్తుక్కడియాన ఐశ్వర్యత్తై యుడైయరెన్నుమామ్.

**(తదఙ్ఘ్రియుగళమ్)** అతువెన్ను మత్తనై యొழియ పేశి ముడిక్క వొణ్ణాతెన్నై.

**(యుగళమ్)** శేర్త్తియాల్ వన్ద అழకైయుడైత్తాయిరుక్కై.

**(ప్రణమామి మూర్ధ్నా)** ఆழ్వారుడైయ తిరువడికళై నినైత్తవాఱే

---

భక్తి అనే సంపదను కల్గిన విభీషణుడు) అని, "స తు నాగవరః శ్రీమాన్" (భగవంతునిపట్ల భక్తి అనే సంపదను ఆ గజేంద్రుడు) అని, "లక్ష్మణో లక్ష్మీసంపన్నః" (లక్ష్మణుడు భగవద్భక్తి అనే సంపదను కలవాడు) అని భగవత్ ప్రత్యాసత్తి ఐశ్వర్యంగా చెప్పబడుతున్నది కదా. (లేక) నా సంపదకు (భక్తిసంపదకు) మూలమైన ఐశ్వర్యాన్ని (భగవత్ప్రత్యాసత్తిని) కలవారని భావం.

**(తదంఘ్రియుగళమ్)** "అది" (తత్) అని అనిర్వచనీయంగా అనడం తప్ప, గొప్పతనం పూర్తిగా వివరంగా పల్క సాధ్యం కానిది - అని భావం.

**(యుగళమ్)** (పాదాల) రెండిటి కలయికవల్ల ఏర్పడిన అందాన్ని కల్గినది.

**(ప్రణమామి మూర్ధ్నా)** - ఆழ్వార్ల శ్రీచరణాలను గూర్చి భావించగానే, "నమః" అని పల్కి నిలువలేక యామునులు వారి పాదాలలో తలను చేరుస్తున్నారు. (నమస్కరిస్తున్నారు). పూర్వం ఉపకారకులను ఈ విధంగా ఆశ్రయించడం ద్వారా ఏమి తెలుపబడింది? అంటే, ముముక్షువునకు ఉపకారకాచార్యులే శేషిత్వప్రతిపత్తికి విషయమై ఉండేవారు (శేషి అని భావించదగినవారు) స్తుతించదగినవారు - అని చెప్పబడింది.



"నమః" ఎన్ఱ నిఱ్కమాట్టాతే అవర్తిరువడికళిలే తలై శేర్క్కిఱార్.

కీழ் ఉపకారకరై ఆశ్రయిత్త ఇత్తాల్, శెయ్తతు - ముముక్షువుక్కు ఉపకారకరే శేషిత్వప్రతిపత్తిక్కు విషయభూతరుమ్, స్తుత్యరుమెన్నుమిడమ్ శొల్లిற்றாయ్త్తు.

ఒరువనుక్కు శేషికళ్ ఇరువరామ్బడి ఎజ్గనే? యెన్నిల్, క్రతుశేషత్వమ్ ఛాగత్తుక్కుమ్ పురోడాశత్తుక్కు ముణ్డానాప్పోలే, ఈశ్వరన్ ప్రధానశేషియాయ్, భాగవతర్కళ్ ద్వారశేషికళామిడత్తిల్ విరోధమిల్లై. అథవా, ఈశ్వరన్ నిరుపాధిక శేషియాయ్, తత్సమ్బన్ధమడియాక వన్దతాకైయాలే భాగవతశేషత్వమ్ సోపాధిక మెన్నుమామ్. తమక్కు స్తోత్రారమ్భహేతువాన జ్ఞానభక్త్యాదికళ్ పితామహోపాత్తధన మెన్నైక్కాక. ముతల్ మూన్ఱు శ్లోకత్తాలే

---

అయితే మఱి, భగవంతుడు శేషి - అని పూర్వం అన్నారు. ఇపుడు నాథమునులు, నమ్మాழ్వార్లు శేషి - అని అంటున్నారు. శేషియై ఉండేవారు ఇద్దఱుగా ఉండడం ఏవిధంగా? అంటే, క్రతువుకు శేషమై ఉండడం అనేది ఛాగపశువులకు, పురోడాశానికి ఉండేటట్లే, ఈశ్వరుడు ప్రధానశేషియై, భాగవతులు ద్వారశేషియై ఉండడంలో విరోధం ఏమీ లేదు. ఆ విధంగానే ఇద్దఱు శేషి - అని, ఆ భగవంతుని సంబంధంవల్ల ఏర్పడిన భాగవతశేషత్వం సోపాధికమైనది-అని కూడా చెప్పవచ్చు. తాము స్తోత్రరత్న రచనను ఆరంభించడానికి హేతువులైన జ్ఞానం, భక్తి మొదలైనవి పితామహులైన నాథమునుల ద్వారా లభించిన ధనమని తెలుపడంకోసం మొదటి మూడు శ్లోకాలద్వారా నాథమునుల జ్ఞానం, భక్తి మొదలైన వాని గొప్పతనాన్ని తెలిపారు. నాల్గవ శ్లోకంతో ఈ విషయం త్రైవిద్య వృద్ధానుమతం - వేదార్థంలో పండితులైన పరాశరమహర్షివంటివారు అంగీకరించినదని అన్నారు. అయిదవ శ్లోకంతో, వీరికి (నాథమునులకు) ఈ జ్ఞానం నమ్మాழ్వార్లవల్ల వచ్చిందని

పెరియముతలియారుడైయ జ్ఞానభక్త్యాదికళిన్ ఆధిక్యమ్ శొన్నార్. నాలామ్ శ్లోకత్తాలే ఇవ్వర్థమ్ త్రైవిద్య వృద్ధానుమతమెన్రార్; అఞ్జామ్ శ్లోకత్తాలే ఇవర్క్కు ఇన్ద జ్ఞానమ్ ఆఴ్వారాలే వన్దతు - ఎన్గిఱార్.

(మదన్వయానాం యదేవ నియమేన మాతా పితా యువతయ స్తనయా విభూతి స్సర్వమ్, ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం శ్రీమత్తదఙ్ఘ్రియుగళం మూర్ధ్నా ప్రణమామి.)

6శ్లో॥ యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సు చ భాతి యస్మిన్
అస్మన్మనోరథపథ స్సకల స్సమేతి ।
స్తోష్యామి నః కులధనం కులదైవతం తత్
పాదారవిన్ద మరవిన్దలోచనస్య ॥

వ్యా :- (యన్మూర్ధ్ని ఇతి) "అఱియాతన వఱివిత్త వత్తా! నీ శెయ్తన" (తి-వాయ్-2-3-2) ఎన్ఱు ఉపకారకరిల్ ప్రథమనాకైయాలుమ్'', "వైకున్దనాకప్పుకఴ" (తి-వాయ్-7-9-7) ఎన్గిఱపడియే ఇవరుడైయ స్తుతి,

---

అన్నారు. (ఈవిధం గదా ఈ అయిదు శ్లోకాలు ఈ స్తుతికి ఉపోద్ఘాతం. ఇకపై భగవంతుని స్తుతి చేయబడుతున్నది.)

"మదన్వయానాం యదేవ నియమేన మాతా పితా యువతయ స్తనయా విభూతి స్సర్వమ్, ఆద్యస్య సః కులపతేః వకుళాభిరామం శ్రీమత్తదంఘ్రియుగళం మూర్ధ్నా ప్రణమామి" అని అన్వయం.

6శ్లో॥ (య న్మూర్ధ్ని ఇతి) - "అఱియాదన అఱివిత్త అత్తా నీ శెయ్తన" (తెలియని విషయాలను తెలిపిన స్వామీ! నీవు చేసిన ఉపకారాలను గూర్చి దాసుడనైన నేను తెలియలేను) అనే ఉపకారకులలో ప్రథముడైనందున, "వైకున్దనాక పుకఴ" (వైకుంఠలోకం పొగడగా) అనే విధంగా వీరు చేసే



ఈశ్వరనుక్కు అభిమతమాయిరుక్కైయాలుమ్, ఇతుతాన్ ఆచార్యర్కళుక్కు ప్రియకరమాకైయాలుమ్, స్తోత్రత్తిల్ మేల్శొల్ల పుకుకిఱ ఉపాయోపేయఙ్గళై సఙ్గ్రహిత్తుక్కొణ్డు ఉపక్రమిత్తపడియే భగవత్ స్తోత్రత్తిలే ఇఴికిఱార్.

(మే మూర్ధ్ని యద్భాతి) తమ్ముడైయ అభినివేశాతిశ-యత్తైయుమ్, సౌన్దర్యశీలాదికళిలే తోఱ్ఱు అత్తాల్ వన్ద శేషత్వత్తైయుమ్, అన్ధకారత్తిల్ దీపమ్బోలే తమ్ముడైయ తిరుముడియిలే వన్ద పిన్బు తిరువడికళ్ మికవుమ్ విళఙ్గినపడియైయుమ్ శొల్లుకిఱతు. ఇత్తాల్-అవనుడైయ ఉపాయభావత్తుక్కు ఏకాన్తమాన సౌశీల్యాదికళైయుమ్, ఇత్తలైయిల్ విషయీకారమ్ తన్ పేఱాక నినైత్తిరుక్కుమెన్టుమ్ శొల్లుకిఱతు. "తలై క్కణియాయ్!" (తి-వాయ్-9-2-

---

స్తుతి భగవంతునకు మిక్కిలి ఇష్టమైనందున, ఇది ఆచార్యులకు ప్రీతికరం కనుక, తాము ఈ స్తోత్రంలో ప్రతిపాదింపబోయే ఉపాయ-ఉపేయాలను సంగ్రహించి, భగవంతుని స్తుతించాలని ఉపక్రమించిన రీతిలోనే భగవత్ స్తోత్రాన్ని చేయడం ఆరంభిస్తున్నారు.

(మే మూర్ధ్ని యద్భాతి) - తమ అభినివేశ (ఆసక్తి) అతిశయాన్ని, భగవంతుని సౌందర్యం, శీలం మొదలైన కల్యాణగుణాలకు జితులైనందున, అందువల్ల ఏర్పడిన శేషత్వాన్ని, అంధకారంలో దీపంవలె, తమ శిరస్సుపైకి వచ్చిన తరువాత, ఆ భగవంతుని శ్రీచరణాలు మిక్కిలిగా ప్రకాశించిన రీతిని (గూర్చి) ఈ శ్లోకంలో పల్కుతున్నారు. దీనివల్ల భగవంతుని ఉపాయభావానికి (భగవంతుడు ఉపాయం కావడానికి) ఏకాంతమైన (ముఖ్యకారణమైన) సౌశీల్యం మొదలైన గుణాలు, జీవుని అనుగ్రహించడం తన ప్రయోజనంగా భగవంతుడు భావించడం తెలుపబడింది. "నిన్ పాదపఙ్గయమే తలైక్కణియాయ్!" (నీ పాదపద్మాన్ని నా శిరస్సుకు ఆభరణంగా అలంకరించు) అని శేషభూతులు ప్రార్థించే విషయాన్ని పొందానని అంటున్నారు. శేషి అయినందున అందఱిపట్ల భగవంతుడు ఉండే తీరు

2) ఎన్ను శేషభూతర్ ప్రార్థిక్కుమత్తైప్పెగ్గ్రోనెన్గిఱార్. శేషియాకైయాలే సర్వవిషయజ్గళిలుమ్ అవనిరుక్కుమ్బడి ఇతు. ఇవర్ తద్జ్ఞరాకైయాలే అత్తై ప్పేశుకిఱార్.

(శ్రుతిశిరస్సు చ భాతి) వేదాన్తజ్గళిలుమ్ విళఙ్గానిన్ఱతు. ఇత్తాల్ - ప్రాప్యత్వముమ్, సర్వాధికత్వముమ్, సర్వమఙ్గళకరత్వముమ్, అతిదుర్లభత్వముమ్ శొల్లుకిఱతు. చకారత్తాలే వేదాన్తజ్గళిలుమ్, తమ్ తలైయిలుమొక్క త్తిరువడికళై త్తరమిడాతే వైత్తపడియాలే, తమ్పక్కల్ అవనుక్కుణ్డాన ఆదరాతిశయుమ్ శొల్లుకిఱతు. 'చ'శబ్దమ్ అవధారణత్తిలేయామ్. తమ్ముడైయ తలైయిలే అన్వయిత్త పిన్బు సౌలభ్యమే తిరువడికళుక్కు స్వరూప మెన్ఱతాకవుమామ్. "తిరుప్పాఱ్కడలే యెన్ తలైయే"

(తి-వాయ్-10-7-8) ఎన్నుమాప్పోలే.

(యస్మిన్నస్మన్మనోరథపథ స్సకల స్సమేతి) "పితా త్వం మాతా త్వమ్"(స్తోత్రరత్నమ్-60) ఇత్యాదికళాన ఎన్నుడైయ ఐహికాముష్మిక సకలమనోరథఙ్గళుమ్ అఖ్పకియతాక యాతొన్ఱిలే శేరుకిఱతు.

(స్తోష్యామి) ఇప్పడి ప్రాప్తముమాయ్, విలక్షణముమాయ్, ఉపకారకముమాన తిరువడికళిలే వాచికమాన అడిమైయై చ్చెయ్కిఱేన్,

(నః కులధనమ్) ధనమావతు- అపద్రక్షకముమాయ్, నిత్యభోగముమా యిరుక్కుమతు. కులధన మెన్ఱైయాలే- అయత్నసిద్ధముమాయ్, స్వతః ప్రాప్తముమాయిరుక్కై.

---

ఇది. (భక్తుల శిరస్సును తన శ్రీచరణాలతో అలంకరిస్తాడు) వీరు (యామునులు) ఆ విషయాన్ని తెలిసినవారు కనుక, దానినిగూర్చి పల్కుతున్నారు.

(శ్రుతిశిరస్సు చ భాతి) - వేదాంతాలలో కూడా ప్రకాశిస్తున్నది- అని భావం. దీనివల్ల భగవచ్చరణారవిందాలు పొందదగినవి-అని, అవి అన్నిటికంటే గొప్పవి-అని, సర్వమంగళకరమైనవి-అని, పొందడానికి చాలా దుర్లభమైనవి అని తెలుపబడింది. "చ" కారం ద్వారా - వేదాంతాలలోను, తమ శిరస్సుపైన ఏ తేడాలేకుండా సమానంగా శ్రీచరణాలను తారతమ్యం చూడకుండా పెట్టినందున, తమపట్ల భగవంతునకు ఉండే గొప్ప ఆదరం తెలుపబడింది. లేక, "చ" శబ్దం అవధారణార్థకం కావచ్చు. నా శిరస్సుపైన, వేదాంతాలలోను భగవచ్చరణాలు ప్రకాశిస్తున్నాయని భావం. (లేక) తమ శిరస్సులో పెట్టిన తరువాత సౌలభ్యం అనే గుణం శ్రీచరణాలకు స్వరూపమని వ్యక్తమైనదని కూడా భావం. "తిరుప్పాఱ్కడలే ఎన్‌తలైయే" (భగవంతుడు వేంచేసి ఉండే చోట్లు, తిరుమాలిరుమ్‌శోలై, క్షేత్రమే, క్షీరాబ్ధియే, నా శిరస్సే)

అనే సూక్తిలోని అవధారణార్థం (ఏకారం) వలె ఇక్కడకూడా చకారానికి అవధారణార్థాన్ని గ్రహించాలి.

(యస్మిన్నస్మన్మనోరథపథః సకలస్సమేతి)- "పితా త్వం మాతా త్వమ్.. త్వద్గతి రహమ్" (తండ్రి నీవు, తల్లి నీవు నీవే నాకు ఉపాయం) ఇత్యాదిగా స్తుతిలోనే ప్రస్తావింపబడిన ఐహిక-ఆముష్మికాలైన అన్ని మనోరథాలు అందంగా ఏభగవచ్చరణాలలో చేరుతున్నవో (నాకు ఐహిక-పారలౌకిక మనోరథాలన్నీ భగవచ్చరణారవిందాలే - అని భావం).

(స్తోష్యామి) - ఈ విధంగా ప్రాప్తమై (స్వరూపానికి తగినదై), విలక్షణమై, ఉపకారకం కూడా అయిన భగవచ్చరణారవిందాలలో వాచికమైన కైంకర్యాన్ని చేస్తాను.

(నః కులధనమ్) - ధనమంటే - ఆపదలో రక్షకమై, నిత్యభోగంగా (నిత్యం అనుభవించదగినదిగా) ఉండేది. కులధనమంటే - తన ప్రయత్నం ఏమీ లేకుండా సిద్ధించినదై, సహజంగానే లభించినది.

(కులదైవతమ్) ఇద్దనత్తై త్తరుమతాయ్, ఆశ్రయణీయమా- యిరుక్కుమతు. ఇత్తాల్ -స్తోత్ర ప్రతిపాద్యమాన ప్రాప్యత్వ- ప్రాపకత్వజ్గళై చ్చొల్లుకిఱతు.

(తత్పాదారవిన్దమ్) ఉక్తస్వభావమాన తిరువడిత్తామరైకళై.

(అరవిన్దవిలోచనస్య) "జితన్తే పుణ్డరీకాక్ష" (జిత-1-1) ఎన్ఱు రుచిజనకముమాయ్, "తన్‌పాల్ పణిన్ద వెన్పాల్ ఎమ్బిరాన తడజ్గణ్గళ్" (తిరువి-42) ఎన్ఱు వత్సలముమాయ్, "తామరై క్కణ్ణనై విణ్ణోర్ పరవుమ్ తలైమకనై" (తి-వాయ్-2-6-3) ఎన్ఱు సూరిభోగ్యముమాన తిరుక్కణ్గళై యుడైయవనుడైయ. ఇత్తాల్ - ఇవరుడైయ ఉద్యోగత్తై క్కణ్డ ప్రీతి

---

(కులదైవతమ్) - ఇటువంటి ధనాన్ని ఇచ్చేదై, ఆశ్రయించదగినదై ఉండేది. "కులధనం, కులదైవతమ్" అనే ఈ రెండు పదాలద్వారా ప్రాప్యత్వం, ప్రాపకత్వం తెలుపబడ్డాయి.

(తత్ పాదారవిందమ్) - ఇంతవరకు తెలుపబడిన స్వభావాన్ని కల్గిన భగవంతుని ఆ శ్రీచరణారవిందాలను,

(అరవిందవిలోచనస్య) - "జితం తే పుండరీకాక్ష !" (పుండరీకాక్షా! నీకు మంగళం) అని భగవత్‌కైంకర్యరుచిని కల్గించేవై "తత్ కాల్ పణిన్ద వెన్పాల్ ఎమ్బిరాన తడజ్గణ్‌కళ్" (తన శ్రీచరణాలను సేవించిన నాపట్ల స్వామి, తామరలవంటి విశాలలోచనాలు వాత్సల్యంతో ప్రకాశించాయి) అనే రీతిలో వాత్సల్యాన్ని కల్గినవై, "తామరైక్కణ్ణనై విణ్ణోర్ పరవుమ్ తలైమకనై" (పద్మాలవంటి నేత్రాలను కలవానిని, నిత్యసూరులు కీర్తించే స్వామిని) అనే విధంగా 'నిత్యసూరులకు భోగ్యమైన నేత్రాలను కల్గినవానియొక్క' అని అర్థం. దీని వల్ల, వీరు చేసే స్తోత్రప్రయత్నాన్ని చూచినపుడు భగవంతునకు కల్గిన ఆనందం ఆ స్వామి తిరునేత్రాలలో ప్రకాశించే రీతి చెప్పబడింది - అని



తిరుక్కణ్గళిలే తోన్ఱుకిఱపడియై చ్చొల్లుకిఱతు- ఎన్నుతల్. ఇవరుద్యోగత్తై క్కణ్డు ప్రీతనాయ్ కుళిరనోక్కిన పడియై చ్చొల్లుకిఱతు - ఎన్ఱుతల్.

(యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సు చ భాతి యస్మిన్నస్మన్మనోరథ పథ స్సకల స్సమేతి. నః కులధనం కులదైవత మరవిన్దలోచనస్య తత్పాదారవిన్దం స్తోష్యామి)

7శ్లో ॥ తత్త్వేన యస్య మహిమార్ణవశీకరాణుః
శక్యో న మాతు మపి శర్వపితామహాద్యైః ।
కర్తుం తదీయమహిమస్తుతి ముద్యతాయ
మహ్యం నమోస్తు కవయే నిరపత్రపాయ ॥ 7

వ్యా :- (తత్త్వేనేతి) విధిశివసనకాదికళ్ కరైప్పన్ఱిలే నిన్ఱు అళున్దుకిఱ విషయత్తై ప్పరిచ్ఛేదిత్తు ప్పుకళ ఇళివతే నానెన్ఱు తమ్మై

---

కాని, వీరి ప్రయత్నాన్ని చూచి, సంతోషించినవాడై, వీరిని చల్లగా చూచిన రీతి తెలుపబడింది - అని కాని చెప్పవచ్చు.

"యన్మూర్ధ్ని మే శ్రుతి శిరస్సు చ భాతి, యస్మిన్ మనోరథపథః సకలః సమేతి నః కులధనం, కులదైవత మరవిందవిలోచనస్య తత్పారవిందం స్తోష్యామి" అని అన్వయం.

7శ్లో ॥ (తత్త్వేనేతి) - బ్రహ్మ, శివుడు, సనకుడు మొదలైనవారు కూడా (భగవన్మహిమ అనే సముద్రంయొక్క) తీరప్రదేశంలోనే నిలచి మునిగిపోయే భగవానుడనే విషయాన్ని ఇదమిత్థంగా పరిచ్ఛేదించి పల్కి కీర్తించాలని నేను ప్రయత్నిస్తున్నానే! - అని తమను అధిక్షేపించుకొంటూ, యుద్ధానికి సిద్ధమైన

క్షేపిత్తు, యుద్ధత్తిలే ఉద్యుక్తనాన అర్జునన్ **"విసృజ్య సశరఞ్చాపమ్" (గీ-1)** ఎన్ఱు యుద్ధాన్నివృత్తనానాప్పోలే, స్తోత్రత్తిల్ నిన్ఱుమ్ నివృత్తరాకిఱార్.

**(తత్త్వేన)** ఈశ్వరనుడైయ స్వరూపరూపాదికళుళ్ళపడియై.

**(యస్య) "యథా రత్నాని జలధేః" (వామనపు-94)** ఇత్యాదికళిలే అనన్తగుణనాక ప్రసిద్ధనానవనుడైయ,

**(మహిమార్ణవశీకరాణుః)** గుణార్ణవత్తినుడైయ శీకరాణువానతు-తివలైయిల్ స్పర్శవేద్యమాన అత్యల్పమానతు.

**(మాతుం న శక్యః)** మనస్సాల్ పరిచ్ఛేదిక్కవుమ్ శక్యమన్ఱు. ఆరాలే యెన్ను మపేక్షైయిలే శొల్లుకిఱతు.

---

అర్జునుడు **"విసృజ్య సశరం చాపమ్"** (వింటిని అంబులతో పాటు విడచిపెట్టి) అనే విధంగాయుద్ధం నుండి విరమించినట్లుగా, స్తోత్రంనుండి విరమిస్తున్నారు.

**(తత్త్వేన)** - భగవంతుని స్వరూపరూపాలను యథాతథంగా,

**(యస్య)** - **"యథా రత్నాని జలధేః"** (సముద్రంలోని రత్నాలకు అంతులేనట్లు భగవద్గుణాలకు కూడా అంతు లేదు) ఇత్యాది ప్రమాణాలలో అనంతమైన గుణాలను కలవాడుగా ప్రసిద్ధి చెందిన భగవంతుని యొక్క - అని భావం.

**(మహిమార్ణవశీకరాణుః)** - గుణసముద్రంలోని నీటి తుంపురుయొక్క అత్యల్పకణం. నీటికణంలోని, కేవలం స్పర్శద్వారానే తెలియదగిన అత్యల్పకణం.

**(మాతుం న శక్యః)** మనస్సుతో పరిచ్ఛేదించడానికి సాధ్యం కాదో - అని భావం. (ఎవరికి? అనే ఆకాంక్షకు సమాధానం ఇకపై తెలుపబడుతున్నది).



**(శర్వపితామహాద్యైః) "ఈశ్వరాద్ జ్ఞానమన్విచ్ఛేత్" (మాత్స్యపు-67-41)** ఎన్ఱు జ్ఞానాధికనాకవుమ్, సర్వసంహర్తా ఎన్ఱు శొల్లుకిఱ రుద్రనాలుమ్, అవనై ఓతువిత్తవనుమాయ్, జగత్స్రష్టావాన బ్రహ్మావాలుమ్. ఆదిశబ్దత్తాలే బ్రహ్మభావనైయేయాన సనకాదికళైయుమ్, సర్వర్క్కుమ్ హితానుశాసనమ్ పణ్ణుకిఱవేదత్తైయుమ్ నినైక్కిఱతు. మేల్ **"సదా స్తువన్తో వేదాః" (స్తోత్రరత్నమ్-8)** ఎన్ఱుమ్, **"విధిశివసనకాద్యైః" (స్తోత్రరత్నమ్-47)** ఎన్ఱుమ్ శొల్లుకైయాలే **"యం న దేవా న మునయో న చాహం న చ శఙ్కరః జానన్తి", "యతో వాచో నివర్తన్తే" (తై-ఆ), "తవాన్తరాత్మా మమ చ" (భార-మో)** ఇత్యారభ్య **"న**

---

**(శర్వపితామహాద్యైః)- "ఈశ్వరాద్ జ్ఞానమన్విచ్ఛేత్"** (శంకరునివల్ల జ్ఞానాన్ని పొందగోరాలి) అని జ్ఞానాధికుడుగా, సర్వసంహర్త (అన్నిటిని సంహరించేవాడు)గా చెప్పబడే రుద్రుని చేతగాని, అతనికి చదువు నేర్పినవాడై, జగత్తును సృష్టించినవాడైన బ్రహ్మచే గాని - అని భావం. ఆదిశబ్దం చేత బ్రహ్మభావను మాత్రం కల సనకాదులు, అందరికీ హితాన్ని బోధించే వేదం తెలుపబడుతున్నది. స్తోత్రంలో దీని తరువాత **"సదా స్తువన్తో వేదాః"** (సదా కీర్తించే వేదాలు కూడా) అని, **"విధి శివసనకాద్యైః"** (బ్రహ్మశివసనకాదులకు కూడా ధ్యానించడానికి సాధ్యంకానివాడు) అని చెప్పబడినందున **"యం న దేవా న మునయో న చాహం న చ శంకరః, జానంతి"** (ఏ భగవంతుని దేవతలు కాని, మునులు కాని, నేను కాని, శివుడు కాని తెలియలేరో) అని, **"యతో వాచో నివర్తంతే"** (ఏ భగవద్గుణావధిని చూడలేక వేదవాక్కులు వెనుదిరుగుతున్నాయో) అని, **"తవాంతరాత్మా మమ చ"** (నీకు, నాకు విష్ణువు పరమాత్మ) అని ఆరంభించి, **"న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్"** (బాహ్యవస్తువులను గ్రహించే ఏ ఇంద్రియాలచే గ్రహించడానికి వీలు కానివాడు) అని, **"చతుర్ముఖాయుః"** (బ్రహ్మ ఆయుస్సును కలవాడు కోటిముఖాలను కలవాడు కూడా భగవద్గుణవైభవాన్ని

గ్రాహ్యః కేనచిత్క్వచిత్", "చతుర్ముఖాయుః" (వారాహ-73) ఇత్యాది.

(తదీయమహిమస్తుతిం కర్తు ముద్యతాయ) అవనుడైయ పెరుమైయై ఉళ్ళవళవుమ్ శొల్లి విడుకైయన్టిక్కే, ఇల్లాతతుమ్‌శొల్ల ఉద్యుక్తనాకై.

(మహ్యం నమోఽస్తు) ఇప్పడిప్పట్ట స్వభావత్తైయుడైయనాకైయాలే స్తుత్యవిషయత్తై విట్టు ఎనక్కు నమస్కారమ్.

(కవయే) సర్వవర్ణనముఖరాయ్.

(నిరపత్రపాయ) నిర్లజ్జనాయిరుక్కిఱ ఎనక్కు. నామ్ పుకழுకై ఇవనుక్కు నిఱక్కేడామెన్టు లజ్జియాతొழிకై.

(యస్య మహిమార్ణవశీకరాణుః శర్వపితామహాద్యై రపి తత్త్వేన

పూర్తిగా ఇదమిత్థంగా లెక్కించి పలుకలేడు) అని గల ప్రమాణాలు స్మరణీయాలు.

(తదీయ మహిమస్తుతిం కర్తు ముద్యతాయ) - అతని గొప్పతనాన్ని యథాతథంగా అది ఉండే అవధిలో పల్కడమే కాక, లేనిది కూడా ఆరోపించి పలకాలని ప్రయత్నించినవాడనైన,

(మహ్యం నమోఽస్తు) - ఇటువంటి స్వభావాన్ని కల్గినవాడనైనందున, స్తుతించవలసిన భగవంతుని విడచి, నాకు నమస్కారం అగు గాక.

(కవయే) - సర్వవర్ణన ముఖరుడనైన - అని భావం.

(నిరపత్రపాయ) - లజ్జలేని నాకు. మనం వర్ణించడం ఆ భగవంతుని గొప్పతనానికి దోషాన్ని కల్గిస్తుందని సిగ్గుపడకపోవడం.

"యస్య మహిమార్ణవశీకరాణుః శర్వపితామహాద్యైరపి తత్త్వేన



మాతుం న శక్యః. తదీయమహిమస్తుతిం కర్తు ముద్యతాయ నిరపత్రపాయ కవయే మహ్యం నమోఽస్తు)

8శ్లో ॥ యద్వా శ్రమావధి యథామతి వాఽప్యశక్తః
స్తౌమ్యేవమేవ ఖలు తేఽపి సదా స్తువన్తః ।
వేదా శ్చతుర్ముఖముఖాశ్చ మహార్ణవాన్తః
కో మజ్జతో రణుకులాచలయో ర్విశేషః ॥

అవ : (యద్వేతి) "ఇషుక్షయాన్నివర్తన్తే", "కాణుమళవుమ్ శెల్లుమ్ కీర్త్తియాయ్" (తి-వాయ్-5-8-4) ఎన్టు అళవుడైయారుమ్ తమ్‌తామ్ జ్ఞానశక్త్యాదికళళవుమ్ పుకழ்న్దార్‌కళత్తనై. ఉమక్కు మవ్వళవు పుకழுకైక్కు క్కుఱైయిల్లై. "సా జిహ్వా యా హరిం స్తౌతి" (విష్ణుధర్మమ్-1), "వాయవనై

మాతుం న శక్యః, తదీయ మహిమస్తుతిం కర్తు మద్యతాయ నిరపత్రపాయ కవయే మహ్యం నమోఽస్తు" అని అన్వయం.

8శ్లో ॥ (యద్వేతి) - "ఇషుక్షయాన్నివర్తంతే" (బాణాల క్షయం వల్ల విలుకాండ్రు బాణప్రయోగం నుండి విరమిస్తున్నారు తప్ప అంతరిక్షంనిండి పోవడంవల్ల కాదు. ఆ విధంగానే, స్తుతించేవారు తన మతి క్షయం వల్ల విరమిస్తున్నాడు తప్ప, గోవిందుని గుణాలు లేకుండా పోవడం వల్ల కాదు) అని, "కాణుమళవుమ్ శెల్లుమ్ కీర్తియాయ్" (స్తుతించేవాడు చూచే అవధికి వెళ్ళే అనేవిధంగా అంతులేని కీర్తిని కలవాడై) జ్ఞానాధికులు కూడా భగవంతుని పూర్తిగా స్తుతించలేరు. తమ తమ జ్ఞానం, స్తుతించడంలో శక్తి ఎంతవరకు ఉన్నదో, అంతవరకే స్తుతించగలరు; అంతే. మీకుకూడా తావన్మాత్రంగా స్తుతించడానికి లోటు లేదు. "సా జిహ్వా యా హరిం స్తౌతి" (హరిని స్తుతించేదే జిహ్వా) అని, "వాయవనై యల్లదు వాழ்త్తాదు" (నా నాలుక భగవంతుని

**యల్లతు వాழ్త్తాతు" (1-తిరువ-11)** వాయ్‌స్తుతిక్కవన్తో కణ్డతు. "స్తవ్య స్తవప్రియః" (సహస్రనామ) ఎన్గిఱపడియే స్తోత్రమ్ నమక్కు ప్రియమన్తోవెన్ఱు, యుద్ధాన్నివృత్తనాన అర్జుననై "కరిష్యే వచనం తవ" (గీ-18-73) ఎన్నప్పణ్ణినాప్పోలే ఈశ్వరన్ తానే మూట్ట సమాహితరాకిఱార్.

**(యద్వా)** పూర్వపక్షనివృత్తిః. మున్బు యోగ్యనల్ల వెన్ఱ విడ మర్థమన్ఱు- ఎన్గిఱార్.

**(యద్వా)** అథవా, ఇల్లావిట్టాల్.

**(శ్రమావధి యథామతి వా)** ఇళైప్పెల్లైయాక వాతల్, జ్ఞాన మెల్లైయాక వాతల్ - ఎన్నుతల్. జ్ఞానశక్త్యాదికళవే స్తోత్రమ్ పణ్ణలావతు - ఎన్గై.

---

తప్ప ఇంకొకనిని స్తుతించదు) అనేవిధంగా జిహ్వా అనేది భగవంతుని స్తుతించడానికి కదా ఉన్నది. **"స్తవ్యః స్తవప్రియః"** (స్తుతించదగినవాడు, స్తుతిని ప్రియంగా కలవాడు) అనే విధంగా స్తుతి అనేది నాకు ఇష్టమేకదా - అని, భగవంతుడు యుద్ధం చేయడంనుండి విరమించిన అర్జునుని **"కరిష్యే వచనం తవ"** (నీ మాటను తప్పక ఆచరిస్తాను) అనేటట్లు చేసినట్లుగా, వీరిని కూడా ప్రోత్సహించగా, యామునులు సమాధానపడుతున్నారు.

**(యద్వా)** - దీనిద్వారా పూర్వపక్షనివృత్తి చేయబడుతున్నది. అంటే- ఇంతకు ముందు పల్కినట్లుగా "తాను భగవంతుని స్తుతించడానికి యోగ్యతను కలవాడనుకాను'' అనేది అర్థం కాదు- అని పల్కుతున్నారు.

**(యద్వా)** - అథవా - లేకపోతే,

**(శ్రమావధి యథామతి వా)** - అలసట కలిగేవరకు కాని, జ్ఞానం ఉన్నంతవరకు కాని- అని భావం. జ్ఞానం, శక్తి ఏ అవధిలో ఉన్నదో, అంత అవధివరకే స్తుతించగల్గడం - అని భావం.



**(అశక్తోఽపి స్తామి)** సర్వప్రకారత్తాలుమ్ అశక్తనేయాకిలుమ్ స్తుతిక్కిఱేన్.

**(సదా స్తువన్తో వేదా శ్చతుర్ముఖముఖాశ్చ ఏవమేవ ఖలు తేఽపి)** త్యాజ్యోపాదేయఙ్గళై ప్పిరిక్కైక్కుక్కుమ్, త్యాజ్యత్తై విట్టు ఉపాదేయత్తిల్ అవగాహిక్కైక్కు మడియాన జ్ఞానశక్త్యాదికళాల్ అధికరానవర్కళుమ్.

**(సదా స్తువన్తో వేదాః)** సర్వకాలస్తుతి సంయోగత్తైయుడైయత్తాన వేదఙ్గళుమ్.

**(చతుర్ముఖముఖాశ్చ)** ద్విపరార్ధకాలావధికరాన బ్రహ్మరుద్రాది- కళుమ్. అధికారావసానత్తళవుమ్ స్తుతిక్కిఱ సనకాదికళుమ్.

**(ఏవ మేవ ఖలు)** ఇవ్వళవేయితే. జ్ఞానశక్తికళళవేయితే. "యతో వాచో

---

**(అశక్తోఽపి స్తామి)** - అన్ని విధాలుగా అశక్తుడనైనా, స్తుతిస్తాను.

**(సదా స్తువంతో వేదా శ్చతుర్ముఖాశ్చ ఏవమేవ ఖలు తేఽపి)** - గ్రహించదగినవానిని, విడువదగినవానిని విభజించడానికి మూలమైన జ్ఞానశక్త్యాదులలో గొప్పవారైనవారుకూడా - అని భావం.

**(సదా స్తువంతో వేదాః)** - సర్వకాలం స్తుతిసంయోగాన్ని కల్గిన వేదాలు కూడా (సదా స్తుతించే వేదాలుకూడా).

**(చతుర్ముఖాశ్చ)** - ద్విపరార్థకాలాన్ని ఆయుష్కాలావధిగా కల్గిన బ్రహ్మరుద్రాదులు సైతం, తమ తమ అధికారాలు పూర్తి అయేవరకు స్తుతించే సనకాదులు కూడా.

**(ఏవమేవ ఖలు)** - ఇంతమాత్రమేకదా. అంటే, జ్ఞానశక్తులున్నంతవరకే స్తుతిస్తారు కదా - అని భావం. **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** (భగవంతుని ఏ ఆనందగుణాన్ని లెక్కించలేక వేదాలు మనస్సుతో

నివర్తన్తే అప్రాప్య మనసా సహ" (తై-ఆ), "యన్నాయం భగవాన్బ్రహ్మా జానాతి పురుషోత్తమమ్" (వి.పు.1-9-59), "మామలరాన్ వార్శడైయాన్ వల్లరే యల్లరే వాழ்త్తు" (4-తిరుప-10), "పేశువా రెవ్వళవుపేశువర్ అవ్వళవే" (3-తిరువ-21), "వల్లతోర్వణ్ణమ్" (తి-వాయ్-7-8-10), "న గ్రాహ్యః కేన చిత్క్వచిత్" (భార-శాన్తి).

ఇజ్గనేయాకిల్ ఉమక్కుమవర్కళుక్కుమ్ వాశియుణ్డో? యెన్న; వేదజ్గళుక్కుమ్ చతుర్ముఖాదికళుక్కుమ్ నెడువాశి యుణ్డాయిరుక్క అవనై ఉళ్ళపడియే పేశమాట్టామైయిలే సామ్యముణ్డానాప్పోలే, ఎనక్కుమవర్కళుక్కుమ్ వాశియుణ్డానాలుమ్ ఉళ్ళపడి పేశమాట్టామైయిల్ వాశియిల్లై.

---

పాటు వెనుదిరుగుతున్నాయో) అని, "యన్నాయం భగవాన్బ్రహ్మా జానాతి పురుషోత్తమమ్" (గొప్ప జ్ఞానశక్త్యాదులను కల ఈ బ్రహ్మకూడా పురుషోత్తముని తెలియలేడు), "మామలరాన్ వార్శడైయాన్ వల్లరే యల్లరే వాழ்త్తు" (నాభీపద్మంనుండి పుట్టిన బ్రహ్మ, జటలను నిండుగా కల శివుడు భగవానుని యథాతథంగా స్తుతించగలరా?) "పేశువారెవ్వళవు పేశువర్ అవ్వళవే" (వర్ణించేవారు ఏ అవధిలో పల్కుతారో, ఆ అవధిలోనే భగవంతుడు వారికి దర్శనమిస్తాడు), "నల్లతోర్ వణ్ణమ్ శొన్నాల్ అదువే ఉనక్కామ్ వణ్ణమే" (తగిన, అద్వితీయమైన రీతిలో పల్కితే అది నీకే అన్వయించే రీతిలో ఉంటుంది) అని, "న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్" (బాహ్యవస్తువులను గ్రహించే ఇంద్రియాలచే గ్రహించడానికి భగవంతుడు వీలుకాడు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

ఈ విధంగా అయితే, మీకు, బ్రహ్మాదులకు ఏమి తారతమ్యం? అంటే, వేదాలకు, బ్రహ్మాదులకు మధ్య చాలా తారతమ్యం ఉన్నా, భగవంతుని యథాతథంగా స్తుతించలేక పోవడంలో పోలిక ఉన్నట్లే, నాకు, వారికి (బ్రహ్మాదులకు) మధ్య తారతమ్యం ఉన్నా, భగవంతుడు ఉండే రీతిలో



ఎతుపోలే? ఎన్నిల్,

(మహార్ణవాన్తర్మజ్జతోరణుకులాచలయోః కో విశేషః) అణుమహీధరజ్గళుక్కు నెడువాశి యుణ్డానాలుమ్, పెరుజ్గడలిలే పుక్కழுన్దుమళవిల్ విశేషమిల్లైయిఱే, అతుపోలేయిఱే.

9 శ్లో ॥ కిఞ్చైష శక్త్యతిశయేన న తేఽనుకమ్ప్యః
స్తోతాఽపి తు స్తుతికృతేన పరిశ్రమేణ ।
తత్ర శమస్తు సులభో మమ మన్దబుద్ధేః
ఇత్యుద్యమోఽయ ముచితో మమ చాబ్జనేత్ర ॥

అవ : (కిఞ్చేతి) బ్రహ్మాదికళిల్కాట్టిల్ ఎనక్కు స్తోత్రత్తిలే ఇழிకైక్కు అధికహేతు వుణ్డెన్గిఱార్. అతావతు- పరక్క పుకழ்కై. ఈశ్వరనిగ్రహహేతు విన్ఱిక్కే స్తుతికృతమానపరిశ్రమమ్ అనుగ్రహహేతువామ్బడి శీలవానాకైయాలే

---

పలుకలేకపోవడంలో తేడా లేదు. ఏవిధంగా? అంటే,

**(మహార్ణవాంతః మజ్జతోరణుకులాచలయోః కోవిశేషః?)** అణువు, పర్వతాల మధ్య అంటే, చాలా చిన్నదైన అణువు, చాలా పెద్దది అయిన పర్వతాల మధ్య - చాలా తేడా ఉన్నా, మహాసముద్రంలో ప్రవేశించి మునిగిపోయే విషయంలో వాటికి తేడా లేదుకదా! ఆవిధంగానే నాకు, బ్రహ్మాదులకు మధ్య తేడా లేదు.

**9శ్లో ॥ (కిం చేతి)** - ఇందులో, బ్రహ్మాదులకంటే నాకు భగవంతుని స్తుతించడానికి యత్నించడంలో ఎక్కువ కారణం ఉన్నదని పల్కుతున్నారు. అది ఏమంటే- విస్తృతంగా పొగడడం. స్తుతిచేయడం వల్ల నాకు కల్గిన అలసట

వన్ద బుద్ధియాన ఎనక్కుమ్ అన్ద శ్రమమ్ సులభమాకైయాలే, అవర్‌కళిల్కాట్టిల్ నాన్ స్తోత్రాధికారి ఎన్గిఱార్.

వ్యా : (కిఞ్చ) కీழ్‌చ్చొన్న సామ్య మొழియ స్తోత్రత్తిలే అవర్‌కళిల్కాట్టిల్ ఎనక్కు అధికారముణ్డాకైక్కు ఒరు హేతు వుణ్డు- ఎన్గిఱార్.

(ఏష స్తోతా) భగవదాభిముఖ్యత్తాలే సంసారికళిల్కాట్టిల్ వ్యావృత్తనాయ్, వాయ్ పడైత్త ప్రయోజనమితువెన్ఱు భగవత్ స్తోత్రత్తిలే ఇழிన్ద ఇవన్.

(శక్త్యతిశయేన న తేఽనుకమ్ప్యః) నమ్మై ప్పరక్క స్తోత్రమ్ పణ్ణమికవుమ్ శక్తనెన్ఱు ఉనక్కు అనుగ్రాహ్యనాకిఱానల్లన్.

---

భగవంతుడు నిగ్రహించడానికి హేతువు కాకుండా, అనుగ్రహహేతువు అయేటట్లుగా, భగవంతుడు శీలగుణం కలవాడైనందున, భగవదనుగ్రహహేతువైన అలసట మందబుద్ధి అయిన నాకు కల్గడం సులభమే కనుక, బ్రహ్మాదుల కంటే నేను సులభంగా భగవదనుగ్రహం పొందగల్గినవాడనైననందున, నేను స్తుతించడానికి (ఎక్కువ) అధికారాన్ని కలవాడను - అని పల్కుతున్నారు.

**(కించ)** - ఇంతేకాక, పూర్వశ్లోకంలో పల్కిన, బ్రహ్మాదులకు నాకుమధ్య ఉండే సామ్యమేకాక, స్తుతించడంలో, వారికంటే నాకు ఎక్కువ అధికారమున్నది - అనే దానికి ఒక హేతువు ఉన్నది - అని పల్కుతున్నారు.

**(ఏష స్తోతా)** - భగవంతుని పట్ల ఆభిముఖ్యాన్ని కల్గి ఉండడంచేత సంసారులకంటే విలక్షణుడనై, జిహ్వను కల్గి ఉన్నందుకు ప్రయోజనం ఇది - అని భగవానుని స్తుతించడానికి ప్రయత్నించే నేను,

**(శక్త్యతిశయేన న తేఽనుకంప్యః)** - "నన్ను విస్తృతంగా స్తుతించడంలో ఇతడు చాలా సమర్థుడు'' అనే కారణంతో నీకు అనుగ్రహించదగినవాడను కాను,



**(తే)** "యతో వాచో నివర్తన్తే" (తై-ఆ), "తద్విప్రాసో విపన్యవః" (విష్ణుసూ) ఎన్ఱుమ్, వేదఙ్గళుమ్ నిత్యసూరికళుమ్ పుకழ்న్దు ఎల్లై కాణమాట్టాత మహిమైయైయుడైయ ఉనక్కు ప్పరక్క స్తోత్రమ్పణ్ణుకై తేట్టమన్ఱే ఎన్నుతల్. సంసారికళ్ అభిముఖ్యమ్ పణ్ణుకై తేట్టమాన శీలవానాకైయాలే ఇవన్ పణ్ణుమ్ స్తోత్రమ్ మిகైయాన ఉనక్కెన్నుతల్.

**(అపి తు)** మఱ్ఱెప్పడి యెన్నుతల్. పిన్నై యెఙ్గనే? యెన్ఱు సానునయ ప్రశ్నమాతల్.

**(స్తుతికృతేన పరిశ్రమేణ)** ఉన్నై స్తుతిక్కైయిలే అత్యాదరత్తై పణ్ణి, అతుక్కీడాన శక్తి యిల్లామైయాలే, పుకழவుమ్ మాట్టాతే, కవిపాడవుమ్ మాట్టాతే పడు మిళైప్పాలేయిఱే నీ ఇరఙ్గువతు.

---

**(తే)** - "యతో వాచో నివర్తంతే" (భగవద్గుణ వైభవాన్ని స్తుతించలేక వేదాలు తిరోగమిస్తున్నాయి) అని, "తద్విప్రాసో విపన్యవః" (స్తుతించడం స్వభావంగా కల ఆ నిత్యసూరులు) అనే రీతిలో వేదాలు, నిత్యసూరి సమూహం స్తుతించి అవధిని దర్శించలేని మహిమను కల నిన్ను పూర్తిగా స్తుతించడం సాధ్యం కాదుకదా - అని భావం. (లేక) సంసారులు ఆభిముఖ్యాన్ని చూపడం గొప్పగా భావించే శీలగుణాన్ని కలవాడైనందున, ఇతడు (నేను) చేసే స్తుతిని గొప్పగా భావించే నీకు - అని భావం.

**(అపి తు)** - వేఱే రీతిలో - అని భావం. (లేక) మఱి ఏవిధంగా? అని సానునయంగా భగవంతుడు ప్రశ్నించడం దీని అర్థమని చెప్పవచ్చు.

**(స్తుతికృతేన పరిశ్రమేణ)** - నిన్ను స్తుతించడంలో చాలా ఆదరాన్ని చూపి, దానికి తగిన శక్తిలేనందున, పొగడలేక, కవిత్వాన్ని పలుకలేక నేను పడే అలసటను చూచి కదా నీవు జాలిపడతావు.

**(తత్ర)** అర్థ మిప్పడియాయ్ నిన్ఱవిడత్తిలే.

**(శ్రమస్తు సులభో మమ)** ఎనక్కు విశేషిత్తతు శ్రమమానతు కుఱైవఱవుణ్డు.

**(తు)** ఎన్ఱు అవధారణమాయ్, ఎనక్కే కుఱైవఱ్ఱ శ్రమ ముళ్ళతు- ఎన్నుమామ్.

**(మన్దబుద్ధేః)** ఎన్ఱు శ్రమహేతువై చ్చొల్లుకిఱతు. అల్పబుద్ధి -ఎన్నై.

**(ఇతి)** ఇప్పడి ఎన్నుతల్. అకైయాలే ఎన్ఱు హేతువాక చ్చొల్లుతల్,

**(అయముద్యమః)** **"స్తోష్యామి" (స్తోత్రరత్నమ్-6)** ఎన్ఱు కొణ్డుణ్డాన ఇన్ద వుద్యోగమ్.

**(ఉచితో మమ చ)** చ శబ్దమ్ అవధారణమాయ్, ఎనక్కే

---

**(తత్ర)** విషయం ఈ విధంగా ఉండే ఈ సందర్భంలో,

**(శ్రమస్తు సులభో మమ)** - నాకు విశేషించి ఉన్నది ఏమంటే- స్తుతించడంలో అలసట లోటు లేకుండా ఉన్నది.

**(తు)** - ఇది అవధారణార్థకం. నాకే ఏ లోటు లేని అలసట ఉన్నదని భావం.

**(మందబుద్ధేః)**- ఎందుకంటే, ఆ శ్రమకల్గడానికి తగిన హేతువును దీని ద్వారా తెల్పుతున్నారు. నేను అల్పబుద్ధిని కనుక- అని దీనిభావం.

**(ఇతి)**- ఈ విధంగా- అని కాని, ఇందువల్ల- అని హేతువుగా కాని దీనిని వివరించచ్చు.

**(అయ ముద్యమః)**- **"స్తోష్యామి"** అని నేను చేసిన ఈ ప్రయత్నం.

**(ఉచితో మమ చ)** - ఇక్కడ చకారం అవధారణను తెలుపుతుంది.



ఉచితమెన్నుతల్. సముచ్చయమాయ్, ఎనక్కుమ్ సముచిత మెన్ఱు కీழ்శ్లోకత్తోడే కూట్టుతల్.

**(అబ్జనేత్ర) "అవలోకనదానేన భూయో మామ్" (వి-పు-1-20-16)** ఎన్ఱుమ్, **"ఉన్తామరైక్కణ్గళాల్ నోక్కాయ్" (తి-వాయ్-9-2-1)** ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే అవిఘ్నన స్తోత్రమ్ తలైక్కట్టుమ్పడి అழకియ తిరుక్కణ్గళాలే నోక్కి యరుళవేణు మెన్నుతల్. స్తోత్రత్తిలే నిలై నిన్ఱార్పడియై క్కణ్డు, **"శెన్దామరై క్కణ్ణాడు మఱప్పఱ వెన్నుళ్ళే మన్నినాన్" (తి-వాయ్-1-10-10)** ఎన్గిఱపడియే ప్రీతియాలే తిరుక్కణ్గళ్ కుళిర్న్ద పడియై చ్చొల్లుతల్.

---

నాకే ఉచితమని భావం, (లేక) సముచ్చయాన్ని తెల్పుతున్నదని భావిస్తే, నాకు కూడా తగినదే- అని పూర్వశ్లోకార్థంతో అన్వయించి అర్థంచెప్పవచ్చు.

**(అబ్జనేత్ర!)** - **"అవలోకనదానేన భూయో మామ్"** (కటాక్షదానంతో మాటిమాటికి నన్ను అనుగ్రహించు) అని, **"ఉన్ తామరైక్కన్గళాల్ నోక్కాయ్"** (నీ, తామరలవంటి నేత్రాలతో కటాక్షించు) అని పల్కినట్లుగా ఏ విఘ్నం లేకుండా స్తుతిని నేను పూర్తిచేసేటట్లుగా అందమైన తిరునేత్రాలతో కటాక్షించాలని భావం. (లేక) స్తుతించాలనే నిశ్చయం కల్గి ఉండడాన్ని చూచి, **"శెన్దామరైకణ్ణాడు మఱప్పఱ ఎన్నుళ్ళే మన్నినాన్"** (పద్మనేత్రాలతో, విస్మృతి కలుగని రీతిలో నాలో స్థిరపడ్డాడు) అనేటట్లు ప్రీతితో తిరునేత్రాలతో కటాక్షించడం తెలుపబడినదని చెప్పవచ్చు.

**10శ్లో ॥** నావేక్షసే యది తతో భువనాన్యమూని
నాలమ్ప్రభో భవితు మేవ కుతః ప్రవృత్తిః ।
ఏవం నిసర్గసుహృది త్వయి సర్వజన్తోః
స్వామి న్నచిత్ర మిద మాశ్రితవత్సలత్వమ్ ॥

అవ : **(నావేక్షసే ఇతి)** ఇప్పడి స్తోత్రాక్షేపసమాధానత్తై ప్పణ్ణి ఈశ్వరనుడైయ శరణ్యత్తైక్కుఉప్పాన భగవత్పరత్వత్తై మేల్ అఞ్జు శ్లోకత్తాలే అరుళిచ్చెయ్‌కిఱార్. ఇతిల్- ముతల్ శ్లోకత్తాలే సద్బ్రహ్మాది సామాన్యవాచిశబ్దఙ్గళాలే జగత్కారణతయా ప్రతిపాదిక్కప్పడుకిఱాన్ శ్రీమన్నారాయణనే-ఎన్ఱు గతిసామాన్యన్యాయత్తాలే కారణవాక్యవిషయమాన భగవత్పరత్వత్తై యరుళిచ్చెయ్‌కిఱార్. స్తోత్రమ్బణ్ణ ఉపక్రమిత్తవాఱే వాత్సల్యజన్యమాన విశేషకటాక్షత్తై ప్పణ్ణినాయెన్గిఱ వితు - ప్రళయకాలత్తిలే

**10శ్లో ॥** అవ : **(నావేక్షస ఇతి)-** ఈవిధంగా ఇంతవరకు భగవంతుని స్తుతించడాన్ని గూర్చి వచ్చిన ఆక్షేపానికి సమాధానం పల్కి, భగవంతుని శరణ్యత్వానికి తగిన (ఉపయోగపడే) భగవత్పరత్వాన్ని (భగవంతుని సర్వాధికత్వాన్ని) ఇకపై అయిదు శ్లోకాలతో పల్కుతున్నారు. వానిలో, ఈ మొదటి శ్లోకంతో, సత్, బ్రహ్మ - మొదలైన సామాన్యవాచి శబ్దాలతో వేదంలో ప్రతిపాదింపబడిన జగత్కారణభూతుడు శ్రీమన్నరాయణుడే - అని గతిసామాన్యన్యాయం ద్వారా వేదంలోని కారణవాక్యాలకు విషయ (ప్రమేయ)మైన భగవత్పరత్వాన్ని తెల్పుతున్నారు. స్తుతించడం ఆరభించగానే వాత్సల్యగుణంతో కూడిన (వాత్సల్యం వల్ల కల్గిన) విశేషకటాక్షాన్ని చేశావు- అని కవి అనడంలోని తాత్పర్యం ఏమంటే - ప్రళయకాలంలో అచిత్తువలె ఉండే జీవులకు **"దయామానమనాః"** (దయ కల మనస్సు కలవాడై) విశేషకటాక్షాన్ని చూపి, సృష్టించి, సృష్టించిన జీవుల ప్రవృత్తినివృత్తులకు



అచిత్కల్పరాన చేతనరై దయమానమనావాయ్ క్కొణ్డు విశేషకటాక్షత్తై ప్పణ్ణి ఉణ్డాక్కి, ఉణ్డాన జన్తుక్కళుడైయ ప్రవృత్తినివృత్తిహేతుభూతనాయ్, ఉపకారకనాన ఉనక్కు సృష్టమాన జన్తుక్కళ్ అభిముఖ్యమ్ పణ్ణ ముకమ్ కొడుత్తాయ్ - ఎన్గిఱ వితు ఆశ్చర్యమో? ఎన్గిఱార్.

వ్యా :- **(నావేక్షసే యది) "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" (తై-ఆ)** ఎన్ఱు అచిత్కల్పరాన చేతనరై క్కటాక్షిత్తిలైయాకిల్. అనాదికాలమ్ పణ్ణిప్పోన్ద అపరాధఙ్గళై ప్పారాతే అవర్గళినుడైయ దుర్గతియైయే పార్త్తు కృపాపరతన్త్రనాయితే ఇప్పోతుమ్ కటాక్షిత్తతు. అల్లతు, ఉన్నై "కటాక్షిత్తిలైయే" ఎన్బారిల్లైయే.

**(తతః) "బహుస్యామ్" (తై-ఆ)** ఎన్గిఱ సఙ్కల్పత్తుక్కు ప్పిన్బు భువనసృష్టిక్కు మున్బుణ్డాన దూరత్తై చ్చొల్లుకిఱతు.

కారణమైనవాడవై, ఉపకారం చేసేవాడవైన నీకు, నీవు సృష్టించిన జీవులు నీపట్ల ఆభిముఖ్యాన్ని చూపిస్తే, వారికి దర్శనాన్ని అనుగ్రహించావు- అనేది ఆశ్చర్యంకాదు కదా !- అని పల్కుతున్నారు.

వ్యా : **(నావేక్షసే యది)-"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ"** (జగత్కారణవస్తువు 'నేను అనేకంగా జన్మిస్తాను' అని సంకల్పించింది.) - "నేను అనేకంగా జన్మిస్తాను అని అచిత్ సమంగా పడి ఉండే జీవులను కటాక్షించకపోతే - అని భావం. జీవులు అనాదికాలంగా చేసే అపరాధాలను చూడకుండా, ఆ చేతనుల దుర్గతిని మాత్రమే చూచి, కృపకు వశుడైకదా భగవంతుడు ఇపుడు కటాక్షిస్తున్నాడు. లేకపోతే - భగవంతుని ఉద్దేశించి "నీవు కటాక్షించ లేదే!" అని అనేవారు లేరుకదా!

**(తతః) - "బహుస్యామ్"** (నేను అనేకంగా జన్మిస్తాను) అనే సంకల్పానికి తరువాత, జగత్తు సృష్టికి ముందు ఉండే వ్యవధానం దీనిద్వారా తెలుపబడుతున్నది.

**(అమూని భువనాని భవితు మేవ నాలమ్)** భోగమోక్షఙ్గళై సాధిత్తుక్కొళ్ళుకైక్కు ఏకాన్తమాన చతుర్దశభువనఙ్గళాన ఇవై ఉణ్డాకవే మాట్టాతు. వ్యతిరేకనిర్దేశమ్ - అర్థస్థైర్యత్తుక్కాక. "కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్?" (తై-ఆ), "న తదస్తి వినా యత్స్యాన్మయా భూతఞ్చరాచరమ్" (గీ-10-39) ఎన్నక్కడవతిఱే.

**(కుతః ప్రవృత్తిః)** ఉన్ సఙ్కల్పమొఴియ ఉణ్డాకవే మాట్టాత ఇవై ప్రవర్త్తిప్పతెత్తాలే. సకలోత్పత్తియుమ్, ప్రవృత్తియుమ్ ఉన్నుడైయ ఒరుకటాక్షఫలమన్ఱో-ఎన్ఱై.

**(ప్రభో!)** జగత్కారణత్వప్రయుక్తమాన ఐశ్వర్యత్తై యుడైయవనే!.

---

**(అమూని భువనాని భవితు మేవ నాలమ్)** - భోగమోక్షాలను సాధించి, పొందడానికి తగినవైన చతుర్దశభువనాలనే ఈ లోకాలు ఉత్పన్నమై ఉండేవి కావు. ఇక్కడ **"భవితు మేవ నాలమ్"** అనే వ్యతిరేకనిర్దేశం - అర్థంలోని స్థిరత్వాన్ని (దార్ఢ్యాన్ని) తెలుపడం కోసం చేయబడింది. **"కో హ్యే వాన్యాత్ కః ప్రాణ్యాత్?"** (ఏ పరమాత్మ ఒక్కడే రక్షించగలడో? ఏ పరమాత్మ జీవింపజేయగలడో?) **"న తదస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరాచరమ్"** (నేను లేకుండా చరాచరాలలో ఏదీ ఉండదు) ఇత్యాది ప్రయోగాలలోని నిర్దేశం అటువంటిదే.

**(కుతః ప్రవృత్తిః?)** - నీ బహుభవనరూప సంకల్పం లేనిదే జన్మించలేని ఈ భువనాలు ఇక ఏవిధంగా ప్రవర్తించగలవు? ఈ భువనాలు ఇక ఏవిధంగా ప్రవర్తించగలవు? అన్నిటి ఉత్పత్తి, ప్రవృత్తి - అంతా నీ సంకల్ప రూప కటాక్షఫలమే కదా !- అని భావం.

**(ప్రభో!)** - జగత్కారణత్వం వల్ల ఏర్పడిన ఐశ్వర్యాన్ని (అధికారాన్ని)- కలవాడా!



**(సర్వజన్తోరేవం నిసర్గసుహృది త్వయి)** నిత్యవిభూతియుణ్డాయిరుక్క ఇవఱ్ఱై యిఴక్కైయాలే "స ఏకాకీ న రమేత" (మహోప) ఎన్నుమ్పడి తనిమైప్పట్టయాయ్, బ్రహ్మరుద్రాదిస్థావరాన్తమాన జన్తుజాతత్తుక్కు కరణకళేబరఙ్గళైక్కొడుత్తు ఉన్ కుఱైతీర్న్దా యెన్నుమ్పడి అకారణసుహృత్తాన ఉన్పక్కలిలే.

**(స్వామిన్!)** ఇవఱ్ఱై యుణ్డాక్కుకిఱ ఇతు ఉన్పేఱాక వేణ్డిఱ్ఱు- ఇవఱ్ఱోడుణ్డాన కుడల్ తుడక్కిఱే. "స్వముద్దిశ్య ఉపాదత్తే" (ర-స్త-2-88) ఎన్ఱిఱే అభియుక్తర్వార్త్తైయుమ్. స్వవ్యతిరిక్తసకల చేతనాచేతనఙ్గళుమ్ ఉనక్కు అనన్యార్హశేషమామ్పడి స్వామిత్వత్తై యుడైయవనే!

---

**(సర్వజంతో రేవం నిసర్గసుహృది త్వయి)** - నిత్యవిభూతిని కల్గి ఉన్నప్పటికీ, సంసారిజీవులను కోల్పోయినందు వల్ల **"స ఏకాకీ న రమేత"** (పరమపదంలోని ఆభగవంతుడు తనను ఏకాకివలె భావించి, ఆనందించడంలేదు) అనేవిధంగా ఒంటరితనాన్ని అనుభవించినవాడవై, బ్రహ్మరుద్రాది స్థావరాలవరకు గల ప్రాణిసమూహానికి ఇంద్రియాలను, దేహాలను ఇచ్చి, నీ కొఱత తీర్చుకొన్నావు - అనే రీతిలో సహజమైన సౌహార్దాన్ని కల్గినవాడవైన నీ విషయంలో.

**(స్వామిన్!)** - ఈ జీవులను సృష్టించడం - అనే ఈ పనిని నీ ప్రయోజనజనంగా ఆశించి చేయడం వీటితో నీకు ఉండే గర్భసంబంధం కారణంగా కదా! **"స్వముద్దిశ్య శ్రీమాన్... ఉపాదత్తే సత్తాస్థితినియమనాద్యైః"** (భవంతుడు సృష్టి, స్థితి, నియమనం మొదలైన కార్యాలతో చేతనాచేతనాలను తన వస్తువులుగా తనకోసం స్వీకరిస్తున్నాడు) అని కదా అభియుక్తులైన భట్టర్ పల్కిన సూక్తి. నీకంటే వేఱయిన సకల చేతనాచేతనాలు నీకు అనన్యార్హాలు అయేటట్లుగా ఉండే స్వామిత్వాన్ని కలవాడా!

**(ఇద మాశ్రితవత్సలత్వం న చిత్రమ్)** సకలవాఙ్మనసాగోచరమాన భగవద్విషయస్తోత్రత్తుక్కు యోగ్యనాప్పడి ఎన్నైక్కలుణ్డాన వాత్సల్యమ్ ఉనక్కు ఆశ్చర్యమో? **"కిమత్ర చిత్రమ్" (రా-సుం-18-36)** ఇత్యాది.

ఇత్తాల్- జగత్కారణత్వత్తాలే సర్వోత్కృష్టనెన్నుమ్ **"కారణన్తు ధ్యేయః" (అథర్వశిఖా)** ఎన్ను సర్వసమాశ్రయణీయనెన్నుమ్, **"ఏష హ్యేవానన్దయాతి" (తై-ఆ)** ఎన్ను ప్రాప్యనెన్నుమ్, సృష్ట్యాదికళై త్తన్పేఱాక ప్పణ్ణుకైయాలే సర్వస్వామి యెన్నుమ్, తామ్ స్తోత్రత్తిలే మూళుమ్పడి ముకమ్ కాట్టుకైయాలే ఆశ్రితవత్సలనెన్నుమ్ శొల్లిఱ్ఱాయిఱ్ఱు.

---

**(ఇదమాశ్రితవత్సలత్వం న చిత్రమ్)** - ఎవరి వాక్కుకు, మనస్సుకు కూడా అందని భగవద్విషయం యొక్క స్తుతిని నేను చేయడానికి తగిన యోగ్యతను కల్గినవాడనయేటట్లు చేసిన నాపట్ల నీకు ఉండే వాత్సల్యం ఆశ్చర్యమా! **"కిమత్ర చిత్రమ్"** (ఇందులో ఆశ్చర్యం ఏమున్నది?).

దీనివల్ల -భగవంతుడు, జగత్కారణభూతుడు కనుక సర్వోత్కృష్టుడని, **"కారణం తు ధ్యేయః"** (జగత్కారణమేదో అది ధ్యానింపదగినది) అని అందఱికి ఆశ్రయించదగినవాడని, **"ఏష హ్యేవానందయాతి"** (ఈ పరమాత్మయే జీవులను ఆనందిపజేస్తున్నాడు) అని, ప్రాప్యుడు (పొందదగినవాడని) సృష్టిమొదలైన వానిని స్వప్రయోజనంగా తలచి చేస్తున్నందున సర్వస్వామి అని, తాము స్తోత్రం చేయడంలో ప్రవృత్తిని కల్గి ఉండేటట్లు తన దర్శనాన్ని అనుగ్రహించినందున ఆశ్రిత వత్సలుడని తెలుపబడింది.



**11శ్లో ॥** స్వాభావికానవధికాతిశయేశితృత్వం
నారాయణ! త్వయి న మృష్యతి వైదికః కః।
బ్రహ్మా శివ శ్శతమఖః పరమస్స్వరాడి
త్యేతేఽపి యస్య మహిమార్ణవవిప్రుషస్తే ॥

అవ : **(స్వాభావికేతి)** కీழ్ గతిసామాన్యన్యాయత్తిలే, నారాయణనే సర్వస్మాత్పరనెన్నతు. ఇతిల్ - విశేషవాచియాన శివశమ్భ్వాదిశబ్దఙ్గళాలుమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱాన్ నారాయణనే యెన్ను సర్వవేదాన్తవ్యాఖ్యాన రూపమాయ్, అనన్యపరమాన నారాయణానువాకసిద్ధమాన భగవత్పరత్వత్తై యరుళిచ్చెయ్‌కిఱార్.

వ్యా : **(స్వాభావికానవధికాతిశయేశితృత్వమ్)** ఇత్తాల్- పరత్వలక్షణమ్ శొల్లుకిఱతు. స్వాభావికశబ్దత్తాల్ కర్మోపాధికమాయ్, అత్తాలే అనిత్యమాయ్ దుఃఖమిశ్రమాన బ్రహ్మాదికళైశ్వర్యత్తై వ్యావర్తిక్కిఱతు. అనవధికాతిశయ

---

**11శ్లో ॥** అవ : **(స్వాభావికేతి)** - పూర్వం గడచిన శ్లోకంలో గతిసామాన్య న్యాయంతో, నారాయణుడే అందఱికంటే పరుడని అన్నారు. ఇందులో (ఈశ్లోకంలో) విశేషవాచి శబ్దాలైన శివ, శంభు మొదలైనవానితో తెలుపబడేవాడు నారాయణుడే - అని సర్వవేదాంత ప్రత్యయన్యాయ రూపమై, ఇంకొకరికి చెందని నారాయణానువాకం ద్వారా సిద్ధించేదైన నారాయణపరత్వాన్ని పల్కుతున్నారు.

వ్యా : **(స్వాభావికానవధికాతిశయేశితృత్వమ్)** - ఈ ప్రయోగం ద్వారా పరత్వ లక్షణం చెప్పబడింది. స్వాభావిక అనే శబ్దంద్వారా - కర్మను ఉపాధిగా (కారణంగా) కల్గినదై, అందువల్ల (కర్మ అనిత్యం కనుక, కారణం అనిత్యమైనపుడు తత్‌కార్యం కూడా అనిత్యం అవుతుంది కనుక) అనిత్యమై, దుఃఖంతో కలసినదైన బ్రహ్మాదుల ఐశ్వర్యాన్ని వ్యావర్తింపజేస్తున్నది. అంటే - బ్రహ్మాదుల ఐశ్వర్యంకంటే భగవదైశ్వర్యం విలక్షణమైనదని తెలుపబడుతున్నది.

శబ్దత్తాలే నిత్యరైయుమ్, ముక్తరైయుమ్ వ్యావర్తిక్కిఱతు, "స స్వరాడ్భవతి" **(ఛాన్దో-7-25-2)** ఎన్టుమ్, **"సత్యకామ స్సత్యసఙ్కల్పః" (ఛాన్దో-8-7-1)** ఎన్టుమ్ నిత్యముక్తవిషయమాన వైశ్వర్యఙ్గళుమ్ భగవదాయత్తమాయ్ సావధికఙ్గళుమాయిరుక్కైయాలే. ఈశితృత్వ మెన్గిఱ అసాధారణ స్వరూపనిర్దేశత్తాలే "నిర్విశేషచిన్మాత్రం వస్తు" ఎన్గిఱ బౌద్ధగన్ధికళాన వేదాన్తికళై వ్యావర్తిక్కిఱతు.

**(నారాయణ!)** సద్బ్రహ్మాదిసామాన్యవాచి శబ్దఙ్గళైయుమ్, విశేషవాచియాన శివశమ్భ్వాదిశబ్దఙ్గళైయుమ్ నారాయణన్బక్కలిలే వ్యవస్థాపిక్కిఱ నారాయణానువాకమ్ శొల్లుకిఱ ఇవ్వర్థత్తిల్ ప్రమాణమెన్టు ప్రత్యభిజ్ఞై పణ్ణ ప్పడుకిఱతు.

---

అనవధికాతిశయ శబ్దం నిత్యులను, ముక్తులను వేఱుచేస్తున్నది. (ఎందుకంటే) **"స స్వరాట్ భవతి"** (ఆ ముక్తుడు స్వయంప్రకాశాన్ని కలవాడవుతున్నాడు) అని, **"సత్యకామః సత్యసంకల్పః"** (ముక్తుడు సత్యమైన కామాలను, సత్యమైన సంకల్పాన్ని కలవాడవుతున్నాడు) అని నిత్యుల, ముక్తుల ఐశ్వర్యాలు భగవదధీనాలు, అవధిని కల్గినవి కనుక. ఈశితృత్వమనే పదంతో భగవంతుని అసాధారణమైన స్వరూపనిర్దేశం చేయడం చేత **"నిర్విశేషచిన్మాత్రం వస్తు"** (ఏవిధమైన విశేషం లేని, జ్ఞానమాత్రమైన వస్తువే బ్రహ్మం) అని వాదించే, బౌద్ధమతగంధాన్ని కల అద్వైతులు వేఱు చేయబడుతున్నారు.

**(నారాయణ!)**- సత్, బ్రహ్మమొదలైన సామాన్యవాచి శబ్దాలను, విశేషవ్యక్తిని తెలిపే శివ, శంభు మొదలైన శబ్దాలను నారాయణుని విషయంలో అన్వయించి పలికే నారాయణానువాకం అనేది ఈ విధంగా పలికే అర్థంలో ప్రమాణమనే విషయాన్ని ఈ సంబోధన ప్రత్యభిజ్ఞను కల్గిస్తుంది. (స్మరణను కల్గిస్తుంది)



**(త్వయి)** సర్వవేదాన్తఙ్గళిలుమ్ సర్వాధికనాక ప్రతిపాదిక్కప్పడుకిఱవనాయ్, ఇవ్వాత్మావుక్కు వకుత్తవనాన ఉన్బక్కలిలే.

**(న మృష్యతి)** ఉక్తమాన ఈశ్వరత్వత్తై ప్పొఱాతే యొழிకిఱవన్.

**(వైదికః కః?)** కిం క్షేపే, అబ్రాహ్మణ- ఇత్యర్థః. **"యో విష్ణుం సతతం ద్వేష్టి" (బ్రహ్మండ పురాణమ్), "విష్ణుభక్తివిహీనో య స్సర్వశాస్త్రార్థవేద్యపి, బ్రాహ్మణ్యం తస్య న భవే త్తస్యోత్పత్తి ర్నిరూప్యతామ్" (పాద్మ పురాణమ్)** ఇత్యాది.

**"హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" (య-కా-2-ప్ర-34), "భూతస్య జాతః పతిరేక ఆసీత్" (తై.సంహి 4-2-8), "న కిరిస్త్వ స్త్వదుత్తరః" (శ్వే 3-2), "ఏక**

---

**(త్వయి)** - అన్ని వేదాలలోను సర్వాధికుడవుగా ప్రతిపాదింపబడేవాడవై, ఈ ఆత్మకు స్వరూపానురూప శేషివియైన నీపట్ల అని అర్థం.

**(న మృష్యతి)** - ఇంతకు ముందు తెల్పిన ఈశ్వరత్వాన్ని గహించలేనివాడు,

**(వైదికః కః?)**- ఇక్కడ కింశబ్దం నిందోక్తిలో పర్యవసిస్తుంది. వాడు బ్రాహ్మణుడు కాడని భావం. **"యో విష్ణుం సతతం ద్వేష్టి"** (ఎవడు విష్ణువును సతతం ద్వేషిస్తున్నాడో, అతడు అవైదికుడు- అబ్రాహ్మణుడు) అని, **"విష్ణుభక్తి విహీనో య స్సర్వశాస్త్రార్థవేద్యపి, బ్రాహ్మణ్యం తస్య న భవే త్తస్యోత్పత్తి ర్నిరూప్యతామ్"** (విష్ణుభక్తిని లేనివాడు, అన్ని శాస్త్రాలను తెలిపినవాడైనా, అతనికి బ్రాహ్మణ్యం ఉండదు. అతని జన్మ నిరూపింపబడుగాక) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**"హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే"** (సృష్టికి పూర్వం బ్రహ్మ ఒక్కడే ఉన్నాడు) **"భూతస్య జాతః పతిరేక ఆసీత్"** (జీవులకు పతి అయినవాడొక్కడే

ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే" (ఋ.అ. 3-6-19) ఇత్యాదికళిలే బ్రహ్మరుద్రాదికళుక్కు సర్వేశ్వరత్వమ్ శొల్లానిఱ్క, శివశమ్భ్వాదిశబ్దఙ్గళ్ నారాయణనై ప్రతిపాదిక్కిఱతెన్ను మిప్ప్రమాణఙ్గళవిల్ అపర్యవసిత్తవన్ వైదికనల్లనెన్ను క్షేపిత్తపడి యెజ్గనే? యెన్నిల్, "స బ్రహ్మ స శివ స్సేన్ద్రః" (తై.నా. 11) ఇత్యాదికళిలే పరిహరిత్త తెన్గిఱతు ఉత్తరార్ధమ్.

(బ్రహ్మ శివ ఇత్యాది) బ్రహ్మరుద్రర్కళోడే సమ్ప్రతిపన్నక్షేత్రజ్ఞనాన ఇన్ద్రనైయుమ్, పారతన్త్ర్యమే స్వరూపమాన నిత్యముక్తరైయుమ్ సమభివ్యాహరిక్కైయాలే అవర్కళుడైయ అనీశ్వరత్వమ్ సమ్ప్రతిపన్నమ్.

(ఏతేఽపి) లోకత్తిలే ఈశ్వరతయాప్రసిద్ధరాన ఇవర్కళుమ్ ఇవర్క్కు

---

ఉన్నాడు) "న కిరిన్ద్ర స్త్వదుత్తరః" (ఓ ఇంద్రా! నీకంటే గొప్పవాడు లేడు), "ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే" (రుద్రుడొక్కడే ఉన్నాడు, రెండవవాడు లేడు) ఇత్యాది వాక్యాలలో బ్రహ్మ-రుద్రుడు మొదలైన వారికి సర్వేశ్వత్వం చెప్పబడుతూ ఉండగా, శివ, శంభుమొదలైన శబ్దాలు నారాయణుని ప్రతిపాదిస్తున్నవి - అనేది ఈ ప్రమాణాల అర్థం అని అంగీకరించనివాడు వైదికుడు కాడు - అని నిందించడం ఏవిధంగా తగినది? అంటే, "స బ్రహ్మ స శివః సేంద్రః" (ఆ నారాయణునకు ప్రకారభూతుడు బ్రహ్మ, ఆనారాయణునకు ప్రకారభూతుడు శివుడు, ఆ నారాయణునకు ప్రకారభూతుడు ఇంద్రుడు) ఇత్యాదులలో ఈ శంక పరిహరింపబడుతున్నదని ఉత్తరార్ధం తెల్పుతున్నది.

(బ్రహ్మ శివ ఇత్యాది) - బ్రహ్మ, రుద్రులతో పాటు సమానంగా లెక్కింపబడే జీవుడైన ఇంద్రుని, పారతంత్ర్యమే స్వరూపంగా కల్గిన నిత్యులను, ముక్తులను కలిపి పల్కినందున - వీరందరి అనీశ్వరత్వం (వీరంతా ఈశ్వరులు కాదనే విషయం) అంగీకరింపబడింది.

(ఏతేఽపి) - లోకంలో ఈశ్వరులుగా ప్రసిద్ధులైన



శేషభూతరాక సమ్ప్రతిపన్నరాన ఇవర్కళుమ్,

(యస్య) "నారాయణపరా వేదాః" (భా 2-5-15) ఎన్ను సర్వవేదాన్త ప్రసిద్ధియై నినైక్కిఱతు.

(మహిమార్ణవవిప్రుష స్తే) సర్వేశ్వరన్ మహిమైయాకిఱ కడలిలే ఒరు బిన్దుమాత్రమెన్ను నారాయణానువాకన్దానే పరిహరియానిన్ఱతు - ఎన్గిఱార్. "యస్య తే" ఎన్ను శ్రుతిప్రసిద్ధియైయుమ్, నినైక్కిఱతు. తమక్కు ఇవ్వర్థత్తిలుణ్డాన సాక్షాత్కారత్తైయు మరుళిచ్చెయ్కిఱార్. "పరమస్వరాట్- నిత్యముక్తాః,

"బ్రహ్మశివశ్శతమఖః పరమస్వరాడిత్యేతేపి యస్య తే - తవ ప్రభావసముద్రస్య, విప్రుషః - బిన్దవః" ఇత్యన్వయః.

---

బ్రహ్మరుద్రేంద్రాదులు, వీరికి శేషభూతులగా అంగీకరింపబడిన వీరు,

(యస్య)- "నారాయణపరా వేదాః" (వేదాలు నారాయణపరత్వాన్ని ప్రతిపాదిస్తున్నది) అనే సర్వవేదాంత ప్రసిద్ధిని ఈ సూక్తి స్మరింపజేస్తున్నది.

(మహిమార్ణవ విప్రుషస్తే)- సర్వేశ్వరుని మహిమ- అనే సముద్రంలో ఒక బిందువు మాత్రమే- అని నారాయణానువాకమే పరిహరిస్తున్నది - అని అంటున్నారు. "యస్య తే" అనే శ్రుతి ప్రసిద్ధిని, తమకు ఈ అర్థంలో గల సాక్షాత్కారాన్ని (స్పష్టతను) గూర్చి పల్కుతున్నారు. పరమస్వరాట్ - అనే పదం నిత్యులను, ముక్తులను తెల్పుతుంది.

"బ్రహ్మ శివశ్శతమఖః పరమస్వరాడిత్యేతేపి యస్య తే, తవ ప్రభావసముద్రస్య విప్రుషః బిందవః" అని ఉత్తరార్ధంలోని అన్వయం.

12శ్లో॥ కశ్శ్రీ శ్శ్రియః పరమసత్త్వసమాశ్రయః కః
కః పుణ్డరీకనయనః పురుషోత్తమః కః ।
కస్యాయుతాయుతశతైకకలాంశకాంశే
విశ్వం విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తమ్ ॥

అవ : (కశ్శ్రీ శ్శ్రియః?) ఇతిల్ విప్రతిపత్తిక్షమఙ్గళన్టియిలే తనిత్తనియే పూర్ణమాయ్, సామర్థ్యపరమాన లిఙ్గఙ్గళాలే పరత్వత్తై అరుళిచ్చెయ్‌కిఱార్.

వ్యా :- (కశ్శ్రీశ్శ్రియః?) ఈశ్వరవ్యతిరిక్త సకలచేతనరాలుమ్ తన్దాముడైయ స్వరూపస్థిత్యాదికళుక్కాక ఆశ్రయిక్కప్పడుకైయాలే శ్రీశబ్దవాచ్యైయాయిరుక్కిఱ పిరాట్టియార్ తన్నుడైయ స్వరూపస్థిత్యాదికళుక్కాక ప్పఱ్ఱవేణ్డుమ్బడియాన మేన్మైయైయుడైయార్ ఉణ్డో యొరువర్ ఆర్? కిమ్-క్షేపార్థమాయ్, ఇల్లై యెన్టపడి. "ఈశ్వరీం సర్వభూతానామ్" (శ్రీసూ), "అస్యేశానా జగతో విష్ణుపత్నీ"(శ్రీసూ), "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా" (తి-మొ-7-7-1) ఎన్నక్కడవతితే.

---

12శ్లో॥ అవ : (కశ్శ్రీ శ్రియః?) ఈ నారాయణపరత్వంలో, విప్రతిపత్తిని పల్కడానికి వీలు లేనివై, ప్రత్యేక ప్రత్యేకంగా పూర్ణాలై, సామర్థ్యాన్ని కల్గినందున గొప్పవైన లింగాలతో (చిహ్నాలతో) (నారాయణ) పరత్వాన్ని పల్కుతున్నారు

వ్యా : (క శ్రీ శ్రియః?) - ఈశ్వరునికంటే వేఱయిన సకలజీవులచేత, తమ తమ స్వరూపం, స్థితి, ప్రవృత్తి మొదలైనవానికోసం ఆశ్రయింపబడడం చేత ("శ్రీయతే ఇతి శ్రీః" - అనే వ్యుత్పత్తిద్వారా) శ్రీశబ్దంతో నిర్దేశింపబడే లక్ష్మీదేవి కూడా తన స్వరూపం, స్థితి మొదలైనవానికోసం ఆశ్రయించేటట్లుండే పరత్వాన్ని కలవారు నీకంటే ఇంక అన్యులెవరున్నారు? ఇక్కడ "కిమ్" అనే శబ్దం క్షేపార్థకం-అంటే - లేరని భావం. "ఈశ్వరీం సర్వభూతానామ్" (సమస్త జీవులను శాసించేది) "అస్యేశానో జగతో విష్ణుపత్నీ" (ఈ జగత్తును శాసించేది, విష్ణువుకు పత్ని) "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా!" (లక్ష్మీదేవికి కూడా లక్ష్మీస్వరూపుడవైన సంపద్రూపా!) అని చెప్పబడుతున్నది కదా!



(పరమ సత్త్వసమాశ్రయః కః?) పరమశబ్దత్తాలే రజస్తమస్సు-క్కళైయుమ్, అత్తోడు సమభివ్యాహృతమాన సత్త్వత్తైయుమ్ వ్యావర్త్తిక్కిఱతు. శుద్ధసత్త్వత్తుక్కాశ్రయమాన విగ్రహాదికళై- యుడైయవన్ ఆర్? "మహాన్ప్రభుర్వై పురుష స్సత్త్వస్యైష ప్రవర్తకః" (శ్వేతా-3-1-2), "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" (పురుషసూ).

(కః పుణ్డరీకనయనః?) స్వానుభవానన్ద తృప్తత్తైయాలుమ్, ఆశ్రితార్థమాన నీర్మైకళుక్కు ప్రకాశకమాయుమ్, సర్వేశ్వరత్వసూచకముమాన తిరుక్కణ్గళైయుడైయవన్ ఆర్? "తస్య యథా కప్యాసం పుణ్డరీకమేవ మక్షిణీ" (ఛాన్దో-1-2-2), "మహావరాహ స్స్ఫుటపద్మలోచనః" (వి-పు-1-4-26), "జితన్తే

---

(పరమసత్త్వసమాశ్రయః కః?)- ఇక్కడ పరమశబ్దం రజస్సును, తమస్సును, వాటితో కలిపి చెప్పబడిన సత్త్వాన్ని వ్యావర్తిస్తున్నది. కేవలం శుద్ధసత్త్వమయాలైన విగ్రహాదులను కలవారెవరు? "మహాన్ ప్రభుర్వై పురుష స్సత్త్వ స్యైష ప్రవర్తకః" (ఈ పరమపురుషుడు గొప్ప ప్రభువు, సత్త్వగుణప్రవర్తకుడు) అని, "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" (సూర్యుని వర్ణాన్ని కలవాడు, రజస్తమస్సులు లేనివాడు) ఇత్యాది ప్రమాణాలు భగవంతుని రజస్తమస్సులు లేనివానిగా తెల్పుతున్నాయి.

(కః పుండరీకనయనః?) - తన అనుభవంలోని పరిపూర్ణతవల్ల, ఆశ్రితులపట్ల తనకు గల సౌలభ్యానికి ప్రకాశకంగాను, సర్వేశ్వరత్వాన్ని సూచించేవి గాను ఉండే తిరునేత్రాలను కలవాడు - అని భావం. దీనికి ప్రమాణాలు- "తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" (సూర్యునిలో అంతర్యామిగా వేంచేసి ఉండే పరమాత్మకు నిండు నీటిలో సూర్యునివల్ల వికసించిన, బలమైన కాడను కల తామరపూల రేకులవంటి నేత్రాలు రెండు

**పుణ్డరీకాక్ష" (1-జితన్తా), "తాయా యళిక్కిన్ఱ తణ్డామరై క్కణ్ణా" (తి-మొ-7-1-9) ఇత్యాది.**

**(పురుషోత్తమః కః?) ఉన్నై యొఴియ పురుషాణాముత్కృష్ట తమరాయిరుక్కిఱార్ ఆర్? "యస్మాత్ క్షరమతీతోఽహమ్" (గీ-15-18) ఇత్యారభ్య, "అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః" (గీ 15-18) ఎన్ఱు ఆప్తతమరాన దేవరీరే అరుళిచ్చెయ్‌తారిఱే.**

**(కస్యాయుతేత్యాది) (విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తం విశ్వం కస్యాయుతాయుతశతైకకలాంశకాంశే) చిద్విభాగత్తాలుమ్,**

---

ఉన్నాయి) అని, **"మహావరాహః స్ఫుటపద్మలోచనః"** (వికసించిన తామరపూలవంటి నేత్రాలను కల వరాహస్వామి) అని, **"జితం తే పుండరీకాక్ష!"** (పుండరీకాక్షా! నీకు మంగళం) **"తాయాయ్ అళిక్కిన్ఱ తణ్డామరైక్కణా!"** (తల్లివలె రక్షించే చల్లని పద్మాలవంటి నేత్రాలను కలవాడా!) అని ఈవిధంగా కల ప్రమాణాలు అనుసంధేయాలు.

**(పురుషోత్తమః కః?)** - నిన్ను విడచి, పురుషులలో ఉత్కృష్టతముడు ఎవరు? **"యస్మాత్ క్షరమతీతోఽహమ్"** అని ఆరంభించి, **"అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః"** (అందువల్ల లోకంలో, వేదంలో కూడా నేను పురుషోత్తముడుగా ప్రసిద్ధుడను) అని ఆప్తతముడవైన నీవే అన్నావు కదా!

**(కస్యాయుతేత్యాది) - (విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తం విశ్వం కస్యాయుత శతైకకలాంశకాంశే)** - చిద్విభాగంతోను, అచిద్విభాగంతోను వర్తించే (చిదచిత్తుల రూపంలో ఉండే) ఈజగత్తు విచిత్రమై, ఎవరి సంకల్పంలోని శతసహస్రాంశలో వర్తిస్తున్నదో - అని భావం. విచిత్రమైన



**అచిద్విభాగత్తాలుమ్ వర్తిక్కిఱ ఇన్ద జగత్ విచిత్రమాయ్‌క్కొణ్డు, అరుడైయ సఙ్కల్పశతసహస్రైక దేశత్తిలే వర్తిక్కిఱతు? విచిత్రమాన అచిత్తాకిఱతు- అత్యన్తం భిన్నమాన ఆకాశాదికళ్. చేతనవైచిత్ర్యమాకిఱతు - కర్మత్తాల్ వన్ద చతుర్విధ శరీరఙ్గళుమ్, తద్భోగ్యభోగోపకరణభోగస్థానఙ్గళుమ్. అంశమెన్ఱు అల్పార్థత్తిలే. "పాదోస్య విశ్వా భూతాని" (పురుషసూక్తమ్), "యస్యాయుతాయుతాంశాంశే" (వి-పు-1-6-53), "మేరోరివాణు ర్యస్యైతత్" , "ఇదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" (గీ 10-42) ఇత్యాది.**

**(అయుతానాం- దశకోటీనామ్. శతస్య ఏకకలాయాశ్శకలస్య; అంశకస్య ఖణ్డస్య, అంశే- అంశమాత్రే విశ్వమ్.)**

---

అచిత్తు, అంటే - అత్యంతం భిన్నమైన ఆకాశాదులు. చేతనులలో వైచిత్ర్యం అంటే- ఆయా జీవుల కర్మవల్ల ఏర్పడిన చతుర్విధశరీరాలు. ఆయా జీవుల భోగ్యవస్తువులు, భోగసాధనాలు, భోగస్థానాలు. అంశమనేది అల్పార్థంలో ప్రయోగింపబడింది. **"పాదోస్య విశ్వభూతాని"** (సమస్తవిశ్వాలు అతని విభూతిలో నాల్గవ భాగం), **"యస్యాయుతాయుతాంశాంశే"** (ఎవని సంకల్పంలోని కోట్లానుకోట్ల అంశాలలోని ఒక అంశంలో ఈ జగత్తు నిలుస్తున్నదో), **"మేరోరివాణు ర్యస్యైతత్"** (ఎవనికి ఈజగత్తు, మేరువునకు అణువువలె అల్పమైనదో), **"ఇదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"** (ఈ జగత్తు అంతా భగవత్సంకల్పంలోని అల్పభాగంతో నిలచి ఉన్నది) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(అయుతాయుతానామ్ - అంటే- పదికోట్లు అని అర్థం. శతస్య ఏక కలాయాః శకలస్య, అంశకస్య ఖండస్య, అంశమాత్రే విశ్వమ్).**

13శ్లో॥ వేదాపహార గురుపాతకదైత్యపీడా-
ద్యాపద్విమోచనమహిష్ఠఫలప్రదానైః ।
కోఽన్యః ప్రజాపశుపతీ పరిపాతి కస్య
పాదోదకేన స శివ స్స్వశిరోధృతేన ॥

అవ : (వేదాపహారేతి) ఇతిహాసపురాణప్రక్రియైయాలే బ్రహ్మరుద్రాదికళుడైయ క్షేత్రజ్ఞత్వత్తైయుమ్, భగవత్పరత్వత్తైయు మరుళిచ్చెయ్కిఱార్.

వ్యా :- (వేదాపహార) "యో వై వేదాంశ్చ" (గీ-10-42) ఎన్ఱ బ్రహ్మావుక్కు వేదచక్షుస్సై క్కొడుక్క, అతు అసురర్కళాలే అపహృతమాక, బ్రహ్మా వేదత్తై ఇழన్దు, దుఃఖాన్తర్నిమగ్ననానవళవిలే విరోధికళై అழియచ్చెయ్తు, వేదత్తై మీట్టుక్కొడుత్త ఉపకారత్తై చ్చొల్లుకిఱతు. "తతో హృతేషు వేదేషు బ్రహ్మాణం కశ్మలోఽవిశత్ తతో వచన మీశానం ప్రాహ వేదైర్వినాకృతః" (శ్వే-6-18) బ్రహ్మా - "వేదా మే పరమం చక్షు ర్వేదా మే

---

13శ్లో॥ అవ : వేదాపహారేతి - ఇతిహాసపురాణ ప్రక్రియలో బ్రహ్మరుద్రాల జీవత్వాన్ని, భగవంతుడైన శ్రీమన్నారాయణుని పరత్వాన్ని తెల్పుతున్నారు.

వ్యా : (వేదాపహార) - "యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (ఆ బ్రహ్మకు ఎవరు వేదాలను అధ్యాపనం చేశాడో) అని బ్రహ్మకు వేదమనే నేత్రాన్ని అనుగ్రహించగా, అది మధుకైటభులనే అసురులచే అపహరింపబడింది. అపుడు బ్రహ్మ, వేదాన్ని పోగొట్టుకొని, దుఃఖమనే సముద్రంలో మునిగిపోగా, ఆ అసురులను నిరసించి, వేదాలను తిరిగి తీసికొని వచ్చిన ఉపకారాన్ని గూర్చి పల్కుతున్నారు. "తతో హృతేషు వేదేషు బ్రహ్మాణం కశ్మలోఽవిశత్, తతో వచనమీశానం ప్రాహ వేదై ర్వినా కృతః" (అపుడు వేదాలు అపహరింపబడగా, బ్రహ్మను దుఃఖం ఆవహించింది. అపుడు వేదాలను పోగొట్టుకొన్న బ్రహ్మ పరమాత్మతో పలికాడు) బ్రహ్మ - "వేదా మే పరమం



పరమం ధనమ్, వేదా మే పరమం ధామ వేదా మే బ్రహ్మ చోత్తమమ్, తతో వేదా హృతా స్సర్వే దానవాభ్యాం బలార్దితాః అన్ధకారాశ్చ మే జాతా లోకా వేదవివర్జితాః వేదాదృతే హి కిం కుర్యాం లోకాన్వై స్రష్టుముద్యతః, అహో! బత! మహద్దుఃఖం వేదనాశనజం మమ, ప్రాప్తం ధునోతి హృదయం మాం హి శోకదురాసదమ్", "జగ్రాహ వేదానఖిలాన్ రసాతలగతాన్హరిః ప్రాదాచ్చ బ్రహ్మణో రాజన్! తత స్స్వాం ప్రకృతిం యయౌ", "తత స్తయో ర్వధేనాశు వేదాపహరణేన చ, శోకాపనయనం చక్రే బ్రహ్మణః పురుషోత్తమః" (భార.శా. 357) ఇత్యాది.

---

చక్షుః వేదా మే పరమంధనమ్, వేదా మే పరమం ధామ, వేదా మే బ్రహ్మ చోత్తమమ్, తతో వేదా హృతా స్సర్వే దానవాభ్యాం బలార్దితాః, అంధకారాశ్చ మే జాతాః లోకా వేదవివర్జితాః, వేదాదృతే హి కిం కుర్యాం లోకాన్ వై స్రష్టుముద్యతః, అహో! బత! మహద్దుఃఖం వేదనాశనజం మమ, ప్రాప్తం ధునోతి హృదయం మాం హి శోకదురాసదమ్" (వేదాలు నాకు గొప్ప నేత్రాలు, వేదాలు నాకు గొప్పధనం, వేదాలు నాకు గొప్ప తేజస్సు, వేదాలు నాకు గొప్ప జ్ఞానం, అన్ని వేదాలను దానవులు బలవంతంగా తీసికొని దొంగిలించారు. నాకు చీకటి కల్గింది. లోకాలన్నీ వేదాలను కోల్పోయాయి. వేదాలు లేకుండా ఏమి చేయగలను? లోకాలను సృష్టించాలని ప్రయత్నించే నాకు వేదాలను కోల్పోయినందువల్ల కల్గిన దుఃఖం చాలా నా హృదయాన్ని చాలా బాధిస్తున్నది), "జగ్రాహ వేదానఖిలాన్ రసాతలగతాన్ హరిః, ప్రాదాచ్చ బ్రహ్మణో రాజన్! తత స్స్వాం ప్రకృతిం యయౌ" (అపుడు పాతాళంలోని అన్ని వేదాలను హరి గ్రహించాడు. వానిని బ్రహ్మకు ఇచ్చాడు. అపుడు, ఓ రాజా! బ్రహ్మ శోకాన్ని వీడి సహజస్వభావాన్ని పొందాడు), "తత స్తయో ర్వధేనాశు వేదాపహరణేన చ శోకాపనయనం చక్రే బ్రహ్మణః పురుషోత్తమః" (అపుడు ఆమధుకైటభుల వధతో, వేదాపహారంవల్ల బ్రహ్మకు కల్గిన దుఃఖాన్ని పురుషోత్తముడు తీర్చాడు) ఇత్యాది మహాభారతం శాంతిపర్వంలోని హయశిర ఉపాఖ్యాన శ్లోకాలు స్మరణీయాలు.

**(గురుపాతక)** రుద్రన్, లోకగురువుమాయ్, పితావుమాయిరుక్కిఱ బ్రహ్మావై దుర్మానమే హేతువాక త్తలైయై యఱుత్తు, ప్రాప్తకియాన పాతకత్తైయుమ్ పోక్కి త్తలైయఱుప్పుణ్డ, బ్రహ్మావైయుమ్ ఉజ్జీవిక్కుమ్పడి పణ్ణిరక్షిత్తపడి. శ్రీమాత్స్యే దేవీం ప్రతి రుద్రః- "తతః క్రోధపరీతేన సంరక్తనయనేన చ, వామాఙ్గుష్ఠనఖాగ్రేణ ఛిన్న న్తస్య శిరో మయా" (మాత్స్యపు-182) బ్రహ్మా- "యస్మాదనపరాధస్య శిరశ్ఛిన్నం త్వయా మమ, తస్మాచ్ఛాపసమావిష్టః కపాలీ త్వం భవిష్యసి", "బ్రహ్మణా శాపితో భూత్వా చరం స్తీర్థాని భూతలే, తతోఽహం గతవాన్ దేవి! హిమవన్తం శిలోచ్చయమ్, తత్ర నారాయణశ్శ్రీమాన్మయా భిక్షాం ప్రయాచితః, తతస్తేన స్వకం పార్శ్వం నఖాగ్రేణ విదారితమ్, మహతీ స్రవతీ ధారా తస్య రక్తస్య నిస్సృతా, విష్ణుప్రసాదాత్సుశ్రోణి కపాలం తత్సహస్రధా, స్ఫుటితం బహుధా యాతం

**(గురుపాతక)** - రుద్రుడు, లోక గురువు, తనకు తండ్రి అయిన బ్రహ్మయొక్క శిరస్సును తన దురహంకారంతో ఖండించినందున ఆ శివుడు పొందిన బ్రహ్మహత్యాపాతకాన్ని పోగొట్టి, శిరస్సు ఖండింపబడ్డ బ్రహ్మను ఉజ్జీవింపజేసిన వృత్తాంతం ఇది.

శ్రీమాత్స్యపురాణంలో పార్వతితో రుద్రుడు ఈ విధంగా పలికాడు. **"తతః క్రోధపరీతేన సంరక్తనయనేన చ, వామాంగుష్ఠనఖాగ్రేణ ఛిన్న న్తస్య శిరో మయా"** (అపుడు క్రోధంతో నిండిన వాడను, మిక్కిలి ఎఱ్ఱని నేత్రాలను కలవాడనైన నేను నా ఎడమ చేతి బొటనవేలు గోరు చివరి భాగంతో ఆబ్రహ్మశిరస్సును ఖండించాను). అపుడు, బ్రహ్మ నాతో ఈవిధంగా అన్నాడు. **"యస్మాదనపరాధస్య శిర శ్ఛిన్నం త్వయా మమ, తస్మాచ్ఛాపసమావిష్టః కపాలీ త్వం భవిష్యసి"** (ఎందువల్ల నీవు ఏ అపరాధం చేయని నాశిరస్సును ఖండించావో, అందువల్ల శాపాన్ని పొందినవాడవై, నీవు



స్వప్నలబ్ధం ధనం యథా" (మాత్స్య-182) ఇత్యాది.

**(దైత్యపీడాద్యాపద్విమోచన)** హిరణ్యరావణాదికళెన్న, త్రిపురత్తిలమరర్కళెన్న. ఆదిశబ్దత్తాలే దుర్వాసాదికళై నినైక్కిఱతు. ఇవర్కళాలే వరు మాపత్తై ప్పోక్కి

**(మహిష్ఠఫలప్రదానైః)** క్షేత్రజ్ఞత్వేన సమ్ప్రతిపన్నరాన ఇవర్కళ్ స్వసమారాధనత్తాలే లోకమడఙ్గ ఈశ్వరర్కళెన్ఱు కొణ్డాడుమ్పడియాన పదఙ్గళై

కపాలివి కాగలవు) అపుడు **"బ్రహ్మణా శాపితో భూత్వా చరన్ తీర్థాని భూతలే, తతోఽహం గతవాన్ దేవి! హిమవంతం శిలోచ్చయమ్, తత్ర నారాయణః శ్రీమాన్ మయా భిక్షాం ప్రయాచితః, తత స్తేన న్వకం పార్శ్వం నఖాగ్రేణ విదారితమ్, మహతీ స్రవతీ ధారా తస్య రక్తస్య నిస్సృతా, విష్ణుప్రసాదాత్ సుశ్రోణి! కపాలం తత్ సహస్రధా, స్ఫుటితం బహుధా యాతం స్వప్నలబ్ధం ధనం యథా"** (బ్రహ్మచే శపింపబడినవాడనై, నేను భూమిలోని తీర్థాలలో సంచరిస్తూ శిలలతో ఉన్నతమైన హిమవత్ పర్వతాన్ని చేరాను. అక్కడ నేను శ్రీమన్నారాయణుని భిక్షపెట్టమని ప్రార్థించాను. అపుడతడు తన వక్షఃస్థలం పార్శ్వాన్ని తన గోటి చివరతో చీల్చాడు. ఆ గాయం నుండి పెద్ద రక్తధార కపాలంలో కారింది. అంతటితో ఆ కపాలం, వేయి ముక్కలుగా పగిలి, కలలో కన్పించిన ధనంవలె, అదృశ్యమైనది) ఇత్యాది శ్లోకాలు స్మరణీయాలు.

**(దైత్యపీడాద్యాపద్విమోచన)** - ఇక్కడ అసురశబ్దం హిరణ్యకశిపుడు, రావణుడు మొదలైనవారిని, త్రిపురాసురులు మొదలైనవారిని తెల్పుతుంది. ఆది శబ్దం ద్వారా దుర్వాసాదులను స్మరించవచ్చు. వీరివల్ల కలిగిన ఆపదలను పోగొట్టి,

**(మహిష్ఠఫలప్రదానైః)**- జీవకోటిలోనికి చెందినవారుగా అంగీకరింపబడిన బ్రహ్మాదుల ఆరాధనవల్ల లోకం అంతా వారిని

క్కొడుత్తపడి. "యుగకోటిసహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః పున స్త్రైలోక్యధాతృత్వం ప్రనాప్తవానితి శుశ్రుమ" (మహా భా-సభా 14-8), "బ్రహ్మాదయ స్సురా స్సర్వే విష్ణుమారాధ్య తే పురా, స్వం స్వం పదమనుప్రాప్తాః కేశవస్య ప్రసాదతః" (నరశింహ పు), "ఏవ మేష సురాణాఞ్చాసురాణాఞ్చాపి సర్వశః, భయాభయకరః కృష్ణ స్సర్వలోకేశ్వరః ప్రభుః" (భా.స) ఇత్యాది.

(కోఽన్య ఇత్యాది) ప్రజాపతి పశుపతికళై త్తన్నాలాల్ వన్ద ఆపత్తుక్కళోడు, పిఱరాల్ వన్ద ఆపత్తుక్కళోడు వాశియఱ సాకల్యేన రక్షిక్కిఱాన్ మఱ్ఱవన్.

---

ఈశ్వరులని కీర్తించేటట్లు స్థానాలను వీరికి అనుగ్రహించడం దీనిద్వారా తెలుపబడింది. "యుగకోటి సహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః, పునస్త్రైలోక్య ధాతృత్వం ప్రాప్తవానితి శుశ్రుమ" (వేయికోట్ల యుగాలతోకాలం విష్ణువును ఆరాధించి బ్రహ్మ మళ్ళీ తిరిగి ముల్లోకాలకు బ్రహ్మ అయే పదవిని పొందాడని వింటున్నాము), "బ్రహ్మాదయ స్సురా స్సర్వే విష్ణుమారాధ్య తే పురా, స్వం స్వం పద మనుప్రాప్తాః కేశవస్య ప్రసాదతః" (బ్రహ్మమొదలైన ఆ దేవతలందఱు పూర్వం విష్ణువును ఆరాధించి, కేశవుని అనుగ్రహంవల్ల తమ తమ స్థానాలను పొందారు), "ఏవ మేష సురాణాం చా సురాణాం చాపి సర్వశః, భయాభయకరః కృష్ణః సర్వలోకేశ్వరః ప్రభుః" (ఈవిధంగానే సమస్తలోకాలకు ఈశ్వరుడు, తనకు వేఱొక నియామకుడు లేనివాడు అయిన ఈ కృష్ణుడు సురులకు అభయాన్ని, అసురులకు భయాన్ని కల్గించేవాడు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

(కోఽన్య ఇత్యాది) - బ్రహ్మను, రుద్రుని తమవల్ల తమకు కల్గిన ఆపదలతోపాటు, ఇతరులవల్ల కల్గిన ఆపదలతో పాటు ఏతేడా లేకుండా అన్నిటినుండి ఎవడు రక్షిస్తున్నాడో,



(కస్య పాదోదకేనేత్యాది) యారుడైయ తిరువడికళినిన్ఱుమ్ విఴున్ద గంగాజలత్తై త్తన్ జటైయిలే ధరిక్కైయాలే అన్ద రుద్రన్ శివనాయిఱ్ఱు, పరిశుద్ధనాయిఱ్ఱు. అవన్ అశుద్ధియై విళైత్తుక్కొళ్ళ అవనై శుద్ధనాక్కుమ్ పరమపావనభూతర్ ఉన్నై యొఴియ వేఱార్? "ద్రవీభూత స్తథా ధర్మోహరిభక్త్యా మహామునే! గృహీత్వా ధర్మపానీయం పాదం నాథస్య తుష్టయే, క్షాళితం పరయా భక్త్యా పాద్యార్ఘ్యాదిభిరర్చితమ్ తదంబు పతితం దృష్ట్వా దధార శిరసా హరః, పావనార్థం జటామధ్యే యోగ్యోస్మీత్యవధారణాత్, వర్షాయుతాన్యథ బహూన్ న ముమోచ తదా హరః" (ఈశ్వరసంహితా), "శతుముక" (పెరి-తి-4-7-3) నిత్యాది- "నలన్దికఴ్ శడైయాన్ ముడిక్కొణ్డై

---

(కస్య పాదోదకేన) - ఎవరి శ్రీచరణాలనుండి జారిపడిన గంగాజలాన్ని తన జటలలో ధరించినందున ఆ రుద్రుడు శివుడు (మంగళకరుడు) అయ్యాడో, పరిశుద్ధుడయ్యాడో అని భావం. అతడు (తనకు) (బ్రహ్మహత్యాపాతకరూపంలో) అపవిత్రతను కల్గించుకోగా, అతనిని పరిశుద్ధుని చేసే పరమపావనుడైన వాడు వేఱొకడు ఎవడు? "ద్రవీభూత స్తదా ధర్మో హరిభక్త్యా మహామునే!, గృహీత్వా ధర్మపానీయం పాదం నాథస్య తుష్టయే, క్షాళితం పరయా భక్త్యా పాద్యార్ఘ్యాదిభిరర్చితమ్, తదంబు పతితం దృష్ట్వా దధార శిరసా హరః, పావనార్థం జటామధ్యే యోగ్యోస్మీత్యవధారణాత్, వర్షాయుతాన్యథ బహూన్ స ముమోచ తదా హరః" (మహామునీ! అపుడు ధర్మదేవత హరిభక్తికారణం దానజలంగా రూపొందింది. ఆ ధర్మజలాన్ని తీసికొని బ్రహ్మ, నాథుడైన హరియొక్క సంతోషంకోసం ఆ స్వామిపాదాన్ని గొప్ప భక్తితో కడిగాడు. పాద్యం, అర్ఘ్యం మొదలైన వారితో అర్చించాడు. ఆపాదంనుండి జాలువారిన జలాన్ని చూచి శివుడు దానిని తన జటలలో, తాను పవిత్రుడు కావడంకోసం, యోగ్యుడనయ్యాననే నిశ్చయం కోసం ధరించాడు. ఆ విధంగానే ఆగంగాజలాన్ని శివుడు పలుకోట్ల సంవత్సరాలు తన తలపైన ధరించాడు, విడువలేదు) అని, "శతుముకన్ కైయిల్

మలరుమ్ నారణన్ పాతత్తుழాయుమ్ కలన్దిழి పునల్"(పెరి-తి-4-7-2).

**14శ్లో ॥** కస్యోదరే హరవిరిఞ్చిముఖప్రపఞ్చః
కో రక్షతీమ మజనిష్ట చ కస్య నాభేః ।
క్రాన్త్వా నిగీర్య పునరుద్గిరతి త్వదన్యః
కః కేన వైష పరవానితి శక్యశఙ్కః ॥

అవ:(కస్యోదరే) ప్రమాణానుకూలమానతర్కరూప-న్యాయత్తాలే ఉక్తమాన భగవత్పరత్వత్తై నిగమిక్కిఱార్.

వ్యా : (హరవిరిఞ్చిముఖప్రపఞ్చః కస్యోదరే) బ్రహ్మరుద్ర-ప్రముఖమాన సకలపదార్థఙ్గళుమ్ మహాప్రళయత్తిలే యారుడైయ వయిற్றిలే

---

శతుప్పుయన్ తాళిల్ శఙ్కరన్ శడైయినిల్ తఙ్గి కతిర్మాకమణి కొణ్డిழిపునల్కఙ్గై" (చతుర్ముఖుని చేతినుండి చతుర్భుజుని పాదాలలో, శంకరుని జటలో నిలచిన ప్రవాహం కల గంగ అని, "నలన్దికழ్ శడైయాన్ ముడికొన్డై మలరుమ్ నారణన్ పాదత్తుழాయుమ్ కలన్దిழి పునలాల్ పుకర్పడు కఙ్గై" (పవిత్రత ప్రకాశించే జటలను కల రుద్రుని శిరస్సులోని గన్నేరుపూలను, నారాయణుని పాదాలలోని తులసిని కలుపుకొని ప్రవహించే జలాలతో ప్రకాశించే గంగ) ఇత్యాదులు స్మరణీయాలు.

**14శ్లో ॥** అవ : **(కస్యోదరే)** - ప్రమాణానుకూలతర్కాలనే న్యాయం ద్వారా ఇంతకుముందు పల్కిన భగవత్పరత్వాన్ని ముగిస్తున్నారు.

వ్యా : **(హరవిరించిముఖప్రపంచః కస్యోదరే)** బ్రహ్మ, రుద్రుడు, మొదలైన సకలపదార్థాలు మహాప్రళయంలో ఎవరి ఉదరంలో ఒదిగి ఉంటాయో - అని భావం. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" (ఓ సామ్యుడా!



ఒతుఙ్గి క్కిడక్కిఱతు. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" (ఛా 6-2-1) ఎన్గిఱపడియే ద్విపరార్ధకాలమ్ నామరూపఙ్గళై యిழన్దు, "తమః పరే దేవ ఏకీభవతి" (సుబా-2) ఎన్గిఱపడియే సర్వేశ్వరన్పక్కలిలే కిడక్కిఱపడియై చ్చొల్లుకిఱతు. "బ్రహ్మాదిషు ప్రలీనేషు నష్టే లోకే చరాచరే, ఆభూతసంప్లవే ప్రాప్తే ప్రలీనే ప్రకృతౌ, మహాన్ ఏక స్తిష్ఠతి విశ్వాత్మా స తు నారాయణః పరః" (వి-పు-6) ఇత్యాది. సంహారాదికళిలుమ్ కర్మభవిక్కుమిడత్తిల్ బ్రహ్మాదికళోడు, పిపీలికాదికళోడు వాశియిల్లై యెన్గై.

**(కో రక్షతీమమ్)** హరవిరిఞ్చి ప్రముఖమాన ఇప్రపఞ్చత్తై రక్షిక్కిఱార్ ఆర్. "న హి పాలన సామర్థ్య మృతే సర్వేశ్వరం హరిమ్" (వి-పు-1-22-21), "న సమ్పదాం సమాహారే విపదాం వినివర్తనే, సమర్థో దృశ్యతే కశ్చిత్తం వినా

---

ప్రళయానికి ముందు సచ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మ ఒక్కడే ఉన్నాడు) అనే రీతిలో ద్విపరార్థకాలం నామరూపాలను కోల్పోయి, "తమః పరే దేవ ఏకీభవతి" (తమశ్శబ్దవాచ్యమైన తత్త్వం పరమాత్మతో ఏకమవుతున్నది) అనే రీతిలో సర్వేశ్వరునితో చేరి ఉండే స్థితిని ఇది తెల్పుతున్నది "బ్రహ్మాదిషు ప్రలీనేషు నష్టే లోకే చరాచరే, ఆభూతసంప్లవే ప్రాప్తే ప్రలీనే ప్రకృతా మహాన్, ఏకస్తిష్ఠతి విశ్వాత్మా స తు నారాయణః పరః" (బ్రహ్మాదులు లయాన్ని పొందగా, చరాచరాలు నశించిపోగా, భూతపర్యంతం మునిగిపోగా, మహచ్ఛబ్ద వాచ్యమైన ప్రకృతి, లీనం కాగా, విశ్వాత్ముడైన ఆ పరమాత్మ నారాయణుడొక్కడే ఉంటాడు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(కో రక్షతీమమ్)** - హరుడు, విరించి మొదలైన ఈ ప్రపంచాన్ని రక్షించేవారెవరు? "న హి పాలనసామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్" (హరికి తప్ప ఇంకొకరికి పాలన సామర్థ్యం లేదు) "న సంపదాం సమాహారే విపదాం వినివర్తనే సమర్థో దృశ్యతే కశ్చిత్తం వినా పురుషోత్తమమ్" (సంపదలను కల్గించడంలో, ఆపదలను తీర్చడంలో ఆ పురుషోత్తముడు తప్ప ఇంకొకడు

పురుషోత్తమమ్" (పరమ సంహితా)

**(అజనిష్ట చ కస్య నాభేః)** మహాప్రళయత్తిల్ అవిభక్తమాయ్ క్కిడక్కిఱ ఇప్రపఞ్చమ్ యారుడైయ తిరునాభీకమలత్తిల్ నిన్ఱు ముత్పన్నమాయిఱ్ఱు. మహాభారతే మార్కణ్డేయ సమాఖ్యానే "స్వపత స్తస్య దేవస్య పద్మం సూర్యసమప్రభమ్, నాభ్యాం వినిస్సృతం తస్మాత్తత్రోత్పన్నః పితామహః" (భార) సుపర్ణవైకుణ్ఠసంవాదే- "యత్తత్పద్మ మభూత్పూర్వం తత్ర బ్రహ్మా వ్యజాయత, బ్రహ్మణశ్చాపి సమ్భూత శ్శివ ఇత్యవధార్యతామ్, శివాత్స్కన్ద స్సమ్బభూవ ఏతత్సృష్టి చతుష్టయమ్" (భార) ఇత్యాది.

**(క్రాన్త్వా)** బ్రహ్మాదిస్థానరాన్తమాన ఎల్లార్ తలైకళిలుమ్ తిరువడికళై

సమర్థుడు కన్పించడంలేదు) ఇత్యాదిప్రమాణాలు స్మరణీయాలు.

**(అజనిష్ట చ కస్య నాభేః)** - మహాప్రళయంలో అవిభక్తంగా (భగవంతునితో కలసి) ఉండే ఈ ప్రపంచం ఎవరి నాభీకమలంనుండి పుట్టిందో? మహాభారతంలోని మార్కండేయోపాఖ్యానంలో- **"స్వపత స్తస్య దేవస్య పద్మం సూర్యసమప్రభమ్, నాభ్యాం వినిఃసృతం తస్మాత్ తత్రోత్పన్నః పితామహః"** (నిద్రించే ఆదేవుని నాభినుండి సూర్యునివంటి కాంతిని కల నాభీపద్మం వెలువడింది. దానినుండి బ్రహ్మ పుట్టాడు), సువర్ణ వైకుంఠసంవాదంలో - **"యత్త త్పద్మమభూత్పూర్వం తత్ర బ్రహ్మా వ్యజాయత, బ్రహ్మణ శ్చాపి సంభూతః శివ ఇత్యవధార్యతామ్, శివాత్ స్కందస్సంబభూవ ఏతత్ సృష్టిచతుష్టయమ్"** (ఏ నాభీపద్మం పూర్వం పుట్టిందో, ఆ పద్మనుండి బ్రహ్మ పుట్టాడు, బ్రహ్మనుండి శివుడు పుట్టాడని గ్రహించు, శివునినుండి స్కందుడు పుట్టాడు. ఇది సృష్టిచతుష్టయం) ఇత్యాది ప్రమాణాలు అవధేయాలు.

**(క్రాంత్వా)**- బ్రహ్మమొదలైన స్థావరాలవరకు ఉండే అందఱి తలలపై శ్రీచరణాలను పెట్టినవాడెవడు? శ్రీచరణాలను అందఱి తలలపై పెట్టినవాడా?,



వైత్తవనార్? తిరువడికళై త్తలైయిలే వైత్తవనో. తిరువడికళిన్ కీழே తుకైయుణ్డవనో ఈశ్వరన్ - ఎన్గిఱార్. "ఏకః ప్రాసీసరత్పాద మేకః ప్రాచిక్షళన్ముదా, అపరోఽపి ధర్మ న్మూర్ధ్నా కోఽధిక స్తేషు గణ్యతామ్" ఎన్నక్కడవతిఱే. "సంస్తై స్సురాణా మిత్యాది" (విష్ణుధ-13-32).

**(నిగీర్య పునరుద్గిరతి)** అవాన్తరప్రళయఙ్గళిలే తిరువయిఱ్ఱిలే వైత్తు , ప్పిన్బు వెళినాడు కాణ ప్పుఱప్పడ విట్టవన్ ఆర్?

**(త్వదన్యః కః?)** ఇప్పడి సర్వప్రకారరక్షకర్ ఉన్నై యొழியయ మఱ్ఱార్?

**(కేన వైష పరవానితి శక్యశఙ్కః?)** మఱ్ఱవరాల్ ఇన్ద ప్రపంచమానతు

శ్రీపాదాలకింద ఒదిగి ఉండేవాడా? ఎవరు ఈశ్వరుడు? అని పల్కుతున్నారు. **"ఏకః ప్రాసీసరత్పాద మేకః ప్రాచిక్షళన్ముదా, అపరోఽ పృధరన్మూర్ధ్నా కోఽ ధిక స్తేషు గణ్యతామ్"** (ఒకడు తన శ్రీచరణాన్ని చాచాడు. ఇంకొకడు దానిని ఆనందంగా కడిగాడు. మఱి ఒకడు దానిని శిరస్సున ధరించాడు. వీరిలో ఎవరు అధికుడో గమనించండి) అని చెప్పబడుతున్నది కదా! **"సంస్తైః సురాణామ్"** (స్వర్గంలోని దేవతల సమూహంచే స్తుతింపబడినవాడై ఏ భగవానుడు శ్రీచరణాలను భూమిపై మోపాడో ఆ హరి నాకు సదా శుభాలను కల్గించాలి) ఇత్యాది ప్రమాణం స్మరణీయం.

**(నిగీర్య పునరుద్గిరతి)** అవాంతరప్రళయాలలో తన ఉదరంలో పెట్టుకొని తరువాత బయటకు వ్యక్తం చేసినవాడు,

**(త్వదన్యః కః?)** ఈవిధంగా అన్ని రీతులలోను రక్షకుడవు నీవు తప్ప ఇంకొకరు ఎవరున్నారు?

**(కేన వైష పరవానితి శక్యశఙ్కః?)** - మఱి ఎవరి కారణంగా ప్రపంచ పరతంత్రమని ఊహించడానికి వీలవుతున్నది? "సందిగ్ధే ఖలు న్యాయః

పరతన్త్రమెన్ఱు శక్యశఙ్కమా యిరుక్కిఱతు? “సన్దిగ్ధే ఖలు న్యాయః ప్రవర్తతే” ఎన్ఱు వేఱే శిలరై శఙ్కిక్కైక్కు సమ్భావనైయే యిల్లై యెన్ఱై.

ఒరువన్ జనకనాయ్, ఒరువన్ జన్యనాయ్, ఒరువన్ శేషియాయ్, ఒరువన్ శేషనాయ్, ఒరువన్ శ్రియఃపతియాయ్, ఒరువన్ ఉమాపతియాయ్, ఒరువన్ పుణ్డరీకాక్షనాయ్, ఒరువన్ విరూపాక్షనాయ్, ఒరువన్ గరుడవాహననాయ్, ఒరువన్ వృషభవాహననాయ్, ఒరువన్ పాతకియాయ్, ఒరువన్ మోచకనాయ్, ఒరువన్ పురుషోత్తమనాయ్, ఒరువన్ పురుషనాయ్, ఒరువన్ శిరస్థిత పాదపఙ్కజనాయ్, ఒరువన్ పాదపాంసుమాత్రమాయ్, ఒరువన్ సూరిదృశ్యనాయ్, ఒరువన్ వేతాళదృశ్యనాయ్ - ఇప్పడి తమః ప్రకాశఙ్గళ్‌పోలే రుద్రనుక్కుమ్, సర్వేశ్వరనుక్కుమ్ నెడు వాశి యుణ్డాకైయాలే రుద్రనుక్కు అస్మదాదికళోపాతి క్షేత్రజ్ఞతైయాలే ఈశ్వరత్వశఙ్కై యిల్లై. బ్రహ్మావుక్కుమ్ సామాన్యన్యాయత్తాలే ఈశ్వరత్వశఙ్కై యిల్లై యెన్ఱతాయ్‌త్తు.

---

ప్రవర్తతే” (సందేహం ఉండే విషయంలో న్యాయం ప్రవర్తిస్తుంది) అనే రీతిలో ఎవరైనా కొందఱు ఈ విషయంలో సందేహించడానికి అవకాశం లేదు.

ఒకడు తండ్రి, ఇంకొకడు అతనికి పుట్టినవాడు. ఒకడు శేషి, ఇంకొకడు శేషభూతుడు. ఒకడు శ్రియఃపతి, ఇంకొకడు ఉమాపతి. ఒకడు పుండరీకాక్షుడు, ఇంకొకడు విరూపాక్షుడు. ఒకడు గరుడవాహనుడు, ఇంకొకడు వృషభవాహనుడు. ఒకడు పాతకి, ఇంకొకడు మోచకుడు. ఒకడు పురుషోత్తముడు, ఒకడు పురుషుడు. ఇంకొకడు శిరస్సులో పాదపద్మాన్ని కలవాడు, ఒకడు పాదరేణువు. ఒకడు సూరిసమానుడు, ఒకడు వేతాళ దృశ్యుడు. ఈ విధంగా, చీకటి వెలుతురులవలె, రుద్రునకు సర్వేశ్వరునకు మధ్య చాలా తారతమ్యమున్నది కనుక, రుద్రునకు, మనకువలె క్షేత్రజ్ఞత (జీవత్వం) ఉన్నందున ఈశ్వరత్వశంక వారిపట్ల లేదు. బ్రహ్మకుకూడా సామాన్య న్యాయంలో ఈశ్వరత్వ సందేహం లేదని తెలుపబడింది.



**15శ్లో ॥** త్వాం శీలరూపచరితైః పరమప్రకృష్ట-
సత్త్వేన సాత్త్వికతయా ప్రబలైశ్చ శాస్త్రైః ।
ప్రఖ్యాతదైవపరమార్థ విదాంమతైశ్చ
నైవాసురప్రకృతయః ప్రభవన్తి బోద్ధుమ్ ॥

అవ : **(త్వాం శీలేతి)** నాపేక్షసేయిల్ వేదాన్తప్రథమప్రాదోక్త కారణత్వమ్ శొల్లి**ற்று**. స్వాభావికేత్యాదియిల్ గుణోపసంహారపాదార్థమ్ శొల్లి**ற்று**. కశ్శ్రీయఃవిల్ త్రిపాదత్తిలర్థమ్ శొల్లి**ற்று**. వేదాపహారేత్యాదియిల్ ఉపబృంహణమాన అర్థమ్ శొల్లి**ற்று**. కస్యోదరత్తిల్ ప్రమాణానుగ్రాహక తర్కసిద్ధపరత్వం శొల్లి**ற்று**. ఇని, ఇతిల్ ఇప్పడి దృఢతరప్రమాణ సిద్ధమాయిరుక్క, “ఆసురీం యోని మాపన్నాః” (గీ 16-20) ఎన్గిఱపడియే “ఆసురప్రకృతికళ్ అవనై ఇ**ழ**ప్పతే” ఎన్ఱు ఇవర్క**ழி**లవుక్కు ఇన్నాతాకిఱార్. అథవా, “యారు మోర్ నిలైమైయనెన వఱివరియ వెమ్బెరుమాన్” (తి-వాయ్-

---

**15శ్లో ॥** అవ : **(త్వామ్ శీలేతి)** “నావేక్షసే” ఇత్యాది 10వ శ్లోకంలో వేదాంతశాస్త్రం (బ్రహ్మసూత్రాలు) ప్రథమపాదంలో ప్రస్తావింపబడిన కారణత్వం తెలుపబడింది. ‘‘స్వాభావిక’’ ఇత్యాది శ్లోకంలో గుణోపసంహారపాదార్థం తెలుపబడింది. “కః శ్రీః శ్రియః” ఇత్యాదిశ్లోకంలో త్రిపాదార్థం తెలుపబడింది. **“వేదాపహార”** ఇత్యాది శ్లోకంలో ఉపబృంహణాలలో (పురాణేతిహాసాలలో) ఉపబృంహితమైన (వివరింపబడిన) అర్థం చెప్పబడింది. **“కస్యోదరే”** ఇత్యాది శ్లోకంలో ప్రమాణాలకు అనుగ్రాహకాలైన తర్కాలద్వారా సిద్ధించే భగవత్పరత్వం చెప్పబడింది. ఇక ఇందులో, ఈ విధంగా దృఢతర ప్రమాణాలద్వారా సిద్ధమై ఉండగా, **“ఆసురీం యోనిమాపన్నాః”** (మూఢులు ప్రతిజన్మలో ఆసురజన్మను పొందినవారైనశిస్తున్నారు) అనే విధంగా ‘‘ఆసురస్వభావాన్ని కలవారు భగవానుని పొందలేక పోతున్నారుకదా!’’ అని వారి నష్టాన్ని గుర్చి చింతిస్తున్నారు - అని చెప్పవచ్చు. లేక, **“యారుమోర్**

**1-3)** ఎన్ఱు దుష్ప్రకృతికళ్ కణ్పడాతొழியు ప్పెఱువతే ఇవ్విలక్షణవిషయమెన్ఱు ఉకక్కిఱారాకవుమామ్.

వ్యా :- **(త్వామ్)** సర్వాధికనాయ్ ఇవ్వాత్మావుక్కు వకుత్త ఉన్నై.

**(శీల)** మహతో మన్దై స్సహ నీరన్ధ్రేణ సంశ్లేషస్వభావత్వమ్. "నావేక్షసే" ఎన్గిఱ శ్లోకత్తిల్ శొల్లుకిఱ స్వభావమ్. అతాకిఱతు- సర్వాధికనాయిరున్దువైత్తు "బహుస్యామ్" (తై-ఆ-6) ఎన్గిఱపడియే అవற்றి నిழవు పేఱు తన్నతాయ్, అభిమానియుమ్ తానేయా యిరుక్కై.

**(రూప)** "కః పుణ్డరీకనయనః?" ఎన్గిఱవడివు. "హిరణ్మయః పురుషో దృశ్యతే, తస్య యథా కప్యాసం పుణ్డరీకమేవ మక్షిణీ" (ఛా-1-6-6),

---

నిలైమైయనెన అఱివరియ ఎమ్బెరుమాన్" (ఇదమిత్థమైన స్థితిని కలవాడుగా ఎవరికీ తెలియడానికి సాధ్యం కానివాడు) అని ఆసురప్రకృతిని కలవారి కంటికి కన్పించని రీతిలో భగవంతుని స్వరూపం ఉన్నదికదా! - అని సంతోషిస్తున్నారని కూడా చెప్పవచ్చు.

వ్యా : **(త్వామ్)**- సర్వాధికుడవై, ఈ ఆత్మకు ప్రాప్తశేషి అయిన నిన్ను- అనిభావం.

**(శీల)- "మహతో మంద్తై స్సహ నీరంధ్రేణ సంశ్లేషస్వభావత్వమ్"** (గొప్పవాడు, తక్కువవారితో ఏసంకోచం లేకుండా వర్తించే స్వభావాన్ని కల్గి ఉండడం - శీలం) ఇది, **"నావేక్షసే"** అనే శ్లోకంలో చెప్పబడిన స్వభావం. అది ఏమంటే- సర్వాధికుడై ఉన్నా, **"బహుస్యామ్"** అనే విధంగా జీవుల నష్టం తన నష్టంగా తలచి, వాటిని అభిమానించేవాడై ఉండడం.

**(రూప)**- రూపమంటే - **"కః పుండరీకనయనః?"** (పుండరీకాక్షు-డెవరు?) - అని ప్రస్తావింపబడిన పుండరీకాక్షత్వాదులలో కూడిన రూపం. **"హిరణ్మయః పురుషో దృశ్యతే తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"**



**"నీలతోయదమధ్యస్థా" (తై-నా), "న భూతసంఘసంస్థానో దేహోస్య పరమాత్మనః" (భారత), "న తస్య ప్రాకృతా మూర్తి ర్మాంసమేదోఽస్థిసమ్భవా" (వాయుపు-34-40)** ఇత్యాది

**(చరితైః)** ''క్రాన్త్వా నిగీర్య పునరుద్గిరతి'' ఎన్ఱుమ్, **"వేదాపహారగురుపాతక"** ఎన్ఱుమ్ శొల్లుకిఱ అతిమానుషచేష్టితఙ్గళాలుమ్.

**(పరమప్రకృష్టసత్త్వేన)**- "పరమసత్త్వసమాశ్రయః కః" ఎన్గిఱ శుద్ధసత్త్వమయమాన విభూతియోగత్తాలుమ్, **"క్షయంతమస్య రజసః పరాకే"**

---

(సూర్యమండలంలోపల వేంచేసి ఉండే ఏ పరమపురుషుడు బంగారువన్నెను కలవాడై గోచరిస్తున్నాడో, అతనికి నిండైన నీటిలో పుట్టిన, బలమైన కాడలను కల్గిన, సూర్యునిచే వికసింపబడిన తామరపూవువంటి రెండు కన్నులున్నవి) అని, **"నీలతోయదమధ్యస్థా"** (నల్లని మేఘాన్ని మధ్యలో కల్గినది, విద్యుల్లేఖవలె ప్రకాశించేదైన పరమాత్మరూపం) అని, **"న భూతసంఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః"** (ఈ పరమాత్మయొక్క దేహం పంచభూతాల కలయికవల్ల ఏర్పడినదికాదు) అని, **"న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోఽస్థిసంభవా"** (పరమాత్మరూపం మాంసం, కొవ్వు, ఎముకలు మొదలైన వానితో నిర్మింపబడిన ప్రాకృతమైనది కాదు) మొదలైన ప్రమాణాలు స్మరణీయాలు.

**(చరితైః) - "క్రాంత్వా నిగీర్య పునరుద్గిరతి"** (లోకాలను త్రివిక్రముడై విక్రమించి, ఉదరంలోపలకు గ్రసించి, మళ్ళీ వెలువరించి) అని, **"వేదాపహారగురుపాతక దైత్యపీడాది"** (వేదాలను అపహరించిన అసురులను వధించడం, శివుని పాతకాన్ని తీర్చడం, రావణ, హిరణ్యకశ్యపాది దైత్యులను సంహరించడం) అని చెప్పబడే అతిమానుషలీలలతో- అని భావం.

**(పరమప్రకృష్టసత్త్వేన) - "పరమసత్త్వసమాశ్రయః కః"** (శుద్ధమైన సత్త్వగుణానికి ఆశ్రయమైనవాడెవడు?) అనే శుద్ధసత్త్వమయమైన విభూతియోగంతోను, **"క్షయంత మస్య రజసః పరాకే"** (రజస్తమోగుణాలకు

(ఋ.అ. 5-6-24-12), "తమసః పరస్తాత్" (పురుషసూ), "స్వసత్తాభాసకం సత్వం గుణసత్త్వాద్విలక్షణమ్" (పాంచరాత్రం) ఇత్యాది.

(సాత్వికతయా ప్రబలైశ్చ శాస్త్రైః) వేదత్తిల్ సాత్వికర్క్కు హితానుశాసనమ్ పణ్ణుమ్ జ్ఞానభాగత్తాలుమ్, "అగ్నే శ్శివస్య మాహాత్మ్యమ్" (మాత్స్య-53-63) ఇత్యారభ్య, "సాత్వికేష్వథ కల్పేషు మహాత్మ్య మధికం హరేః" ఎన్ఱు శ్రీమాత్స్యపురాణత్తిలే సత్వోద్రిక్తనాన బ్రహ్మావిన్ వాక్యమాకైయాలే ప్రబలమాన శాస్త్రఙ్గళాలుమ్.

(ప్రఖ్యాతదైవపరమార్థవిదాంమతైశ్చ) ప్రఖ్యాతమాన దైవత్తినుడైయ యాథార్థ్యవిత్తుక్కళుడైయ మతఙ్గళాలుమ్ సృష్టివాక్యమ్, నారాయణానువాకమ్, సుబాలోపనిషత్, అన్తర్యామిబ్రాహ్మణాదికళిలే సర్వాధికనాక ప్రఖ్యాతనాయిరుక్కై. ప్రఖ్యాతదైవ పరమార్థవిత్తుక్కళెన్గిఱతు-

---

అతీతంగా), "తమసః పరస్తాత్" (రజోగుణతమోగుణాలకు ఆవలివైపున) "స్వసత్తాభాసకం సత్వం గుణసత్త్వాదిలక్షణమ్" (సత్త్వగుణం తనసత్తను ప్రకాశింపజేస్తుంది) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

(సాత్త్వికతయా ప్రబలైశ్చ శాస్త్రైః) - వేదంలో సాత్త్వికులకు హితాన్ని ఉపదశించే జ్ఞానభాగంతోను, "సాత్వికేష్వథ కల్పేషు మాహాత్మ్య మధికం హరేః" (సాత్త్వికాలైన కల్పాలలో హరియొక్క మహిమ అధికం) అని శ్రీమాత్స్యపురాణంలో సత్త్వగుణం అతిశయించిన సమయంలో బ్రహ్మ పల్కిన వాక్యమైనందున, (ఇటువంటి) ప్రబలమైన శాస్త్రాలద్వారా,

(ప్రఖ్యాతదైవపరమార్థవిదాం మతైశ్చ) - ప్రఖ్యాతమైన దైవంయొక్క (దైవాన్ని ఉద్దేశించి ప్రవర్తించిన) యథార్థాన్ని తెలిసినవారి మతాలద్వారా, సృష్టివాక్యాలు, నారాయణానువాకం, సుబాలోపనిషత్, అంతర్యామి బ్రాహ్మణం మొదలైన వానిలో సర్వాధికుడుగా ప్రసిద్ధిచెందినవాడై ఉండడం.



"స హో వాచ వ్యాసః పారాశర్యః" ఎన్గిఱ పరాశరభగవాన్, "యద్వైకిఞ్చ మనురవదత్తద్భేషజమ్" ఎన్గిఱ మను, వేదాచార్యనాన వేదవ్యాసన్, వాజసనేయ ప్రసిద్ధనాన యాజ్ఞవల్క్యన్, "నమ శ్శౌనకాయ" ఎన్ఱు వైదికాగ్రేసరర్ శొల్లుమ్ శ్రీశౌనకన్. ఏవమ్భూతనాన ఆపస్తమ్బన్, ఆయోనిజనాయ్ శ్రీరామాయణ ప్రవర్తకనాన వాల్మీకి, "ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నర సూనవః" ఇతి వసిష్ఠపులస్త్య వరప్రదాన సిద్ధదేవతాపరమార్థజ్ఞ పరాశరః. "రుక్మాభం స్వప్నధీగమ్యమ్" ఇతి మనుః. "క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానాద్విశుద్ధిః పరమా మతా" ఇతి యాజ్ఞవల్క్యః, "తామర్చయేత్తాం ప్రణమేత్" ఇతి శౌనకః, "పూః ప్రాణిన స్సర్వ ఏవ గుహాశయస్య" ఇత్యాపస్తమ్బః, "భవాన్నారాయణో దేవః" ఇతి

---

ప్రఖ్యాతదైవపరమార్థ విదులంటే - "స హోవాచ వ్యాసః పారాశర్యః" (పరాశరమహర్షికుమారుడైన ఆవ్యాసుడు కదా పలికాడు) అనే కీర్తిని కల పరాశరభగవాన్, "యద్వై కించ మనురవదత్ తద్భేషజమ్" (మనువు పలికినది అంతా మందువలే హితం) అనే మనువు, వేదాచార్యుడైన వేదవ్యాసమహర్షి, వాజసనేయంలో ప్రసిద్ధుడైన యాజ్ఞవల్క్యుడు, "నమః శౌనకాయ" అని వైదికాగ్రేసరులు కీర్తించే శ్రీశౌనకమహర్షి, ఇటువంటివాడే అయిన ఆపస్తంబుడు, అయోనిజుడై, శ్రీరామాయణ ప్రవర్తకుడైన వాల్మీకి మొదలైనవారు "ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః" (జలం, నారాలనబడుతున్నాయి. ఆపస్సు నరసూనులు కదా) అని వసిష్ఠ, పులస్త్యవరప్రదానసిద్ధమైన దేవతాపరమార్థాన్ని తెలిసిన పరాశరమహర్షి. "రుక్మాభం స్వప్నధీగమ్యమ్" (భగవంతుడు బంగారు ప్రభను కలవాడు, స్వప్నజ్ఞానంలోవలె సాక్షాత్కరించేవాడు) అని మనువు, "క్షేత్రజ్ఞస్యేశ్వర-జ్ఞానాద్విశుద్ధిః పరమా మతా" అని యాజ్ఞవల్క్యుడు, "తామర్చయేత్తాం ప్రణమేత్" (అర్చామూర్తిని అర్చించాలి, దానిని నమస్కరించాలి.) అని శౌనకుడు. "పూః ప్రాణిన స్సర్వ ఏవ గుహాశయస్య" అని ఆపస్తంబుడు. "భవాన్

వాల్మీకిః ఎన్గిఱ ఇవర్కళై. ఏవం విశిష్టం త్వామ్.

**(అసురప్రకృతయః)** క్రూరకర్మాక్కళాన పేర్కళ్ సర్వాధికనాన దేవరీరై.

**(బోద్దుమేవ న ప్రభవన్తి)** అఱికైక్కుత్తానే సమర్థనాళన్రు. "అసురీం యోనిమాపన్నాః" (గీ-16-20) ఇత్యాది.

**16శ్లో॥** ఉల్లఙ్ఘితత్రివిధసీమసమాతిశాయి-
సమ్భావనం తవ పరిబ్రఢిమస్వభావమ్ ।
మాయాబలేన భవతాఽపి నిగూహ్యమానం
పశ్యన్తి కేచిదనిశం త్వదనన్యభావాః ॥

అవ : **(ఉల్లఙ్ఘితేత్యాది)** "మహాత్మాన స్తు మామ్" (గీ-9-13)

---

నారాయణో దేవః" (నీవు సాక్షాత్తు దేవుడవైన నారాయణుడవు) అని వాల్మీకి పలికారు. ఇటువంటి, పరమార్థవేత్తలైనవారి మతాలతో శీలాదిగుణ విశిష్టుడవుగా తెలియబడే నిన్ను,

**(ఆసురప్రకృతయః)** -క్రూరకర్మలను చేసేవారైన ఆసురస్వభావాన్ని కలవారు, సర్వాధికుడవైన నిన్ను,

**(బోద్దుమేవ న ప్రభవంతి)** - తెలియడానికి కూడా సమర్థులుకారు. **"ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని, మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్"** (అర్జునా ! ఆసురజన్మలను పొందిన మూఢులు ప్రతిజన్మలోను నన్ను పొందలేకుండానే అధమగతిని పొందుతారు) అనే ప్రమాణాలు స్మరణీయాలు.

**16శ్లో॥** అవ : **(ఉల్లంఘితేత్యాది)- "మహాత్మాన స్తు మాం పార్థ!"** ఇత్యాది



**ఇత్యాదికళిల్ శొల్లుకిఱపడియే ఉన్నై ప్పెఱుమ్ సత్త్వప్రకృతికళ్ కాణప్పెఱువతే యెన్రుమ్, "యారుమోర్ నిలమైయనెన వఱివెళియ వెమ్బెరుమాన్" (తి-వాయ్-1-3) ఎన్ర తన్ పేఱాక వుకక్కిఱార్.**

వ్యా : **(ఉల్లఙ్ఘితేత్యాది) త్రివిధపరిచ్ఛేదరహితమాయ్, సమాధిక సమ్భావనైయుమ్ కడన్దుళ్ళ ఉన్నుడైయ ప్రభుత్వత్తినుడైయ స్వరూపత్తై. విభుత్వాద్దేశపరిచ్ఛేదరహితః, నిత్యత్వాత్కాలపరిచ్ఛేదరహితః, సర్వప్రకారిత్వేన**

---

సూక్తులలో పల్కినట్లుగా, నిన్ను పొందే సాత్త్వికప్రకృతిని కలవారు దర్శించగల్గుతున్నారు కదా! - అని **"యారుమోర్ నిలమైయనెన అఱివెళియ ఎమ్బెరుమాన్"** (ఎవరూకూడా ఒక నిర్దిష్టమైన స్థితిని కలవాడని తెలియడానికి వీలు కానివాడు, భగవంతుడు) ఇత్యాది పాశురంలో పల్కినట్లు అది తమ ఫలంగా సంతోషిస్తున్నారు.

వ్యా : **(ఉల్లంఘితేత్యాది)** త్రివిధపరిచ్ఛేదరహితమై, సమాధికసంభావనను కూడా అతిక్రమించిన నీ ప్రభుత్వం యొక్క స్వరూపాన్ని **"విభుత్వాత్ దేశపరిచ్ఛేదరహితః, నిత్యత్వాత్ కాలపరిచ్ఛేదరహిత, సర్వప్రకారిత్వేన పృథక్స్థితి యోగ్యవస్త్వంతరాభావాత్ వస్తుపరిచ్ఛేదరహితః, సదృశవస్త్వంతరాభావాత్ తులయా ప్రస్థాదినా వా పరిచ్ఛేదరహితః - ఇతి వా. అత ఏవ సమానాధికదరిద్రః"** (విభువైనందున సర్వత్ర ఉన్నవాడు కనుక-భగవంతుడు దేశపరిచ్ఛేదరహితుడు - అంటే - ఈ దేశంలోనే ఉన్నాడని నిర్దేశించి చెప్పడానికి వీలు లేనివాడు, అన్ని కాలాలలో ఉన్నందున కాలపరిచ్ఛేదాన్ని లేనివాడు - అంటే - ఈ కాలంలో మాత్రమే ఉన్నాడని చెప్పడానికి వీలు లేనివాడు, అన్నిటిని తనకు ప్రకారంగా కలవాడైనందున, తనకంటే వేఱుగా ఉండే ఇంకొక వస్తువును లేనివాడైనందున వస్తుపరిచ్ఛేదరహితుడు - అనగా - ఈ వస్తువు రూపంలో మాత్రమే ఉన్నాడని చెప్పడానికి వీలు లేనివాడు. లేక, తనతో సాటి వచ్చే ఇంకొక వస్తువు

పృథక్స్థితియోగ్యవస్త్వన్తరాభావాత్ వస్తుపరిచ్ఛేదరహితః, సదృశవస్త్వన్తరాభావాత్ తులయా ప్రస్థాదినా వా పరిచ్ఛేదరహితః ఇతి వా, అత ఏవ సమాధికదరిద్రః.

**(మాయాబలేన)** భగవత్స్వరూపత్తై అఱియవొట్టాత ప్రకృతిసంబన్ధత్తాలే- ఎన్నుతల్; దివ్యవిగ్రహత్తై ఇతరసజాతీయమాక్కుమ్ ఆశ్చర్యశక్తియోగత్తాలే- ఎన్నుతల్.

**(భవతాఽపి నిగూహ్యమానమ్)** "ఆత్మానం మానుషం మన్యే" (రా-యు-120-11), "అహం వో బాన్ధవో జాతః" (వి-పు-5-13-13) ఎన్ఱు ఆళ్‌పార్త్తుఴితరుమున్నాలే మఱైక్కప్పట్టతే యాకిలుమ్. నిగూహ్యమానమపి- విహితమపి.

**(పశ్యన్తి కేచిదనిశమ్)**- సత్త్వప్రకృతికళాయిరుప్పార్ శిల మాహాత్మాక్కళ్ సర్వకాలము ముళ్ళపడి కాణానిన్ఱార్కళ్.

---

లేనందువల్ల, బరువును తూచే త్రాసుతో గాని, పరిమాణాన్ని కొలిచే కుంచం మొదలైన కొలతలతో కాని లెక్కకట్టడానికి వీలు లేనివాడు. అందువల్లనే తనకంటే అధికుడు, తనతో సమానుడు ఇంకొకడు లేనివాడు),

**(మాయాబలేన)** - భగవత్ స్వరూపాన్ని తెలియనీయని ప్రకృతిసంబంధంతో - అనిభావం. (లేక) తన దివ్యరూపాన్ని ఇతరసజాతీయంగా చేసే ఆశ్చర్యశక్తియోగంతో- అనికూడా భావం.

**(భవతాఽపి నిగూహ్యమానమ్)** - **"ఆత్మానం మానుషం మన్యే"** (నన్ను మానవునిగా భావిస్తున్నాను) అని, **"అహం వో బాంధవా జాతః"** (నేను నీకు బంధువువైపుట్టాను) అనే నీచే మఱుగుపరచబడినదైనా - అనిభావం. నిగూహ్యమానమపి- పిహితమపి (ఆవరింపబడినదైనా)

**(పశ్యంతి కేచిదనిశమ్)**- సాత్త్విక స్వభావాన్ని కల కొందఱు మహాత్ములు సర్వకాలం నిన్ను యథాతథంగా దర్శిస్తున్నారు.



**(త్వదనన్యభావాః)** ఉన్నై యొఴియ వేఱు పరత్వబుద్ధి యిల్లాతవర్కళ్ - ఎన్నుతల్. ఉన్నైయొఴియ ఉపాయాన్తర మఱియాతవర్కళ్ - ఎన్నుతల్. ఉన్నై యొఴియప్రాప్యాన్తర మఱియాతవర్ కళ్ - ఎన్నుతల్. "క్రియతా మితి మాం వద" (రా-అ-15-7) ఎన్ఱు ఉన్నినైవొఴియ వేఱు విషయ మఱియాతవర్కళ్ - ఎన్నుతల్, ఇప్పడికళాలే జ్ఞానత్తుక్కు ఉన్నై యొఴియ విషయాన్తరమిల్లాతవర్కళ్.

**17శ్లో॥** యదణ్డమణ్డాన్తరగోచరఞ్చ యత్
దశోత్తరాణ్యావరణాని యాని చ ।
గుణాః ప్రధానం పురుషః పరంపదం
పరాత్పరం బ్రహ్మ చ తే విభూతయః ॥

అవ : **(యదణ్డమితి)** కీఴ్ ప్రతిపాదిత్త సర్వేశ్వరత్వత్తుక్కు ప్రతిసమ్బన్ధితయా అపేక్షితమాన ఈశితవ్యజాతత్తై ప్రపఞ్చికరిక్కిఱార్.

---

**(త్వదనన్యభావాః)**- నీ విషయంలో తప్ప, అన్యులపట్ల పరత్వభావనను లేనివారని భావం. (లేక) నిన్ను తప్ప ఇంకొక ఉపాయాన్ని తెలియనివారు- అని భావం. **"క్రియతామితి మాంవద"** (నీకు ఇష్టమైన రీతిలో నన్ను సేవను చేయమని చెప్పు) అని లక్ష్మణుడు పల్కినటు నీ అభిప్రాయాన్ని తప్ప వేఱొక దానిని లక్ష్యంగా లేనివారు (నిన్నే పరదైవంగా, ఉపాయంగా, ప్రాప్యంగా భావించేవారని తాత్పర్యం).

**17శ్లో॥** అవ: **(యదండమితి)** - ఇంతకు ముందు ప్రతిపాదించిన (ప్రస్తావించిన) సర్వేశ్వరునకు ప్రతిసంబంధిగా అపేక్షింపబడే

వ్యా : (యుదణ్డమ్) చతుర్దశభువనాత్మకమాన అణ్డమ్ యాతొన్ఱు. జాత్యేకవచనమ్. "అణ్డానాన్తు సహస్రాణామ్" (వి-పు-2-7-27) ఇత్యాదియిల్ శొల్లుకిఱపడియే అణ్డసమూహమ్ యాతొన్ఱు,

(అణ్డాన్తరగోచరఞ్చ యుత్) అణ్డాధిపతిలోకేశ్వర దిక్పాలనరపతిప్రముఖమాయ్, స్థావరజఙ్గమాత్మకమాన అణ్డాన్తర్వర్తి సమూహమ్ యాతొన్ఱు,

(దశోత్తరాణీత్యాది) మేన్మేలుమ్ ఒన్ఱుక్కొన్ఱు దశగుణితమాన పృథివివారివహ్ని అనిల ఆకాశఙ్గళుమ్, భూతాదికళుమ్, మహానుమ్, కార్యోన్ముఖమాయ్ వికృతమాన ప్రకృత్యంశమాన ఏழாవరణఙ్గళ్ యావై శిల.

(గుణాః) అతు చేతనరై బన్ధిప్పతు, గుణద్వారావాకైయాలే బన్ధకారణమాన సత్త్వాదికళ్.

---

ఈశితవ్యజాతాన్ని (పాలింపబడే పదార్థసమూహాన్ని) ఇందులో వివరిస్తున్నారు.

వ్యా: **(యదండమ్)** - చతుర్దశభువనాల రూపంలోని బ్రహ్మాండం -అని అర్థం. ఇక్కడ అండశబ్దం జాత్యేకవచనంగా ప్రయోగింపబడింది. **"అండానాం తు సహస్రాణామ్"** (ఈ ప్రకృతిలో వేలాది బ్రహ్మాండాలు ఉన్నాయి) ఇత్యాది ప్రమాణంలో చెప్పబడే బ్రహ్మాండసమూహాలు.

**(అండాతరగోచరం చ యత్)** - బ్రహ్మాండాధిపతి, లోకేశ్వరుడు, దిక్పాలులు, నరపతులు మొదలైన స్థావరజంగమరూపాలైన అండంలో ఉండే జీవసమూహం.

**(దశోత్తరాణీత్యాది)** - ఒకదానికి మించి పదిరెట్లు ఉండే పృథివి-జలం-వహ్ని-అనిలం-ఆకాశాలు, భూతాదులు, మహాన్, కార్యోన్ముఖమై, వికారాన్ని పొందిన ప్రకృత్యంశమాన సప్తావరణాలు.



(ప్రధానమ్) అవికృతప్రకృతి ప్రదేశమ్. "గుణాః ప్రధానమ్" ఎన్ఱు గుణగుణికళై ప్పిరిత్తు ప్పేశుకిఱతు- గుణఙ్గళైయే జగత్కారణమాక చ్చొల్లుకిఱ సాఙ్ఖ్యమతమ్ అవైదికమెన్నైక్కాక.

(పురుషః) బద్ధాత్మసమష్టి. అణ్డాన్తరగోచరమెన్ఱు వ్యష్టియై చ్చొల్లుకైయాలే ఇతు సమష్టివిషయమ్. కార్యకారణోభయావస్థ ప్రకృత్యాశ్రయ క్షేత్రజ్ఞర్. "క్షేత్రజ్ఞ ఆత్మా పురుషః" (అమరకోశం) ఎన్నక్కడవతిఱే.

(పరంపదమ్) కార్యకారణోభయావస్థ ప్రకృత్యాశ్రయాత్ క్షేత్రజ్ఞాత్పరంపదమ్. "హిరణ్మయః పరే లోకే" (ముణ్డక-2-2-10) ఇత్యారభ్య "జోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదో విదుః", "పరమే వ్యోమన్" (తై-బ్రా-2-

---

**(గుణాః)** - చేతనులను బంధించడం- గుణాలద్వారా కనుక, బంధానికి కారణమైన సత్త్వాదిగుణాలు,

**(ప్రధానమ్)** - వికారాన్ని పొందని ప్రకృతిప్రదేశం- అని భావం. **"గుణాః ప్రధానమ్"** అని సత్త్వాది గుణాలను, వాటిని కల ప్రకృతిని పల్కడం ఎందుకంటే - గుణాలే జగత్కారణమని పలికే సాంఖ్యమతం అవైదికమని పల్కడం కోసం.

**(పురుషః)** బద్ధాత్మల సమూహం. **"అండాంతరమ్"** అనే చోట వ్యష్టిసృష్టి తెలుపబడింది కనుక, ఇది సమష్టి సృష్టి విషయం. కార్యావస్థ, కారణావస్థలనే రెండు అవస్థలలోని ప్రకృతిని ఆశ్రయంగా కల్గిన జీవులు. **"క్షేత్రజ్ఞ ఆత్మా పురుషః"** అని అమరకోశంలో పురుషశబ్దం క్షేత్రజ్ఞవాచకంగా చెప్పబడింది కదా!

**(పరంపదమ్)** - కార్యావస్థ, కారణావస్థ, ఉభయావస్థలను కల ప్రకృతిని ఆశ్రయంగా కల క్షేత్రజ్ఞుని కంటే గొప్పదైన స్థానం (పరమపదమ్). **"హిరణ్మయః**

8-9-6), "సోశ్నుతే" (తై-ఆ-1), "త్రిపాదస్యామృతం దివి" (పురుషసూక్తమ్), "యత్ర పూర్వే సాధ్యా స్సన్తి దేవాః" (పురుషసూక్తమ్), "అత్యర్కానలదీప్తం తత్స్థానం విష్ణోర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః , తత్ర గత్వా పునర్నేమం లోకమాయాన్తి భారత!" (భార-ఆర-163)) ఇత్యుక్తాత్రిపాద్విభూతిః.

(పరాత్పరమ్) బ్రహ్మాదికళిల్ పరర్ ముక్తర్. అవర్కళిల్ పరర్ నిత్యసిద్ధర్.

---

పరే లోకే" (బంగారు వలె మెఱిసే పరమపదం) అని ఆరంభించి, "జ్యోతిషాం జ్యోతిః తద్వదాత్మవిదో విదుః" (జ్యోతిస్సులలో గొప్ప జ్యోతిస్సుగా ఉండే పరమాత్మను ఆత్మతత్త్వజ్ఞులు తెలిసికొంటున్నారు), "పరమే వ్యోమన్" (ఎవడు ఈ జగత్తుకు అధిపతియై పరమపదంలో వేంచేసిఉన్నాడో) , "సోశ్నుతే" (ముక్తుడు అన్ని కళ్యాణగుణాలను పరమాత్మతోపాటు అనుభవిస్తున్నాడు), "త్రిపాదస్యామృతం దివి" (పరమపదంలో పరమాత్మ విభూతిలోని నిత్యమైన మూడుభాగాలు ఉన్నాయి), "యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః" (ఎక్కడ సాధ్యులనబడే నిత్యులు ఉన్నారో), "అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః, తత్ర గత్వా పునర్నేమం లోకమాయాంతి భారత" (ఓ భారతవంశంలో జన్మించినవాడా! మహాత్ముడైన విష్ణువుయొక్క ఆ గొప్ప స్థానం సూర్యునికంటే, అగ్నికంటే మించిన తేజస్సును కల్గినది. రాజా! అది తమ కాంతితో దేవదానవులకు కూడా కళ్ళతో దర్శించడాని సాధ్యం కానిది. అక్కడకు వెళ్ళిన తరువాత తిరిగి ఈ లోకానికి రారు) అని ఈ విధమైన ప్రమాణాలలో తెలుపబడిన త్రిపాద్విభూతి (పరమపదం).

(పరాత్పరమ్) - బ్రహ్మాదులకంటే గొప్పవారు ముక్తులు. వారికంటే గొప్పవారు నిత్యసిద్ధులు.



(బ్రహ్మ చ) శుద్ధసత్త్వమయమాయ్. జ్యోతిర్మయమాయ్, సౌన్దర్యసౌకుమార్యాది కల్యాణగుణోపేతమాయ్, బృహత్త్వబృంహణత్వ-గుణయోగత్తాలే బ్రహ్మశబ్దవాచ్యమాన దివ్యమఙ్గళవిగ్రహమ్. "స పర స్సర్వశక్తీనాం బ్రహ్మణ స్సమనన్తరమ్" (వి-పు-1-22-62), "మూర్తం బ్రహ్మ" (వి-పు-1-22-63), "శాన్తానన్త మహావిభూతిపరమం యద్బ్రహ్మరూపం హరే ర్మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్" (చతుశ్లోకీ) ఇత్యాది.

(తే విభూతయః) విభూతిశరీరశబ్దఙ్గళ్ పర్యాయమాకైయాలే దేవర్క్కు శరీరతయా శేషఙ్గళ్. "విభూతయో హరేరేతా జగత స్సృష్టిహేతవః" (వి-పు-

---

(బ్రహ్మ చ) - శుద్ధసత్త్వమయమై, జ్యోతిర్మయమై, సౌందర్య సౌకుమార్యాది కల్యాణగుణాలను కల్గినదై, తాను పెద్దదై ఉండడం, తన సంబంధం కల్గినవానిని పెద్దదిగా చేయడమనే బృహత్వ-బృంహణత్వాలు మొదలైన గుణాల సంబంధంతో బ్రహ్మశబ్దంతో నిర్దేశింపదగిన దివ్యమంగళవిగ్రహం. "స పరః సర్వశక్తీనాం బ్రహ్మణః సమనంతరమ్" (భగవంతుడు అన్ని శక్తుల్కంటే గొప్పవాడు. బ్రహ్మ శబ్దంచేత చెప్పబడే భగవానుని తిరువేని ఆ విష్ణువునకు అంతరంగమైనది), "శాంతానంతమహావిభూతిపరమం యద్బ్రహ్మరూపం హరేః మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్" (దోషం లేనిది, అంతులేనిది, గొప్పవి అయిన ఉభయవిభూతులను కలిగినది, ఉన్నతమైనది, బ్రహ్మశబ్దంచేత చెప్పబడే ఏ హరిస్వరూపం ఉన్నదో, దానికంటే అతనికి మిక్కిలి ఇష్టం అయినది, అద్భుతమైనది అతని రూపం ) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

(తే విభూతయః) - విభూతి - శరీరశబ్దాలు పర్యాయాలు కనుక నీకు శరీరమైనందున శేషాలు. "విభూతయో హరే రేతా జగత స్సృష్టిహేతవః"

1-22-31), "యాని మూర్తాన్య మూర్తాని యాన్యత్రాన్యత్ర వా క్వచిత్, సన్తి వై వస్తుజాతాని తాని సర్వాణి తద్వపుః" (వి-పు-1-22-86), "తత్సర్వం వై హరేస్తనుః" (వి-పు-1-22-38) ఇత్యాదిభిః విభూతిశరీరశబ్దయోః పర్యాయత్వం శాస్త్రేషు ప్రసిద్ధమ్.

18శ్లో॥ వశీ వదాన్యో గుణవానృజు శ్శుచి
ర్మృదుర్దయాళు ర్మధుర స్థిర స్సమః ।
కృతీ కృతజ్ఞ స్త్వమపి స్వభావత
స్సమస్తకల్యాణగుణామృతోదధిః ॥

అవ: (వశీత్యాది) కీఴ్ శరణ్యనుడైయ ఉత్కర్షమ్శొల్లి, ఇతిల్ ఉభయవిభూతినాథనై నమ్మాల్ కిట్టలావో-ఎన్ఱు కూశాతపడి,

---

(ప్రజాపతులు, కాలం, ఆవిధంగానే అన్నిజంతువులు అనే హరియొక్క ఈ విభూతులు జగత్తుసృష్టికి హేతువులు), "యాని మూర్తాన్య మూర్తాని యాన్యత్రాన్యత్ర వా క్వచిత్, సంతి వై వస్తుజాతాని తాని సర్వాణి తద్వపుః" (రూపాలను కల్గినవి, రూపాలులేనివి అయిన ఏ వస్తువులు ఇక్కడ కాని, వేఱొక చోటకాని ఉన్నాయో, అవి అన్నీ ఆ పరమాత్మ శరీరాలే), "తత్సర్వం వై హరే స్తనుః" (సృష్టింపబడేది అంతా అంతా హరికి శరీరమే) ఇత్యాది ప్రమాణాలవల్ల విభూతిశరీరశబ్దాల పర్యాయత్వం శాస్త్రాలలో ప్రసిద్ధం.

18శ్లో॥ అవ: (వశీత్యాది) - గడచిన శ్లోకంలో శరణ్యుడైన భగవంతుని గొప్పతనాన్ని గూర్చి పలికారు. ఇందులో ఉభయవిభూతినాథుని వద్దకు మనం సమీపించగలమా? అని సందేహించనక్కరలేనట్లుగా, ఆశ్రితులు అవగాహించే



ఆశ్రితర్క్కిఴియుమ్ తుఱైయాన కల్యాణగుణఙ్గళిలే పన్నిరణ్డుగుణఙ్గళై యరుళిచ్చెయ్కిఱార్. అథవా, కీఴ్ సర్వేశ్వరత్వమ్ శొల్లిఱ్ఱాయ్, ఇని చ్చొల్లప్రాప్తమాన సమస్తకల్యాణగుణాత్మకత్తైయై అరుళిచ్చెయ్కిఱా రెన్నుమామ్.

(వశీ) కీఴ్ చ్చొన్న ఈశితవ్యత్తైయై త్తన్ వశత్తిలే నడత్తివర్తిక్కుమెన్గై. ఇత్తాలుమ్ స్వతన్త్రన్పక్కలిలే గుణమ్ కిడన్దాల్ అతు పెరువిలైయనా మెన్నుమిడమ్ శొల్లుకిఱతు. "సర్వస్య వశీ సర్వస్యేశానః" (బృహ-6-4-22), "జగద్వశే వర్తతే ఇదమ్" (భార-ఆను). అథవా తన్నుడైయ తిరువడికళిల్ ఆనుకూల్యముడైయార్ వశత్తిలే తాఴనిఱ్కు మెన్నుమామ్. "ఇమౌ స్మ మునిశార్దూల! కిఙ్కరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవావ

---

రేవు (ఘట్టం) వంటి ఆస్వామి యొక్క కల్యాణగుణాలలో పన్నెండు గుణాలను ప్రస్తావిస్తున్నారు. లేక, ఇంతకుముదు సర్వేశ్వరత్వం చెప్పబడింది. ఇక, చెప్పదగిన (వలసిన) కల్యాణగుణాత్మకత్వాన్ని గూర్చి పల్కుతున్నారు.

వ్యా : (వశీ) పూర్వం పల్కిన ఈశితవ్యతను (శాసింపబడడమనేదానిని) తన స్వాధీనంలో నడపి నిర్వహిస్తాడని భావం. ఇందువల్ల కూడా స్వతంత్రుడైన వానివద్ద గుణం ఉంటే, అది గొప్ప విలువను కల్గినది అవుతుందనే విషయం తెలుపబడింది. "సర్వస్య వశీ సర్వస్యేశానః" (అన్నిటిని తన వశంలో కలవాడు, అన్నిటిని శాసించేవాడు), "జగద్వశే వర్తతేదమ్" (ఈ జగత్తు భగవంతుని వశంలో ఉన్నది) ఇత్యాది ప్రమాణాలు దీనికి అనుగుణంగా స్మరణీయాలు. లేక, తన శ్రీచరణాలపట్ల అనుకూలభావాన్ని కలవారి వశంలో తాను విధేయుడై ఉంటాడని కూడా అర్థం. దీనికి అనుగుణంగా "ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవామ కిమ్?" (ఓ మునిశార్దూలా! (గొప్ప మునీ!) మేమిద్దరం నీకు కింకరులమై ఉన్నాము. నీవు మమ్ములను యథేష్టంగా

కిమ్" (రా-బా-31-4), "ఆజ్ఞాపయ మహాబాహో! బ్రూహి యత్తే వివక్షితమ్" (భారతం), "స్వయమేవ హరిర్వవ్రే విప్రపాదావనేజనమ్" (భారతం), "అనన్యాధీనత్వమిత్యాది" (వరదస్త). ఆశ్రితపరతన్త్ర నాయిరుక్కు మిరుప్పు, పిఱర్క్కావే వెన్నాల్ నివారకరిల్లామైయాలే స్వాతన్త్ర్య కార్యమాయిరుక్కుమ్.

(వదాన్యః) ఇప్పడి ఆశ్రితపరతన్త్రనాయ్ చ్చెయ్యుమ్ కార్యమెన్? ఎన్నిల్; తన్నైయుమ్, తన్నుడైమైయుమ్ అవర్కళుక్కు క్కొడుక్కుమిడత్తిల్ ఇరన్దు కొడుక్కు మౌదార్యత్తై చ్చొల్లుకిఱతు. "ప్రియవాగ్దానశీలశ్చ వదాన్యః పరికీర్తితః", "య ఆత్మదా బలదా" (యజు. కాఠకమ్ 7-5-36), "స సర్వానర్థినో దృష్ట్వా సమేత్య ప్రతినన్ద్య చ" (రా-అ-16-27), "ఉదారా స్సర్వ ఏవైతే" (గీ-

---

ఆజ్ఞాపించు. నీ ఆజ్ఞను దేనిని మేము నిర్వర్తించాలి?), **"ఆజ్ఞాపయ మహాబాహో! బ్రూహి యత్తే వివక్షితమ్"** (ఓ మహాబాహూ! ఆజ్ఞాపించు. నీకు ఏమి అభిమతమో, దానిని పల్కు), **"స్వయమేవ హరిర్వవ్రే విప్రపాదావనేజనమ్"** (స్వయంగానే శ్రీకృష్ణుడు బ్రాహ్మణుల చరణాలను కడగడాన్ని వరించాడు), **"అనన్యాధీనత్వమ్"** (వరదా! వేదాలు నీకు స్వాతంత్ర్యం సహజమని పల్కుతున్నాయి. కానీ, భక్తులకు వశమైఉండడం నీకు సహజమని మేము భావిస్తున్నాము.) ఇత్యాది ప్రమాణాలు దీనికి అనుగుణంగా స్మరణీయాలు. భగనానుడు ఆశ్రితపరతంత్రుడై ఉండే స్థితి ఇతరుల కోసమే అయితే, దానిని నివారించేవారు లేనందున, అది స్వాతంత్ర్యకార్యమై ఉంటుంది.

**(వదాన్యః)** - ఈవిధంగా ఆశ్రితపరతంత్రుడై చేసే పని ఏమి? అంటే, తనను, తన సొత్తును వారికి ఇచ్చేటపుడు, తానే స్వయంగా అడిగి వారికి ఇచ్చే ఔదార్యాన్ని ఈ పదం తెల్పుతున్నది. **"ప్రియవాక్ దానశీలశ్చ వదాన్యః పరికీర్తితః"** (ప్రియమైన మాటను పలికేవాడు, దానగుణం కలవాడు వదాన్యుడనబడుతున్నాడు), **"య ఆత్మదా బలదా"** (ఏ భగవంతుడు ఆత్మను ఇస్తాడో, ఆ భగవంతుడే అతనిని అనుభవించడానికి కావలసిన బలాన్ని



7-19), "న తే రూపమ్" (జిత-1).

(గుణవాన్) తన్నైయుమ్, తన్నుడైమైయుమ్ అవర్కళుక్కు క్కొడుక్కుమిడత్తిల్ అవర్కళ్, తన్మేన్మైయుమ్, తఙ్గళ్ శిఱుమైయుమ్ పార్త్తు ప్పిఱ్కాలియామే అవర్కళ్ అళవాక త్తన్నై యమైక్కుమ్ శీలమ్. "మహతో మన్దైః" గుణప్రకరణమాకైయాలే గుణవానెన్గిఱతు - గుణసామాన్యత్తై చ్చొల్లుకిఱతన్దు, గుణవిశేషత్తై చ్చొల్లుకిఱతు. "గుణ్యత ఇతి - గుణః" ఎన్గిఱపడియే అనుసన్ధాతావుక్కు ఎప్పోతుమొక్క విడవొణ్ణామైయాలే శీలత్తై గుణశబ్దత్తాలే శొల్లుకిఱతు. సొలశబ్దమ్ వృక్షసామాన్యవాచియాయిరుక్క,

---

ఇస్తున్నాడు), **"స సర్వా నర్థినో దృష్ట్వా సమేత్య ప్రతినంద్య చ"** (ఆ శ్రీరాముడు యాచకులనందఱిని చూచి వారి దగ్గరకు వచ్చి, వారిని పలకరించి), **"ఉదారా స్సర్వ ఏవైతే"** (నాదగ్గరకు వచ్చి నన్ను అడిగే యాచకులు, నాకు వదాన్యతను కల్గిస్తున్నందున, వారు ఉదారులు), **"న తే రూపం నాచాకారో నాయుధాని న చాస్పదమ్"** (నీ స్వరూపంకాని, ఆకారంకాని, ఆయుధాలుగాని, నివాసంకాని నీకోసం కాదు, భక్తులకోసమే) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(గుణవాన్)** - తనను, తన సొత్తును తన భక్తులకు ఇచ్చేటపుడు, వారు తన పరత్వాన్ని, తమ నైచ్యాన్ని చూచి వెనుకంజ వేయకుండా ఉండేటట్లు వారి పరిధిలో తనను మలచుకొనే శీలం (స్వభావం). **"మహతో మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేష స్వభావత్వమ్"** (గొప్పవారు తక్కువవారితో ఏ తేడా లేకుండా కలిసే స్వభావాన్ని కల్గి ఉండడం-శీలం). ఇది గుణాలను ప్రస్తావించే ప్రకరణం కనుక, **"గుణవాన్"** అనే ఈ పదం గుణసామాన్యాన్ని తెలుపదు. శీలమనే గుణవిశేషాన్ని తెల్పుతున్నది. **"గుణ్యత ఇతి గుణః"** (మాటిమాటికి అనుసందింపబడుతున్నది కనుక గుణం) అనే రీతిలో అనుసంధించేవానికి ఏ సమయంలోను విడువడానికి సాధ్యం కానందున శీలం ఇక్కడ గుణశబ్దంతో నిర్దేశింపబడింది. సాలశబ్దం వృక్షసామాన్యవాచకమైనా, సందర్భాన్ని బట్టి

వృక్షవిశేషత్తై క్కాట్టుమాపోలే. "అజాయమానః" (తై-ఆర-3-17). గుణశబ్దత్తై "కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్?" (రాబా-1) ఎన్ఱు తొడఙ్గి, "ఇక్ష్వాకువంశప్రభవో బభూవ గుణవత్తరః" (రా.యు. 1-2) ఎన్నుమళవాక శీలపరమాక చ్చొల్లిఱ్ఱే. "స హి దేవైరుదీర్ణస్య" (రా-అ-1-7) ఎన్గిఱపడియే శీలకార్య మవతారమెన్ఱై.

**(ఋజుః)** ఇప్పడి తన్నై యమైత్తుక్కొణ్డు పొరున్దుమ్బోతు అవర్కళ్ నానారుచికళానాల్, మేట్టిలే విరకాలే నీరేఱ్ఱుమాపోలే అవర్కళ్ శెవ్వైక్కేడే శెవ్వైయామ్బడి శెవ్వియనాకై. ఆర్జవమావతు- ఆశ్రితవిషయత్తిల్

---

వృక్షవిశేషాన్ని తెల్పుతున్నట్లే ఇదికూడా. **"అజాయమానః బహుధా విజాయతే"** (భగవానుడు కర్మమూలకంగా పుట్టనివాడైనా, దయామూలకంగా పలుమార్లు పలుజాతులలో జన్మిస్తున్నాడు) మొదలైన ప్రమాణాలు ఈ శీలగుణానికి ప్రమాణాలు. అవతారం శీలగుణమా? అంటే, గుణశబ్దాన్ని **"కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్?"**(ఇపుడు ఈ లోకంలో శీలగుణాన్ని కలవాడెవడు?) అని ఆరంభించి, **"ఇక్ష్వాకువంశ ప్రభవో బభూవ గుణవత్తరః"** (ఇక్ష్వాకువంశంలో జన్మించిన శ్రీరాముడు గుణాలు కల వారిలో గొప్పవాడయ్యాడు) అనే పర్యంతం శీలగుణపరంగా చెప్పబడింది కదా! **"సహి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః"** (ఆ సనాతనుడైన విష్ణువు, దుష్టుడైన రావణుని వధించాలని కోరే దేవతలచే ప్రార్థింపబడినవాడై, మానవలోకంలో అవతరించాడు) అనే రీతిలో అవతారం అనేది శీలగుణకార్యం.

**(ఋజుః)** - ఈవిధంగా తనను మలచుకొని, ఆయా అవతారాలకు పొసగేటట్లుగా ఉండేటపుడు, భక్తులు పలు అభిరుచులను కలవారైతే, మిట్టగా ఉండే ప్రదేశాలకు ఉపాయంతో నీటిని తోడి ప్రవహింపజేసేటట్లే, వారి వక్రస్వభావమే ఋజుస్వభావం అయ్యేటట్లు వారి వారి స్వభావాలకు,



మనోవాక్కాయఙ్గళాలే ఏకరూపనాకై. "యజ్జాతీయో యాదృశో యత్స్వభావ స్తజ్జాతీయ స్తాదృశ స్తత్స్వభావః" (సుందరబాహు 30). "తద్వై తథాస్తు కతమోయ మహో స్వభావో యావా న్యథావిధగుణో భజతే భవన్తమ్, తావాం స్తథావిధ గుణ స్తదధీనవృత్తి స్సంశ్లిష్యసి త్వమిహ తేన సమానధర్మా" (వై-స్త-67) ఇత్యాదయః.

**(శుచిః)** ఇప్పడి ఉపకరిక్కుమిడత్తిల్ ఒరు ప్రయోజనత్తై క్కణిశియాతే వెఱుమ్బుఱత్తిలే ఉపకరిక్కుమ్ భావశుద్ధియై చ్చొల్లుకిఱతు. "యోఽర్థే శుచి స్సహి శుచిః" (మనుస్మృతి 5-106). నిత్యసంసారియై స్వసమ్బన్ధమే హేతువాక

---

అభిరుచులకు అనుగుణంగా తనను మలచుకొనే ఋజుత్వాన్ని కలవాడు. ఆర్జవమంటే - ఆశ్రితులవిషయంలో మనస్సు, వాక్కు, కాయాలనే త్రికరణాలతో ఏకరూపుడై ఉండడం. **"యజ్జాతీయో యాదృశో యత్స్వభావః తజ్జాతీయ స్తాదృశ స్తత్స్వభావః"** (నీ భక్తుడు ఏ జాతికి చెందినవాడో, ఎటువంటివాడో, ఏ స్వభావాన్ని కలవాడో, నీవు కూడా ఆజాతికి చెందినవాడవై, అటువంటివాడవై, ఆ స్వభావాన్ని కలవాడవు అవుతావు) అని, **"తద్వై తథాస్తు కతమోయమహో స్వభావో యావాన్యథా విధగుణో భజతే భవంతమ్, తావాంస్తథావిధగుణ స్తదధీనవృత్తిః సంశిష్యసి త్వమిహ తేన సమానధర్మా"** (ముందు చెప్పినది ఆవిధంగానే కాని. ఈ స్వభావం ఎంత ఆశ్చర్యకరమైనది? నిన్ను ఎవడు ఏ విధమైన స్వరూపంతో, గుణంతోకూడినవాడై భజిస్తున్నాడో అతనితో నీవు ఆ విధమైన స్వరూపాన్ని, గుణాన్ని కలవాడవై చేరుతున్నావు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(శుచిః)**- ఈవిధంగా ఉపకారం చేసేటపుడు ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, రిక్తంగానే ఉపకరించే భావశుద్ధిని ఈ పదం తెల్పుతున్నది. **"యోఽర్థేశుచిః స హి శుచిః"** (నీటితో, మట్టితో కడుగుకొంటే పవిత్రుడు కాడు. ఎవడు ధనవిషయంలో శుచిత్వాన్ని కలవాడో అతడే శుచి) ఇత్యాది

నిత్యసూరికళోడే ఒరు కోవైయాక్కవల్ల పావనత్వవత్తై చ్చొల్లుకిఱతెన్నుమామ్. "పావన స్సర్వలోకానాం త్వమేవ రఘునన్దన!" (రా-ఉతర-82-9) కర్మకాణ్డే- "భక్తి రష్టవిధాహ్యేషా యస్మిన్మ్లేచ్ఛేపి వర్తతే, స విప్రేన్ద్రో ముని శ్శ్రీమా న్స యతి స్స చ పణ్డితః, మయా పూజ్య స్సదా చా సౌ మద్భక్త శ్శ్వపచోఽపి యః, తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథా హ్యహమ్" (గరుడ పు. 219-6-9).

**(మృదుః)** సంశ్లేషత్తిల్ ఇప్పడి యిరుక్కిఱవన్ ఇవర్కళ్

---

ప్రమాణాలు అనుసంధేయాలు. నిత్యసంసారిని, అతడు తనతో సంబంధం కల్గిఉండడమే కారణంగా చేసికొని, అతనిని నిత్యసూరుల గోష్ఠిలో ఒకడు అయేటట్లు చేయగల పావనత్వం దీనివల్ల తెలుపబడుతున్నదని కూడా చెప్పవచ్చు. **"పావన స్సర్వలోకానాం త్వమేవ రఘునందన!"** (రఘునందనా! అన్ని లోకాలలోను నీవే పావనుడవు) అని, కర్మకాండలోని **"భక్తిరష్ట విధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే, స విప్రేంద్రో మునిః శ్రీమాన్ స యతి స్స చ పండితః, మయా పూజ్య స్సదా చాసౌ మద్భక్తః శ్వపచోఽపి యః, తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథా హ్యయమ్"** (ఎనిమిది విధాలుగా ఉండే ఈ భక్తి ఎవరిలో ఉన్నదో, అతడు మ్లేచ్ఛుడైనా, అతడు గొప్ప బ్రాహ్మణుడు, ముని, సిరి కలవాడు, అతడు యతి, పండితుడు. అతడు సదా నాకు పూజ్యుడు. నా భక్తుడు కుక్కమాంసాన్ని తినేవాడైనా, అతని నుండి దేనినైనా గ్రహించవచ్చు. అతనికి ఇవ్వవచ్చు. అతడు నావలెనే పూజింపదగినవాడు) ఇత్యాది ప్రమాణాలలో భగవత్సంబంధం పవిత్రతను కల్గిస్తుందని తెలుపబడింది.

**(మృదుః)** భక్తుల సంశ్లేషంలో ఈవిధంగా ఉండేవాడు, వీరి విశ్లేషంలో సహించలేడు - అని ఈపదం తెల్పుతున్నది. ఇది ఆత్మగుణాలను తెలిపే ప్రకరణం కనుక ఈ పదం మానసికమైన మృదుత్వాన్ని కల్గి ఉండడం



విశ్లేషత్తిలాఱ్ఱమాట్టా నెన్గిఱతు. ఆత్మగుణప్రకరణమాకైయాలే మానసదౌర్బల్యత్తై చ్చొల్లుకిఱతు. "నైవ దంశా న్న మశకాన్" (రా-సు-36-42), "న జీవేయం క్షణమపి" (రా-సు-66-10), "అవగాహ్యేర్ణవం స్వప్స్యే" (రా-యు-5-9).

**(దయాళుః)** ఆశ్రితవిశ్లేషదుఃఖత్తిలసహనాయిరుక్కై, దయై-పరదుఃఖా సహిష్ణుత్వమ్. "స ఏకాకీ న రమేత" (మహోపనిషత్), "వ్యసనేషు మనుష్యాణామ్" (రా-అ-2-41) ఎన్గిఱ ఇతు సర్వసాధారణమానాల్ ఆశ్రితవిషయత్తిల్ కృపై అవాఙ్మనసగోచరమితే. "ప్రియో హి జ్ఞానినోఽ

---

తెల్పుతున్నది. దివ్యమంగళ విగ్రహపరమైన మృదుత్వాన్ని తెలుపదు. **"నైవ దంశాన్ న మశకాన్ న కీటాన్ న సరీసృపాన్, రాఘవోఽపనయేద్గాత్రాత్ తద్గతేనాంతరాత్మనా"** (సీతను విశ్లేషించిన శ్రీరాముడు, తన మనస్సు ఆమెపైననే లగ్నమై ఉన్నందున, తన శరీరంపై వాలిన ఈగలను, దోమలను, కీటకాలను, పాములువంటి పాకే ప్రాణులను తొలగించుకోవడం లేదు), **"న జీవేయం క్షణమపి వినా తామసితేక్షణామ్"** (నేను, నల్లని కన్నులను కల ఆ సీత లేకుండా క్షణమైనా జీవించలేను) **"అవగాహ్యేర్ణవం స్వప్స్యే"** (లక్ష్మణా, నిన్నువిడచి సముద్రంలో ప్రవేశించి నిద్రిస్తాను) ఇత్యాది ప్రమాణాలు తెల్పుతున్నాయి.

**(దయాళుః)** - ఆశ్రితుల విశ్లేషదుఃఖాన్ని సహించలేకుండా ఉండడాన్ని ఇది తెల్పుతుంది. దయ అంటే - పరదుఃఖాన్ని సహించలేని స్వభావం. **"స ఏకాకీ న రమేత"** (వైకుంఠంలో ఉన్నా సర్వేశ్వరుడు సంసారిజీవులకు దూరమై ఏకాకివలె సంతోషాన్ని పొందడు) అని, **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** (మానవుల కష్టాలలో శ్రీరాముడు వారికంటే ఎక్కువగా దుఃఖాన్ని పొందుతాడు) అనే దయ సర్వసాధారణమైనపుడు, భక్తుల విషయంలో ఉండేదయ మాటకు అందనిది కదా ! "ప్రియో హి జ్ఞానినోఽ

**త్యర్థమ్" (గీ-7-17)** ఇతి. **"స్త్రీ ప్రణష్టేతి కారుణ్యాత్" (రా సు), "స తం నిపతితమ్" (రా-సు-38-34)** ఇత్యాది.

**(మధురః)** నిర్దయనానాలుమ్ విడవొణ్ణాత సారస్యత్తై చ్చొల్లుకిఱతు. నానావిధరుచికళాన జన్తుక్కళుక్కు అవ్వవర్కళ్ నిష్ట నిష్ట నిలైకళిలే ఇనియనాయ్నిఱ్కై. "రసో వై సః" (తై-ఆ), "ఏషహ్యేవానన్దయాతి" (తై-ఆ), "రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి" (తై-ఆ) ఇత్యాదయః.

**(స్థిరః)** ఇప్పడి సర్వరసికనాయిరుక్కిఱ తాన్ తన్బక్కలిలే

---

**త్యర్థమ్ అహం, స చ మమ ప్రియః"** (నేను జ్ఞానికి చాలా ఇష్టమైనవాడను, నాకుకూడా అతడు చాలా ఇష్టమైనవాడు) ఇత్యాదులు స్మరణీయాలు. **"స్త్రీ ప్రణష్టేతి కారుణ్యాత్"** (ఒక స్త్రీ తప్పిపోయిందే! అనే దయవల్ల శ్రీరాముడు సీత విషయంలో దుఃఖిస్తున్నాడు), **"స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"** (శరణు వేడదగినవారిలో గొప్పవాడైన ఆ శ్రీరాముడు, తన ముందు కిందపడినవాడు, శరణాగతుడైన కాకాసురుడు, వధార్హుడైనా, అతనిని కృపతో రక్షించాడు) ఇత్యాదులు కూడా స్మరణీయాలు.

**(మధురః)** ఒకవేళ దయ లేనివాడైనా, విడువడానికి సాధ్యం కాని మాధుర్యాన్ని కల్గి ఉండడం దీనిద్వారా తెలుపబడింది. పలువిధాలైన అభిరుచులను కల ప్రాణులను, వారు వారు ఉండే స్థితులకు తగినట్లు మధురంగా ఉండేవాడని అర్థం. ''రసో వై సః'' (ఆపరమాత్మ రసస్వరూపుడుకదా), **"ఏష హ్యేవ ఆనందయాతి"** (ఈ పరమాత్మయే కదా జీవునకు ఆనందాన్ని పొందిస్తున్నాడు), **"రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"** (రసస్వరూపుడైన పరమాత్మను ఈ జీవుడు పొంది ఆనందాన్ని పొందినవాడవుతున్నాడు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(స్థిరః) -** ఈవిధంగా సర్వరసికుడై ఉండే తన విషయంలో కొద్దిపాటి



అల్పానుకూల్యముణ్ణినార్క్కు త్తనక్కు అన్తరఙ్గరానార్ విరోధికళానాలుమ్ అవర్కళాల్ అప్రకమ్ప్యనాయిరుక్కై. **"న త్యజేయం కథఞ్చన" (రా-యు-18-3), "అభయం సర్వభూతేభ్యః" (రా-యు-18-33), "ఎన్నడియారతు శెయ్యార్" (పెరి-తె-4-8-2).**

**(స్థిరః)** ఆశ్రితరుడైయ ప్రాతికూల్యఙ్గళాలుమ్ అవికృతనాయిరుక్కుమెన్నమామ్.

**(సమః)** ఆశ్రయిక్కుమిడత్తిల్ జన్మవృత్తాదికళాల్ కుఱైన్దిరున్దార్కళే యాకిలుమ్ ఆశ్రయణీయత్వే సమనాకై. **"సమోఽహం సర్వభూతేషు" (గీ-9-29),** ''ఈడుమెడుప్పుమిలీశన్'' **(తి-వాయ్-1-8-3),**

---

ఆనుకూల్యం కలవారికి తనకు అంతరంగసేవకులైనవారు విరోధులైనా, వారిచే ఏవిధంగాను తన నిశ్చయంలో మార్పు పొందకుండా, చలించకుండా ఉండే స్వభావం దీనివల్ల తెలుపబడింది. శ్రీరాముడు, తనను శరణువేడిన విభీషణుని విషయంలో సుగ్రీవ, జాంబవదాదులు ప్రతికూలంగా పల్కినా, **"న త్యజేయం కథంచన"** (ఏరీతిలోను విభీషణుని విడువను), **"అభయం సర్వభూతేభ్యః"** (అభయాన్ని అన్ని ప్రాణులకు ఇస్తాను. ఇది నా వ్రతం), **"ఎన్నడియార్ అదు శెయ్యార్ శెయ్దారేల్ నన్టు శెయ్దార్"** (నా దాసులు తప్పు చేయరు. చేస్తే మంచినే చేస్తారు) ఇత్యాది సూక్తులు భగవంతుని ఆశ్రితరక్షణలోని స్థైర్యాన్ని తెల్పుతున్నాయి.

**(స్థిరః)-** భక్తుల ప్రతికూలకార్యాలవల్ల కూడా ఏవిధమైన వికారాన్ని పొందనివాడై ఉంటాడని కూడా అర్థం.

**(సమః)-** ఆశ్రయించే భక్తులు జన్మం, వృత్తం మొదలైనవానిలో తక్కువవారైనా, వారికి తాను ఆశ్రయణీయుడు కావడంతో సమంగా ఉండడం. అంటే, వారికి దుర్లభుడు కాకుండా, సులభుడై ఉండడం. గొప్పవారికి ఏవిధంగా

**"కొళ్కైకొళామైయిలాతాన్" (తి-వాయ్-1-8-5).**

**(కృతీ)** కుశలః. ఇప్పడి ఆశ్రయిత్తాల్ అవర్కళుడైయ కర్తవ్యాంశమెల్లామ్ తనక్కే అనుష్ఠేయమెన్ఱిరుక్కుమ్. "ఆదికర్మణి క్త". అథవా ఆశ్రితర్కళ్ తన్నై లభిత్తాల్ ఇఴన్దవర్కళ్ పెఱ్ఱారాయిరుక్కైయన్ఱిక్కే తన్పేఱాయిరుక్కై. **"అభిషిచ్య చ" (రా-బా-1), "తవ చార్థః ప్రకల్పతే" (రా-**

---

సులభుడో, ఆవిధంగానే వీరికి కూడా సులభుడని తాత్పర్యం. **"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః"** (నేను ప్రాణులందఱి విషయంలో సమానుడను. నాకు ద్వేషించదగినవాడు కాని, ఇష్టమైనవాడు కాని ఎవడూ లేడు), **"ఈడు మెడుప్పుమిలీశన్"** (సాటి మేటి లేని ఈశ్వరుడు), **"కొళ్ కొళామైయిలాదాన్"** (గ్రహించడం, గ్రహించకపోవడం అనేది లేనివాడు) ఇత్యాదులు ప్రమాణాలు.

**(కృతీ) -** కుశలుడని అర్థం. ఈ విధంగా భక్తులు తనకు ఆశ్రయిస్తే, వారి కర్తవ్యాలను అన్నిటినీ తన కర్తవ్యాలుగా భావించేవాడై ఉంటాడు. కృతాలను- ఆశ్రితుల కోసం చేసిన కృత్యాలను కలవాడు - కనుక కృతి. ఇక్కడ కృతశబ్దంలోని క్తప్రత్యయం. **"ఆదికర్మణి క్తః"** అనే సూత్రం వల్ల వచ్చింది. లేక, ఆశ్రితులు తనను పొందితే, ఇంతవరకు తనను కోల్పోయిన వీరు ఇపుడు పొందారు - అని భావించడం కాకుండా, వారిని పొందడం తన ప్రయోజనంగా భావించేవాడని భావం. **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ"** (రాక్షసశ్రేష్ఠుడైన విభీషణుని లంకకు ప్రభువుగా అభిషేకించి, రాముడు, తన మనస్సులో ఆర్తిని తీరినవాడై, మిక్కిలి సంతోషించాడు కదా!) అని విభీషణుని పొందినపుడు తనను కృతకృత్యునిగా శ్రీరాముడు తలచాడు. శ్రీరాముడు తనను సేవకునిగా గ్రహించడం వల్ల ఆ శ్రీరాముని ప్రయోజనం నెరవేరినట్లవుతుందని పల్కుతూ లక్ష్మణుడు- **"తవ చార్థః ప్రకల్పతే"** (నీ



**అ-31-22).**

**(కృతజ్ఞః)** ఇప్పడితాన్ అవర్కళుక్కు ఎల్లా వుపకారఙ్గళై పణ్ణినాలుమ్ అవర్వళ్ తన్విషయత్తిల్ అడియిల్ పణ్ణిన అల్పానుకూల్యత్తై క్కువాలాక నినైత్తిరుక్కై. అవర్కళ్ పణ్ణుమపకారము మఱియాన్. **"అవిజ్ఞాతా సహస్రాంశుః" (సహస్రనా). "న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా, కథఞ్చిదుపకారేణ కృతేనైకేన తుష్యతి, ఉచ్యమానోఽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే" (రా)** తాన్ పణ్ణిన ఉపకారమఱియాన్. **"ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి" (భార-ఉద్యో)** ఎన్ఱిరుక్కుమవన్. అవర్కళ్ తిఱత్తిల్ తాన్ శెయ్యప్పెఱాత కుఱైయై నినైత్తిరుక్కుమెన్నుమామ్; **"శిరసా యాచత స్తస్య**

---

ప్రయోజనం కూడా సిద్ధిస్తుంది) అని అన్నాడు కదా.

**(కృతజ్ఞః)-** ఈ విధంగా, ఆశ్రయించినవారికి అన్ని ఉపకారాలను చేసినా, వారు తనపట్ల పూర్వం చేసిన అల్పమైన అనుకూల భావాన్ని తాను చేసిన ఉపకారాలకంటే గొప్పగా భావించేవాడని అర్థం. వారు చేసే అపకారాలను ఎంతమాత్రం గమనించడు. **"అవిజ్ఞాతా సహస్రాంశుః"** (భక్తుల దోషాలను తెలియనివాడు, వారి ఆనుకూల్యంలో వేయిరెట్లు దృష్టిని కలవాడు) అనే నామాలు, **"న స్మంత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా, కథం చిదుపకారేణ కృతేనైకేన తుష్యతి, ఉచ్యమానోఽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే"** (భక్తులు తనకు ఆత్మవంటివారైనందున, వారు చేసిన పలు వందలాది ఉపకారాలను స్మరించడు. ఏదోవిధంగా వారు చేసిన ఒక్క ఉపకారంతో సంతోషిస్తాడు. వారు పరుషవాక్యాలను పల్కినా, బదులు పల్కడు) అనే సూక్తులు ప్రమాణాలు. తాను వారికి చేసిన ఉపకారాన్ని తెలియడు. ద్రౌపది చేసిన శరణాగతిని గూర్చి (శ్రీకృష్ణుడు) **"ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి"** (వడ్డీతో పాటు పెరిగిన ఋణం వలె ద్రౌపది **"గోవిందా!"** అని చేసిన ఆక్రందన నాహృదయం నుండి తొలగిపోవడం లేదు)

వచనం న కృతం మయా" (రా-యు-124-20).

(త్వమసి) ఇగ్గుణఙ్గళుమ్ తన్నై ప్పర్ఱి నిఱమ్ పెఱువ్వుడి స్పృహణీయమా యిరుక్కుమెన్నుతల్. ఆశ్రయత్తిల్ ఇగ్గుణఙ్గళ్ పోరాతెన్నుమ్బడియిరుక్కు మెన్నుతల్.

(స్వభావతః) ఇగ్గుణఙ్గళ్ - అవిద్యమెన్నుతల్, ఔపాధిక మెన్నుతలా కాతపడి యావద్ద్రవ్య భావియాయ్ నైసర్గికమాయిరుక్కుమెన్గిఱతు.

(సమస్తకల్యాణగుణామృతోదధిః) ఎల్లా గుణఙ్గళుమ్ కల్యాణమాయ్, నిరతిశయభోగ్యఙ్గళుమాయ్, అనుభవిక్క ఇழிన్దార్క్కు తుఱై కాణవొణ్ణామైక్కు

---

అని భావించాడు కదా. వారి విషయంలో తాను చేయలేకపోయిన కొఱతను భావిస్తూ ఉండేవాడని కూడా అర్థం. "శిరసా యాచత స్తస్య వచనం న కృతం మయా" (శిరస్సుతో ప్రణమిల్లి భరతుడు యాచించిన మాట నాచే చేయబడలేదు) అని శ్రీరాముడు అన్నాడుకదా !

(త్వమసి) ఇంతవరకు ప్రస్తావించిన ఈగుణాలు కూడా తనను ఆశ్రయించి ప్రకాశించేటట్లు స్పృహణీయుడై ఉండేవాడని అర్థం. (లేక), ఆశ్రయంలో ఇంతవరకు పల్కిన గుణాలు చాలవు - అనేటట్లు ఉండేవాడని భావం.

(స్వభావతః) - ఈ గుణాలు - ఆవిద్యం (అవిద్య- అజ్ఞానంవల్ల, తోచేవి) అనికాని, సోపాధికాలు- అని కాని పల్కడానికి అవకాశం లేని రీతిలో యావద్ద్రవ్యభావిగా (ద్రవ్యం ఉన్నంతకాలం అంటే - నిత్యంగా) ఉండేవై, స్వాభావికంగా ఉంటాయని అర్థం.

(సమస్తకల్యాణగుణామృతోదధిః) - అన్ని గుణాలు శుభకరాలై, నిరతిశయభోగ్యాలై, వానిని అనుభవించాలని ప్రయత్నించినవారికి అంతు గమనించడానికి సాధ్యం కాకుండా ఉండే రీతిలో ఒక సముద్రం అని



ఒరు కడలెన్నుమత్తై యెన్గిఱార్. "మతిక్షయాన్నివర్తన్తే న గోవిన్ద గుణక్షయాత్".

19శ్లో॥ ఉపర్యుపర్యబ్జభువోఽపి పూరుషాన్
ప్రకల్ప్య తే యే శతమిత్యనుక్రమాత్ ।
గిర స్త్వదేకైకగుణావధీప్సయా
సదా స్థితా నోద్యమతోఽతిశేరతే ॥

వ్యా : (ఉపర్యుపరి) ఇగ్గుణఙ్గళుక్కు సంఖ్యై యిల్లాతవోపాతి ఓరో గుణఙ్గళుక్కుమ్ అవధి యిల్లై యెన్గిఱార్.

(అబ్జభువః ఉపర్యుపరి- తే యే శతమిత్యనుక్రమాత్ పూరుషాన్ ప్రకల్ప్య) తిరునాభీకమలత్తిలే అవ్యవధానేన పిఱన్దు అవనోడే యోతిన చతుర్ముఖనుక్కు మేలే అవనైయుమ్ మనుష్యకోటియిలే నిఱుత్తి, తే యే శతక్రమత్తాలే మనుష్యగన్ధర్వాది బ్రహ్మాన్తమాక ఆనన్దావధిసిద్ధ్యర్థమాక

---

చెప్పదగినట్లుంటాడు. అంతే - అని పల్కుతున్నారు. "మతిక్షయా న్నివర్తంతే న గోవిందగుణక్షయాత్" (కీర్తించేవారు తమ బుద్ధి క్షయించినందువల్ల కీర్తించడం మానివేస్తున్నారు తప్ప, గోవిందుని గుణాలు క్షీణించినందువల్లకాదు) అనే సూక్తి ప్రమాణం.

19శ్లో॥ అవ : (ఉపర్యుపరి) - ఈ గుణాలకు లెక్కలేని రీతిలో, ఒక్కొక్క గుణానికి కూడా అవధి లేదు - అని పల్కుతున్నారు.

వ్యా : (అబ్జభువః ఉపర్యుపరి-తే యే శతమిత్యనుక్రమాత్ పురుషాన్ ప్రకల్ప్య) - నాభీపద్మంలో వెంటనే జన్మించి, ఆ పరమాత్మ వద్ద వేదాధ్యయనం చేసిన చతుర్ముఖునకు పిమ్మట, ఆ చతుర్ముఖ బ్రహ్మను కూడా మానవుని స్థానంలో నిలిపి, "తే యే శతమ్ మానుషా ఆనందాః" అనే క్రమంలో మనుష్య-

పురుషర్కళై సంకల్పిత్తు.

**(ఏకైకగుణావధీప్సయా సదా స్థితా గిరః)** ఆనన్దగుణ మొన్దైయుమ్ ఎల్లై కాణ్డైయిలే ఇచ్ఛైయిలే ఉద్యోగిత్తు, సర్వకాలత్తిలుమ్ స్థితైకళాన వైదికగీర్కళానవై. ఏకైక ఎన్దైయాలే ఆనన్దావహమాన యువత్వాదికళై నినైక్కిఱతు. "సదా స్థితా వేదగిరః" ఎన్ఱు నిత్యత్వాపౌరుషేయత్వఙ్గళై చ్చొల్లిఱ్ఱాకవుమామ్. వేదాక్షరరాశి యెన్నాతే "గిరః" ఎన్గిఱతు "వేదశబ్దేభ్య ఏవాదౌ" (వి-పు-1-5-63) ఎన్గిఱపడియాలే లౌకికశబ్దఙ్గళుమ్ వైదికఙ్గళాకైయాలే శొల్లుకిఱతు.

అవై అన్దగుణఙ్గళై ఎల్లై కణ్డ వళవు ఎన్నెన్నిల్;

---

గంధర్వాదులనుండి "స ఏకో బ్రహ్మణ ఆనందః" అని బ్రహ్మవరకు ఆనందావధి సిద్ధికోసం ఆయా పురుషులను సంకల్పించి - అని అర్థం.

**(ఏకైకగుణావధీప్సయా సదా స్థితా గిరః)** - ఆనందమనే ఒక గుణం యొక్క అవధిని చూడాలనే కోరికతో ప్రయత్నించి, అన్నికాలాలలో యత్నించే వేదవాక్కులు - అని భావం. **"ఏకైక"** అని అన్నందున ఆనందాన్ని కల్గించే యువత్వాది గుణాలు గ్రాహ్యాలు. "సదా స్థితా వేదగిరః" అనే ప్రయోగం వేదంయొక్క నిత్యత్వాన్ని, అపౌరుషేత్వాన్ని తెల్పుతున్నదని చెప్పవచ్చు. **"వేదాక్షరరాశి"** అని అనకుండా, **"గిరః"** అని అనడం ఎందుకంటే, **"వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః"** (ఆ పరమాత్మ, ప్రారంభంలో వేదశబ్దరాశి నుండియే దేవతలభాషమొదలైనవానిని నిర్మించాడు) అనే రీతిలో లౌకికశబ్దాలు కూడా వైదికశబ్దాలు కనుక ఈవిధంగా చెప్పబడింది.

ఆ వేదవాక్కులు, ఆ గుణాల అవధిని చూచిన క్రమమేది? అంటే -

**(నోద్యమతోఽతిశేరతే)** ప్రయత్నం చేసిన దశ తప్ప తరువాత కాలు



**(నోద్యమతోఽతిశేరతే)** ఉద్యోగదశైయాన ఇతొழియ మేల్కాల్ వాఙ్గిత్తినవిల్లై. "సైషాఽఽనన్దస్య మీమాంసా భవతి" (తై-ఆ) ఇత్యారభ్య "స ఏకో బ్రహ్మణ ఆనన్దః" (తై.ఆ) ఇతి. "యువా స్యాత్" (తై.ఆ) స్వరూపగుణఙ్గళుక్కు ఉపలక్షణమాతల్, యువత్వత్తాల్ వన్ద తేజస్సై చ్చొల్లుతలాతల్. అధ్యాయక ఇతి జ్ఞానమ్. ఆశిష్ఠ ఇతి - శక్తిః. ద్రడిష్ఠ ఇతి- వీర్యమ్. బలిష్ఠ ఇతి - బలమ్. తస్యేయమిత్యైశ్వర్యమ్. "త్రయ్యుద్యతా తవ యువత్వముఖై ర్గుణౌఘైః" (వైకుం-స్త) ఇత్యాదయః.

**(ఉద్యమతః)** ఉద్యోగాత్.

**(నాతిశేరతే)** అతిక్రమణసమర్థా న భవన్తి.

---

ఎత్తినది లేదు. **"సైషా నందస్య మీమాంసా భవతి"** (ఇది ఆనందగుణాన్ని గూర్చి చేసిన విచారం) అని ఆరంభించి, **"స ఏకో బ్రహ్మణ ఆనందః"** (అది పరబ్రహ్మయొక్క ఆనందం) అనే పర్యంతం స్మరణీయం. **"యువా స్యాత్"** అని ఇక్కడ చెప్పబడిన యువత్వం అనే గుణం స్వరూపగుణాలకు అన్నిటికి ఉపలక్షణం కావచ్చు. (లేక) యువత్వం వల్ల కల్గిన తేజస్సు **"యువా"** అనే పదంచేత చెప్పబడినదిగా కావచ్చు. **"అధ్యాయకః"**-జ్ఞానం కలవాడు, **"ఆశిష్ఠః"**-శక్తిని కలవాడు, ద్రడిష్ఠః-వీర్యగుణాన్ని కలవాడు, **"బలిష్ఠః"**-బలంకలవాడు, **"తస్యేయం పృథివీ విత్తస్య పూర్ణా స్యాత్"** అని ఐశ్వర్యం చెప్పబడింది. ఈ విధంగా వేదవాక్కులు ఆనందగుణాన్ని లెక్కించలేక విరమించడం కూరేశుల వైకుంఠస్తవంలోని **"త్రయ్యుద్యతా తవ యువత్వ ముఖైర్గుణౌఘైః"**ఇత్యాది సూక్తులలో ప్రస్తావింపబడింది.

**(ఉద్యమతః)**- ప్రయత్నంనుండి,

**(నాతిశేరతే)** - ముందుకు వెళ్ళడానికి శక్తిని కల్గినవి కావడంలేదు.

**20శ్లో ॥** త్వదాశ్రితానాం జగదుద్భవస్థితి-
ప్రణాశసంసారవిమోచనాదయః ।
భవన్తి లీలావిధయశ్చ వైదికా
స్త్వదీయగమ్భీరమనోఽనుసారిణః ॥

అవ : **(త్వదాశ్రితానామితి)** కీழ్ చ్చొన్న గుణఙ్గళుక్కు భోక్తాక్కళాన ఆశ్రితర్పెరుమైయై యరుళిచ్చెయ్కిఱార్. "అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి" (బ్రహ్మ సూ 1-1-20) ఎన్ఱు ఇవనాలే వన్ద పెరుమైయై యుడైయవర్కళళవు ఇతువానాల్ అవన్పెరుమైయై ప్పరిచ్చేదిక్కవొణ్ణాతెన్నుమిడమ్ కింపురునర్వ్యాయసిద్ధమన్ఱో ఎన్గిఱారెన్నుమామ్.

వ్యా : **(త్వదాశ్రితానామ్)** బ్రహ్మేన్ద్రరుద్రాదీనామ్, సనకాదీనాఞ్చ. దేవరై దూరనిన్ఱాశ్రయిక్కిఱ బ్రహ్మాదికళ్ సృష్టిస్థితి సంహారఙ్గళైయుమ్, ఉపదేశక్రమత్తాలే పెఱ్ఱు సంసారవిమోచనత్తైయుమ్ పణ్ణ శక్తరాన పిన్బు, అనన్యప్రయోజనరాయాశ్రయిక్కుమవర్కళ్. అవఱ్ఱై చ్చెయ్యప్పార్త్తాల్

**20శ్లో ॥** అవ : **(త్వదాశ్రితానామితి)** - పూర్వం పల్కిన గుణాలను అనుభవించేవారైన భక్తుల గొప్పతనాన్ని ఇందులో ప్రస్తావిస్తున్నారు. **"అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి"** (ఆనందమయుడైన ఈ భగవంతుని వద్ద ఈ జీవాత్మకు ఆనందంలో చేరికను శృతి పలుకుతున్నది) అని భగవంతుని వల్ల కల్గిన గొప్పతనాన్ని కలవారి వైభవం ఇటువంటిది అయితే, ఆ స్వామి గొప్పతనాన్ని పరిచ్ఛేదించి (ఇంతటిది-అని లెక్కకట్టి) పలుకడం సాధ్యం కాదనే విషయం కింపునర్న్యాయసిద్ధం (చెప్పనక్కరలేదు) కదా - అని అంటున్నారని కూడా అనవచ్చు.

వ్యా : **(త్వదాశ్రితానామ్)** - బ్రహ్మరుద్రేంద్రాదుల యొక్క, సనకాదుల యొక్క - అని అర్థం. దేవరవారికి దూరంగా ఉండి ఆశ్రయించిన బ్రహ్మమొదలైనవారు సృష్టి స్థితి సంహారాలను ఉపదేశక్రమంలో పొంది, సంసారవిమోచనాన్ని కూడా చేయడంలో సమర్థులైనపుడు, అనన్యప్రయోజనులై



లీలైయాకానిఱ్కుతు. ముక్తర్ దేవరోడే లీలారసమనుభవిక్కుమ్బోతు సఙ్కల్పజ్ఞానత్తాలే సృష్టిత్తితే అనుభవిప్పతు. **"సఙ్కల్పాదేవ శ్రుతేః" (ఛాన్దో), "సఙ్కల్పాదేవాస్య పితర స్సముత్తిష్ఠన్తి" (ఛా 8-2-1).** జగత్సృష్ట్యాదికళిల్ ప్రాప్తియిల్లామైపోక్కి, శక్తియిల్లామైయాలే తవిరుకిఱారల్లర్. ఆదిశబ్దత్తాలే అనేకశరీరాన్తః ప్రవేశనియమనఙ్గళై నినైక్కిఱతు. **"జగద్వ్యాపారవర్జమ్" (బ్రహ్మసూ 4-4-17), "భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ" (బ్రహ్మసూ 4-4-21).**

---

(భగవత్కైంకర్యం తప్ప వేఱొక ప్రయోజనాన్ని ఆశించనివారై) ఆశ్రయించినవారు వానిని (సృష్టిస్థితి సంహారాలను) చేయాలని చూస్తే, అవి వారికి లీలగా - అనాయాసంగా - చేయగల్గినవిగా ఉంటాయి. ముక్తులు దేవరవారిలో లీలారసాన్ని అనుభవించేటపుడు, తమ సంకల్పరూపజ్ఞానంతో ఆయా వస్తువులను సృష్టించికదా ఆనందిస్తారు. **"సంకల్పాదేవ శ్రుతేః"** (సంకల్పం వల్లనే ముక్తుడు సృష్టి చేస్తున్నాడు. ఆవిధంగా శృతి తెలుపుతున్నదిగనుక), **"సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠంతి"** (ఆ ముక్తుడు తన పితృదేవతలను దర్శించాలని అనుకుంటే, వారు ఇతని సంకల్పంవల్లనే ఆవిర్భవిస్తున్నారు) ఇత్యాదులు సంకల్పరూప జ్ఞానంతో ముక్తులు సృష్టిస్తారనే విషయానికి ప్రమాణాలు. ముక్తులకు జగత్సృష్టి మొదలైన వానితో సంబంధం లేదు తప్ప, వారికి శక్తిలేకపోవడం చేత వాటిని మానివేయడంలేదు. **"విమోచనాదయః"** అనే ప్రయోగంలోని **"ఆది"** శబ్దం ద్వారా జీవుల అనేక శరీరాలలోపల ప్రవేశించి, వారిని నియమించడం తెలుపబడుతున్నది. (దీనితో భగవంతునకు తప్ప ముక్తులకు సంబంధం లేదు) **"జగద్వ్యాపారవర్జమ్"** (ముక్తుని ఐశ్వర్యం జగద్వ్యాపారంలేని భగవదనుభవం మాత్రమే), **"భోగమాత్రసామ్యలింగాచ్చ"** (పరమాత్మ అనుభవంలో మాత్రమే ముక్తునకు సామ్యం చెప్పబడినందున) మొదలైనవి ఇక్కడ ప్రమాణాలు.

అథవా (జగదుద్భవస్థితిప్రణాశ సంసారవిమోచనాదయః లీలాః త్వదాశ్రితానాం భవన్తి) ముముక్షు సిసృక్షయావిఱే సృష్ట్యాదికళ్. నిరతిశయభోగ్యతైయే స్వరూపమాక విరుక్క, సంసారవిమోచనమాకిఱతు- ఆశ్రితార్థమాకవిఱే. ఆదిశబ్దత్తాలే తదర్థమాక అనేకావతారఙ్గళ్ తిరుక్కురువైయిల్ అనేక విగ్రహపరిగ్రహాదికళ్.

(విధయశ్చ వైదికాః) "ఇదం కురు, ఇదం మాకార్షీః" ఎన్గిఱపడియే స్వతన్త్రమాన వైదికవిధికళుమ్.

(త్వదీయగమ్భీరమనోఽనుసారిణః) అనన్యప్రయోజనరాయ్, దేవరై ఆశ్రయిత్తవర్కళుడైయ గమ్భీరమాన మనస్సై ప్పిన్ శెల్లానిన్ఱన. మనస్సుక్కు గామ్భీర్యమావతు-క్షుద్రమాన ఐశ్వర్యాదికళిల్ కాల్తాழாతే అనన్యప్రయోజనమాకై. "బ్రహ్మవాదినో వదన్తి" (యజు), "స హో వాచ వ్యాసః పారాశర్యః" (తై.ఆ.ప్రశ్న-1), "యే తత్ర బ్రాహ్మణా స్సంమర్శినః" (తై.శీ) ఇత్యారభ్య "యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః" (తై.శీ), "నినైతొఱుమ్ శొల్లున్దొఱుమ్

---

లేక, (జగదుద్భవస్థితిప్రణాశ సంసారవిమోచనాదయః లీలాః త్వదాశ్రితానాం భవంతి) ముముక్షువులను సృష్టించాలనే ఇచ్ఛతో కదా సృష్ట్యాదులు చేయబడుతున్నవి. సృష్ట్యాదులకు నిరతిశయభోగ్యతయే స్వరూపమై ఉండగా, సంసారవిమోచనమనేది - ఆశ్రితులకోసం కదా చేయబడుతున్నది. ఆదిశబ్దం ద్వారా - సంసారవిమోచనం కోసం ఎత్తిన అనేక అవతారాలు, రాసక్రీడలోని అనేకవిగ్రహ పరిగ్రహాలు మొదలైనవి తెలుపబడుతున్నాయి.

(విధయశ్చ వైదికాః) - "ఇదం కురు, ఇదం మా కార్షీః" (దీనిని అనుష్ఠించు, దీనిని చేయకు) అనే రీతిలోని స్వతంత్రమైన వైదికవిధులు.

(త్వదీయగంభీరమనోనుసారిణః) - అనన్యప్రయోజనులై, దేవరవారిని ఆశ్రయించినవారి గంభీరమైన మనస్సును అనుసరిస్తున్నవి.



నెఞ్జ్ఱిడిన్దు కుమ్"(తి.వాయ్ 9-6-2) ఎన్ను భగవద్విషయత్తిలివ్వళవు అవగాహియాతార్క్కు "నిదిధ్యాసితవ్యః" (బృహ-4-4-5), "విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత" (బృ 6-4-21), "ఆత్మానం ధ్యాయీత" (ముణ్డక 2-2-6) ఎన్ను విధిత్తతిఱే. త్వదీయమాన గమ్భీరమనస్సై అనుసరియానిన్ఱన- ఎన్నుమామ్- "శ్రుతిస్స్మృతి ర్మమైవాజ్ఞా" (విష్ణు ధర్మమ్ 6-31).

---

మనస్సు లోని గాంభీర్యమంటే- క్షుద్రమైన ఐశ్వర్యాదులలో కాలు జారకుండా అనన్యప్రయోజనంగా ఉండడం. "బ్రహ్మవాదినో వదంతి" (బ్రహ్మవాదులు పలుకుతున్నారు), "స హోవాచ వ్యాసః పారాశర్యః" (పరాశరుని కుమారుడైన ఆ వేదవ్యాసుడు ఈవిధంగా పలికాడుకదా!), "యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః" (విచారం చేయడంలో సమర్థులైనవారు ఉన్నారో) అని ఆరంభించి, "యథా తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః" (వారు అప్పుడు ఏవిధంగా ప్రవర్తిస్తారో నీవుకూడా ఆసందర్భాలలో ఆ విధంగానే ప్రవర్తించు), "నినైతొఱుమ్ శొల్లుమ్ తొఱుమ్ నెఞ్జిడిన్దుకుమ్" (తలచినపుడంతా, పలికేటపుడంతా మనస్సు భగ్నమై ద్రవిస్తుంది) అనే పర్యంతంలో భగవంతునిపట్ల ప్రేమలేనివారికి కదా వేదం "నిదిధ్యాసితవ్యః" (ఆత్మ ధ్యానించదగినది), "విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత" (జ్ఞానంకలవాడైన బ్రాహ్మణుడు అ పరమాత్మను తెలిసికొని ధ్యానించాలి), "ఆత్మానం ధ్యాయీత" (పరమాత్మను ఓం అని ప్రణవంతో ధ్యానించాలి) అని విధించింది కదా! (లేక) నీ గంభీరమైన మనస్సును వైదికవిధులు అనుసరిస్తున్నాయి - అని కూడా చెప్పవచ్చు. దీనికి "శ్రుతిస్మృతీః మమైవాజ్ఞా" (వేదాలు, స్మృతులు నా ఆజ్ఞలే) ఇత్యాదులు ప్రమాణాలు.

**21శ్లో॥** నమో నమో వాఙ్మనసాతిభూమయే
నమో నమో వాఙ్మనసైకభూమయే ।
నమో నమోఽనన్తమహావిభూతయే
నమో నమోఽనన్త దయైకసిన్ధవే ॥

అవ : **(నమో నమ ఇతి)** ఇతుక్కు క్కీఴ్ ఈశ్వరనుడైయ స్వరూపత్తాల్ వన్ద ఉత్కర్షత్తుక్కుమ్, ఉభయవిభూతియోగత్తాల్ వన్ద వైశ్వర్యత్తుక్కుమ్, గుణోత్కర్షత్తాల్వన్ద నీర్మైక్కుమ్ తోఱ్ఱు, **"జితన్తే" (1-జి-1)** ఎన్ఱ శ్వేతద్వీపవాసికళైప్పోలేయుమ్, **"నమః పురస్తాదథ పృష్ఠత స్తే" (గీ 11-39)** ఎన్గిఱ అర్జుననై ప్పోలేయుమ్, **"యారుమోర్ నిలైమైయనెన" (తి వాయ్-1-3-4)** ఎన్ఱ ఆఴ్వారైప్పోలేయుమ్ శరణ్యనుడైయ పెరుమైయై

**21శ్లో॥** అవ : **(నమో నమ ఇతి) -** ఇంతకు ముందు భగవంతుని స్వరూపం వల్ల కల్గిన ఉత్కర్షానికి (గొప్పతనానికి) (ఈ విషయం **"స్వాభావిక"** ఇత్యాది శ్లోకాలలో వ్యక్తం), ఉభయవిభూతి యోగంవల్ల (లీలావిభూతిని, నిత్యవిభూతిని కల్గి ఉన్నందువల్ల) ఉండే ఐశ్వర్యానికి (ఈ విషయం **"యదండమండాంతర గోచరం చ"** ఇత్యాది శ్లోకాలలో తెలుపబడింది), గుణోత్కర్షవల్ల కల్గిన సౌలభ్యానికి (ఇది **"వశీ వదాన్యః"** ఇత్యాది శ్లోకాలలో స్పష్టం) జితులయ్యారు. అందువల్ల ఈ శ్లోకంలో **"జితం తే పుండరీకాక్ష!"** (పుండరీకాక్ష! నీకు నమస్కారం) అని పలికే శ్వేత ద్వీపవాసులవలె, **"నమః పురస్తాదథ పృష్ఠత స్తే"** (నీకు ముందు నమస్కారం, వెనుక నమస్కారం) అని పల్కిన అర్జునునివలె, **"యారుమోర్ నిలమైయనెన అఱివఱియ ఎమ్బెరుమాన్"** (ఇటువంటి స్థితిని కలవాడని ఎవరికీ స్వప్రయత్నంతో తెలియడానికి సాధ్యం కాని భగవంతుడు) అని పల్కిన ఆఴ్వార్ల వలె శరణ్యుడైన భగవంతుని మహిమను అనుభవిస్తున్నారు. (లేక) ఇంతకుముందువరకు ప్రాప్యుడైన సర్వేశ్వరుని స్వరూపం తెలుపబడింది, ఇందులో ప్రాప్త అయిన జీవుని



అనుభవిక్కిఱార్. ఇతుక్కు మున్బు ప్రాప్యస్వరూపమ్ శొల్లిఱ్ఱాయ్. ఇతిల్ ప్రాప్తావిన్ స్వరూపమ్ శొల్లుకిఱతెన్నుమాయ్. కీఴ్ శరణ్యస్వరూపమ్ శొల్లిఱ్ఱాయ్ మేల్శొల్లప్పుకుకిఱ శరణాగతియై ఇతిలే ప్రస్తావిక్కిఱారెన్నుమామ్.

వ్యా :- **(వాఙ్మనసాతిభూమయే నమో నమః)** ఎత్తనైయేనుమ్ జ్ఞానాధికరుమ్ స్వయత్నత్తాలే అఱియప్పుక్కాల్ అవర్కళుడైయ వాఙ్మనస్సుక్కు అభూమియాయిరుక్కిఱ వుమక్కు నమః. **"యతో వాచో నివర్తన్తే" (తై-ఆ), "యన్నాయం భగవాన్బ్రహ్మా జానాతి పురుషోత్తమమ్" (విష్ణుపు 1-9-59)** ఎన్నక్కడవతిఱే. **(నమః)** ఎన్ఱు - అహఙ్కార మమకార నివృత్తమాన స్వరూపత్తై చ్చొల్లుకిఱతు. **"అహమపి న మమ"** ఇత్యారభ్య **"ఇత్యేవం మమతాం యోజయన్తి, అతో నమ ఇతి", "ద్వ్యక్షరస్తు భవేన్మృత్యు స్త్ర్యక్షరం బ్రహ్మణః**

స్వరూపం తెలుపబడుతున్నదని కూడా చెప్పవచ్చు. (లేక) పూర్వం శరణ్యుడైన భగవంతుని స్వరూపం తెలుపబడగా, ఇకపై చెప్పబోయే శరణాగతిని ఈ శ్లోకంలో ప్రస్తావిస్తున్నారని కూడాచెప్పవచ్చు.

వ్యా : **(వాఙ్మనసాతిభూమయే నమో నమః)** ఎటువంటి జ్ఞానాధికులైనా, తమ ప్రయత్నం ద్వారా తెలియాలని యత్నిస్తే, వారి వాక్కుకు, మనస్సుకు అందనివాడవై ఉండే నీకు నమస్కారం. **"యతో వాచో నివర్తంతే"** (భగవంతుని ఆనందగుణాన్ని గూర్చి ఇదమిత్థంగా తెలియలేని వేదవాక్కులు వెనుదిరుగుతున్నాయి), **"యన్నాయం భగవాన్ బ్రహ్మా జానాతి పురుషోత్తమమ్"** (జ్ఞానశక్త్యాదులను కల ఈ బ్రహ్మకూడా పురుషోత్తముని తెలియలేడు) అని చెప్పబడుతున్నది కదా! **"నమః"** అనే పదంద్వారా అహంకారం, మమకారం తీరిన జీవస్వరూపం తెలుపబడుతున్నది **"అహమపి న మమ"** అని ఆరంభించి, **"ఇత్యేవం మమతాం యోజయంతి, అతో నమ ఇతి"** (ఈ విధం మమతను యోజన చేస్తున్నారు, అందువల్ల **"నమః"** అని

**పదమ్" (భార శాంతి 13-4), "అనాత్మన్యాత్మబుద్ధిః" (వి-పు-2-7-11) ఇత్యాది. నమశ్శబ్దమ్- శరణపర్యాయ మాకైయాలే శరణాగతియై ప్రస్తావిక్కిఱ తాకవుమామ్. వీప్సైయాలే అన్ద స్వభావత్తుక్కు తోற்றు అరుళిచ్చెయ్‌కిఱార్. "సకృత్తే నమః, ద్విస్తే నమః" (తై.ఆ 4-28) ఇత్యారభ్య, "సహస్రకృత్వ స్తే నమః, అపరిమితకృత్వస్తే నమః" (తై.ఆ 4-28) ఇతి. "నమ ఇత్యేవవాదినః" (భార-మొ-337-40) ఇత్యాది.**

**(వాఙ్మనసైక భూయో నమో నమః) నీ కాట్ట క్కాణ్బారుడైయ వాఙ్మనస్సుక్కళుక్కే నిలమాయిరుక్కిఱ వునక్కు. "భవన్తి నానాభూతానాం**

నిష్కృష్ట జీవస్వరూపం తెలుపబడుతున్నది) అని, **"ద్వక్షరస్తు భవేన్మృత్యుః త్ర్యక్షరం బ్రహ్మణః పదమ్"** (మమ - అనే రెండక్షరాలు మృత్యువు- న మమ- అనే మూడక్షరాలు మోక్షస్థానం), **"అనాత్మన్యాత్మబుద్ధిర్యా"** (ఆత్మకాని దేహంలో అది ఆత్మ అనే బుద్ధి ఏది ఉన్నదో, అది అవిద్య అనే వృక్షం నుండి పుట్టిన బీజం) ఇత్యాది ప్రమాణాలు ఇక్కడ స్మరించదగినవి. నమశ్శబ్దం శరణపర్యాయవాచకం కనుక, ఈ పదం ద్వారా ఈ శ్లోకంలో శరణాగతిని ప్రస్తావిస్తున్నారని చెప్పవచ్చు. **"నమో నమః"** అనే ద్విరుక్తి ద్వారా వాక్కుకు, మనస్సుకు అందని భగవత్స్వభావానికి జితులై ఆదరాతిశయంతో పల్కుతున్నారు. **"సకృత్తే మః, ద్విస్తే నమః"** (ఒకసారి నీకు నమస్కారం, అపరిమిత పర్యాయాలు నీకు నమస్కారం) అని, **"బద్ధాంజలిపుటా హృష్టా నమ ఇత్యేవవాదినః"** (శ్వేతద్వీపనివాసులు అంజలి ఘటిస్తూ, ఆనందించేవారై "నమః, నమః" అని భగవన్మంగళాశాసనం చేస్తూ ఉంటారు) ఇత్యాదులు ఇక్కడ నమశ్శబ్దం యొక్క వీప్సకు ప్రమాణాలు.

**(వాఙ్మనసైక భూమయే నమో నమః)** నీవు దర్శింపజేస్తే, దర్శించే ఆழ்వార్ల వంటి వారి వాక్కుకు, మనస్సుకు మాత్రమే గోచరుడవైన నీకు పునఃపునః నమస్కారం. **"భవంతి భావాభూతానాం మత్త ఏవ పృథగ్విధాః"**



**మత్త ఏవ పృథగ్విధాః" (గీ) ఇత్యాది.**

**(అనన్తమహావిభూతయే నమో నమః) అపరిచ్ఛేద్యోభయ మహావిభూతికనాయిరుక్కిఱ ఉనక్కు నమః. వాఙ్మనస్సుకళుక్కు అభూమియాయిరుక్కైక్కడి అపరిచ్ఛేద్య మహావిభూతికనాకై.**

**(అనన్తదయైక సిన్ధవే నమో నమః) అపరిచ్ఛేద్య మహావిభూతికనాయిరుక్కిఱ ఉన్నై వాఙ్మనస్సుకళుక్కు ఏకభూమియామ్బడి పణ్ణుమపరిమితమాన దయైక్కు ఒరు సిన్ధువాయిరుక్కిఱ ఉనక్కు నమః. "యది శక్నోషి గచ్ఛ త్వమ్" (వి-పు-5-6-15) ఎన్ఱు సర్వశక్తియై ఓరిడైచ్చి**

(జీవుల పలు విధాలైన భావాలన్నీ నావల్లనే కల్గుతున్నాయి) ఇత్యాదులు ఇక్కడ ప్రమాణాలు.

**(అనంత మహావిభూతయే నమో నమః)** అపరిచ్ఛేద్యాలైన (ఇంతటివి- అని కొలిచి చెప్పడానికి వీలుకాని) లీలావిభూతులు, ఉభయవిభూతి - అనే రెండు విభూతులను కలవాడవై ఉండే నీకు నమస్కారం. వాక్కుకు, మనస్సుకు భగవంతుడు అందకపోవడానికి కారణం - అపరిచ్ఛేద్యాలైన మహావిభూతులను కల్గి ఉండడం.

**(అనంతదయైకసింధవే నమోనమః)** - అపరిచ్ఛేద్యాలైన మహావిభూతులను కల్గినవాడవై ఉండే నిన్ను వాక్కుకు, మనస్సుకు అందేటట్లు చేసే, అపరిమితమైన దయకు అద్వితీయ సముద్రమైన నీకు నమస్కారం. **"యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచల చేష్టిత !"** (మిక్కిలిగా చిలిపి పనులను చేసేవాడా! నీవు సమర్థుడవైతే, ఇక్కడనుండి వెళ్ళు చూస్తాను) అని అంటూ సర్వశక్తియైన శ్రీకృష్ణుని ఒక గోపిక (యశోద) నియమించేటట్లుగా, ఒకచోటనే ఉండేటట్లు పరిచ్ఛేదించేటట్లుగా కదా, భగవత్కృపయొక్క నిరవధికత్వం ఉన్నది. (అందువల్ల నీటికి నిరవధికమైన స్థానం సముద్రం అయినట్లే, దయకు

పరిచ్ఛేదిక్కలామ్బడియితే కృపైయినుడైయ నిరవధికత్వమ్.

**22శ్లో ॥** న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ
న భక్తిమాం స్త్వచ్చరణారవిన్దే ।
అకిఞ్చనోఽనన్యగతి శ్శరణ్య!
త్వత్పాదమూలం శరణం ప్రపద్యే ॥

అవ : **(న ధర్మనిష్ఠోఽస్మి)** తమ్ముడైయ అధికారత్తై చ్చొల్లిక్కొణ్డు ప్రస్తుతమాన ప్రపత్తియై ప్రయోగిక్కిఱార్. కీఴ్చ్చొన్న ఉపేయానుకూలమాన ఉపాయత్తై అనుష్ఠిక్కిఱార్- ఎన్నుమామ్. కీఴ్ "త్వాం శీల", "ఉల్లఙ్ఘిత" ఎన్గిఱ శ్లోకఙ్గళిలే దుష్ప్రకృతికళ్ ఇవన్ పెరుమైయై యఱియార్కళ్, సత్ప్రకృతికళఱివార్కళ్- ఎన్ఱార్. "నమో నమః" ఎన్గిఱ శ్లోకత్తిలే స్వరూపత్తై అత్యన్తరపరతన్త్రమాక ఉణర్న్దవనుక్కే ఇవ్విషయమ్ ప్రాప్యమావతు. స్వతన్త్రనుక్కు ప్రాప్యమెన్ఱెన్ఱార్. ఇతిల్ ఆశ్రయిక్కుమిడత్తిల్ స్వశక్తియైక్కొణ్డాశ్రయిక్కుమ్ విషయమన్ఱు. తన్నుడైయ వాకిఞ్చన్యత్తై మున్నిట్టుక్కొణ్డాశ్రయిక్కుమ్ విషయమెన్గిఱార్.

వ్యా :- **(న ధర్మనిష్ఠోఽస్మి)** ధార్మికనావే నెన్గిఱేనల్లేన్, నాస్తిక నెన్గిఱేనల్లేన్, ధర్మత్తిల్ నిష్ఠైయై యుడైయనల్లేన్. పిఱర్- ధార్మికనెన్ఱు నినైక్కైక్కుమ్ నానుమ్, ఎనక్కు నన్మైయుణ్డెన్ఱు భ్రమిక్కైక్కుమ్ నీయుమ్, "తానే శిలప్రవృత్తియా నిన్ఱానాకిల్ నాన్ శెయ్వతన్?" ఎన్ఱు కైవిడుకైక్కుమ్ వేణ్డువతుణ్డిత్తనై. ఉన్ తిరువడికళై ప్రాపిక్కైక్కు హేతువామ్బడియాన వృత్తియిల్ నిష్ఠైయిల్లై - యెన్ఱె.

**(న చాత్మవేదీ)** ఆత్మదర్శనమ్ పణ్ణువార్ వార్త్తైయై చ్చొల్లి ప్పోరానిన్ఱేన్. తచ్ఛీలనల్లేన్. కర్మయోగానుష్ఠానత్తాలే క్షీణపాపనానవనుక్కొఴియ

---

నిరవధికమైన స్థానం భగవంతుడు కనుక దయైకసింధువుగా నిర్దేశింపబడ్డాడు.)

**22శ్లో ॥** అవ : **(న ధర్మనిష్ఠోఽస్మి)** - తమ అధికారాన్ని గూర్చి ప్రస్తావిస్తూ, స్తోత్రంలో ముందు శ్లోకంలో "నమో నమః" అని ప్రస్తుతమైన ప్రపత్తిని ఇందులో ప్రయోగిస్తున్నారు. లేక, పూర్వం పల్కిన ఉపేయానికి (భగవంతుడనే ఉపేయానికి) తగిన ఉపాయాన్ని అనుష్ఠిస్తున్నారని కూడా చెప్పవచ్చు. పూర్వం "త్వాం శీల", "ఉల్లంఘిత" అనే శ్లోకాలలో "దుష్టస్వభావాన్ని కలవారు భగవంతుని గొప్పతనాన్ని తెలియలేరు. సాధుస్వభావాన్ని కలవారు తెలియగలరు" - అని అన్నారు. "నమో నమః" అనే శ్లోకంలో "జీవస్వరూపాన్ని అత్యంత పరతంత్రమని తెలిసినవానికే ఈ విషయం ప్రాప్యమవుతుంది. స్వతంత్రునకు ప్రాప్యం కాదు" - అని అన్నారు. ఇందులో, ఆశ్రయించేటపుడు కూడా, తన శక్తిని జీవుడు పురస్కరించుకొని ఆశ్రయించే విషయం భగవంతుడు కాదు, తన ఆకించన్యాన్ని పురస్కరించుకొని ఆశ్రయించదగిన విషయం- అని పల్కుతున్నారు.

వ్యా : **(న ధర్మనిష్ఠోఽస్మి)** - నేను ధార్మికుడను - అని అనడంలేదు, నాస్తికుడనని అనడంలేదు. ధర్మంలో నిష్ఠను కలవాడనుకాను, ఇతరులు "ఇతడు ధార్మికుడు'' అని భావించడానికి, నేను కూడా "నాకు మంచి ఉన్నది'' అని భ్రమించడానికి, నీవు సైతం "ఇతడు, తన రక్షణకు స్వయంగా కొన్ని ప్రయత్నాలను చేసేవాడైనపుడు ఇక నేను చేసేది ఏమున్నది?'' అని చేయివిడువడానికి కావలసినది - ఉన్నది అంతే. నీ శ్రీచరణాలను చేరడానికి కారణమైన ప్రయత్నంలో నిష్ఠ లేదు - అని భావం.

**(న చాత్మవేదీ)** - ఆత్మదర్శనం చేసేవారి మాటలను పల్కుతున్నాను. కాని, ఆత్మదర్శనం చేసే స్వభావాన్ని కలవాడను కాను. కర్మయోగానుష్ఠానం

ఆత్మయాథాత్మ్య దర్శనమిల్లైయాయిరుక్క, అతిల్లై యెన్ఱ పోతే తత్సాధ్యమాన జ్ఞానమిల్లామై అర్థసిద్ధమాయిరుక్క, జ్ఞానమిల్లై ఎన్గిఱతు. "బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్" (గీ-7-19) ఎన్ఱు జన్మసహస్రత్తాలే జ్ఞానమ్ పిఱక్కలామే!- ఎన్నిల్, అతువు మిల్లై యెన్గిఱార్.

(త్వచ్చరణారవిన్దే న భక్తిమాన్) ఇవ్వాత్మావుక్కు వకుత్తవనాన ఉన్నుడైయ నిరతిశయభోగ్యమాన తిరువడికళిల్ అనవరత భక్తియై యుడైయవనల్లేన్. కర్మజ్ఞానఙ్గళిల్లై ఎన్ఱపోతే తత్సాధ్యమాన భక్తియిల్లై యెన్ఱు అర్థాత్ సిద్ధమాయిరుక్క, భక్తియిల్లై యెన్బానేన్? ఎన్నిల్, పూర్వోక్తప్రకారత్తాలే జన్మాన్తర సంస్కారముతవి యుణ్డాకలామితే ఎన్నిల్, అతువు మిల్లై యెన్గిఱార్. "కుళిత్తు మూన్ఱనలై" (తిరుమా), "నోఱ్ఱ నోన్బు" (తి వాయ్-5-8-1),

ద్వారా పాపాలు తొలగినవానికి తప్ప ఆత్మయాథాత్మ్య దర్శనమనేది లభించనిదై ఉండగా, ఆ దర్శనం లేదని అన్నపుడే, దానివల్ల సాధించదగిన జ్ఞానం లేదనేది అర్థాత్ ఏర్పడుతూ ఉండగా, జ్ఞానం లేదు - అని ప్రత్యేకంగా పల్కడం ఎందుకు? అంటే, "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్" (పలుజన్మలను ఎత్తిన తరువాత ఆత్మజ్ఞానాన్ని కలవాడవుతున్నాడు) అని వేలాది జన్మల తరువాత జ్ఞానం కలుగవచ్చుకదా! అంటే, అదికూడా లేదని తెలుపడంకోసం.

(త్వచ్చరణారవిందే న భక్తిమాన్)- ఈ ఆత్మకు ప్రాప్తశేషి అయిన నీ నిరతిశయభోగ్యాలైన శ్రీచరణాలలోని అనవరతమైన భక్తిని కలవాడను కాను. కర్మజ్ఞానాలు లేవని అన్నపుడే, వానివల్ల కలుగవలసిన భక్తి లేదనేది అర్థాత్ తెలుస్తూ ఉండగా, మళ్ళీ భక్తి లేదని అనడం ఎందుకు? పూర్వం "జన్మాంతర సహస్రేషు" ఇత్యాది ప్రమాణం ద్వారా తెల్పిన రీతిలో జన్మాంతర సంస్కారం ద్వారా భక్తి కలుగవచ్చుకదా! అంటే, అది కూడా లేదు - అని దీనిద్వారా తెల్పుతున్నారు. "కుళిత్తు మూన్ఱనలై" అనే తిరుమాలైపాశురభావాన్ని



'కఱవైకళ్ పిన్ శెన్ఱు" (తిరుప్పావై-28) ఇత్యాది.

(ఆకిఞ్చనః) ఇవై యిల్లై యెన్ను మనుతాపమెన్న, ఇవై యుణ్డాకైక్కుఱుప్పాన ఆత్మగుణమెన్న, అధికారశక్తివాఞ్ఛాధికళెన్న - ఇవఱ్ఱియుడైయే నల్లేన్. ఇప్పడి నమ్మై క్కిట్టుకైక్కు క్కైమ్ముతలిల్లైయాకిలుమ్ పుఱమ్బే రక్షకరాయిరుప్పార్ పక్కలిలే పోనాలో? ఎన్న,

(అనన్యగతిః) పుఱమ్బురు పుకలిల్లై యెన్నుతల్. ఉన్నై "విట్టొన్ఱుమాఱ్ఱకిఱ్కిన్ఱిలేన్" (తి.వాయ్ 5-7-1) ఎన్గిఱపడియే ఉన్నై యొழియ చ్చెల్లాతవనెన్నుతల్.

(శరణ్య!) తన్దామ్బక్కల్ కైమ్ముతలిల్లాతార్క్కుమ్ శరణవరణార్హరితే, దేవర్. నిరుపాధిక శరణ్యరాకైయాలే రుచియే వేణ్డువతు.

"నోఱ్ఱ నోన్బు" అనే తిరువాయ్మొழி పాశురభావాన్ని, "కఱవైకళ్ పిన్శెన్ఱు" అనే తిరుప్పావై పాశురభావాన్ని ఇక్కడ అనుసంధించాలి.

(అకించనః) - కర్మజ్ఞానభక్తులు లేవనే పశ్చాత్తాపం కాని, ఇవి కల్గడానికి తగిన ఆత్మగుణాలు కాని, అధికారం (యోగ్యత), శక్తి, వాంఛలు కాని - వీనిని వేనినీ కలవాడను కాను. మఱి ఈవిధంగా నాదరికి చేరడానికి ఏ సహాయం (కైమ్ముదల్) లేకపోయినా, బయట మిమ్ములను రక్షించే వారిదగ్గరకు మీరు వెళ్ళవచ్చుకదా? అంటే,

(అనన్యగతిః) - నీవు తప్ప బయట ఇంకొకరు రక్షకులెవ్వరూ నాకు లేరు - అని అర్థం. (లేక), "ఉన్నై విట్టు ఒన్ఱు మాఱ్ఱకిఱ్కిన్ఱిలేన్" (నిన్ను విడచి నేను ఏమీ భరించి ఉండలేను) అనే రీతిలో నిన్ను విడచి ఉండలేనివాడను - అని భావం.

(శరణ్య!)- తమవద్ద తమను రక్షించేది ఏదీ లేని వారికి కూడా నీవు శరణు పొందదగినవాడవు కదా! నిరుపాధిక శరణ్యుడవు కనుక,

దేవరై ప్పెఱుక్కైక్కు ఒరు కైమ్మాతల్ వేణ్డావిఱే.

**(త్వత్పాదమూలమ్)** 'మామేకం శరణం వ్రజ" (గీ-18-22) ఎన్ఱ దేవర్ తిరువడికళే మూలమ్. "మూలమ్" ఎన్గిఱతు- సౌలభ్యాది గుణఙ్గళైయుమ్ ఇతరావయవఙ్గళైయు మొழிయ తిరువడిత్తామరైకళైయే నినైక్కిఱతు.

**(శరణం ప్రపద్యే)** విరోధినిరసనపూర్వకమాక కైఙ్కర్యసిద్ధిక్కు ఉపాయమాక అధ్యవసిక్కిఱేన్. "ఉపాయే గృహరక్షిత్రోః" (అహిర్బు-సం-36-36) అహిర్బుధ్న్యసంహితైయిలే ఇతినుడైయ స్వరూపమ్ శొల్లప్పట్టతు. "అహమస్మ్యపరాధానామాలయః" (హరి-36-38). ఇన్ద శ్లోకత్తాల్ అధికారిస్వరూపముమ్, శ్వేతాశ్వతరే - "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్" (శ్వే-6-18) ఎన్ఱు శరణాగతి ప్రయోగముమ్ శొల్లిற்றாయ్త్తు.

---

ఆశ్రయించాలనే రుచి ఉంటే చాలు. నిన్ను ఆశ్రయించవచ్చు. నిన్ను పొందడానికి అంతకంటే ఇంకొక ఏ మంచి **(కైమ్మాదల్)** అక్కరలేదుకదా!

**(త్వత్పాదమూలమ్)** "మామేకం శరణం వ్రజః" (నన్ను ఒక్కనిమాత్రం శరణు పొందు) అని పల్కిన దేవరవారి శ్రీచరణాల మూలం -అని అర్థం. **"మూలమ్"** అనేది - "సౌలభ్యాది గుణాలను కాని, ఇతర అవయవాలను కాని కాకుండా, శ్రీచరణపద్మాలను మాత్రమే భావించడం తెల్పుతున్నది.

**(శరణం ప్రపద్యే)** - విరోధినివృత్తి పూర్వకమైన కైంకర్యప్రాప్తికి ఉపాయంగా నిశ్చయించుకొన్నాను. **"ఉపాయే గృహరక్షిత్రోః"** (శరణశబ్దం- ఉపాయం, గృహం, రక్షించేవాడనే అర్థాలను ఇస్తుంది) ఇత్యాది అహిర్బుధ్న్య సంహితాసూక్తిలో ఉపాయస్వరూపం తెలుపబడింది. **"అహమస్మి అపరాధానా మాలయః"** అనే శ్లోకం ద్వారా అధికారి స్వరూపం, శ్వేతాశ్వతరోపనిషత్తులోని **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్"** అనేసూక్తిలో శరణాగతి స్వరూపం తెలుపబడ్డాయి.



**23శ్లో॥** న నిన్దితం కర్మ యదస్తి లోకే
సహస్రశో యన్న మయా వ్యధాయి ।
సోఽహం విపాకావసరే ముకున్ద!
క్రన్దామి సమ్ప్రత్యగతి స్తవాగ్రే ॥

**అవ : (న నిన్దితమ్)** ఆనుకూల్యఙ్గళిల్లై యెన్ఱు వెఱుక్కవేణ్డా, ఉణ్డాన యోగ్యతైయు మழிక్కవற்றான నిషిద్ధానుష్ఠానఙ్గళిల్లై యాకిల్ నన్మైకళై యుణ్డాక్కి ప్పురుషార్థత్తైయుమ్ తరుకిఱో మెన్ఱు భగవదభిప్రాయమాక, ప్రాతికూల్యఙ్గళాల్ పరిపూర్ణన్- ఎన్గిఱార్.

**వ్యా : (సహస్రశో యన్న మయా వ్యధాయి నిన్దితం కర్మ తల్లోకే నాస్తి)** ఆయిరమ్ మడఙ్గు ఎన్నాల్ పణ్ణప్పడాతతు యాతొరు నిన్దితకర్మ ముణ్డు- అతిపాతకమహాపాతకాదికళ్, అతు శాస్త్రత్తిలుమిల్లై. లోక్యత అస్మిన్నితి లోకః

---

**23శ్లో॥ అవ : (న విన్దితమ్)** - ఆనుకూల్యాలు- అనుకూలప్రవృత్తులు - లేవని వెఱువవద్దు. ఉండే యోగ్యతను కూడా లేకుండా చేసే నిషిద్ధ కర్మానుష్ఠానాలు లేకుండా ఉంటే, తావన్మాత్రంతో చాలు. యోగ్యతను కలుగ జేసి పురుషార్థాన్ని ఇస్తాను - అని భగవానుని అభిప్రాయంగా తలచి, "ప్రాతికూల్యాలతో నిండిన వాడను నేను" అని బదులు పల్కుతున్నారు.

**వ్యా : (సహస్రశో యన్న మయా వ్యధాయి నిందితం కర్మ తత్ లోకే నాస్తి)** వేయి మార్లు నాచే చేయబడని అతిపాతక, మహాపాతకాది నిందిత కర్మలు అనేవి శాస్త్రంలో కూడా లేవు. (అంటే - శాస్త్రంలో నిర్దేశింపబడిన అతిపాతక మహాపాఆతకాలను అన్నిటినీ నేను ఒక్కొక్కటిని వేయిమార్లు తక్కువ లేకుండా చేశాను - అనిభావం). ఇక్కడ లోకశబ్దానికి **"లోక్యత అస్మిన్ ఇతి లోకః"** అనే వ్యుత్పత్తిద్వారా శాస్త్రమనే అర్థం తెలుపబడుతున్నది. (సాధారణంగా) అనుష్ఠించేవారిలో కన్పించని నిషిద్ధకర్మలు కొన్ని శాస్త్రంలో కన్పించవచ్చు. ఆ విధమైన స్థితి విషయంలో

**- శాస్త్రమ్. అనుష్ఠాతాక్కళ్ పక్కలిల్లాత నిషిద్ధఙ్గళుమ్ శాస్త్రత్తిల్ కాణలామిఱే.**

**(సోఽహమ్) నిషిద్ధఙ్గళై అనుష్ఠిత్తు ప్రాయశ్చిత్తఙ్గళిలుమిழியఅఱియాతే తప్పు చ్చెయ్‌తో మెన్గిఱ వనుతాపముమిన్ఱిక్కే యిరుక్కిఱ నాన్.**

**(విపాకావసరే) అవై పక్వమాయ్ అనుభవత్తై యొழியప్పోక్కడియిల్లాత అవసరత్తిలే.**

**(ముకున్ద!) ముక్తిభూమిప్రద ! ఇద్దుర్దశైయై ప్రాప్తనానవనుక్కుమ్ దేవరే ఉజ్జీవనహేతు వెన్ను మిడత్తైయే బుద్ధి పణ్ణి. "దురాచారోఽపి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా" (సాత్వ-సం-16-26), "దోషో యద్యపి తస్య స్యాత్" (రా-యు-18-3), "వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్" (రాసు-సు-**

లేదు. నేను అన్ని పాతకాలను ఎన్నోమార్లు చేశానని భావం.

**(సోఽహమ్)** - నిషిద్ధకర్మలను చేసి, (వాటికోసం) ఏప్రాయశ్చిత్తాన్ని చేయాలని తెలియకుండా, తప్పు చేశామే - అనే పశ్చాత్తాపం లేకుండా ఉండే నేను - అని భావం. (ఇది ఇక్కడ ప్రయోగింపబడ్డ "సః అహమ్" అనే రెండు సర్వనామ శబ్దాల తాత్పర్యం.)

**(విపాకావసరే)** - అవి పరిణతదశను పొంది, అనుభవిస్తే తప్ప పోగొట్టుకోవడానికి సాధ్యం కాని సమయంలో,

**(ముకున్ద!)** - ముక్తిభూమి అయిన పరమపదాన్ని అనుగ్రహించేవాడా! "ఇటువంటి దుర్దశను పొందినవానికి కూడా దేవరవారే ఉజ్జీవనహేతువు - అనే విషయాన్నే భావించి" - అని ఈ సంబోధనలోని తాత్పర్యం. **"దురాచారోఽపి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా"** (దురాచారం కలవాడైనా, అభక్ష్యభక్షణాన్ని చేసేవాడైనా, కృతఘ్నుడైనా, పూర్వం నాస్తికుడైనా తర్వాత భక్తుడైతే పరమాత్మయొక్క ప్రభావంచేత అతనిని దోషరహితునిగా తెలియాలి), **"వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"** (కాకాసురుడు



**38-34). "తస్మాదపి వధ్యం ప్రపన్నం న ప్రతిప్రయచ్ఛన్తి" (యజు 6-5). అహిర్బుధ్న్య సంహితాయామ్, "అనేనైవ ప్రపన్నస్య భగవన్తం సనాతనమ్. తస్యానుబన్ధాః పాప్మాన స్సర్వే నశ్యన్తి తత్క్షణాత్. కృతాన్యనేన సర్వాణి తపాంసి తపతాం వర, సర్వే తీర్థా స్సర్వయజ్ఞాః సర్వదానాని చ క్షణాత్, కృతాన్యనేన మోక్షశ్చ తస్య హస్తే న సంశయః" (అహిర్బు సం 37-32).**

**(అగతిః) దేవరీరుడైయ నీర్మైయేయన్ఱి ఎన్నుడైయ గతిశూన్యతైయే హేతువాక.**

వధించదగినవాడైనా శరణాగతుడైనందున అతనిని శ్రీరాముడు దయతో పరిపాలించాడు), **"తస్మాదపి వధ్యం ప్రపన్నం న ప్రతిప్రయచ్ఛంతి"** (అందువల్ల వధింపదగినవాడైనా అతడు ప్రపన్నుడైతే, అతనిని రక్షించకుండా విడచిపెట్టారు) ఇత్యాదులు అనుసంధేయాలు. అహిర్బుధ్న్యసంహితలోకూడా **"అనేనైవ ప్రపన్నస్య భగవంతం సనాతనమ్, తస్యానుబంధాః పాప్మానః సర్వే నశ్యంతి తత్ క్షణాత్, కృతాన్యనేన సర్వాణి తపాంసి తపతాం వర!, సర్వే తీర్థాః సర్వయజ్ఞాః సర్వదానాని చ క్షణాత్, కృతాన్యనేన మోక్షశ్చ తస్య హస్తే న సంశయః"** (ఈ కారణంవల్ల, సనాతనుడైన భగవంతుని శరణాగతి చేసినవానికి చెందిన పాపాలన్నీ ప్రపత్తి చేసిన ఆ క్షణంలోనే నశిస్తాయి. అతనిచే అన్ని తపస్సులు ఆచరించినట్లవుతుంది. తపస్సు చేసేవారిలో గొప్పవాడా ! అన్ని తీర్థాలు, అన్ని యజ్ఞాలు అన్ని దానాలు ఒక్క క్షణంలో అతనిచే చేయబడినట్లవుతాయి. మోక్షంకూడా అతని చేతిలో ఉంటుంది. ఏ సందేహం లేదు) అని ప్రపన్నుని వైభవం తెలుపబడింది.

**(అగతిః)** - దేవరవారి దయయేకాక, నా గతిశూన్యత కూడా హేతువుగా అయినవాడనై.

**(సంప్రతి క్రందామి)** - దేవరవారికి విడువడానికి వీలుకాని దశలో, నన్ను రక్షించకపోతే, లోకంలోని వారు దేవరవారిపట్ల గుణహీనతను

(సమ్ప్రతి క్రన్దామి) దేవరీరుక్కు ప్పరిహరిక్కవొణ్ణాత దశైయిలే దేవర్పక్కల్ గుణహానియై శఙ్కిక్కుమ్బడి సాధనానుష్ఠానమ్బణ్ణి ఫలమ్ పెఱాతారైప్పోలే కూప్పిడానిన్ఱేన్.

(తవాగ్రే) "హ్రీ రేషా హి మమాతులా" (రా-అ-10-9) ఎన్గిఱ దేవరీర్ తిరుమున్బే.

24శ్లో॥ నిమజ్జతోఽనన్త! భవార్ణవాన్త
శ్చిరాయ మే కూలమివాసి లబ్ధః।
త్వయాపి లబ్ధం భగవన్నిదానీ
మనుత్తమం పాత్రమిదం దయాయాః॥

అవ : (నిమజ్జతః) ఉమ్ముడైయ పూర్వవృత్తి ఇతువాయిరుక్క "క్రన్దామి" (స్తోత్రరత్నమ్ 26) ఎన్ఱు నమ్కుర్ఱమ్బోలే కూప్పిడునతెత్తాలే ?

సందేహించినట్లుగా (అంటే, నీవు దయారహితుడవని సందేహించేటట్లుగా), మోక్షోపాయాలను అనుష్ఠించి ఫలం పొందనివారివలె ఆక్రందిస్తున్నాను.

(తవాగ్రే) - "హ్రీ రేషా హి మమాతులా" (నేను మీవద్దకు రావలసి ఉండగా, మీరే నావద్దకు రావడం నాకు చాలా సిగ్గుగా ఉన్నది) అని పల్కిన దేవరవారి సమక్షంలో - అని భావం. (ఇది "తవ" అనే సర్వనామశబ్దతాత్పర్యం.)

24శ్లో॥ అవ : (నిమజ్జతః) - మీ పూర్వచరిత్ర ఇటువంటిది అయినపుడు "క్రందామి" అని అంటూ మా దోషం ఉన్నట్లుగా మీరు ఆక్రందించడానికి ఏమి కారణం? - అని భగవంతుడు అనగా, సంసారమనే సముద్రంలో మునిగే నాకు నిర్హేతుకమైన కృపతో నీ వైలక్షణ్యాన్ని నాకు తెలిపావు. "కూశమ్ శెయ్యాదు కొణ్డాయ్, ఎన్నై క్కావి క్కొళ్ళాయ్ వన్దన్దో!" (సందేహించకుండా



ఎన్న; సంసారార్ణవత్తిలే అழுన్దుకిఱ ఎనక్కు నిర్హేతుకకృపైయాలే ఉన్ వాశియై యఱివిత్తాయ్. "కూశమ్ శెయ్యాతు కొణ్డాయ్, ఎన్నై క్కావి క్కొళ్ళాయ్ వన్దన్దో !" (తి-వాయ్-10-10-2) ఎన్గిఱపడియే ఉన్‌తిరువడికళై ప్రాప్పిక్కైక్కుమ్, అన్దకృపైయే హేతువెన్ఱు దయైకరక్ష్యత్వత్తాలే కూప్పిడుకిఱేన్ -ఎన్గిఱార్. ఎనక్కు దేవరై లభిక్కై పెఱాప్పేఱానాప్పోలేయన్ఱో దేవరీరుడైయ కృపైక్కుమ్ ఎన్నుడైయ పాపమెన్గిఱార్.

వ్యా : (అనన్త! భవార్ణవాన్తర్నిమజ్జతః), (అనన్త) త్రివిధపరిచ్ఛేదరహిత! ఎన్నుడైయ సంసారత్తై ప్పరిచ్ఛేదిక్కిలుమ్ దేవరుడైయ ప్రభావత్తై ప్పరిచ్ఛేదిక్కై యరితు - ఎన్ఱై. భవార్ణవవిశేషణమాయ్, కరైకాణ వొణ్ణాత సంసారార్ణవ

నన్ను గ్రహించావు. ఇక నన్ను దగ్గరకు చేర్చుకో) అనేవిధంగా నీ శ్రీచరణాలను పొందడానికి ఆ కృపయే హేతువు అని తలచి, కేవలం నీదయవల్ల మాత్రమే రక్షింపబడవలసిన నా స్థితి కారణంగా ఆక్రందిస్తున్నాను - అని పల్కుతున్నారు. (లేక) నాకు, దేవరవారిని పొందడం అలభ్యలాభం అయినట్లే, దేవరవారి కృపకు కూడా నా పాపం అలభ్యలాభమని అంటున్నారు. (శ్లోకంలోని పూర్వార్ధాన్ని, ఉత్తరార్ధాన్ని ఉద్దేశించి ఈరెండు అవతారికలు అనుగ్రహింపబడ్డాయి.)

వ్యా : (అనంత! భవార్ణవాంతర్నిమజ్జతః)- (అనంత!) త్రివిధపరిచ్ఛేదాలను (కాలదేశవస్తుగతాలైన మూడు విధాలైన పరిచ్ఛేదాలను) లేనివాడా! నా సంసారాన్ని పరిచ్ఛేదించినా, దేవరవారి ప్రభావాన్ని పరిచ్ఛేదించడం - "ఇంతటిది'' అన్ని లెక్కకట్టి పల్కడం సాధ్యం కాదని ఈసంబోధనలోని భావం. (ఇది "అనంత" అనే పదాన్ని సంబోధనాంతంగా, వ్యస్తపదంగా గ్రహించినపుడు స్ఫురించే భావం) లేక, "అనంత" శబ్దాన్ని అర్ణవానికి విశేషణంగా చేసి, తీరం చూడలేని సంసారసముద్రం- అని కూడా చెప్పవచ్చు.

మెన్నవుమామ్.

**(మే) "ఆవారార్ తుణై యెన్రలై నీర్క్కడలుళ్ఴున్దుమ్ నావాయ్" (తి-వాయ్-5-1-9)** ఎన్గిఱపడియే అఴున్దుకిఱ ఎనక్కు. సనకాదికళైప్పోలే కరైప్పఱ్ఱిలే యిరున్దేనో?

**(చిరాయ)** అనాదికాలమెల్లా మెఴున్దుకిఱ ఎనక్కు.

**(మే)** అఴున్దుకై యొఴియ ప్పరిహారవ్ పార్ క్క అఱియాతవెనక్కు

**(కూలమివ లబ్ధోఽపి) "ఉన్ పేరరుళాలిక్కరై యేఱి" (పెరి-తి-5-3-7)** ఎన్నుమ్బడియే అఴున్దుకిఱ విడత్తిలే కరై కిట్టినాప్పోలే లబ్ధనాకానిన్గాయ్.

---

**(మే)- "ఆవారార్ తుణై ఎన్రలై నీర్క్కడలుళ్ అఴున్దుమ్ నావాయ్"** (రక్షించేవారెవరు? అని అలలు లేచే సముద్రంలో మునిగిపోయే నావవలె) అనే రీతిలో సంసారసముద్రంలో మునిగే నాకు- అని భావం. నేను సనకాది మునులవలె సముద్రతీరాన్ని ఆశ్రయించి లేనుకదా !

**(చిరాయ)** - అనాదికాలంగా సంసారసముద్రంలో మునిగి ఉండే నాకు.

**(మే)** - మునిగిపోవడమే తప్ప, పైకి లేచే ఉపాయాన్ని గమనించడం ఏవిధంగానో తెలియని నాకు.

**(కూలమివ లబోఽ్ధపి) - "ఉన్‌పేరరుళా లిక్కరైఏఱి"** (నీ గొప్ప కరుణతో సంసారసముద్ర తీరాన్ని ఎక్కి)అనే రీతిలో మునిగిపోయే చోట తీరం దరిచేరినట్లుగా, నాకు నీవు లభించావు.

**(త్వయాఽపి లబ్ధమ్)** - నీకు కూడా (ఒకటి) లభించింది. నాకు, దేవరవారు అలభ్యలాభమైనట్లే, **"ఎదిర్‌శూఴల్ పుక్కు"** (నన్ను రక్షించాలని



**(త్వయాఽపి లబ్ధమ్)** దేవరాలుమ్ లభిక్కప్పట్టతు. ఎనక్కు దేవర్ పెఱాప్పేఱానాప్పోలేయితే ఎతిర్శూఴల్ పుక్కుత్తిరికిఱ దేవర్క్కుమ్ ఇన్ద వస్తు.

**(భగవన్!)** జ్ఞానాదిగుణపూర్ణరాన దేవరుడైయ పేఱెన్నమిడమ్ నానే శొల్లవేణుమో? ఎన్గై.

**(ఇదానీమ్)** దేవరుమ్ నశైయఱ్ఱు విడవేణ్డుమ్బడియాన దుర్దశైయిలే.

**(అనుత్తమం పాత్రమ్)** ఉత్తమోత్తమమాన పాత్రమ్.

**(ఇదమ్)** రక్షకాపేక్షకరిల్లై ఎన్నుమ్ వస్తు.

---

ఎదురు ఉపాయాన్ని చేసి) సంచరించే దేవరవారికి, ఈ (నా) ఆత్మవస్తువు అలభ్యలాభంగా దొరికింది.

**(భగవన్!)** - జ్ఞానశక్త్యాది గుణాలతో పూర్ణుడవైన నీకు ఇది ప్రయోజనమనే విషయం నేను చెప్పాలా! - అనేది ఈ సంబోధనతాత్పర్యం.

**(ఇదానీమ్)** దేవరవారు (ఇక నన్ను ఏవిధంగా రక్షించాలో తెలియక) ఆశను కోల్పోయి, ఇక విడువవలసిన ఈదుర్దశలో,

**(అనుత్తమం పాత్రమ్)** - ఉత్తమోత్తమమైన పాత్రంగా,

**(ఇదమ్)**- రక్షకాపేక్షకులు లేరు - అనే ఈఆత్మవస్తువు. (**"రక్షకాపేక్షైక్కినియిల్లై- ఎన్నుమ్ వస్తు"** అనే పాఠాంతరానికి - రక్షించే వారెవరో? అని అపేక్షించడానికి ఇక లేదు - అనేస్థితిలో ఉండే నా ఆత్మవస్తువు - అని భావం.)

**(దయాయాః)** - రక్షింపబడదగిన విషయమనేది ఒకటి ఉంటే,

(దయాయాః) రక్ష్యవిషయముణ్డాకిల్ తానుణ్డామ్బుడియాన దేవరుడైయ దయైక్కు.

25శ్లో॥ అభూతపూర్వం మమ భావి కిం వా
సర్వం సహే మే సహజం హి దుఃఖమ్।
కిన్తు త్వదగ్రే శరణాగతానాం
పరాభవో నాథ! న తేఽనురూపః ॥

అవ : (అభూతపూర్వమితి) నమ్పక్కల్ న్యస్తభరరా-యిరుక్కిఱ వుమక్కు "తత్తస్య సదృశం భవేత్" (రా-సు-39-30) ఎన్గిఱపడియే నాన్ శెయ్తపడి కణ్డిరుక్కై స్వరూపమాయిరుక్క, ఇజ్గనే నిర్బన్దిక్కక్కడవీరో? ఎన్న; ఎన్నుడైయ అనర్థత్తై ప్పరిహరిక్క చ్చొల్లుకిఱేనల్లేన్. ఆశ్రితర్క్కు విషయఙ్గళాల్ వరుమ్ పరిభవమ్ రక్షకరాన దేవర్క్కు తేజోహాని యెన్ఱు అత్తై ప్పరిహరిక్కచ్చొల్లుకిఱేన్- ఎన్గిఱార్.

---

తానుండే దేవరవారి దయకు - అని భావం.

25శ్లో॥ అవ : (అభూతపూర్వమితి) - నావద్ద మీ రక్షణభారాన్ని సమర్పించిన మీకు "తత్తస్య సదృశం భవేత్" (నన్ను రక్షించడం అనేది అతనికి తగినదై ఉంటుంది) అనేవిధంగా నేను చేసేరీతిని గమనిస్తూ ఉండడం మీ స్వరూపమై ఉండగా, ఈ విధంగా రక్షించమని నన్ను నిర్బంధించవచ్చునా? - అని అంటే, నాకు కల్గిన అనర్థాన్ని (ఆపదను) తీర్చమని అనడం లేదు. నిన్ను ఆశ్రయించినవారికి లౌకిక విషయాల వల్ల కలిగే పరాభవం రక్షకుడవైన నీకు తేజోహానిని (అపకీర్తిని) కల్గిస్తుంది - అనే కారణంచేత, దానిని లేకుండా చేయమని పల్కుతున్నాను - అని అంటున్నారు.



వ్యా : (మమ అభూతపూర్వం భావి కిం వా) నరకగర్భవాస జనన మరణక్లేశాదికళే యాత్రైయాయ్ప్పోన్ద ఎనక్కు, మున్బు అనుభూతమన్ఱిక్కే ఇని అనుభావ్యమాయిరుప్పతొరు దుఃఖముణ్డో?

(కిమ్) క్షేపే.

(సర్వం సహే) అధివ్యాధికళ్, పరిపరిభవమ్, శీతోష్ణాదికళ్, తద్విశ్లేషజనితదుఃఖమ్- ఇవఱ్ఱై ఇవర్సహిక్కవల్లరాయ్ చ్చొల్లుకిఱారల్లర్, ఆత్మా- నిత్యన్, కాలమ్- అనాది, ఇవఱ్ఱై ప్పొఱుత్తు, ఉళ్ కొతిప్పాలే నశియాతే కిడన్ద ఆశ్చర్యత్తై క్కణ్డుశొల్లు కిఱార్.

(మే సహజం హి దుఃఖమ్) అనాదికాలమ్ కర్మమే నిరూపకమాక ప్పోన్ద ఎనక్కు. అతిన్ఫలమాన దుఃఖముమ్ సహజమన్రో?

---

వ్యా : (మమ అభూతపూర్వం భావి కిం వా)- నరకం, గర్భవాసం, జననం, మరణం మొదలైన క్లేశాలే జీవన యాత్రగా గడపిన నాకు, ఇంతకుముందు అనుభవించనిది, ఇక అనుభవించవలసినదైన దుఃఖం అనేది ఒకటి ఉన్నదా?

(కిమ్) - ఉందా ఏమి ? లేదనే క్షేపంలోనే దీని తాత్పర్యం.

(సర్వం సహే) - మానసిక క్లేశాలు, శారీరక వ్యాధులు, పరాభవం, చలి, వేడిమి, నీ ఎడబాటువల్ల కలిగే దుఃఖం - అనే వీటిని వీరు సహించగల్గినవారై ఈ మాటను అనడం లేదు. ఆత్మ-నిత్యుడు, కాలం-అనాది, వీటిని అన్నిటినీ సహించి, లోపల కల్గిన తాపంవల్ల ఆత్మ నశించకుండా ఇంకా ఉన్నదే! - అనే ఆశ్చర్యకరమైన విషయాన్ని గమనించి పల్కుతున్నారు.

(మే సహజం హి దుఃఖమ్) - అనాదికాలం కర్మమే నిరూపకలక్షణంగా ఉండే నాకు, తత్కర్మఫలమైన దుఃఖం కూడా సహజమే కదా. అనాదిగా కర్మ చేయడమే సహజమైతే, దాని అనుభవమైన దుఃఖం కూడా సహజమే.

(కిన్తు) పొఱుక్కవొణ్ణాతతొన్టుణ్డు.

(త్వదగ్రే) సర్వశేషియాయ్, సర్వత్ర సన్నిహితరాన దేవర్‌తిరుమున్బే.

(శరణాగతానాం పరాభవః) ఉన్బక్కల్ న్యస్తభరరాయిరుక్కుమవర్‌కళుక్కు, శబ్దాదివిషయ ప్రావణ్యత్తాల్ వన్ద ఎళివరవు. "పావియేనై ప్పల నీ కాట్టి ప్పడుప్పాయో?" (తి-వాయ్-2-9-9), "కిఱి శెయ్‌తెన్నై ప్పుఱత్తిట్టిన్నమ్ కెడుప్పాయో?" (తి-వాయ్-2-9-8) ఎన్ఱు విషయసన్నిధియే తుడజ్గి ఎళివరవాయిఱే అనన్య ప్రయోజనర్‌క్కిరుప్పతు. బహువచనత్తాలే శొల్లుకిఱతు- ఒరుత్తనుడైయ ఎళివరవు వైష్ణవజాతిక్కాక వన్దతు -ఎన్ఱై. "ఎజ్గనుమ్ తేఱువరుమరే" (తి-వాయ్-8-1-3) ఎన్గిఱపడియే ఉనక్కు క్కైపుకున్దవర్‌కళుమ్ ఉన్నుడైయ రక్షణత్తిల్ అతిశజ్కై పణ్ణువార్‌కళ్ - ఎన్ఱై.

---

(కిం తు) - కాని, సహించలేనిది ఒకటి ఉన్నది.

(త్వదగ్రే) - సర్వశేషియై, అంతటా సన్నిహితుడవై ఉండే నీ సమక్షంలోనే,

(శరణాగతానాం పరాభవః)- నీవద్ద రక్షణభారాన్ని సమర్పించిన శరణాగతులకు, శబ్దాది లౌకిక విషయాలవల్ల కల్గిన హైన్యం - అని భావం. "పావియేనై పల నీ కాట్టి ప్పడుప్పాయో?" (పాపిష్ఠివాడనైన నన్ను పలు లౌకిక విషయాలను చూపించి బాధిస్తావా?), "కిఱి శెయ్‌దు ఎన్నై ప్పుఱత్తిట్టు ఇన్నమ్ కెడుప్పాయో !" (ఉపాయం చేసి, నన్ను బయటకు గెంటి ఇంకా నశింపజేస్తావా?) అనే రీతిలో లౌకికవిషయాల సన్నిది అనన్య ప్రయోజనులకు చాలా హీనంగా కదా ఉంటుంది. "శరణాగతానామ్" అనేచోట బహువచనంలోని తాత్పర్య మేమంటే- ఒక వైష్ణవునకు కల్గిన హీనత వైష్ణవజాతికి అంతటికి వచ్చినట్లే- అనేభావంతో ప్రయోగింపబడింది. "ఎజ్గనుమ్ తేఱువర్ ఉమరే" (నీభక్తులు ఏవిధంగా ఊరడిల్లుతారు?) అనేటట్లు నీకు లభించిన భక్తులు కూడా



(నాథ!) ఇతు తన్నరశునాడాకిల్ దేవర్‌క్కు వరువతు ఒరు నాథత్వముణ్డో? ఉడైమై నోవుపడుకై ఉడైయవనుక్కు ఎళివరవన్రో?

(న తేఽనురూపః) "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" (గీ-18-22) ఎన్గిఱదేవర్‌క్కనురూపమన్ఱు. అతు ఎనక్కసహ్యమెన్ఱై.

26శ్లో ॥ నిరాసకస్యాపి న తావదుత్సహే
మహేశ! హాతుం తవ పాదపఙ్కజమ్ ।
రుషా నిరస్తోఽపి శిశుః స్తనన్ధయో
న జాతు మాతుశ్చరణౌ జిహాసతి ॥

అవ : (నిరాసకస్యాపి) దేవరుడైయ రక్షణాభావత్తాల్ వన్ద తేజోహానియైయుమ్ పారాతే ఎన్నై క్కైవిడుమన్ఱుమ్ నాన్ విడప్పార్‌క్కిఱిలేన్

---

నీరక్షణను గూర్చి అతిశంకను (చాలా సందేహాన్ని) పొందుతారని తాత్పర్యం.

(నాథ!) - ఇది ఇష్టారాజ్యం (తన్నరశునాడు) అయితే దేవరవారికి నాథత్వమనేది ఉంటుందా? నీవే కదా అందఱికి నాథుడవు. సొత్తు బాధపడడం స్వామికి అగౌరవమే కదా!

(న తేఽనురూపః) - "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" (అన్ని పాపాలనుండి శరణాగతిచేసిన వారిని విడిపిస్తాను) అని పల్కి నీకు తగినది కాదు. అదినాకు సహించరానిది (నీకు అపకీర్తి కల్గడం - నాకు సహించరానిది) అని తాత్పర్యం.

26శ్లో ॥ అవ : నీవు నన్ను రక్షించకపోవడంవల్ల కలిగే అపకీర్తిని (తేజోహానిని) కూడా చూడకుండా, నన్ను విడచి పెట్టినప్పటికీ, నేనుమాత్రం నిన్ను విడచిపెట్టాలని చూడడంలేదు - అని అంటూ తమ అగతిత్వంవల్ల (ఏగతి

- ఎన్ఱు తమ్ముడైయ అగతిత్వత్తాలే తమ్ముడైయ మహావిశ్వాసత్తై ఆవిష్కరిక్కిఱార్.

వ్యా : (నిరాసకస్యాపి) రక్షకత్వమే స్వరూపమాయిరుక్కిఱ దేవర్ నిరాసకరాక ప్రసఙ్గమిల్లై. ఇప్పడి దేవర్ నిర్ఘృణరాయ్, నిరాసకరానాలుమ్.

(తవ పాదపఙ్కజం తావత్ హాతుం నోత్సహే) రక్షకముమాయ్, ప్రాప్తముమాయ్, భోగ్యముమాన తిరువడికళై నాన్ మున్దుఱ మున్నమ్‌విట్టు జీవిక్క శ్రద్ధై పణ్ణుకిఱిలేన్. "కణ్డారికఴ్ వనవే కాతలన్దాన్ శెయ్‌తిడినుమ్ కొణ్డానైయల్లాలఱియా క్కులమకళ్‌పోల్" (పెరి-తి-5-2) ఎన్ఱు దేవర రక్షకరన్ఱియిలే యొఴిన్దాలుమ్ పుఱమ్బు పోక్కిల్లై యెన్గై.

(మహేశ!) "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" (శ్వే-6-7),

---

లేని స్థితివల్ల) తమకు ఏర్పడిన మహావిశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నారు. (మహావిశ్వాసం అనేది శరణాగతి అంగాలలో ముఖ్యమైనది)

వ్యా : (నిరాసకస్యాపి) రక్షకత్వమే స్వరూపంగా కల్గిన దేవరవారు నిరాసకులు (గెంటి వేసేవారు) అయే ప్రసంగం లేనే లేదు. అయినా, ఈ విధంగా దేవరవారు దయావిహీనులై, నన్ను దూరంగా గెంటివేసేవారే అయినా,

(తవ పాదకజం తావత్ హాతుం నోత్సహే) - రక్షకమై, నాకు స్వరూపానురూపమై, భోగ్యమైన మీ శ్రీచరణాలను నేను మునుముందుగా విడచి జీవించాలనే ఉత్సాహాన్ని కలవాడను కాను. "కణ్డారికఴ్‌నవే కాదలన్ తాన్ శెయ్‌దిడినుమ్ కొణ్డానైయల్లాల్ అఱియా క్కులమకళ్‌పోల్" (చూచేవారు నిందించే పనులను భర్త చేసినప్పటికీ, తనను పరిగ్రహించిన భర్తను తప్ప ఇంకొకరిని తెలియని కులసతి వలె) అనే విధంగా రక్షకులు కాకుండా పోయినా, నేను బయటకు పోవడం లేదు - అని తాత్పర్యం.

(మహేశ) - "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"



"ఈశ్వర స్సర్వభూతానామ్" (గీ-18-21) ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే నిరుపాధికనిర్వాహకనానవనే ! సంసారత్తిల్ సంబన్ధఙ్గళ్ పోలే కర్మోపాధికబన్ధమాయ్ పుఱమ్బే పోయ్ జీవిక్కిఱేనో? "సుహృదం సర్వభూతానామ్" (గీ-5-29) ఎన్ఱుమ్, "సర్వేషామేవ లోకానాం పితా మాతా చ మాధవః" (భార-ఆర) ఎన్ఱుమ్, నిరుపాధికమాన పితావుమ్, బన్ధువుమ్ పుఱమ్బే యుణ్డాయ్, దేవరై విట్టు ప్పోయ్ జీవిక్కిఱేనో?

(స్తనన్ధయ శ్శిశుః రుషా నిరస్తోఽపి) స్తన్యమే ధారకమాన శిశువానతు జననియాలే క్రోధమడియాక క్కైవిడప్పట్టాలుమ్. స్వరక్షణత్తిల్ శక్తియన్ఱిక్కే మాత్రేకరక్ష్యమాన దశైయై చ్చొల్లుకిఱతు. ఇవ్వాత్మవస్తువుమ్ ఈశ్వరైక రక్ష్యమాయ్, అవనుక్కు నిత్యస్తనన్ధయమాయిఱే యిరుప్పతు. "అరిశినత్తాలీన్ఱ

---

(ఈశ్వరులందరికి గొప్ప మహేశ్వరుడైన ఆభగవంతుని) అని, "ఈశ్వర స్సర్వభూతానామ్" (సమస్తజీవులకు ఈశ్వరుడు) అని పలికేటట్లు నిరుపాధికనిర్వాహకుడైన వాడా! సంసారంలోని సంబంధాలవలె కర్మను ఉపాధిగా కల్గి వచ్చిన బంధాన్ని కలవాడనై, బయటకు వేఱొకని దగ్గరకు పోయి జీవించగలనా? "సుహృదం సర్వభూతానామ్" (ప్రాణులందరికి మంచిని కోరే సుహృత్తు) అని, "సర్వేషామేవ లోకానాం పితా మాతా చ మాధవః " (లోకాలన్నిటికీ తల్లి, తండ్రి మాధవుడే) అని నిరుపాధికుడైన తండ్రి, తల్లి, బంధువు బయట కలవాడనై, దేవరవారిని విడచిపెట్టిపోయి, జీవించగలనా? (జీవించలేను).

(స్తనంధయ శ్శిశుః రుషా నిరస్తోఽపి) - స్తన్యక్షీరమే ధారకంగా ఉండే చంటిబిడ్డను తల్లి తీవ్రమైన కోపం కారణంగా చేయివిడచినా - అని భావం "స్తనంధయః" అనే పదంద్వారా తన రక్షణలో తనకు శక్తి లేకుండా, కేవలం తల్లిచేతనే రక్షింపదగిన శిశువు దశ తెలుపబడింది. ఈ ఆత్మవస్తువుకూడా ఈశ్వరుని ఒక్కనిచే మాత్రమే రక్షింపదగినదై, అందువల్ల, అతనికి

తాయ్ కఱ్ఱిడినుమ్ మఱ్ఱవళ్ తన్నరుళ్ నినైన్దే యఴుమ్ కుఴవి" (పెరు-తి-5-1). "ఈన్ఱతాయ్" ఎన్నుమ్, "అరిశినమ్" ఎన్నుమ్ విరుద్ధధర్మమ్ ఏకాశ్రయత్తిల్ సమ్భవియాతెన్నై. పితావుక్కు హితార్థమాన క్రోధమ్ సమ్భవిక్కిలుమ్ మాతృవిషయత్తిల్ క్రోధసమ్భావనై యిల్లైయిఱే.

**(జాతు)** ఒరుకాల్ క్రుద్ధైయానపోతోడు ఆదరిత్తపోతోడు వాశియఱ.

**(మాతు శ్చరణౌ న జిహాసతి)** కైయాలే తళ్ళుకై యన్ఱిక్కే, కాలాలే తళ్ళిలుమ్ అన్ద క్కాలై క్కట్టిక్కొళ్ళు మత్తనైయొఴియ ప్పుఱమ్బే పోకప్పారాతాప్పోలే.

---

నిత్యస్తనంధయ శిశువుగా కదా ఉన్నది. "అరిశినత్తాలీన్ఱతాయ్ అకఱ్ఱిడినుమ్ మఱ్ఱవళ్తన్నరుళ్ నినైన్దే అఴుమ్ కుఴవి" (మిక్కిలి కోపంతో కన్నతల్లి దూరంగా గెంటివేసినా, మళ్ళీ ఆమె దయను మనస్సులో భావిస్తూ ఆ శిశువు రోదిస్తుంది) అనే కులశేఖరసూక్తి స్మరణీయం. "ఈన్ఱ తాయ్" (కన్నతల్లి) అని, "అరి శినమ్" (తీవ్రమైనకోపం) అని పరస్పరం విరుద్ధధర్మాలు రెండు ఒకే వ్యక్తిలో ఉండవని తాత్పర్యం. తండ్రికి, హితం కారణంగా క్రోధం కల్గినా, తల్లి విషయంలో క్రోధం ఏర్పడే అవకాశం లేదు.

**(జాతు)** - ఆ విధంగా కాకుండా, ఒకవేళ ఆమె క్రుద్ధురాలైనపుడు, ఆదరించినపుడు తేడాలేకుండా,

**(మాతు శ్చరణౌ న జిహాసతి)**- చేతితో గెంటివేయడం కాకుండా కాలితో తన్ని గెంటినా, ఆకాళ్ళను చుట్టుకొని ఉంటుంది తప్ప, బయటకు పోవాలని చూడని రీతిలో, నేనుకూడా, నీవు రక్షించకుండా నన్ను విడచినా, నిన్నువిడచి ఇంకొకరిదగ్గరకు పోను - అని తాత్పర్యం.



**27శ్లో॥** తవామృతస్యన్దిని పాదపఙ్కజే
నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి ।
స్థితేఽరవిన్దే మకరన్దనిర్భరే
మధువ్రతో నేక్షురకం హి వీక్షతే ॥

**అవ : (తవామృతస్యన్దిని)** ఎన్నుడైయ అగతిత్వత్తాలే విడమాట్టాతవళవేయో? దేవర్భోగ్యతైయిలే అఴున్దిన మనస్సు వేఱొన్ఱిల్ పోకమాట్టాతు- ఎన్గిఱార్.

**వ్యా : (తవామృతస్యన్దిని పాదపఙ్కజే)** ప్రాప్తముమాయ్, భోగ్యముమాన దేవర్తిరువడిత్తామరైకళిలే. అమృతత్తై ప్రవహిక్కిఱ తిరువడిత్తామరైకళిలే. "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (పురుషసూ), "రసో వై సః" (తై-ఆ-7-0), "తేనే మలరుమ్ తిరుప్పాతమ్" (తి-వాయ్-1-5-5)ఎన్ఱు శ్రుతిసిద్ధమిఱే ఉన్నుడైయ భోగ్యతై.

**(నివేశితాత్మా)** దేవరుడైయ నిర్హేతుకమాన ప్రసాదత్తాలే నివేశిక్కప్పట్ట

---

**27శ్లో॥ అవ : (తవామృతస్యందిని)** - నా అగతిత్వం వల్ల నిన్ను విడువలేకపోవడం మాత్రమేనా! దేవరవారి భోగ్యతలో మగ్నమైన నా మనస్సు వేఱొకదానిలో దేనిలోకి పోలేదు- అని అంటున్నారు.

**వ్యా : (తవామృతస్యందిని పాదపంకజే)** - ప్రాప్తమై (స్వరూపానికి తగినదై), భోగ్యం కూడా అయిన దేవరవారి శ్రీచరణపద్మాలలో- అని భావం. అమృతాన్ని ప్రవహించే శ్రీచరణపద్మాలలో. "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (మధువును ప్రవహించే, విష్ణువుయొక్క గొప్ప పదంలో) అని, "రసో వై సః" (ఆ భగవంతుడు రసస్వరూపికదా) అని, "తేనే మలరుమ్ తిరుప్పాదమ్" (తేనెను స్రవించే శ్రీచరణం) అని నీ భోగ్యత వేదంలో ప్రసిద్ధం కదా!

**(నివేశితాత్మా)** - దేవరవారి నిర్హేతుకమైన అనుగ్రహంతో

మనస్సానతు. అభోగ్యజ్గళుమాయ్, అప్రాప్తజ్గళుమాన హేయవిషయజ్గళిలే వழకిప్పోన్ద మనస్సు, సూరిభోగ్యమాన దేవర్‌తిరువడికళిలే అవగాహిక్కుమ్బోతు దేవర్‌ప్రసాదమే హేతువాక వేణ్డావో?

**(కథమన్యదిచ్ఛతి)** **"మయ్యాసక్త మనాః" (గీ-7-1)** ఎన్గిఱపడియే దేవర్ తిరువడికళిలే సక్తమాన మనస్సు తద్వ్యరిక్తవిషయజ్గళిలే శ్రద్ధై పణ్ణుమ్బడి ఎజ్గనే? ఉన్ వాశియైయు మఱిన్దువైత్తు చైతన్యప్రసరణద్వారమాన ఇతు, విషయాన్తరజ్గళై విరుమ్బుమ్బడి యెజ్గనే ?

**(అరవిన్దే మకరన్దనిర్భరే స్థితే)** సుఖస్పర్శమాయ్, మధువాలే పూర్ణమాన శెన్దామరై యానతు, భోక్తాక్కళై క్కుఱిత్తు అవసరప్రతీక్షమాయ్ నిఱ్క,

---

ప్రవేశింపజేయబడిన నా మనస్సు, భోగ్యాలు కానివి, నా స్వరూపానికి తగనివి అయిన లౌకికాలైన నీచవిషయాలలో అలవాటు పడిన మనస్సు, నిత్యసూరులకు భోగ్యమైన దేవరవారి శ్రీచరణాలలో అవగాహిస్తే (ప్రీతితో చేరేటపుడు) దానికి హేతువు దేవరవారి అనుగ్రహమే కదా అవుతుంది.

**(కథమన్యదిచ్ఛతి) - "మయ్యాసక్తమనాః"** (నాపట్ల ఆసక్తిని పొందిన మనస్సు కలవాడు) అనే విధంగా దేవరవారి శ్రీపాదాలలో ఆసక్తిని పొందిన మనస్సు ఆ చరణాల కంటే వేఱయిన లౌకికవిషయాలలో ఏవిధంగా శ్రద్ధను కల్గి ఉంటుంది? నీ వైలక్షణ్యాన్ని తెలిసిన తరువాత కూడా, చైతన్యం ప్రసరించే మార్గమైన ఈ మనస్సు, విషయాంతరాలను ఏవిధంగా ఆశపడి ఆదరిస్తుంది?

**(అరవిందే మకరందనిర్భరే స్థితౌ) -** సుఖమైన స్పర్శను కల్గినదై, మధువు (తేనె)తో నిండుగా ఉండే ఎఱ్ఱ తామరపూవు "నన్ను అనుభవించే భోక్తలు ఎవరున్నారు?" అని తగిన సమయంకోసం ఎదురు చూస్తూ ఉండగా,



**(మధువ్రతః)** మధువే జీవనమాన పదార్థమెన్నుతల్. మధుసమృద్ధమానవిడత్తిలే పరుకక్కడవో మెన్గిఱ సజ్కల్పత్తైయుడైయ పదార్థమెన్నుతల్

**(ఇక్షురకం న వీక్షతే)** కిట్టుకైయే అరితాయ్, కిట్టినాల్ నాక్కు ననైక్కప్పోరాతే యిరుక్కిఱ ముళ్ళిప్పూవిలే శెన్టు పడియాతொழికైయన్టిక్కే కటాక్షిప్పతుమ్ శెయ్యాతు.

**(హి)** ఇతు ఉపదేశిక్కవేణుమో ? దేవర్‌క్కు. సమ్ప్రతిపన్నమన్టో? **"ఎజ్గు పోయుయ్ కేనిన్నిణైయడియే అడైయలల్లాల్" (పెరు-తి-5-5)** ఎన్నక్కడవతిఱే.

---

**(మధువ్రతః) -** తేనెమాత్రమే జీవనంగా ఉండే తుమ్మెద- అని భావం. (లేక) మధువుతో (తేనెతో) నిండిన చోట ఆ తేనెను పానం చేద్దాం- అనే సంకల్పాన్ని కల తుమ్మెద - అని భావం.

**(ఇక్షురకం న వీక్షతే) -** దరికి రావడమే అరుదై, ఒకవేళ దగ్గరకు వచ్చినా, నాలుకను అయినా తడుపలేని అల్పమైన తేనెను కల ముళ్ళపూవు (కంటకారికపుష్పం - ముళ్ళగోరింట) వద్దకు పోక పోవడమే కాకుండా, దానివైపు దృష్టిని కూడా పెట్టదు.

**(హి) -** దీనిని నీకు ఉపదేశించాలా? బాగా తెలిసిన విషయమే కదా! **"ఎజ్గుప్పోయ్ ఉయ్‌కేన్ ఇన్నిణైయడియే అడైయలల్లాల్"** (నీ పాదద్వంద్వాన్ని ఆశ్రయించడం తప్ప నేను వేఱొక చోటకు ఎక్కడికి పోయి ఉజ్జీవించగలను?) అని కులశేఖరులన్నారుకదా!

28శ్లో ॥ త్వదఙ్ఘ్రి ముద్దిశ్య కదాపి కేనచిత్
యథాతథా వాపి సకృత్కృతోఽఞ్జలిః ।
తదైవ ముష్ణాత్యశుభాన్యశేషతః
శుభాని పుష్ణాతి న జాతు హీయతే ॥

అవ : **(త్వదఙ్ఘ్రిమ్)** "న ధర్మనిష్ఠోఽస్మి"యిలే దేవర్‌తిరువడికళై లభిక్కైక్కు అనుకూలఙ్గళొన్ఱు మిల్లై యెన్ఱార్. అవ్వళవే యన్ఱు; ప్రతికూలఙ్గళాల్ పూర్ణనెన్ఱార్. ఇప్పడిప్పట్ట ఎనక్కుమ్ **పేఱ్ఱిల్** వన్దాల్ దేవర్‌కృపైయే పర్యాప్తమెన్ఱార్. ఇప్పడి న్యస్తభరనాన ఎన్బక్కలిలే విరోధి మేలిడుకై దేవర్‌క్కు తేజోహాని యెన్ఱార్. అత్తై ప్పారాతే దేవర్‌కైవిట్ట వన్ఱుమ్ పుఱమ్బుపోక్కిల్లై ఎన్ఱార్. ఇనిమేల్ "త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" ఎన్ఱు నీర్ పణ్ణిన ప్రపత్తి యొన్ఱు

---

28శ్లో ॥ అవ : **(త్వదంఘ్రిమ్)** - "న ధర్మనిష్ఠోఽస్మి" అనే శ్లోకంలో "దేవరవారి శ్రీచరణాలను పొందడానికి అనుకూలమైన వానిలో ఏమీ నాకు లేవు" - అన్నారు. అంతేకాదు. ప్రతికూల విషయాలతో నిండిన వాడనని "న నిందితమ్" అనే శ్లోకంతో పలికారు. ఇటువంటివాడనైన నాకు కూడా ప్రాప్యాన్ని గూర్చి ప్రస్తావిస్తే, దేవరవారి అనుగ్రహమే తగిన చాలిన ఉపాయమని "నిమజ్జతః" అనే శ్లోకంలో అన్నారు. ఈ విధంగా న్యస్తభరుడనైన (నీపాదాలలో నారక్షణభారాన్ని సమర్పించినవాడనైన) నా విషయంలో విరోధులు ఆక్రమించడం నీకీర్తికే భంగం అని "అభూతపూర్వమ్" అనే శ్లోకంలో అన్నారు. దానినికూడా లెక్కించకుండా, దేవరవారు నన్ను విడచి పెట్టినా నేను బయటకు ఎక్కడికీ పోను - అని "నిరాసకస్యాపి" అనే శ్లోకంలో పలికారు. (మధ్యలో ప్రాసంగికంగా శ్రీచరణభోగ్యతను తెలిపే "తవామృతస్యందిని" అనే 26వ శ్లోకానికి "త్వదంఘ్రిముద్దిశ్య" అనే 28వ శ్లోకంతో సాక్షాత్ సంగతి ఉన్నది) ఇకపై "తత్పాదమూలం శరణం ప్రపద్యే" (నీ శ్రీపాదసన్నిధిలో శరణు



మమ్మైయుమో? విరోధినివృత్తిక్కుమ్ అభిమతసిద్ధిక్కు మెన్న; మనోవాక్కాయఙ్గళ్ మూన్ఱాలుమ్ పణ్ణిన ప్రపత్తి యెల్లామ్ వేణుమో? "బద్ధాఞ్జలిపుటం దీనం యాచన్తం శరణాగతమ్" (భరద్వాజ సం) ఎన్గిఱ అతిల్ కాయికమాన అఞ్జలి ఒన్ఱు మమైయాతో? ఎన్గిఱార్.

వ్యా : **(త్వదఙ్ఘ్రిమ్)** నిరుపాధికశేషియాన ఉన్నుడైయ నిరతిశయభోగ్యముమాయ్, సర్వసులభమాన తిరువడికళై. ఇత్తాల్ ప్రాప్యముమాయ్, ప్రాపకముమాయ్, ప్రాప్తముమా యిరుక్కిఱపడియై చ్చొల్లుకిఱతు.

**(ఉద్దిశ్య)** ఇత్తైయే పరప్రాప్యమాక నినైత్తు. ఇత్తాల్ ప్రయోజనాన్తర వ్యావృత్తిశొల్లుకిఱతు.

---

పొందుతున్నాను) అని మీరు చేసిన ప్రపత్తి ఒక్కటియే విరోధులు తొలగిపోవడానికి అభిమతం సిద్ధించడానికి చాలునా? - అని భగవంతుడనగా, "మనోవాక్కాయాలు మూడిటితో చేసిన ప్రపత్తి ఆవశ్యకమా? **"బద్ధాంజలి పుటం దీనం యాచంతం శరణాగతమ్"** (చేతులను జోడించి అంజలిని చేసేవాడు, దైన్యాన్ని కలవాడు, ప్రార్థించేవాడు, శరణాగతుడు) అనే త్రివిధకరణాత్మకమైన ప్రపత్తిలో కాయిక ప్రపత్తిరూపమైన అంజలి ఒక్కటియే చాలదా? అని అంటున్నారు.

వ్యా : **(త్వదంఘ్రిమ్)** - నిరుపాధికశేషి అయిన నీయొక్క, అంతులేని భోగ్యతను కల్గినవి, అందఱు ఆశ్రయించడానికి సులభమైనవి అయిన శ్రీచరణాలను - అని భావం. దీనిద్వారా శ్రీచరణాలే ప్రాపకాలుగా (ఉపాయోపేయాలుగా) ఉండే రీతి చెప్పబడింది.

**(ఉద్దిశ్య)** - ఈ శ్రీచరణాలనే పరమప్రాప్యంగా భావించి- అని భావం. దీనివల్ల వేఱొక ప్రయోజనాన్ని ఆశించకపోవడం తెలుపబడింది.

**(కదాపి)** ఇచ్చై పిఱన్ద పోతు కాలమెన్ఱై. ఇత్తాల్ వసన్తగ్రీష్మశరత్ శుక్లపక్షపూర్వాహ్ణ అపరాహ్ణాదికాల నియతియుడైయ జ్యోతిష్టోమాదికళిల్ ఇతుక్కుణ్డాన వ్యావృత్తి.

**(కేనచిత్)**- సర్వాధికారమెన్ఱై! ఇత్తాల్-త్రైవర్ణికత్వ గృహమేధిత్వ కృష్ణకేశత్వ వేదవేదాంగ విద్యాధికారనియమ ముడైయ కర్మఙ్గళిల్ వ్యావృత్తి.

**(యథాతథా)** ప్రకారనియతి యిల్లై యెన్గిఱతు. ఇత్తాల్ శాస్త్రఙ్గళిల్ ప్రకారవిశేష నియతమాన కర్మఙ్గళిల్ వ్యావృత్తి.

''వా అపి'' ఎన్ఱు వికల్పసముచ్చయ సూచకమాన అవ్యయఙ్గళిరణ్డాలుమ్ ఒన్ఱిలే నియతమాన కర్మఙ్గళిలే ఇతుక్కుణ్డాన వ్యావృత్తి

---

**(కదాపి)** - ఆశ కల్గిన సమయంలో ఎపుడైనా- అని భావం. దీనివల్ల వసంత, గ్రీష్మ- శరత్ఋతువులు, శుక్లపక్షం పూర్వాహ్ణం, అపరాహ్ణం- మొదలైన కాలనియమాలను కల జ్యోతిష్టోమాదులకంటే దీనికి కల వైలక్షణ్యం తెలుపబడింది.

**(కేనచిత్)** - అంజలి సర్వాధికారం, అందఱు అంజలిని చేయడానికి అర్హులే- అని భావం. ఇందువల్ల, త్రైవర్ణికులు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులనే మూడు వర్ణాలకు చెందినవారు) గృహస్థులు, నల్లని కేశాలను కలవారు, వేదవేదాంగాలను నేర్చే అధికారం ఉన్నవారే అనుష్ఠించాలనే కర్మలకంటే దీనికల తారతమ్యం తెలుపబడింది.

**(యథాతథా)** - ప్రకారం (ఆచరించే విధానం)లో నియమం లేదని భావం. ఇందువల్ల శాస్త్రాలలో ''ఈ విధంగా ఈ కర్మను ఆచరించాలి'' అనే నియతమైన కర్మలకంటే దీనికి ఉండే తేడా తెలుపబడింది.

**(వా అపి)** - వికల్పాన్ని అని అర్థం. అదికాని, ఇది కాని - అనేది



శొల్లుకిఱతు.

**(సకృత్కృతః)** ఎన్ఱు యావజ్జీవాధికారమాన నిత్యకర్మవ్యావృత్తి శొల్లుకిఱతు.

**(అఞ్జలిః)** విత్తవ్యయాయాసాది సహకారిసాపేక్షమాన అశ్వమేధాదికళిల్కాట్టిల్ ఇతుక్కుణ్డాన సుకరత్వమ్ శొల్లుకిఱతు.

**(తదైవ)** దేశాన్తరే, కాలాన్తరే, దేహాన్తరే ఫలప్రదమాన కర్మఙ్గళిల్ వ్యావృత్తి శొల్లుకిఱతు.

**(అశుభాన్యశేషతః)** సర్వపాపఙ్గళుమ్ మఱువలిడాతపడియే పోకై. "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" (గీ-18-66) ఎన్గిఱపడియే ఒరు పాపత్తుక్కు

---

వికల్పం.ఇది **("వా" శబ్దార్థం)** సముచ్చయాన్ని (అది, ఇది రెండు - అనేది సముచ్చయం. ఇది "అపి" శబ్దార్థం) సూచించే అవ్యయాలు "వా, అపి" అనే రెండిటిద్వారా ఏదో ఒక దానిలో (వికల్పంలోకాని, సముచ్చయంలోకాని) నియతమైన కర్మలకంటే తారతమ్యం తెలుపబడింది.

**(సకృత్ కృతః)** - దీనిద్వారా యావజ్జీవం ఆచరించవలసిన నిత్యకర్మకంటే తేడా తెలుపబడింది.

**(అంజలిః)** - ధనాన్ని వెచ్చించడం, శ్రమపడడం, పలువురి సహాయంతో చేయడం - మొదలైన వానిని అపేక్షించే అశ్వమేధయాగాది కర్మకంటే దీనికి ఉండే సుకరత్వం - సులభంగా చేయగల్గడం - ఈ పదం ద్వారా తెలుపబడింది.

**(తదైవ)** - వేఱొక దేశంలో, వేఱొక కాలంలో, వేఱొక దేహంలో ఫలాన్ని ఇచ్చే కర్మలకంటే వ్యావృత్తి తెలుపబడింది.

**(అశుభాన్యశేషతః)** - సర్వపాపాలు మళ్ళీ తిరిగి తల ఎత్తని రీతిలో నశిస్తాయి. "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అనేవిధంగా ఒక్కొక్క రూపానికి

ఒరు ప్రాయశ్చిత్తమాన ద్వాదశవార్షిక సంవత్సరచాన్ద్రాయణ కృచ్ఛ్రాదికళిల్ వ్యావృత్తి.

**(ముష్ణాతి) "ముష స్తేయే", "వఞ్జిత్తు ము*ఱ్ఱు*మ్ తవిర్న్ద" (తి-వాయ్-8-10-1), "శుమ్మెనాతే కైవిట్టోడి" (పెరి-తి-5-4-3), "కానో వొరుజ్గి*ఱ్ఱు*" (పెరియతివ-54)** ఎన్గిఅపడియే పోనప్రకారమ్ తెరియాతపడి పోకై.

**(శుభాని పుష్ణాతి)** విరోధికళైప్పోక్కి విడుమళవిన్రిక్కే, అభిమతజ్గళాలే పూర్ణమాక్కుమ్. బహువచనత్తాలే పరభక్తిపరజ్ఞాన పరమభక్తిదేశ విశేషప్రాప్తిభగవల్లాభ ప్రాప్తిఫలమాన కైఙ్కర్యమ్, ఇవ*ఱ్ఱై* చ్చొల్లుకిఱతు. ఇత్తాల్ స్వర్గాదికళాన ఓరోరు ఫలజ్గళిలే నియతమాన కర్మజ్గళిల్ వ్యావృత్తి.

---

ఒక్కొక్క ప్రాయశ్చిత్తంగా చెప్పబడిన ద్వాదశవార్షిక (పన్నెండేళ్ళకాలం), కాలం చేసే కర్మలు, చాంద్రాయణం, కృచ్ఛ్రం మొదలైన వానికంటే గల తేడా తెలుపబడింది.

**(ముష్ణాతి) "ముష-స్తేయే"** అనేది ఇచటి ధాతువు. అపహరిస్తుందని భావం. **"వఞ్జిత్తు ము*ఱ్ఱు*మ్ తవిర్న్ద"** (వంచించి, మొత్తం తీర్చిన) అని, **"శుమ్మెనాదే కైవిట్టోడి"** (కిమ్మనకుండా, చేతిని విడచిపరుగెత్తి), అని, **"కానోఒరుజ్గి*ఱ్ఱు*"** (అరణ్యంలోకి పారిపోయాయా?) అనేవిధంగా పోయిన రీతి తెలియనట్లుగా పోతాయి.

**(శుభాని పుష్ణాతి)** - విరోధులను పోగొట్టడమే కాక, అభిమతాలను పూర్తి చేస్తుంది. **"శుభాని"** అనే పదంలోని బహువచనంతో పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులు, దేశవిశేషప్రాప్తి (కైవల్యం), భగవల్లాభ ప్రాప్తి (మోక్ష) ఫలమైన కైంకర్యం - అనే ఇవి తెలుపబడతాయి. ఇందువల్ల, స్వర్గం మొదలైన ఒక్కొక్కఫలాన్ని మాత్రం ఇచ్చే కర్మలకంటే గల వైలక్షణ్యం తెలుపబడింది.



**(న జాతు హీయతే)** ఇత్తనైయుమ్ కొడుత్తాలుమ్ తాన్కుఱైయాతిరుక్కై.

ఇత్తాల్ ఫలప్రదానత్తళవిలే క్షీణశక్తికమాన కర్మజ్గళిల్ వ్యావృత్తి. **"అంజలిః పరమా ముద్రా క్షిప్రం దేవప్రసాదనీ" (భరద్వాజసం), "సుసుఖం కర్తు మవ్యయమ్" (గీ-9-2)** ఎన్నక్కడవతిఱే. క్రియారూపమాన అఞ్జలి కుఱైయాతిరుక్కై యావతు ఎన్? ఎన్నిల్. అనన్యప్రయోజనమాయ్ క్కొణ్డుపణ్ణిన అంజలియాకైయాలే ప్రసన్ననాన ఈశ్వరన్ ఎల్లామ్ శెయ్తాలుమ్ ఒన్రుమ్ శెయ్యాతానాయిరుక్కైయాలే శొల్లుకిఱతు. **"ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి" (భార-ఉద్యో), "ఉన్నడియార్క్కెన్**

---

**(న జాతు హీయతే)** - ఇవి ఇచ్చినా, తాను ఎంత మాత్రం కొఱతను పొందకుండా ఉంటుంది.

ఇందువల్ల ఫలప్రదానం చేసిన తరువాత శక్తి సన్నగిల్లే ఇతరకర్మల కంటే అంజలికి ఉండే తారతమ్యం తెలుపబడింది. **"అంజలిః పరమా ముద్రా క్షిప్రం దేవప్రసాదినీ"** (అంజలిని అనేది గొప్ప సూచకం. అది దేవతలను త్వరగా ప్రపన్నులను చేస్తుంది) అని, **"సుసుఖం కర్తు మవ్యయమ్"** (చేయడంలో సులభమైనది, నశించనిది) అని చెప్పబడుతున్నది కదా! క్రియారూపమైన అంజలి కొఱతను పొందకుండా ఉండడం అంటే ఏమి? అంటే, అనన్యప్రయోజనంగా చేసినదైన (భగవత్ప్రీతి తప్ప వేఱొక ఫలాన్ని ఆశించి చేసినదైన) అంజలి కనుక దానితో ప్రపన్నుడైన భగవంతుడు అన్నీ ఇచ్చినా, ఏమీ చేయలేనివానినిగా తనను భావిస్తాడు కనుక, ఈవిధంగా చెప్పబడింది. భగవంతుని ఈ స్వభావం **"ఋణం ప్రవృద్ధ మివ మే హృదయాన్నాపసర్పతి"** (గోవిందా! అని ద్రౌపది చేసిన ఆక్రందన నాహృదయంనుండి, వడ్డీతో పెరిగిన ఋణంవలె, తొలగిపోవడం లేదు) అని, **"ఉన్నడియార్క్కు ఎన్ శెయ్వన్ ! ఎన్రే యిరుత్తి నీ"** (నీ భక్తులకు "ఇంకా

శెయ్వనెన్ఱేయిరుత్తి నీ” (పెరియతిరువ-53) ఎన్నక్కడవతిఱే.

29శ్లో ॥ ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం
క్షణేన నిర్వాప్య పరాఞ్చ నిర్వృతిమ్ ।
ప్రయచ్ఛతి త్వచ్చరణారుణామ్బుజ -
ద్వయానురాగామృతసిన్ధుశీకరః ॥

అవ : (ఉదీర్ణేత్యాది) ఆయాసాత్మకమాన అఞ్జలితాన్ వేణమో? “శిన్దిప్పే యమైయుమ్” (తి-వాయ్-9-1-) ఎన్గిఱపడియే మానసమాత్రమే వమైయాతో విరోధినివృత్తిపూర్వకమాన పరమసుఖత్తై త్తరుకైక్కు- ఎన్గిఱార్. ఇత్తాల్ “బద్ధాఞ్జలి పుటం దీనమ్” (రా-యు-18-27) ఎన్గిఱ మానసప్రపత్తియై చ్చొల్లుకిఱతు. “న ధర్మనిష్ఠోఽస్మి” ఎన్గిఱ ఇతు- వాచిక ప్రపత్తియాయ్, “త్వదంఘ్రి ముద్దిశ్య” ఎన్గిఱవితు, కాయిక ప్రపత్తియాయ్, ఇతిల్ మానసప్రపత్తియెన్నవుమామ్. అథవా, “త్వదంఘ్రిమ్”, “ఉదీర్ణ” ఎన్గిఱ

---

ఇంకా ఏమేమి చేయగలను?'' అని నీవు భావిస్తూ ఉంటావు) ఇత్యాదులలో చెప్పబడింది.

29శ్లో ॥ అవ : (ఉదీర్ణేత్యాది) శ్రమరూపమైన అంజలిని చేయాలా? (కాయిక ప్రపత్తిని చేయాలా?) “శిన్దిప్పే అమైయుమ్” (మనస్సులో చింతిస్తేనే చాలు) అనే రీతిలో మానసిక ప్రపత్తియే విరోధిని తీర్చి, పరమసుఖాన్ని కల్గించడానికి చాలదా? అని ఇందులో పల్కుతున్నారు. దీనివల్ల “బద్ధాఞ్జలి పుటం దీనమ్” (రెండు చేతులలతో అంజలి చేసినవాడు, మనస్సులో దైన్యాన్ని పొందిన వాడు) అనే మానసిక ప్రపత్తి తెలుపబడింది. (లేక) “న ధర్మనిష్ఠోఽస్మి” అనే శ్లోకంలో వాచిక ప్రపత్తి, “త్వదంఘ్రిముద్దిశ్య” అనే శ్లోకంతో కాయిక ప్రపత్తి, ఇందులో మానసిక ప్రపత్తి చేయబడిందని చెప్పవచ్చు. (లేక) “త్వదంఘ్రిమ్”, “ఉదీర్ణ”



శ్లోకద్వయత్తాలే ప్రపత్తిఫలమాన పరభక్తియై చ్చొల్లుకిఱతు ఎన్నవుమామ్.

వ్యా : (ఉదీర్ణసంసారదవాశుశుక్షణిమ్) కిళర్న్దెరికిఱ సంసారమాకిఱ కాట్టుత్తీయై. సంసారత్తై క్కాట్టు త్తీయాక చ్చొల్లుకిఱతు - దాహ్యమాన కాట్టిలగ్నియై అవిక్కవొణ్ణాతాప్పోలే అవిద్యాదికళుక్కిలక్కామిత్తనైయొழియ ప్పరిహరిక్క వొణ్ణాతు-ఎన్నైక్కాక. ఆత్మా అదాహ్యనెన్గిఱతు లౌకికాగ్నిక్కిఱే. సంసారాగ్ని “అసన్నేవ” (తై-ఆ-2-1) ఎన్గిఱపడియే దగ్ధపటమ్బోలే యాక్కుమిఱే.

(క్షణేన నిర్వాప్య) “అథ సోఽభయంగతో భవతి” (తై-ఆ-7-2) ఎన్గిఱపడియే అప్పోతే అవిత్తు. “తదైవ ముష్ణాతి”, “క్షణేన నిర్వాప్య” ఎన్టుమ్

---

అనే రెండు శ్లోకాలతో ప్రపత్తి ఫలమైన పరభక్తి తెలుపబడుతున్నదని కూడా చెప్పవచ్చు.

వ్యా : (ఉదీర్ణసంసారదవాశుశుక్షణిమ్) - విజృంభించి, జ్వలించే సంసారమనే దావాగ్నిని - అని అర్థం. సంసారాన్ని దావాగ్నిగా రూపించి పల్కడం - దహింపబడే అరణ్యంలోని దావాగ్నిని ఆర్పడానికి సాధ్యం కానట్లుగా, అవిద్యాదులకు లక్ష్యం అవుతుంది తప్ప, సంసారమనే దావాగ్ని పూర్తిగా లేకుండా చేయడానికి సాధ్యం కాదు - అని తెలుపడంకోసం. ఆత్మ ఆదాహ్యం (దహింపరానిది) అని అనడం లౌకికమైన అగ్నిని ఉద్దేశించికదా! సంసారాగ్ని ఆత్మను “అసన్నేవ” (లేనివాడే అవుతున్నాడు) అనేటట్లు దగ్ధపటం (దహింపబడిన వస్త్రం) వలె చేస్తుంది కదా (భౌతికంగా ఉన్నట్లు కన్పించినా, లేనిదిగా చేస్తుంది)

(క్షణేన నిర్వ్యాప్య) - “అథ సోఽభయంగతో భవతి” (అపుడతడు సంసారమనే భయం లేనివాడవుతున్నాడు) అనే రీతిలో అపుడే సంసారాగ్నిని ఆర్పివేసి - అని అర్థం. “తదైవ ముష్ణాతి” (అపుడే అపహరిస్తుంది) అని, “క్షణేన నిర్వాప్య” (క్షణంలో ఆర్పివేసి) అని అన్నందున ప్రపన్నుడనే ఈ అధికారి ఫలం పొందడంలో ఆసల్యం ఉండదని అంటున్నారు. “యథైషీకాతూల

**శొల్లుకైయాలే ఇవ్వధికారిక్కు ఫలత్తుక్కు విళమ్బుమిల్లై ఎన్గిఱార్. "యద్వైషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత" (ఛా-5-24-3) ఎన్గిఱపడియే సంసారత్తిలే ఇవన్ పట్ట నోవై ఇవన్ విరోధివర్గత్తోడే పోక్కుమీశ్వరన్ - ఎన్రై.**

**(పరాఞ్చ నిర్వృతిం ప్రయచ్ఛతి) ఒరు దేశవిశేషత్తిలే ఆనన్ద నిర్భరనాయిరక్కు మిరుప్పై త్తారానిఱ్కుమ్. "నిరఞ్జనః పరమం సామ్యముపైతి" (ముణ్డ-4-1-3), "మమ సాధర్మ్య మాగతాః" (గీ-14-2), "స స్వరాడ్భవతి" (ఛా-7-25-2) ఎన్నుమ్ సుఖమిఱే.**

**(త్వచ్చరణారుణామ్బుజేత్యాది) ప్రాప్తనాయ్, సులభనాన ఉన్నుడైయ శివన్ద తామరైపోలే నిరతిశయభోగ్యమాన తిరువడికళిరణ్డిల్ అనురాగమాకిఱ అమృతసాగరత్తిలే ఒరు తివలై. అరుణపదత్తాలే- పరభాగరసమ్ శొల్లుకిఱతు.**

---

మగ్నౌ ప్రోతం ప్రదూయేత" (అగ్నిలో పడిన రెల్లుగడ్డిముక్క ఏవిధంగా దగ్ధమవుతుందో) అన్నట్లు సంసారంలో ఇతడు పడిన క్లేశాన్ని సర్వేశ్వరుడు, ఇతని విరోధి వర్గంతో పాటుగా పోగొడతాడని భావం.

**(పరాం చ నిర్వృతిం ప్రయచ్ఛతి)** - ఒక దేశవిశేషంలో (పరమపదంలో) ఆనందంతో పూర్ణుడై ఉండే స్థితిని కల్గిస్తాడు. ఇక్కడ చెప్పబడిన **"పరాం నిర్వృతిమ్"** అనేది - **"నిరంజనః పరమం సామ్యముపైతి"** (కర్మసంబంధం తీరినవాడు పరమాత్మతో పూర్ణమైన సామ్యాన్ని పొందుతున్నాడు) అని, **"మమ సాధర్మ్యమాగతాః"** (నాతో సాధర్మ్యాన్ని పొందినవారు) అని, **"స సర్వాట్ భవతి"** (ఆముక్తుడు స్వతంత్రుడవుతున్నాడు) అనే సుఖం కదా!

**(త్వచ్చరణారుణంబుజేత్యాది)** - మాకు ప్రాప్తశేషివై, సులభుడవైన నీ ఎఱ్ఱని, తామరలవంటి, అంతులేని భోగ్యమైన శ్రీచరణాలు రెండిటిలోని అనురాగమనే అమృతసాగరంలోని ఒక చిన్నకణాన్ని - అని అర్థం. అరుణపదంతో పరభాగశోభ నీలవర్ణ - అరుణవర్ణాల కలయికవల్ల ఏర్పడిన



**అమ్బుజపదత్తాలే- మెన్మై కుళిర్చ్చి, నాற்றజ్గళాల్ వన్ద రసమ్. ద్వయపదత్తాలే అన్యోన్యసదృశమాన శేర్త్తియழకాల్ వన్ద సారస్యమ్. ఇత్తాల్, అనురాగజనకమాన తిరువడికళ్ఱై.**

**(అనురాగ) తిరువడికళిల్ అధ్యవసాయాత్మకమాన రుచి యెన్నుతల్. ప్రపత్తిఫలమాయ్ కైజ్కర్యోపకరణమాన భక్తి యెన్నుతల్. ప్రీతికారితమిఱే కైజ్కర్యమ్.**

**(అమృత) స్మర్తవ్యవిషయసారస్యత్తాలే స్వయంప్రయోజన మాయిరుక్కైయన్నియే పథ్యమాయిరుక్కై.**

**(సిన్ధుశీకరః) "అతనిల్ పెరియ వెన్నవా" (తి-వాయ్-10-10-10)**

---

శోభ) యొక్క అనుభవం చెప్పబడుతున్నది. అంబుజపదంతో మృదుత్వం, చల్లదనం, పరిమళం - అనే వీనివల్ల కల్గిన అనుభవం తెలుపబడుతున్నది. ద్వయమనే పదంతో పరస్పరం పోలికను కల పాదాల రెండిటి చేరికలో అందంవల్ల ఏర్పడిన అనుభవం తెలుపబడుతున్నది. ఏతావతా, వీటివల్ల అనురాగాన్ని (ప్రీతిని) కల్గించే శ్రీచరణాలని తాత్పర్యం.

**(అనురాగ)** - శ్రీచరణాలలోని నిశ్చయాత్మకమైన అభిలాష - అని అర్థం. (లేక) ప్రపత్తిఫలం వల్ల కల్గిన కైంకర్యానికి ఉపకరణమైన (పూర్వభావి అయిన) భక్తి - అని కూడా అర్థం. కైంకర్యం అనేది ప్రీతి ప్రేరేపింపగా చేయబడేదికదా.

**(అమృత)** - స్మరించదగిన భగవంతుడనే విషయంలోని స్వరసతవల్ల, స్వయం ప్రయోజనంగానే కాకుండా, (భోగ్యంగానే కాకుండా) పథ్యంగా హితాన్ని కలుగచేసేదిగా ఉన్నదని భావం.

**(సింధుశీకరః)** - **"అదనిల్ పెరియ ఎన్నవా"** (దాని కంటె పెద్దది, నాఆర్తి) అనే రీతిలో విషయానికి (భగవంతుడనే విషయానికి) తగిన ప్రేమ

ఎన్గిఱపడియే విషయానురూపమాన ప్రేమమెల్లామ్ వేణ్డా అభిమతసిద్ధిక్కెన్గై.

**30శ్లో॥** విలాసవిక్రాన్త పరావరాలయం
నమస్యదార్తిక్షపణే కృతక్షణమ్ ।
ధనం మదీయం తవ పాదపఙ్కజం
కదా ను సాక్షాత్కరవాణి చక్షుషా ॥

అవ : **(విలాసేతి)** ఇప్పడి విళమ్బహేతు విల్లాత సిద్ధోపాయత్తై ప్పరిగ్రహిత్తవరాకైయాలే క్రమప్రాప్తి పఱ్ఱాతే త్వరై ప్రేరిక్క, **"కూవిక్కొళ్ళుమ్ కాల మిన్నమ్ కుఱుకాతో!" (తి-వాయ్-6-6-6)** ఎన్గిఱార్. ప్రబలమాన

అంతా, అభిమతసిద్ధికి ఆవశ్యకం కాదు. ప్రీతి అనే అమృతసముద్రంలోని ఒక్కచిన్న కణం అన్నట్లు అతిస్వల్పమైన ప్రీతి అయినా చాలు, భగవదనుభవమనే గొప్ప ఫలాన్ని పొందడానికి - అని భావం.

**30శ్లో॥** అవ : **(విలాసేతి)** - ఈవిధంగా, ఆలస్యానికి కారణం లేని సిద్ధోపాయాన్ని (శరణాగతిని) స్వీకరించిన (చేసిన) వారైనందున, ఫలం సిద్ధించడంలోని క్రమప్రాప్తిని (ఆవశ్యకమైన కాలావధిని) సహించలేక, ప్రాప్యాన్ని పొందాలనే త్వర ప్రేరేపించగా **"కూవికొళ్ళుమ్ కాలమ్ ఇన్నమ్ కుఱుకాదో"** (నన్ను నీ వద్దకు పిలుచుకొని, స్వీకరించే సమయం ఇంకా దగ్గరపడలేదా?) అని ఇందులో అంటున్నారని చెప్పవచ్చు. లేక, ప్రబలమైన పరభక్తివల్ల **"కనైకழల్ కాణ్బదెన్ఱుకొల్ కణ్గళే"** (నా కళ్ళునీ ధ్వనించే శ్రీచరణాలను దర్శించేది ఎపుడో కదా!) అని, **"కాణ క్కరుదుమ్ ఎన్కణ్ణే"** (నా నేత్రాలు నిన్ను దర్శించాలని ఆశపడుతున్నాయి) అని పల్కినట్లుగా నా



పరభక్తియాలే **"కనైకழల్ కాణ్బతెన్ఱుకొల్ కణ్కళే" (తి-వాయ్-4-6-10)** ఎన్ఱుమ్, **"కాణ క్కరుతు మెన్కణ్ణే" (తి-వాయ్-6-4-1)** ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే ఎన్కణ్ణాలే కాణ్బతెన్ఱు? ఎన్గిఱా రెన్నుమామ్.

వ్యా : **(విలాసేత్యాది)** లీలైయాక ఆక్రమిక్కప్పట్ట ఉత్కృష్టరాన దేవతైకళుడైయ ఇరుప్పిడఙ్గళైయుమ్, అవరరాన మనుష్యాదికళుడైయ ఇరుప్పిడఙ్గళై యముడైత్తాయిరున్దుళ్ళత్తై.

**(విలాస)** విముఖరుడైయ తలైయిలుమ్ అనాయాసేన శెన్ఱిరున్దుళ్ళ తిరువడికళుక్కు రుచియుడైయార్ తలైయిలే యిరుక్కై పణియుణ్డో ?

**(విక్రాన్త)** అన్యపరరానార్ పక్కలిలేయో మేల్ విழలావతు. అనన్యప్రయోజనర్ పక్కల్ మేల్విழలాకాతో?

**(పరావరాలయమ్)** వసిష్ఠచణ్డాళ విభాగమిన్ఱిక్కే ధూళిదానమ్ పణ్ణిన

కళ్ళతో దర్శించడం ఎపుడో కదా! - అని అంటున్నారని కూడా చెప్పవచ్చు.

వ్యా : **(విలాసేత్యాది)** అవలీలగా గొప్ప దేవతల నివాసాలను, వారికంటే అల్పులైన మానవులు మొదలైనవారి నివాసాలను ఆక్రమించినవి, నీ పాదాలని భావం.

**(విలాస)** - నీపట్ల విముఖులైనవారి శిరస్సులపై కూడా ఏ శ్రమ లేకుండా చేరిన నీ శ్రీచరణాలకు, నీ విషయంలో భక్తిని కలవారి తలలపై చేరడంలో ప్రయత్నం ఆవశ్యకమా! లీలగా అవి చేరగలవు గదా!

**(విక్రాంత)** - ప్రయోజనాంతరాన్ని ఆశించే దేవతల విషయంలో ఆదరాన్ని చూపిస్తావా? **(మేల్విళుకై** - మీదపడడం.. అంటే, ఆదరాన్ని చూపడం - అని తాత్పర్యం) అనన్యప్రయోజనులైన మావంటివారిపట్ల ఆదరాన్ని చూపించరాదా?

**(పరావరాలయమ్)** - ఇతడు మహనీయుడైన వశిష్ఠుడు, ఇతడు

తిరువడికళ్ అత్తై యొழియచ్చెల్లాత ఎనక్కు రితావతే. "సఙ్ఘైస్సురాణామ్" (మ్హాల్యస్త) ఎన్గిఱ కర్మభావనానిష్ఠరుమ్, "తవమ్ శెయ్తు నాన్ముకనే పెఱ్ఱాన్" (2-తిరువ-78) ఎన్గిఱ ఉభయభావనానిష్ఠరుమ్ పెఱ్ఱ పేఱు ఎనక్కు రితావతే.

(నమస్యదార్త్తిక్షపణే కృతక్షణమ్) ప్రాసఙ్గికమాక ప్పిఱన్ద అపదానమ్ కిడక్కకిడీర్, తిరువడికళిలే తలైశాయ్త్తారుడైయ ఆర్తికళైప్పోక్కుకైయిలే కృతావసరమాయుళ్ళత్తై. ఆశ్రితరక్షణత్తిలే అవసరప్రతీక్షమాన తిరువడికళై క్కాణ్గైక్కు "కదా ను సాక్షాత్కార వాణి చక్షుషా" ఎన్ఱు కూప్పిడవేణ్డువతే.

(ధనం మదీయమ్) "వైత్తమానితి" (తి-వాయ్-6-7-11) ఎన్గిఱపడియే

---

అత్యల్పుడైన ఛండాలుడు - అనే తేడా లేకుండా అందటికి నీవు అనుగ్రహించిన శ్రీచరణరేణుదానం, అది పొందలేనిదే జీవించలేని నాకు అరుదైనదే! "సంఘైః సురాణామ్" (దేవతల సంఘాలచే) అనే కర్మభావనానిష్ఠులైన దేవతలు, "తవమ్ శెయ్దు నాన్ముకనే పెఱ్ఱాన్" (తపస్సు చేసి చతుర్ముఖ బ్రహ్మ పొందాడు) అనే కర్మబ్రహ్మభావనా నిష్ఠులైన బ్రహ్మాదులు పొందిన ప్రాప్యం (నీ శ్రీచరణరేణుప్రాప్తి) నాకు అరుదైనది కదా!

(నమస్యదార్త్తిక్షపణే కృతక్షణమ్) - ఏదో ఒక సందర్భంలో నీవు త్రివిక్రమావతారాన్ని ఎత్తినపుడు సంభవించిన వృత్తాంతం అటు ఉండనీ. ఆవిధంగా ప్రాసంగికంగా కాకుండా, శ్రీచరణాలలో తలవంచినవారి క్లేశాలను పోగొట్టడంలో వ్రతాన్ని చేపట్టినవి కదా, నీ శ్రీచరణాలు, అటువంటి శ్రీచరణాలను - (అని భావం.) ఆశ్రిత రక్షణకై తగిన సమయం కోసం ఎదురుచూచే నీ శ్రీచరణాలను దర్శించడానికి "కదా ను సాక్షాత్కారవాణి" (ఎపుడు దర్శించగలనో కదా!)- అని ఆక్రందించవలసివచ్చిందే!

(ధనం మదీయమ్) - "వైత్తమానిది" (దాచిపెట్టుకొన్న గొప్పనిధి)



ఎనక్కు ప్రాప్యముమ్. ప్రాపకముమాన తాయుళ్ళత్తై.

(తవ పాదపఙ్కజమ్) సర్వసులభముమాయ్, ఆశ్రిత-వత్సలముమాయ్, నిరతిశయభోగ్యముమాన తిరువడికళై.

(కదా ను సాక్షాత్కరవాణి?) త్రైవిక్రమాపదాన ధూళిదానత్తిలుమ్ కాణప్పెఱాత నాన్ ఇని ఎన్ఱు కాణవిరుక్కిఱేన్.

(చక్షుషా) విషయఙ్గళిలే మణ్డిక్కిడక్కిఱ సంసారికళ్ నడువే యిరుక్కిఱ ఉమక్కు నమ్మై యొழియ చ్చెల్లాతపడి పుకురనిఱుత్తినోమాకిల్, ఒన్ఱుమ్ శెయ్యాతారైప్పోలే కూప్పిడుకిఱతు ఎన్? ఎన్నిల్; కణ్ణాలే కణ్డు విడాయ్ తీర ఇరుక్కిఱ ఎనక్కు సంసారికళిఱ్కాట్టిల్ ఒరు వ్యావృత్తిపణ్ణి త్తరవమైయుమో?

(చక్షుషా) ఒరు దేశవిశేషత్తిలే సదాదర్శనమ్ పణ్ణప్పఱ్ఱాతు; కాణవిడాయ్త్త వెనక్కు ఇక్కణ్ణాలే కాణవేణుమ్.

---

అనేటట్లు నాకు ప్రాప్యమై, ప్రాపకమై (పొందే ప్రయోజనమై, దాన్ని పొందడంలో తగిన ఉపాయమై) ఉండే నీ శ్రీచరణాలను - (అని భావం)

(తవ పాదపంకజమ్) - సర్వసులభంగా, ఆశ్రితుల పట్ల వాత్సల్యాన్ని కల్గినవిగా, అంతులేని భోగ్యతను కల్గినవిగా ఉండే నీ శ్రీచరణపద్మాలను.

(కదా ను సాక్షాత్కారవాణి?) - త్రివిక్రమవృత్తాంతంలో జరిగిన శ్రీచరణరేణు దానంలో కనుపించని నేను ఇక ఎపుడు దర్శించగలను?

(చక్షుషా) - లౌకిక విషయాలలో లగ్నమై ఉండే సంసారుల మధ్య ఉన్న మీకు, నేను లేకపోతే నిలువలేనట్టి స్థితిని కల్గించినపుడు, మీకు నేను ఏమీ చేయనట్లుగా ఆక్రందిస్తున్నారు! ఎందుకు? - అని అంటే, కంటితో చూచి, ఆర్తి తీరాలని ఆశపడిన నాకు సంసారుకంటే ఏదో ఒక వైలక్షణ్యాన్ని కల్గించినంతమాత్రంతో చాలునా ?

**31శ్లో ॥** కదా పునశ్శఙ్ఖరథాఙ్గకల్పక-
ధ్వజారవిన్దాఙ్కుశ వజ్రలాఞ్ఛనమ్ ।
త్రివిక్రమ! త్వచ్చరణామ్బుజద్వయం
మదీయమూర్ధాన మలఙ్కరిష్యతి ॥

అవ : **(కదా పునః)** ఇతిల్ కణ్డాలే కాణుమళవుమ్ పోరాతు. **"పడిక్కళవాక నిమిర్త్త నిన్‌పాతపఙ్కయమే తలైక్కణియాయ్"** (తి-వాయ్-6-2-2) ఎన్ఱుమ్, **"కోలమా మెన్ శెన్నిక్కు ఉన్‌కమలమన్న కుఱైకழల్"** (తి-వాయ్-4-3-6) ఎన్గిఱపడియే ఉన్‌తిరువడికళాలే ఎన్ తలైయై అలఙ్కరిక్క వేణుమెన్గిఱార్.

వ్యా : **(కదా పునః)** తిరువడికళిలుణ్డాన ప్రాప్తియైయుమ్

---

**(చక్షుషా)-** ఒక దేశవిశేషంలో (పరమపదంలో) సదా దర్శనం పొందితే అది చాలదు. చూడాలని ఆశపడిన ఈ భౌతిక నేత్రాలతోనే ఇక్కడే నేను దర్శించాలి.

**31శ్లో ॥** అవ : **(కదా పునః)** - ఈ శ్లోకంలో- కళ్ళతో దర్శించినంతమాత్రంతో చాలదు, **"పడిక్కళవాక నిమిర్త్త నీ పాదపఙ్కయమే తలైక్కణియాయ్"** (భూమి పర్యంతంగా విస్తరించి స్పృశించిన నీ పాదపద్మాలను నా తలకు అలంకారంగా అలంకరించు) అని, **"కోలమామెన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కుఱై కழలే"** (పద్మాల వంటి, కడియాలతో ధ్వనించే నీ శ్రీచరణాలు నా శిరస్సుకు ఆభరణం) అనేవిధంగా నీ శ్రీచరణాలతో నాశిరస్సును భూషించాలి - అని పల్కుతున్నారు.

వ్యా : **(కదా పునః)** భగవంతుని శ్రీచరణాలతో ఉండే సంబంధాన్ని,



సౌలభ్యత్తైయుమ్, భోగ్యత్తైయైయుమ్ అనుసన్దిత్తు, అత్తాల్ వన్ద త్వరైయాలుమ్ విళమ్బ హేతువిల్లాత ఉపాయత్తై ప్పరిగ్రహిత్తవరాకైయాలుమ్, పిన్నై ఎప్పోతు శెయ్‌వతు? - ఎన్గిఱార్.

**(శఙ్ఖరథాఙ్గేత్యాది)** సర్వేశ్వరనుడైయ ఐశ్వర్యసూచకమాయ్, ఆకర్షకముమాయిరుక్కుమ్, తిరువడికళోట్టై సమ్బన్ధత్తాలే ఇవర్‌తలైక్కు ఆభరణముమాయ్, శేషత్వలక్షణము మాయిరుక్కుమ్ శంఖచక్రాదిలక్షణఙ్గళాలే చిహ్నితమాయుళ్ళత్తై. **"ఎన్‌శెన్ని"** (పెరి.తి 5-2-8) యిత్యాది, **"పాతవిలచ్చినై వైత్తాన్"** (పెరి-తి-5-2-8) ఎన్నక్కడవతితే.

**(త్రివిక్రమ!)** గుణాగుణనిరూపణమ్ పణ్ణాతే, తిరువడికళిల్ వైలక్షణ్యముమ్ పారాతే, ఎల్లార్ తలైయిలుమ్ వైక్కుమవనల్లైయో?

---

వాటి సౌలభ్యాన్ని, భోగ్యతను మనస్సులో తలచి, ఆ అనుసంధానంతో ఏర్పడిన త్వరవల్ల, ఆలస్యం లేకుండా ఫలాన్ని ఇచ్చే ప్రపత్తిరూపమైన ఉపాయాన్ని పరిగ్రహించినవారైనందువల్ల "ఇంకా ఎపుడు నీ శ్రీచరణాలు నాకు అనుగ్రహిస్తావు?" అని అంటున్నారు.

**(శంఖరథాంగేత్యాది)** - సర్వేశ్వరుని యొక్క, ఐశ్వర్యాన్ని సూచించేవి, ఆకర్షకంగా ఉండేవి అయిన శ్రీచరణాలలో సంబంధంచేత, వీరి శిరస్సుకు ఆభరణంగా, శేషత్వాన్ని తెలిపే లక్షణంగా ఉండే శంఖచక్రాది చిహ్నాలతో అంకితమైన శ్రీచరణాలను (అని భావం). **"ఎన్‌శెన్ని"**, **"పాదవిలచ్చినై వైత్తాన్"** ఇత్యాది పాశురాల భావం ఇక్కడ స్మరణీయం.

**(త్రివిక్రమ!)** - గుణాగుణనిరూపణాన్ని చేయకుండా - అంటే - వీరు గుణాన్ని కలవారు, వీరు గుణాన్ని లేనివారు - అనే విభాగాన్ని చేయకుండా, నీ శ్రీచరణాలలోని వైలక్షణ్యాన్ని గమనించకుండా, అందఱి శిరస్సులలోను వాటిని పెట్టే వాడవుకదా నీవు.

**(త్వచ్చరణామ్బుజద్వయమ్)** ఇప్పడి ప్రాప్తనుమాయ్, సులభనుమాన ఉన్నుడైయ నిరతిశయభోగ్యమాన తిరువడికళై.

**(మదీయమూర్ధానమ్)** ఎన్నుడైయతాన శిరస్సిలే ఎప్పోతు అలఙ్కరిక్క ప్పుకుకిఱాయ్? **"ఎన్తలైమేలవే" (తిరునె-1)** ఎన్ఱ ప్రకర్షమ్ శొల్లిఱ్ఱు. నరకహేతువాన పదార్థఙ్గళిన్ కాల్కాణ ప్రార్థిత్తుప్పోన్ద వెన్ తలై యెన్నుతల్. ఇతుక్కు ప్రాప్తనాయ్ ప్పోన్ద ఎన్తలై యెన్నుతల్. పతివ్రతైక్కు మఙ్గళసూత్రమ్బోలేయిఱే శేషభూతనుక్కు త్తిరువడికళ్. "మే మూర్ధ్ని భాతి" ఎన్ఱు తన్తలైయిలే నీర్మైక్కుడలాక స్వసమ్బన్ధమ్ అత్తలై క్కేఱ్ఱమాక చ్చొన్నార్. ఇఙ్గు తత్సమ్బన్ధమే ఇత్తలైక్కు ఏఱ్ఱమెన్గిఱార్ స్వశేషత్వసిద్ధిక్కాక.

---

**(త్వచ్చరణాంబుజద్వయమ్)** - ఈ విధంగా స్వరూపాను-రూపమైనవి, సులభమైనవి అయిన నీ నిరతిశయభోగ్యాలైన శ్రీచరణాలను (అని భావం.)

**(మదీయమూర్ధానమ్)** - నా శిరస్సులో ఎపుడు అలంకరించబోతావు? **"ఎన్తలైమేలవే"** (భగవానుని శ్రీచరణాలు నా శిరస్సుపై ఉన్నాయి) అనే గొప్పతనం చెప్పబడింది. నరకానికి హేతువులైన లౌకిక విషయాలైన పదార్థాల (స్త్రీల) పాదాలను చూడాలని ఇంతకాలం ప్రార్థించిన నా శిరస్సుపై - అని భావం. (లేక) నీశ్రీచరణాలను అలంకారంగా పొందడానికి తగిన సంబంధాన్ని కల నా శిరస్సుపై - అని కూడా భావం. పతివ్రతకు మంగళసూత్రంవంటివి, శేషభూతునకు భగవంతుని శ్రీచరణాలు. **"మే మూర్ధ్ని భాతి"** (నా శిరస్సుపై భగవంతుని శ్రీచరణం ప్రకాశిస్తున్నది) అనే శ్లోకంలో పూర్వం - సౌలభ్యానికి తగినట్లు, తమ శిరఃసంబంధం సర్వేశ్వరుని శ్రీచరణానికి అతిశయాన్ని కల్గిస్తుందని **"భాతి"** అనే పదం ద్వారా పలికారు. ఇక్కడ, ఆ సర్వేశ్వరుని శ్రీచరణసంబంధమే తమ శిరస్సుకు అతిశయహేతువని పల్కుతున్నారు. ఈ విధంగా పల్కడం ఎందుకంటే, తమ శేషత్వసిద్ధికోసం.



**32శ్లో ॥** విరాజమానోజ్జ్వలపీతవాససం
స్మితాతసీసూన సమామలచ్ఛవిమ్ ।
నిమగ్ననాభిం తనుమధ్య మున్నతం
విశాలవక్షస్థల శోభిలక్షణమ్ ॥

అవ : (విరాజమానేత్యాది) ఇన్ద శ్లోకమ్ ముతలాక "భవన్తమ్" ఎన్గిఱ శ్లోకత్తళవుమ్ పర్యఙ్కవిద్యాక్రమత్తాలే అవయవాభరణాయుధ మహిషీపరిజనపరిచ్ఛదఙ్గళోట్టై చ్చేర్త్తియఴకై అనుభవిత్తు, అవ్వనుభవ జనితప్రీతికారితమాన కైఙ్కర్యత్తాలే ఉన్నై ఉకప్పిప్పతు ఎప్పోతు? ఎన్గిఱార్. ఇత్తాల్ తమ్ముడైయ ప్రాప్యత్తై అరుళిచ్చెయ్‌కిఱార్. "వైకుణ్ఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణురచిన్త్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ" (శైవే) ఎన్ఱిఱే ప్రాప్యవస్తు ఇరుప్పతు.

---

**32శ్లో ॥ అవ : (విరాజమానేత్యాది)** - ఈశ్లోకం నుండి **"భవంతమ్"** అనే **46**వ శ్లోకం వరకు బ్రహ్మవిద్యలలో ఒకటైన పర్యంకవిద్యలో చెప్పబడిన క్రమంలో - భగవంతుని దివ్యావయవాలతో, ఆభరణాలతో, ఆయుధాలతో, దివ్యమహిషులతో, పరిజనపరిచ్ఛదాలతో గల సంబంధంచేత ఏర్పడిన అందాన్ని దర్శించి, అనుభవించి (ఆనందించి), ఆ అనుభవంవల్ల కల్గిన ప్రీతి ప్రేరేపింపగా చేసే కైకంర్యంతో నిన్ను ఆనందింపజేయడం ఎపుడోకదా! అని పల్కుతున్నారు. ఈవిధంగా తమ ప్రాప్యాన్ని గూర్చి ఇందులో పల్కుతున్నారు. **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్థం జగత్పతిః, ఆస్తే విష్ణురచింత్యాత్మా భక్తైః భాగవతై స్సహ"** (పరమపదమైన వైకుంఠంలో ఊహించలేని వైభవాన్ని కల జగత్పతి అయిన విష్ణువు శ్రీదేవితోపాటు, భక్తులతో, భాగవతులతో కలసి వేంచేసి ఉంటాడు) అని కదా ప్రాప్యవస్తువుయొక్క స్వరూపం ఉన్నది. (అందువల్ల అక్కడ కేవలం భగవానుని దివ్యమంగళవిగ్రహానుభవమే కాక, దివ్యాభరణ - ఆయుధ - దివ్యమహిషీ పరిజన పరిచ్ఛదాల దర్శనానుభవంకూడా కల్గుతుంది) ప్రాప్యస్వరూపం ఇదే - అని తాత్పర్యం.)

వ్యా : (విరాజమాన) ఇతిల్ తిరువడికళై త్తలైయిలే వైక్క వమైయమో? ఎన్న; అవ్వళవు పోరాతెన్ఱు సామాన్యశోభైయై అనుభవిక్కిఱార్.

(విరాజమాన) తిరునిఱత్తుక్కు ప్పరభాగమాక మికవుమ్ విళఙ్గానిఱ్కిఱ వడివఴకు.

(ఉజ్జ్వల) "మహారజనం వాసః" (ఛాన్దో-1-6-6) ఎన్గిఱ స్వరూపత్తాల్ వన్ద ఔజ్జ్వల్యమ్. "ఉడైయార్న్ద వాడై" (తి-వాయ్-3-7-4) ఎన్ఱు తిరువరై పూత్తాప్పోలేయిరుక్కిఱ తిరుప్పీతామ్బరత్తాల్ వన్ద అఴకు,

(పీతవాససమ్) "పీతకవాడై ప్పిరానార్" (పెరి-తి-5-2-7) ఎన్ఱు అఴకేయన్ఱిక్కే ఐశ్వర్య సూచకముమాయిరుక్కై.

(స్మితాతసీత్యాది) అలరుకిఱపోతే శెవ్వియైయుడైత్తాన కాయామ్పూప్పోలే నిర్మలమాన కాన్తియై యుడైత్తాయిరుక్కై.

---

వ్యా : (విరాజమాన) - ఈ శ్లోకంలో "మీ శిరస్సుపై నా పాదాలను పెడితే చాలునా?'' అని సర్వేశ్వరుడనగా, "అంతమాత్రం చాలదు'' అని అంటూ, సామాన్యమైన దివ్యమంగళ విగ్రహశోభను దర్శించి ఆనందిస్తున్నారు.

(విరాజమాన) - నీలవర్ణానికి పరభాగంగా చాలా ఎక్కువగా ప్రకాశిస్తున్న దివ్యదేహశోభ.

(ఉజ్జ్వల)- "మహారజనం వాసః" (వస్త్రం బంగారు రంగును కల్గినది) అని స్వరూపంవల్ల కల్గిన ఔజ్జ్వల్యం. "ఉడైయార్న్ద వాడై" అనే రీతిలో నడుము పూచినట్లుగా ఉండే పీతాంబరం వల్ల ఏర్పడిన అందం.

(పీతవాససమ్) - "పీతకవాడైపిరానార్" (పసుపు పచ్చని వస్త్రాన్ని ధరించిన స్వామి) అనే రీతిలో పీతాంబరం అందానికి సూచకమే కాక, భగవంతునకు ఐశ్వర్య సూచకం కూడా.

(స్మితాసపీత్యాది) - పూచేటపుడే కాంతిని కల అగిసెపూవువలె



"అతసీపుష్పసఙ్కాశమ్" (భార.శాంతి 46-118), "కాయామ్పూమలర్ ప్పిఱఙ్గలన్న మాలై" (పెరు-తి-1-2) ఎన్ఱు అభియుక్తర్ ఆఴ్ఙ్గాల్ పడుకిఱ నిఱమితే.

(నిమగ్ననాభిమ్) "ఆవర్త ఇవ గఙ్గాయాః" (విష్ణుపు 5-6-28) ఎన్గిఱపడియే సౌన్దర్యవెళ్ళమ్ శుఴిత్తాప్పోలే యిరుక్కిఱ తిరునాభియై యుడైయవన్. "నన్దన్ మతలైక్కు నన్ఱుమఴకియ వున్ది" (పెరి-తి-1-2-8) ఎన్నక్కడవతిఱే.

(తనుమధ్యమ్) "శిఱ్ఱిడైయుమ్వడివుమ్", "తుడిశేరిడయుమ్" (తి-వాయ్-8-5-3) ఎన్నక్కడవతిఱే.

(ఉన్నతమ్) ఇప్పడి ఇవ్వఴకాలుమ్, ఇడైయఴకాలుమ్

---

నిర్మలమైన కాంతిని కల్గి ఉండడాన్ని ఈ ప్రయోగం తెల్పుతున్నది. "అతసీపుష్ప సంకాశమ్" (అగిసెపూవు రంగువంటి రంగును కలవానిని) అని, "కాయామ్ పూమలర్ పిఱఙ్గలన్నమాలై" (అతసీపుష్పమాలిక అనదగినట్లుండే, ఆశ్రితమోహం కల స్వామి) అని అభియుక్తులు గొప్పగా అవగాహించే వర్ణంకదా, స్వామివర్ణం.

(నిమగ్ననాభిమ్) - "ఆవర్త ఇవ గంగాయాః" (గంగానదిలోని సుడివలె) అనేటట్లు సౌందర్యప్రవాహం సుడులు తిరిగినట్లుండే నాభిని కలవాడు. "నన్దమదలైక్కునన్ఱుమఴకియ ఉన్ది" (నందుని కుమారుడైన శ్రీకృష్ణుని అందమైన నాభి) అని చెప్పబడుతున్నది కదా!

(తనుమధ్యమ్) - "శిఱ్ఱిడైయుమ్ వడివుమ్" (సన్నని నడుము, రూపం) అని, "తుడిశేరిడైయుమ్" (సన్నని నడుము) అని భగవంతుని నడుము సన్ననిదని చెప్పబుతున్నది కదా!

(ఉన్నతమ్) - ఈ రూపసౌందర్యంతో, నడుము అందంతో "ఇతడు

సర్వాధికనెన్ఱు తోற்றుమ్బడి యిరుక్కిఱవన్.

**(విశాలేత్యాది)** అతివిస్తృతమాన తిరుమార్పిలే విళఙ్గానిఱ్పదాయ్, స్వాసాధారణమాన శ్రీవత్సచిహ్నత్తై యుడైయవనై.

**33శ్లో॥** చకాసతం జ్యాకిణకర్కశై శ్శుభై
శ్చతుర్భి రాజానువిళమ్బిభిర్భుజైః ।
ప్రియావతంసోత్పలకర్ణభూషణ-
శ్లథాలకాబన్ధవిమర్ద శంసిభిః ॥

వ్యా :(చకాసతమ్) తిరుత్తోళ్కళిల్ ఐశ్వర్యవీర్యాది-కళైయుమ్, అழకైయుమనుభవిక్కిఱార్.

**(జ్యాకిణకర్కశైః)** "తழుమ్బిరున్ద శార్ఙ్గనాణ్ తోయ్న్ద వామఙ్గై" **(1-తిరువ-23)** ఎన్గిఱపడియే శ్రీశార్ఙ్గత్తిల్ నాణిత్తழుమ్బాలే అలఙ్కృతమాన

---

సర్వాధికుడు'' అని తోచేటట్లుండేవాడు.

**(విశాలేత్యాది)** - అతివిస్తృతమైన వక్షఃస్థలంలో వెల్గుతున్నదై, తన సర్వేశ్వరత్వానికి అసాధారణ చిహ్నమైన శ్రీవత్సమనే పుట్టుమచ్చను కలవానిని,

**33శ్లో॥ వ్యా : (చకాసతమ్)** - బాహువులలో ప్రకాశించే ఐశ్వర్యవీర్యాది గుణాలను, అందాన్ని దర్శించి ఆనందిస్తున్నారు.

**(జ్యాకిణకర్కశైః) - "తழుమ్బిరున్ద శార్ఙ్గనాణ్ తోయ్న్దవా మఙ్గై"** (అందమైన బాహువులలో శార్ఙ్గమనే వింటినారి తగిలినందువల్ల ఏర్పడిన కిణాలున్నాయి) అనేవిధంగా శ్రీశార్ఙ్గమనే వింటికి పూన్చిన నారివల్ల కల్గిన కిణాలతో అలంకరింపబడిన దివ్యబాహువులు. నారి దెబ్బవల్ల కల్గిన కాయలు



తిరుత్తోళ్కళ్. నాణిత్తழుమ్బు ఎల్లావற்றుక్కుముణ్డానైయాలే సవ్యసాచి యెన్గై. ఆశ్రితవిరోధికళై అழియచ్చెయ్తు తழుమ్బై యుడైత్తాన తోళ్కళ్. వీరత్తழుమ్బు వీరభుజఙ్గళుక్కు అలఙ్కారమిఱే.

**(శుభైః)** "శుభేన మనసా ధ్యాతమ్" **(వి-పు-5-6-28)** ఎన్నుమాపోలే ఆశ్రితసమృద్ధియే ప్రయోజనమాక వెఱుమ్బుఱత్తిలే ఉపకరిక్కుమ్ తోళ్కళ్ ఎన్నుతల్. ఆశ్రితర్క్కు ప్రాప్యమాన తోళ్కళ్ ఎన్నుతల్.

**(చతుర్భిః)** కల్పకతరు పణైత్తాప్పోలే నాలాయ్, ఆశ్రితరక్షణమే విళైనీరాక ప్పణైత్తపడి.

**(అజానువిళమ్బిభిః)** ఆజానుబాహువాయిఱే యిరుప్పతు. తిరుముழన్దాళళవుమ్ తొఙ్గానిఱ్పతాయ్ పురుషోత్తమలక్షణ మిరుక్కిఱపడి.

---

అన్ని బాహువులలో ఉన్నందున స్వామి సవ్యసాచి - అని భావం. ఆశ్రితుల (భక్తుల) విరోధులను నశింపజేసే, కిణాలను కల్గిన దివ్యబాహువులు. వీరకిణాలు వీరుని భుజాలకు అలంకారంకదా!

**(శుభైః) - "శుభేన మనసా ధ్యాతమ్"** (మంచి మనస్సుతో ధ్యానింపబడింది) అనే విధంగా ఆశ్రితుల సమృద్ధియే ప్రయోజనంగా, (ప్రత్యుపకృతిని ఏమీ ఆశించకుండా) రిక్తంగా ఉపకారం చేసే బాహువులు - అని భావం. భక్తులకు ప్రాప్యమైన, దర్శించి ఆనందించదగిన బాహువులని కూడా భావం.

**(చతుర్భిః)** - కల్పవృక్షం పలుశాఖలుగా విస్తరించినట్లుగా నాలుగై, ఆశ్రిత రక్షణమే పెంచే నీరుగా విస్తరించినవి - అని భావం.

**(అజానువిలంబిభిః)** - స్వామి ఆజానుబాహువుగా (మోకాలివరకు ఉండే బాహువులను కలవాడుగా) కదా ఉంటాడు. మోకాళ్ళ పర్యంతం వేలాడే బాహువులను కల్గి ఉండే పురుషోత్తమలక్షణం ఉన్నది.

**(ప్రియావతంసేత్యాది) తిరుత్తోళ్కళుక్కు ఆశ్రితరక్షణమే యాత్రైయాయిరుక్కుంపడి శొల్లిఱ్ఱు క్కీఴ్. అతువే పచ్చైయాక ప్పిరాట్టియై యణైక్కుమ్బడి శొల్లుకిఱతు మేల్. పిరాట్టి తిరుచ్చెవ్వియిలరాన ఉత్పలమెన్న, మఱ్ఱుముళ్ళ కర్ణభూషణఙ్గళెన్న, సంసర్గత్తాలే తత్కాలత్తిలే కిఞ్చిదాకుఞ్చితమాన తిరుక్కుఴల్కఱ్ఱైయెన్న, ఇవఱ్ఱినుడైయ సమ్మర్దత్తై క్కొళ్ళొల్లుమవైయాయ్, అవఱ్ఱాలే విళఙ్గానిన్ఱుళ్ళవనై. "సీతయా శోభితం పురా" (రా) ఎన్గిఱపడియే వీరభుజత్తైయిఱే వీరపత్ని అణైవతు. అల్లాతపోతు సజాతీయైయాన స్త్రీయై అణైత్తవోపాతియిఱే. ప్రణయచిహ్నఙ్గళుమ్, రక్షణచిహ్నఙ్గళుమిఱే తిరుత్తోళ్కళుక్కు మాఙ్గళ్యమ్.**

**(చకాసతమ్) ఇప్పడిప్పట్ట తోళ్కళిఱే ప్రణయియాన ఉనక్కు ఔజ్జ్వల్యహేతుక్కళ్.**

---

**(ప్రియావతంసేత్యాది)** - స్వామి బాహువులకు ఆశ్రితుల రక్షణమే జీవనయాత్రగా ఉండే రీతి ఇంతకు ముందు తెలుపబడింది. అదే నిరూపకలక్షణంగా (గుర్తుగా) పిరాట్టిని (లక్ష్మీదేవిని) ఆలింగనం చేసికొనే రీతి ఇకపై తెలుపబడుతున్నది. లక్ష్మీదేవి అలంకరించుకొన్న కర్ణపుష్పమైన ఉత్పలం, ఇంకా ఉండే కర్ణభూషణాలు, లక్ష్మీసంశ్లేషం వల్ల ఆకాలంలో కొంచెం ఆ కుంచితమైన (జారిన) కేశపాశం - అనేవీటి సమ్మర్ధాన్ని సూచించే బాహువులతో ప్రకాశిస్తున్నవాడు. **"శయనే చోత్తమాంగేన సీతాయాః శోభితం పురా"** (శయనంలో, సీతాదేవి శిరస్సుచే ఇంతకుముందు ప్రకాశించే బాహువు) అనేవిధంగా వీరభుజాన్నే కదా వీరపత్ని ఆలింగనం చేసికొంటుంది. లేకపోతే, సజాతీయురాలైన వేఱొకస్త్రీని ఆలింగనం చేసికొన్నట్లే కదా. ప్రణయచిహ్నాలు, రక్షణచిహ్నాలే కదా బాహువులకు మంగళకరమైనవి.

**(చకాసతమ్)** - ఇటువంటి బాహువులే కదా ప్రణయి అయిన వానికి శోభను కల్గిస్తాయి.



**34శ్లో ॥ ఉదగ్రపీనాంసవిళమ్బికుణ్డలా-**
**లకావళీబన్ధురకంబుకన్ధరమ్ ।**
**ముఖశ్రియా న్యక్కృత పూర్ణనిర్మలా-**
**మృతాంశుబిమ్బామ్బురుహోజ్జ్వల శ్రియమ్ ॥**

**అవ : (ఉదగ్రేతి) తిరుత్తోళ్కళుక్కనన్తరమాన తిరుక్కఴుత్తైయుమ్, తదనన్తరమాన తిరుముఖత్తిలే సామాన్యశోభైయైయు మనుభవిక్కిఱార్.**

**(ఉదగ్రేతి) ఓఙ్గి తాఴ్న్దిరున్దుళ్ళ అంసత్తిలే వరత్తాఴ్న్ద మకరకుణ్డలఙ్గళెన్న, అవ్వళవు వరత్తాఴ్న్ద తిరుక్కుఴలెన్న, ఇవఱ్ఱాలే సున్దరమాయ్ వడివుతాన్ రేఖాత్రయాఙ్కితమాయిరున్దుళ్ళ తిరుక్కఴుత్తైయుడైయవనై. "తరుణగ్రీవాకమ్బుప్రతిమమాన తిరుక్కఴుత్తు" ఎన్నక్కడవతిఱే.**

**(బన్ధురమ్) సున్దరమ్. "రేఖాత్రయాఙ్కితాగ్రీవా కమ్బుగ్రీవేతి కథ్యతే", "మిన్ను మణిమకరకుణ్డలఙ్గళ్ విల్వీశ" (పెరియతిరుమడల్) ఎన్నుమ్,**

---

**34శ్లో ॥** అవ : **(ఉదగ్రేతి)** - బాహువులకు తరువాత కంఠాన్ని, తరువాత, ముఖంలోని సాధారణ (అంగాల) శోభను కూడా దర్శించి పల్కుతున్నారు.

వ్యా : **(ఉదగ్రేతి)** ఉన్నతమై, మాంసలంగా ఉండే అంసభాగం (భుజాల మూపురభాగం) వరకు వేలాడే మకరకుండలాలు, అంతవరకు వేలాడే కేశపాశం, వీటితో సుందరంగా ఉన్నదై, రూపంలో మూడు రేఖలతో అంకితమైన కంఠాన్ని కలవాడని భావం. **"తరుణగ్రీవాకంబుప్రతిమమాక తిరుక్కఴుత్తు"** (చక్కగా ఎదిగిన, రేఖాత్రయాంకితమైన కంబుగ్రీవంవంటి కంఠం) అని స్తుతింపబడుతున్నది కదా!

**(బంధుర)** - అందమైన. **"రేఖాత్రయాంకితా గ్రీవా కంబుగ్రీవేతి కథ్యతే"** (మూడు రేఖలతో చిహ్నితమైన కంఠం కంబుగ్రీవమనబడుతున్నది) అని, **"మిన్ను మణిమకరకుణ్డలఙ్గళ్ విల్వీశ"** (ప్రకాశించే, మణులు పొదగి

"మకరమ్ శేర్కుழை యిరుపాడిలఙ్గియాడ" (తిరునె-21) ఎన్నుమ్ శొల్లుకిఱపడియే తిరుక్కழుత్తుక్కు ప్పరభాగమాన ఒళియైయుడైత్తాయ్, ఇరణ్డాదిత్యర్కళ్ ఆభరణవేషత్తాలే అలఙ్కరిక్కిఱాప్పోలే యిరుక్కై. "కొళ్కిన్ఱ కోళిరుళై" (తి-వాయ్-7-7-9) ఇత్యాదిప్పడియే తిరుక్కுழలాలే అలఙ్కృతమాయిరుక్కిఱపడి.

(ముఖశ్రియేత్యాది) అత్తిరుక్కுழలినழకు తిరుముకత్తిలే మూట్ట అన్ద వழకై అనుభవిక్కిఱార్. తన్నుడైయ జ్యోతిస్సాలే పూర్ణచన్ద్రనుడైయ ఒழிవైయుమ్, అప్పోతలర్న్ద తామరైప్పూవిలழకైయుమ్ తోఱ్పిక్కుమ్ తిరుముకత్తై యుడైయ వున్నై.

(ముఖశ్రియా) ముఖకాన్త్యా.

(న్యక్కృత) అవన్. సమ్పూర్ణకలైకళాలుమ్ పూర్ణమాన

---

మకరకుండలాలు కాంతులను వెదజల్లగా) అని, "మకరమ్ శేర్కుழை యిరుపాడిలఙ్గియాడ" (మకరంవంటి రూపాన్ని కల కుండలాలు రెండువైపుల వెల్గుతూ ఊగిసలాడగా) అని చెప్పబడినట్లుగా, కంఠానికి పరభాగశోభను కల్గించేవై, ఇద్దఱు సూర్యులు ఆభరణాల రూపంలో అలంకరించినట్లుగా ఉన్నాయని భావం. "కొళ్కిన్ఱకోళిరుళై" (చీకటివలె నల్లని) అనేవిధంగా ఉండే కేశపాశంతో స్వామి ముఖం అలంకరింపబడి ఉన్నది.

(ముఖశ్రియా) - ఆ కంఠంలోని అందం తిరుముఖంలోనికి తీసికొనిపోగా, ఆ ముఖంలోని అందాన్ని దర్శించి ఆనందిస్తున్నారు. జ్యోతిస్సుతో పూర్ణచంద్రుని కాంతిని, అపుడే పూచిన తామరపూవులోని అందాన్ని జయించే ముఖాన్ని కల నిన్ను.

(ముఖశ్రియా) - ముఖకాంతితో.

(న్యక్కృత) - ముఖం సంపూర్ణమైన కళలతో పూర్ణుడుగా ఉండే



పౌర్ణమావాస్యైయిల్ చన్ద్రమణ్డలమాయ్, మఱుక్కழற்றినవళవిలేయాయ్త్తు సదృశమాయిరుప్పతు. "ఎత్తనైయేను మెన్ మకన్ ముకమ్ నేరొవ్వా" (పెరియాళ్వార్ తిరుమొழி-1-5-3) ఎన్ను తన్నైత్తாழవిట్ట విడత్తిలేయాయ్త్తు ఒవ్వాతొழிవతు తేజస్సై. అన్రియే, సౌకుమార్యత్తుక్కుమ్ "వికాసిశారదామ్భోజ మవశ్యాయ జలోక్షితమ్" (విష్ణుపు 5-20-55) శెవ్విక్కుమ్, పరిమళత్తుక్కుమ్ తామరైప్పూవుమ్ సదృశమన్ను. "తం పరిభూయస్థితమ్" (విష్ణుపు 5-20-55) ఎన్నక్కడవతిఱే.

---

పౌర్ణమినాటి చంద్రమండలమె ఉన్నది. అందులోని కళంకం తొలగించినట్లయితే, అపుడుకూడా చంద్రుడు స్వామిముఖానికి ఉపమానంగా చెప్పడానికి తగడు - అని అనవచ్చు. "ఎత్తనై శెయ్యిలుమ్ ఎన్మకన్ ముఖమ్ నేరొవ్వారుయ్" (ఎన్ని చేసినా, నా కుమారుని ముఖంతో నీవు సాక్షాత్తుగా పోలి ఉండలేవు) అని తనను సంస్కరించిన, స్వామితో సాటి రాకపోవడం. ఇది తేజస్సు విషయంలోనే కాదు, సౌకుమార్య విషయంలోకూడా వర్తిస్తుంది. "సఖ్యః! పశ్యత కృష్ణస్య ముఖమత్యరుణేక్షణమ్, వికాసిశారదాంభోజ మవశ్యాయజలోక్షితమ్, పరిభూయ స్థితం జన్మ సఫలం క్రియతాం దృశః" (సఖులారా! చాలా ఎఱ్ఱని నేత్రాలను కల్గినది, మంచుబిందువులతో జల్లబడినది, వికసించిన శరత్కాల పద్మాన్ని జయించినది అయిన శ్రీకృష్ణుని ముఖాన్ని చూడండి. కన్నులున్నందుకు ప్రయోజనం కల్గినట్లుగా చేసుకోండి) అని భగవంతుని ముఖం గూర్చి చెప్పబడుతున్నది కదా!

**35శ్లో ॥** ప్రబుద్ధముగ్ధామ్బుజచారులోచనం
సవిభ్రమభ్రూలత ముజ్జ్వలాధరమ్ ।
శుచిస్మితం కోమల గణ్డమున్నసం
లలాటపర్యన్తవిళమ్బితాలకమ్ ॥

అవ : **(ప్రబుద్ధేతి) "కోళిழ்త్తామరై" (తి-వాయ్-7-7-8)** ఎన్గిఱపడియే తిరుముకత్తిలవయవ సౌన్దర్యత్తినుడైయ శేర్త్తియై అనుభవిక్కిఱార్.

వ్యా : **(ప్రబుద్ధ)** ఆశ్రితసంశ్లేషత్తాలే వికసిత మాయిరుక్కై.

**(ముగ్ధ) "కిజ్గిణివాయ్ చ్చెయ్త తామరై ప్పూప్పోలే అజ్గణిరణ్డుజ్గొణ్డు" (తిరుప్పావై-22)** ఎన్గిఱపడియే అలరత్తుడజ్గిన వళవాయిరుక్కు మెన్నుతల్. **"పేతుఱు ముకమ్ శెయ్తు" (తి-వాయ్-9-9-9)** ఎన్నుమ్బడియే ఆశ్రితరోట్టై క్కలవియాల్ వన్ద ఆనన్దాతిశయత్తిల్ వికృతియై చ్చొల్లుతల్.

---

**35శ్లో ॥** అవ : **"కోళిழ்త్తామరై"** అనే తిరువాయ్మొழி పాశురంలో చెప్పబడినట్లుగా, ముఖంలో దివ్యావయవసౌందర్యాల అందమైన కలయికను దర్శించి, ఆనందిస్తున్నారు.

వ్యా : **(ప్రబుద్ధ)** ఆశ్రితుల (భక్తుల) కలయికవల్ల వికసించి ఉన్నది.

**(ముగ్ధ)- "కింకిణి వాయ్చ్చెయ్ద తామరైప్పూప్పోలే అజ్గణిరణ్డుమ్ కొణ్డు"** (మువ్వలతో పోలిన తామరపూవువలె ఉండే అందమైన రెండు నేత్రాలతో) అనేటట్లు అపుడే వికసించడానికి ఆరంభించినవై ఉన్నది- అనిభావం. లేక, **"పేదుఱుముకమ్ శెయ్దు"** (ముగ్ధముఖాన్ని చూపి) అనే రీతిలో భక్తుల సంశ్లేషంతో కల్గిన ఆనందాతిశయంలోని వికారాన్ని ఈప్రయోగం తెల్పుతున్నదని చెప్పవచ్చు).



**(అమ్బుజచారులోచనమ్)** ఇప్పడిపట్ట తామరై దృష్టాన్తమాక ప్పోరామైయాలే దార్ష్టాన్తికమ్ తన్నైయే శొల్లుకిఱతు. **"తత్పుణ్డరీకనయనం విష్ణో ర్ద్రక్ష్యామ్యహం ముఖమ్" (శ్రీభాగవతమ్).** ఆశ్రితర్ ఆశ్పైడుమతిఱే.

**(సవిభ్రమభ్రూలతమ్) "మన్నియ శీర్మతనన్ కరుప్పు చ్చిలైకొల్" (తి-వాయ్-7-7-4)** ఎన్గిఱపడియే ఆకర్షకముమాయ్, ఆశ్రితర్పక్కల్ ఆదరమెల్లామ్తోற்றుమ్బడి శెఱిన్దిరుక్కుమ్ పరువత్తై యుడైయ పున్నై. **"తన్కైచ్చార్జ్గమతువే పోల్" (నాత-6)** ఎన్ఱు తెళిన్దిరుక్కుమ్బడిక్కు దృష్టాన్తమిఱే.

**(ఉజ్జ్వలాధరమ్) "వాழியతోర్ కనికొల్" (తి-వాయ్-7-7-3)**

---

**(అంబుజచారులోచనమ్) -** ఇటువంటి తామరపూవు దృష్టాంతంగా చాలదు. కనుక దార్ష్టాంతికమే నేరుగా చెప్పబడుతున్నది. **"పాపం సంహరతి యత్పుంసాం స్మృతం సంకల్ప నామయమ్, తత్పుండరీక నయనం విష్ణోః ద్రక్ష్యామ్యహం ముఖమ్"** (ఏ ముఖమండలం, భావింపబడగానే అది మానవుల పాపాన్ని పోగొడుతున్నదో, ఆశ్రితుల సంకల్పానుసారంగా అమరిఉన్నది. తామరలవంటి కన్నులను కల్గినది అయిన విష్ణువుయొక్క ఆ ముఖమండలాన్ని ఎపుడు నేను చూడగలను?) అనే రీతిలో స్వామిముఖం ఆశ్రితులచే అభిలషింపబడుతుంది కదా! (ఈ ప్రమాణంలో కూడా ముఖానికి ఏ ఉపమానం నిర్దేశింపబడలేదు).

**(సవిభ్రమభ్రూలతమ్) - 'మన్నియశీర్మదనన్ కరుప్పుచ్చిలైకొల్"** (సౌందర్యపూర్ణుడైన మన్మథుని చెఱకువిల్లా?) అనే రీతిలో భక్తులపట్ల తనకు ఉండే ఆదరమంతా స్ఫురించేటట్లు వంగి ఉండే కనుబొమలను కల నిన్ను. **"తన్కై చ్చార్జ్గమదువే పోల్"** (తన చేతిలోని శార్జ్గమనే విల్లువలె) అని ఉపమించే రీతిలో కదా స్వామి కనుబొమలు ఉంటాయి.

**(ఉజ్జ్వలాధరమ్) - "వాలియదోర్ కనికొల్!"** (విలక్షణమైన ఒక

ఎన్నుమ్, "కోలన్దిరళ్ పవళక్కొఴున్దుణ్డజ్గొల్" (తి-వాయ్-7-7-3) ఎన్నుమ్, "నీల నెడుముకిల్పోల్ తిరుమేనియమ్మాన్ తొణ్డైవాయ్" (తి-వాయ్-7-7-3) ఎన్నుమ్ శొల్లుకిఱపడియే మిక్క అఴకైయుడైయ తిరువధరత్తై యుడైయ ఉన్నై.

(శుచిస్మితమ్) "పవళచ్చెన్దువర్ వాయినిడై క్కోమళవల్లి ముళైప్పోల్ శిలపల్లిలక" (పె.తిరు. 1-6-9) ఎన్నుమ్, "ఎన్నావియడుమణి ముత్తజ్గొల్" (ముదలాయిరమ్-1-6-9) ఎన్నుమ్ శొల్లుకిఱ తిరుముఱువలై యుడైయ వున్నై.

(కోమలగణ్డమ్) అనుభవిప్పార్క్కు ఆకర్షకమాయ్ సుకుమారమాన గణ్డస్థలత్తై యుడైయ ఉన్నై

(ఉన్నసమ్) "మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో కొఴున్దో" (తి-వాయ్-

---

ఫలమా?) అని, "కోలమ్‌తిరళ్ పవళచ్చెఴున్దుణ్డజ్కొల్" (అందం ఒక చోట చేరినట్లున్న పగడపుతునకా?) అని, "నీలనెడుముకిల్‌పోల్ తిరుమేనియమ్మాన్ తొణ్డైవాయ్" (నల్లనిమేఘం వంటి తిరుమేనును కల స్వామి యొక్క దొండపండువంటి కిందిపెదవి) అని పల్కినట్లుగా మిక్కిలి అందాన్ని కల అధరాన్ని కల నిన్ను.

(శుచిస్మితమ్) - "పవళచ్చెన్దువర్ వాయినిడైక్కోమళవల్లి ముళైప్పోల్ శిలపల్లిలక" (పగడం వలె ఎఱ్ఱగా ఉండే పెదవి మధ్యలో లలితమైన తీగమొగ్గ తొడిగినట్లుగా కొన్న దంతాలు ప్రకాశించగా) అని, "ఎన్నావియిడుమ్ అణిముత్తజ్కొల్" (నా ప్రాణాన్ని బాధించే అందమైన ముత్యాలా?) అని పల్కినట్లుగా చిఱునవ్వును కల నిన్ను.

(కోమలగండమ్) - దర్శించేవారికి ఆకర్షకమై, సుకుమారమైన చెక్కిళ్ళను కల నిన్ను.

(ఉన్నసమ్) - "మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో కొఴున్దో" (పార్శ్వభాగాలలో వర్ధిల్లే కల్పతయా? లేక, దాని చిగురా?) అనేవిధంగా



7-7-2) ఎన్గిఱపడియే నాసాలతైయై యుడైయ ఉన్నై.

(లలాటపర్యన్తవిలమ్బితాలకమ్) "మున్నై ముకత్తణియార్ మొయ్కుఴల్కళ్" (ముదలాయిరం-16-5) ఎన్నుమ్, "శురుణ్డిరుణ్డ కుఴల్తాఴ్న్దముకమ్" (ముదలాయిరం-3-6-9) ఎన్నుమ్ శొల్లుకిఱపడియే తిరునెఱ్ఱియిలేవర అలై యెఱికిఱ తిరుక్కుఴలై యుడైయ వున్నై. పిన్బు అంసవిళమ్బియాయ్ మున్బులలాటపర్యన్తమా యిరుక్కిఱపడి.

36శ్లో ॥ స్ఫురత్కిరీటాఙ్గదహారకణ్ఠికా -
మణీన్ద్రకాఞ్చీగుణనూపురాదిభిః ।
రథాఙ్గశఙ్ఖాసిగదాధనుర్వరై
ర్లసత్తులస్యావనమాలయోజ్జ్వలమ్ ॥

అవ : (స్ఫురదితి) ఆభరణాదికళుడైయ శేర్త్తియఴకై అనుభవిక్కిఱార్.

---

నాసాలతను కల నిన్ను.

(లలాటపర్యంత విలంబితాలకమ్) - "మన్నుముకత్తణియార్ మొయ్కుఴల్కళ్" (ముఖానికి అలంకారమైన దట్టమైన ముంగురులు) అని, "శురణ్డిరుణ్డ కుఴల్ తాఴ్న్ద ముకత్తాన్" (గుండ్రంగా, దట్టంగా ఉండే కేశపాశం జారిన, వేలాడే ముఖాన్ని కలవాడు) అని చెప్పే రీతిలో ఫాలభాగం పర్యంత ప్రదేశంవరకు జారిన, అల్లల్లాడే, ముంగురులను కల నిన్ను- అని భావం. కేశపాశం వెనుక భుజాలవరకు వేలాడుతున్నదై, ముందు లలాటం చివరవరకు ఉన్నదని భావం.

36శ్లో ॥ అవ : (స్ఫురదితి) దివ్యాభరణాలు మొదలైనవాని చేరికలోని అందాన్ని దర్శించి పల్కుతున్నారు.

వ్యా : (స్ఫురత్కిరీట) ఉభయవిభూతినాథత్వమాకిఱ ఐశ్వర్యత్తుక్కనురూపమాయ్, తిరుముడియిలే విళఙ్గానిన్ఱ తిరువభిషేకమ్. "కతిరాయిరమిరవి కలన్దెరిత్తాలొత్తా నీణ్ముడియితే". (ముదలాయిరం-4-1-1)

(అఙ్గద) సర్వాశ్రయమాన తిరుత్తోళ్కళై ప్పఱ్ఱి విళఙ్గానిన్ఱుళ్ళ తిరుత్తోళ్వళైకళై.

(హార) "పొన్నిన్ మామణియార మణియాక త్తిలఙ్గుమాల్" (పె-తి-8-1-3) ఎన్ఱుమ్, "పెరియవరైమార్పిల్ పేరారమ్ పూణ్డు" (ఇయఱ్ఱా-3-5-5) ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే విళఙ్గా నిన్ఱ తిరువారమ్.

(కణ్ఠికా) తిరుక్కழுత్తిలే విళఙ్గానిన్ఱ ముత్తుత్తిరుక్కట్టువడమ్.

---

వ్యా : (స్ఫురత్కిరీట) - ఉభయవిభూతి నాథత్వమనే ఐశ్వర్యానికి తగినదై, శిరస్సుపై ప్రకాశించే కిరీటం - అని భావం. "కతిరాయిరమిరవి కలన్దెరిత్తాలొత్త నీణ్ముడి" అనే విధంగా వేయి కిరణాలను కల వేయి మంది సూర్యులు కలసి ప్రకాశించినట్లుండే ఉన్నతమైన కిరీటం కదా!

(అంగద) - అందటికి ఆశ్రయమైన బాహువులను ఆశ్రయించి, వెలుగుతున్న బాహువులు - అనే ఆభరణాలు.

(హార) - "పొన్నిన్ మామణియార మణియాక త్తిలఙ్గుమాల్" (బంగారంతో చేసిన, గొప్ప మణులతో కూర్చిన హారాలు ఆభరణాలుగా స్వామివక్షఃస్థలంలో వెల్గుతున్నాయి. ఆహా!) అని "పెరియమార్బిల్ పేరారమ్ పూణ్డు" (పర్వతం వలె ఉన్నతమైన వక్షఃస్థలంలో గొప్ప హారాలను ధరించి) అని పల్కినట్లుగా వెల్గుతున్న హారాలు.

(కంఠికా) - కంఠసీమలో వెలిగే ముత్యాలు కూర్చిన సరం (హారం)



(మణీన్ద్ర) అవన్దనక్కుమ్ సదా స్పృహణీయమాన శ్రీకౌస్తుభమ్.

(కాఞ్చీగుణ) తిరువరైయిలే విళఙ్గానిన్ఱ అరైనూల్ పట్టికై.

(నూపుర) తిరువడికళై ప్పఱ్ఱి విళఙ్గానిన్ఱ తిరుచ్చిలమ్బుమ్.

ఆదిశబ్దత్తాలే "పలపలవే యాపరణమ్" (తి-వాయ్-2-5-6) ఎన్ఱుమ్, "అపరిమితదివ్యభూషణ" (గద్యత్రయం) ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే అసఙ్ఖ్యాతమెన్నై.

(రథాఙ్గ) ఇన్ద ఆభరణఙ్గళోడు వికల్పిక్కలామ్బడి శోభావహమాన దివ్యాయుధఙ్గళిన్ శేర్త్తియై అనుభవిక్కిఱార్.

(లసత్తులస్యావనమాలయోజ్వలమ్) సర్వైశ్వర్యసూచకమాయ్, తిరువడికళళవుమ్ తాழ்న్దు "అల్లితుழாయలఙ్గళ్" (తి-వాయ్-7-8-10)

---

(మణీంద్ర) - అతనికి (స్వామికి)కూడా సదా అభిలషణీయమైన శ్రీకౌస్తుభమణి.

(కాంచీగుణ) - నడుములో వెల్గుతున్న మొలనూలు.

(నూపుర) - శ్రీచరణాలను ఆశ్రయించి వెలిగే మంజీరాలు.

(ఆది) - శబ్దంతో "పలపలవే ఆభరణమ్" (ఆభరణాలు అనేకం) అని, "అపరిమిత దివ్యాభరణ" (అంతులేని దివ్యాభరణాలు) అని పల్కినట్లు లెక్కలేనన్ని ఆభరణాలు - అని భావం.

(రథాంగ) - ఇంతవరకు తెల్పిన ఆభరణాలతో పాటు, "ఇది కూడా ఒక ఆభరణమే" అనదగినట్లు శోభను కల్గించే దివ్యాయుధాల చేరికను దర్శించి పల్కుతున్నారు.

(లసత్తులస్యా వనమాలాయోజ్జ్వలమ్) - భగవంతుని సర్వైశ్వర్యానికి సూచకమై, శ్రీచరణాలవరకు వేలాడుతూ, "అల్లిత్తుழாయ్అలఙ్గళ్"

ఎన్గిఱ వనమాలైయాలే విళఙ్గానిన్ఱ ఉన్నై. ఆభరణాయుధఙ్గళ్ తన్నైప్పఱ్ఱి విళఙ్గుకైయుమ్ అవఱ్ఱాలే తాన్విళఙ్గుకైయుమాయ్ చ్చొల్లుకిఱపడి. "స్రగ్వస్త్రాభరణైర్యుక్తం స్వానురూపైరనూపమైః చిన్మయై స్స్వప్రకాశైశ్చ అన్యోన్యరుచిరఞ్జకైః" (పౌష్కర సం).

37శ్లో॥ చకర్థ యస్యా భవనం భుజాన్తరం
తవ ప్రియం ధామ యదీయజన్మభూః।
జగత్సమస్తం యదపాఙ్గసంశ్రయం
యదర్థ మమ్భోధిరమన్థ్యబన్ధి చ ॥

అవ : (చకర్థేతి) మేల్ శ్లోకద్వయత్తాలే పిరాట్టియోట్టై చ్చేర్త్తియై అనుభవిక్కిఱార్. ఇతిల్ ముతల్ శ్లోకత్తాలే పిరాట్టియుడైయ మేన్మైయుమ్

---

(తామరపూవులతో కూర్చిన తులసీమాలిక) అనేవిధంగా వనమాలికతో ప్రకాశించే నిన్ను - అని భావం. (లసత్, ఉజ్జ్వలమ్ - అనేపదాలతో) ఆభరణ-ఆయుధాదులు తనను ఆశ్రయించి వెల్గడం, వాటితో తాను ప్రకాశించడం-రెండు ఇక్కడ తెలుపబడ్డాయి. "స్రగ్వస్త్రాభరణైర్యుక్తం స్వానురూపై రనూపమైః, చిన్మయైః స్వప్రకాశైశ్చ అన్యోన్యరుచిరంజకైః" (తనకు తగినవి, సాటి లేనివి, జ్ఞానమయైనవి, స్వయం ప్రకాశకమైనవి, ఒక దానిని ఇంకొకటి, కలయికవల్ల ఏర్పడిన కాంతితో అందంగా ఉన్నవి అయిన మాలికలతో, వస్త్రాలతో, ఆభరణాలతో కూడి ఉండేవాడు, పరమాత్మ) అనే ప్రమాణం ఈఅర్థానికి అనుగుణంగా స్మరణీయం.

37శ్లో॥ అవ : ఇకపై గల రెండు శ్లోకాలతో లక్ష్మీదేవితో కలసి వేంచేసి ఉండే స్థితిని దర్శించి ఆనందించి పల్కుతున్నారు. వీటిలో, మొదటి శ్లోకంతో పిరాట్టి



ఇవళ్పక్కల్ ఈశ్వరనుక్కుణ్డాన వ్యామోహత్తైయు మరుళిచ్చెయ్కిఱార్.

వ్యా : (తవ భుజాన్తరం యస్య భవనం చకర్థ) "సర్వయజ్ఞమయం వపుః" (విష్ణుపురాణమ్) ఎన్గిఱ తిరుమార్పై పిరాట్టిక్కు క్కోయిల్కట్టణమాక ప్పణ్ణియరుళిఱ్ఱు

"యస్యాః" - ఎన్గిఱతు - ఇతిలుణ్డాన ప్రమాణప్రసిద్ధియాలే. "సర్వయజ్ఞమయం వపురధ్యాస్తే" (విష్ణుపురాణమ్), "పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షస్థలం హరేః" (విష్ణుపురాణమ్), "నిన్వలమార్పినిల్ వాழ்కిన్ఱ

---

గొప్పతనాన్ని (పరత్వాన్ని), ఈమెపట్ల స్వామికి ఉండే వ్యామోహాన్ని గూర్చి పల్కుతున్నారు.

వ్యా : (తవ భుజాంతరం యస్యా భువనం చకర్థ) - "కా త్వన్యా త్వా మృతే దేవి ! సర్వయజ్ఞమయంవపుః, అధ్యాస్తే దేవదేవస్య యోగిచింత్యం గదాభృతః" (ఓ దేవీ! గదాధారి, దేవదేవుడైన భగవంతుని యొక్క, యోగులకు సైతం భావించరానిది, సర్వయజ్ఞమయమైనది అయిన శరీరంలో నీవు తప్ప ఇంకెవరుంటారు?) అనే రీతిలోని తన వక్షస్సును స్వామి లక్ష్మీదేవికి అంతఃపురంగా చేశాడు.

"యస్యాః" అనేది ఈ అర్థంలోని ప్రసిద్ధిని బట్టి ప్రయోగింపబడింది. "సర్వయజ్ఞమయం వపురధ్యాస్తే" (నీవు తప్ప ఇంకెవరు సర్వయజ్ఞమయమైన స్వామి శరీరంలో ఉన్నారు?) "దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణ భూషితా, పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః" (అప్రాకృతాలైన మాలికలను, వస్త్రాన్ని ధరించినది, స్నానం చేసినది, భూషణాలతో అలంకరింపబడినది అయిన శ్రీదేవి దేవతలంతా చూస్తూ ఉండగానే హరివక్షఃస్థలాన్ని చేరింది), "నిన్వలమార్బినిల్ వాழ்కిన్ఱ మఙ్గైయుమ్ పల్లాండు" (నీ వక్షఃస్థలంలో కుడివైపున ప్రకాశించే లక్ష్మీదేవికి మంగళం), "తికழ்కిన్ఱ తిరుమార్బిల్

మఙ్గైయుమ్" (తిరుప్పల్లాణ్డు-1), "తికழ்కిన్ఱ తిరుమార్పిల్ తిరుమఙ్గై తన్నోడుమ్ తికழ்కిన్ఱ తిరుమాలార్" (తి-వాయ్-10-6-9), "ఎన్ తిరుమకళ్ శేర్ మార్పన్" (తి-వాయ్-8-2-9), "మైయకణ్ణాళ్ మలర్మేలుఱై వాళుఱైమార్పినన్" (తి-వాయ్-4-5-2), "అలర్మేల్మఙ్గై-యుఱైమార్పా!" (తి-వాయ్-6-10-10), "మార్వత్తుమాలై నఙ్గై" (తి-వాయ్-10-10-2), "శెయ్యాళ్ తిరుమార్పినిల్ శేర్తిరుమాల్" (తి-వాయ్-9-4-1)

(ప్రియం ధామ యదీయజన్మభూః) యవళొరుత్తి అవతరిత్త తిరుప్పాఱ్కడల్ అయర్వఱుమమరర్కళధిపతియాన దేవర్క్కు ఇని తమరుమిడ మాయిற்று. "శ్రీః పూర్వ ముధదేః" (విష్ణుపురాణమ్), "దేవదానవయత్నేన ప్రసూతాఽమృతమన్థనే" (విష్ణుపురాణమ్ 1-9-141),

---

తిరుమఙ్గైతన్నోడుమ్ తికழ்కిన్ఱ తిరుమాలార్" (ప్రకాశించే వక్షఃస్థలంలో వేంచేసి ఉండే లక్ష్మీదేవితో ప్రకాశిస్తున్న శ్రియఃపతి) "ఎన్ తిరుమకళ్ శేర్మార్బనే!" (నాకు పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవి నివసించే వక్షః స్థలాన్ని కలవాడా!), "మైయకణ్ణాళ్ మలర్మేల్ ఉఱైవాళ్ ఉఱైమార్బినన్" (నల్లని కళ్ళను కల్గినది, తామరపూవుపై నివసించేది అయిన లక్ష్మీదేవి నివసించే వక్షస్సును కలవాడు), "అలర్మేల్ మఙ్గైయుఱై మార్బా!" (పద్మనివాసిని అయిన లక్ష్మీదేవి నివసించే వక్షఃస్థలాన్ని కలవాడా!), "మార్వత్తుమాలై నఙ్గై" (వక్షఃస్థలంలో పూలమాలిక వంటి లక్ష్మీదేవి), "శెయ్యాళ్ తిరుమార్పినిల్ శేర్తిరుమాల్" (హిరణ్యవర్ణ అయిన లక్ష్మీదేవి వక్షఃస్థలంలో చేరిన శ్రియఃపతి) అని ఈ విధంగా పలు ప్రమాణాలు ప్రసిద్ధాలు.

(తవ ప్రియం ధామ యదీయజన్మభూః) - ఏ లక్ష్మీదేవి అవతరించిన క్షీరాబ్ధి "అయర్వఱుమమర్కళ్ అదిపతి" (విస్మృతిలేని జ్ఞానాన్ని కల నిత్యసూరులకు అధిపతి) అయిన నీకు ప్రీతిగా ఉండే నివాసమైనదో- అని భావం. "భృగోః ఖ్యాత్యాం సముత్పన్నా శ్రీః పూర్వముదధేః పునః, దేవదానవ



"నేదానీం త్వదృతే సీతే! స్వర్గోఽపి మమ రోచతే" (శ్రీ రా-అయోధ్యా).

(జగత్సమస్తం యదపాఙ్గసంశ్రయమ్) "అస్యేశానా జగతః" (శ్రీసూక్తమ్), "ఈశ్వరీం సర్వభూతానామ్" (శ్రీసూక్తమ్), "త్వం మాతాసర్వలోకానామ్" (విష్ణుపురాణమ్ 1-9-126) ఎన్గిఱపడియే ఇవ్వుభయ విభూతియుమ్ ఇవళొరుత్తియుడైయ మన్దకటాక్షత్తై ప్పற்றி యుణ్డాయిరుక్కిఱతు.

(యదర్థ మమ్బోధి రమన్థి) "విణ్ణవరముతుణ వముతిల్ వరుమ్పెణ్ణముతుణ్డ ఎమ్బెరుమాన్" (పె-తి-6-1-2) ఎన్గిఱపడియే యావళొరుత్తియై ప్పెఱుకైక్కు క్కడల్ కడైన్దరుళிற்று.

---

యత్నేన ప్రసూతాఽమృతమంథనే" (మొదట, భృగుమహర్షికి, అతని పత్ని అయిన ఖ్యాతివల్ల శ్రీదేవి అవతరించింది. తిరిగి, అమృతమథనకాలంలో దేవాసురుల యత్నఫలంగా సముద్రంనుండి ఆవిర్భవించింది?) అని, "నేదానీం త్వదృతే సీతే! స్వర్గోఽపి మమ రోచతే" (సీతా! ఇపుడు నీవు లేకపోతే స్వర్గంకూడా నాకు రుచించదు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

(జగత్ సమస్తం యదపాంగసంశ్రయమ్) - "అస్యేశానో జగతో విష్ణుపత్నీ" (ఈ లోకానికి అంతటికి స్వామిని, విష్ణువుకు పత్ని), "ఈశ్వరీం సర్వభూతానామ్" (సమస్తప్రాణులకు ఈశ్వరి- అయిన శ్రీదేవిని ఇక్కడకు ఆహ్వానిస్తున్నాను) "త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా" (లోకాలన్నిటికి నీవే తల్లి, దేవదేవుడైన హరి తండ్రి) అనేవిధంగా ఈ ఉభయవిభూతులు కూడా ఏ లక్ష్మీదేవి యొక్క స్వల్పకటాక్షాన్ని ఆశ్రయించి ఏర్పడుతున్నదో-

(యదర్థ మంభోధి రమంథి)- "విణ్ణవర్ అముదుణ అముదిల్ వరుమ్ పెణ్ణముదుణ్డ పెరుమాన్" (దేవతలు అమృతాన్ని భుజించగా, ఆ అమృతంకంటే అరుదైన లక్ష్మీదేవి అనే అమృతాన్ని పొందిన స్వామి) అనేరీతిలో ఏలక్ష్మీదేవిని పొందడంకోసం సముద్రాన్ని చిలికాడో -

(అబన్ది చ) యావళొరుత్తియుడైయ పిరివాற்றாமையాలే కడలై యుడైత్తరుళిற்று. "ఏష సేతు ర్మయాబద్ధ స్సాగరే సలిలార్ణవే, తవ హేతోర్విశాలాక్షి! నళసేతు స్సుదుష్కరః" (శ్రీరా-యుద్ధకాణ్డమ్).

38శ్లో ॥ స్వవైశ్వరూప్యేణ సదాఽనుభూతయా-
ప్యపూర్వవద్విస్మయ మాదధానయా ।
గుణేన రూపేణ విలాసచేష్టితై
స్సదా తవైవోచితయా తవ శ్రియా ॥

అవ : (స్వవైశ్వరూప్యేణ) ఇతిల్ పిరాట్టియినుడైయ నిరతిశయ భోగ్యతైయైయుమ్, "ఉనక్కేర్క్కుమ్ కోలమలర్ప్పావై" (తి-వాయ్-10-10-6) ఎన్గిఅపడియే అవనుక్కేయాయిరుక్కిఅ విరుప్పైయు మనుభవిక్కిఱార్.

వ్యా : (స్వవైశ్వరూప్యేణ సదాఽనుభూతయాపి) సర్వశక్తియాన దేవర్.

---

(అబంధిచ) - ఏలక్ష్మీదేవియొక్క విశ్లేషాన్ని సహించలేనందున సముద్రాన్ని వారధికట్టి బంధించాడో - అని భావం. "ఏష సేతుర్మయా బద్ధః సాగరే సలిలార్ణవే, తవ హేతో ర్విశాలక్షి! నళసేతు స్సుదుష్కరః" (విశాలమైన నేత్రాలను కల్గిన సీతా! నీటితో నిండిన సముద్రంలో నళసేతువు అనే పేరును కల, కట్టడానికి చాలా దుష్కరమైన ఈ వారధి నీకోసం నాచే కట్టబడింది) అనే శ్రీరామాయణ సూక్తి స్మరణీయం.

38శ్లో ॥ అవ : ఈ శ్లోకంలో, లక్ష్మీదేవియొక్క అంతు లేని భోగ్యతను, "ఉనక్కేఱ్కుమ్ కోలమలర్ ప్పావై" (నీకు అనురూపమైన, అందమైన తామరపూవులో నివసించే లక్ష్మీదేవి) అనే రీతిలో ఆభగవంతునకే తగినట్లుండే ఆమె స్థితిని దర్శించి, ఆనందిస్తున్నారు.

వ్యా : (స్వవైశ్వరూప్యేణ సదాఽనుభూతయాపి) సర్వశక్తివి అయిన



సర్వవిగ్రహత్తాలుమ్, సర్వకాలుమ్, సర్వప్రకారాత్తాలుమ్ అనుభవియానిన్రాలుమ్ పిరాట్టియుడైయ భోగ్యతైయై ప్పరిచ్చేదిక్కప్పోకాతు. సౌభరియైప్పోలే అనేకవిగ్రహత్తై ప్పరిగ్రహత్తాలుమ్ ముడియాతు.

(అపూర్వవద్విస్మయ మాదధానయా) నిత్యాపూర్వవైప్పాలే ఆశ్చర్యావహమాయిరుక్కుమ్. "స ఏకధా భవతి, ద్విధా భవతి" (కౌషీతకీ-ఉపని) ఎన్లు నిత్యసూరికళ్ తన్ తిఅత్తిల్ పడువతెల్లామ్ పిరాట్టియై క్కుఅిత్తు త్తాన్ పడుమెన్గై. "పణ్డివరైక్కణ్డఱివ తెవ్వూరిల్?" (తిరుమొழி-8-1-9) ఎన్లుమ్,

---

నీవు, అన్ని రూపాలతో, సర్వకాలం, అన్ని రీతులలో ఆనందించినా, ఇంకా, లక్ష్మీదేవికి ఉండే భోగ్యతను ఇంతటిదని పరిచ్ఛేదించి పల్కడం వీలుకాదు. (సౌభరివలె అనేక రూపాలను పరిగ్రహించినా సాధ్యం కాదు), "పరిశ్రమాత్ ప్రసుప్తా చ రాఘవాంకేఽ ప్యహం చిరమ్, పర్యాయేణ ప్రసుప్తశ్చ మమాంకే భరతాగ్రజః" (రాఘవుని ఒడిలో నేను శ్రమవల్ల చిరకాలం నిద్రించాను. భరతుని అన్న అయిన అతడుకూడానే ఒడిలో నిద్రించాడు) అనేవిధంగా ప్రకారాలు (రీతులు) అనేకమైనప్పటికీ సాధ్యం కాదు.

(అపూర్వవద్విస్మయమాదధానయా) - నిత్యాపూర్వతవల్ల (ఎప్పటికప్పుడు కొత్తగా తోచే స్వభావంవల్ల) ఆశ్చర్యాన్ని కల్గించేదై ఉంటుంది. "స ఏకధా భవతి త్రివిధా భవతి పంచధా, సప్తధా నవధా చైవ పునశ్చైకాదశః స్మృతః, శతంచ దశచైకం చ సహస్రాణి చ వింశతిః" (ముక్తాత్మ ఒకడుగా, ముగ్గురుగా, అయిదుగురుగా, ఏడుగురుగా, తొమ్మిది మందిగా, పదకొండు మందిగా, వంద మందిగా, పది మందిగా, ఒక్కడుగా, వేయి మందిగా - ఈ విధంగా పలు రూపాలను కలవాడవుతున్నాడు) అని, నిత్యసూరులు తన విషయంలో పడే పాట్లను అన్నిటినీ పిరాట్టివిషయంలో తాను పడుతున్నాడని భావం. "పణ్డివరై క్కణ్డదు ఎవ్వూరిల్?" (ఇంతకుముందు వీరిని చూచినది ఏ ఊరిలో?) అని, "అప్పాழுదైక్కప్పాழுదు

"అప్పోழுతైక్కప్పోழுతెన్నారావముతమ్" (తి-వాయ్-1-5-4) ఎన్ఱు ఆழ்వార్కళుమ్, "సదా పశ్యన్తి" (విష్ణుసూక్తమ్) ఎన్ఱు నిత్యసూరికళుమ్ నిత్యాపూర్వత్తైయాలే దేవర్త్తిఅత్తిల్ పడువతెల్లామ్ దేవర్ పడుమ్బడియాయితే పిరాట్టిభోగ్యత్తై యిరుప్పతు. ఉకప్పిప్పతు ఎమ్మొకత్తాలే? ఎన్నిల్,

(గుణేన రూపేణ విలాసచేష్టితైః) వడివழகాలుమ్ శీలాదిగుణఙ్గళాలుమ్, విలాసచేష్టితఙ్గళాలుమ్, "సకృత్త్వదాకారవిలోకనాశయా" (స్తోత్రరత్నమ్) ఎన్గిఅపడియేయుమ్. "ఈర్కిన్ఱ కుణఙ్గళై యుడైయాయ్" (తి.వాయ్ 8-1-8) ఎన్గిఅ గుణఙ్గళైయుమ్, "ఉన్ శెయ్కై నైవిక్కుమ్" (తి-వాయ్-8-1-8) ఎన్గిఅ చేష్టితఙ్గళిలుమ్ అభియుక్తర్ అழఙ్గాల్ పడుమ్బడి యిరుక్కుమవనితే. ఇప్పడి ఇవళుడైయ స్వరూపాదికళిలే అழுన్దుకిఱాన్. అవన్ స్వరూపత్తిలే అపరిచ్ఛిన్నన్. ఇవళ్ భోగ్యత్తైయాలే అపరిచ్ఛిన్నై.

ఎన్నారావముదమ్" (ఎప్పటికప్పుడు అపూర్వంగా అపర్యాప్తంగా తోచే అమృతం) అని ఆழ்వార్లు "సదా పశ్యంతి" (ఎల్లప్పుడు దర్శిస్తూ ఉంటారు) అని నిత్యసూరులు నిత్యాపూర్వతవల్ల నీ విషయంలో పడేపాట్లు అన్నీ నీవు పడేటట్లుగా కదా లక్ష్మీదేవి భోగ్యత ఉంటుంది. ఆనందింపజేయడం ఏ రీతిలో? అంటే,

(గుణేన రూపేణ విలాసచేష్టితైః) - రూపసౌందర్యంతో, శీలాదిగుణాలతో "సకృత్త్వదాకారవిలోకనాశయా" (ఒక్కమారు నీ రూపాన్ని దర్శించాలనే ఆశతో) అనే రీతిలో "ఈర్కిన్ఱ కుణఙ్గళ్" (మనస్సును ఛేదిస్తున్న గుణాలను) అనే గుణాలను, 'ఉన్ శెయ్కై నైవిక్కుమ్" (నీ లీలలను మనస్సును బాధిస్తాయి) అనే లీలలను ఆழ்వార్లు లోతుగా అవగాహించేటట్లుగా కదా, స్వామి ఉంటాడు. ఈవిధంగా, లక్ష్మీదేవి స్వరూపగుణచేష్టితాలలో స్వామి పూర్తిగా మగ్నుడై ఉంటాడు. అతడు స్వరూపంతో అపరిచ్ఛేద్యుడు (అపరిచ్ఛేద్యమైన స్వరూపాన్ని కలవాడు). ఈమె భోగ్యతతో అపరిచ్ఛేద్య (అంతులేని భోగ్యతను కల్గినది).



(సదా తవైవోచితయా) "తుల్యశీలవయోవృత్తామ్" (రా.సుం 16-5) ఎన్ఱుమ్, "ఉనక్కేఱ్ఱుమ్ కోలమలర్ప్పావై" (తి.వాయ్ 10-10-8) ఎన్ఱుమ్ శొల్లుకిఅపడియే దేవర్తమక్కు త్తకుతియాయిరుక్కిఅవళ్.

(సదా) ఎన్ఱు పరవ్యూహవిభవరూపేణ ఉణ్డాన సర్వావస్థైకళిలుమెన్గిఅతు. "గుణేన రూపేణ విలాసచేష్టితైస్సదా తవైవోచితయా" ఎన్నవుమామ్.

(తవ శ్రియా) "విష్ణోశ్శ్రీః" (విష్ణుపురాణమ్) ఎన్ఱుమ్ "ఉన్తిరు" తి.వాయ్ 10-10-2) ఎన్ఱుమ్ శొల్లుకిఅపడియే అనన్యార్హై యెన్నుతల్. దేవర్క్కు

(సదా తవైవోచితయా) - ''తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణమ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా" (రామునకు తగిన శీలాదిగుణాలను, వయస్సును, నడవడికను కల్గినది. తగిన కులాన్ని, లక్షణాలను కల్గినది అయిన సీతకు రాముడు తగినవాడు; అతనికి నల్లని కన్నులను కల ఈమె తగినది) అని, "ఉనక్కేఱ్ఱుమ్ కోలమలర్ప్పావై" (నీకు తగినది అయిన, అందమైన లక్ష్మీదేవి) అని పల్కినట్లుగా నీకు తగినదై ఉన్నది.

(సదా) - అని అంటూ పరవ్యూహ విభవరూపాలతో ఉండే అన్ని అవస్థలలోను- అని తెలుపబడుతున్నది. అన్ని రూపాలలో, అవస్థలలో నీకు తగినది- అని తాత్పర్యం. "గుణేన రూపేణ విలాసచేష్టితైః సదా తవైవోచితయా" (గుణాలతో, రూపంతో, విలాసచేష్టితాలతో ఎల్లప్పుడు నీకు తగిన లక్ష్మీదేవితో) అనికూడా అన్వయించి అర్థాన్ని చెప్పవచ్చు.

(తవ శ్రియా) "నిత్య వైషా జగన్మాతా విష్ణోశ్శ్రీ రనపాయినీ" (లోకానికి అంతటికి తల్లి, నిత్య అయినది, విష్ణువునకు చెందినది అయిన ఈలక్ష్మీదేవి) అని, "ఉన్ తిరుమార్వత్తుమాలై నఙ్గై" (నీ వక్షఃస్థలానికి వనమాలిక వలె

సమ్పత్తాయిరుక్కుమవళ్ - ఎన్నుతల్.

39శ్లో ॥ తయా సహాసీనమనన్తభోగిని
ప్రకృష్టవిజ్ఞానబలైకధామని ।
ఫణామణివ్రాతమయూఖమణ్డల-
ప్రకాశమానోదరదివ్యధామని ॥

అవ : (తయా సహాసీనమ్) ఇతిల్ పర్యఙ్కవిద్యైయిల్ శొల్లుకిఱపడియే తిరువనన్దాழ்వాన్ మడియిలే పిరాట్టియోడే యెழுన్దరుళియిరుక్కిఱ శేర్త్తియై అనుభవిక్కిఱార్.

వ్యా : (తయా సహాసీనమ్) "శ్రియా సార్ధం జగత్పతిరాస్తే" (శైవమ్) ఎన్గిఱపడియే నిత్యవిభూతియిల్ మిథునమాయిరున్దితే అడిమైకొళ్వతు. అవతారత్తిలుమ్ "భవాంస్తు సహ వైదేహ్యా" (రా అయో 31-25) ఎన్నక్కడవతిఱే.

---

అలంకారమైన లక్ష్మీదేవి) అని పల్కినట్లుగా అనన్యార్హ- అనికాని, నీకు సంపదయై ఉన్నది అని కాని చెప్పవచ్చు.

39శ్లో ॥ అవ : ఈశ్లోకంలో పర్యంకవిద్యలో చెప్పినట్లుగా ఆదిశేషుని ఒడిలో లక్ష్మీదేవితోపాటు వేంచేసి ఉండే చేరికను దర్శించిపల్కుతున్నారు.

వ్యా : "వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణురచింత్యాత్మా భక్తైర్భాగవతైస్సహ" (గొప్ప లోకమైన వైకుంఠంలో జగత్పతి అయిన, భావించడానికి సాధ్యం కాని స్వరూపాన్ని కల విష్ణువు లక్ష్మీదేవితోపాటు భక్తులతో, భాగవతులతో కలసి వేంచేసి ఉంటాడు) అనేవిధంగా నిత్యవిభూతి అనే పరమపదంలో మిథునంగా కదా కైంకర్యాన్ని స్వీకరిస్తాడు. అవతారాలలో కూడా "భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు



(అనన్తభోగిని) శ్రియఃపతిత్వత్తాల్ వన్ద ఉత్కర్షత్తోపాతియిఱే. తిరువనన్దాழ்వానోట్టైచ్చేర్త్తియుమ్, "గన్ధర్వాప్సరస్సిద్ధాః కిన్నరోరగచారణాః, నాన్తం గుణానాం గచ్ఛన్తి తేనానన్తోఽయ ముచ్యతే" (తి-వాయ్-10-10-2) ఎన్గిఱపడియే గుణానన్త్యత్తాలే అనన్తనెన్నక్కడవతిఱే. ఈశ్వరన్ రక్షణత్తిలే అసంఖ్యాతగుణన్. ఇవన్ కైఙ్కర్యార్థమాక అసంఖ్యాతగుణన్.

(భోగిని) "మెన్మై, కుళిర్త్తి, నాற்றమ్" ఇవற்ற స్వభావమాకవుడైయ తిరుమేనియిలే. భోగమ్- శరీరమ్.

(ప్రకృష్టవిజ్ఞానబలైకధామని) ఇరువరుమాయ్ ప్పరిమాఱుమ్పోతు

---

రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే" (సీతాదేవితో పాటుగా నీవు పర్వతచరియలలో విహరిస్తావు. అపుడు నేను నీకు అన్ని కైంకర్యాలను నీవు మేల్కొని ఉండేటపుడు, నిద్రించేటపుడు చేస్తాను) అని కదా మిథునంగా కైంకర్యాన్ని స్వీకరిస్తాడని చెప్పబడింది.

(అనంతభోగిని) - శ్రియఃపతిత్వంవల్ల (లక్ష్మికి నాథుడైనందువల్ల) కల్గిన ఉత్కర్షం వంటిదికదా, ఈ అనంతునితో కలయికవల్ల కలిగే ఉత్కర్షం. "గంధర్వాప్సరసః సిద్ధాః సకిన్నరమహోరగాః నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయ ముచ్యతే" (గంధర్వులు, అప్సరసలు, కిన్నరులతో పాటు మహానాగాలతో కూడిన సిద్ధులు, ఇతని గుణాల అంతును పొందలేదు. అందువల్ల ఇతడు అనంతుడని అనబడుతున్నాడు) అనే రీతిలో గుణాలు అంతులేనివి అయినందున అనంతుడని అనబడుతున్నదికదా. ఈశ్వరుడు రక్షణంలో అసంఖ్యాత (లెక్కలేనన్ని) గుణాలను కలవాడు. ఆదిశేషుడు కైంకర్యార్థంగా అసంఖ్యాతుడు. లెక్కలేనన్ని కైంకర్యాలను చేసేవాడు.

(భోగిని) - మృదుత్వం, చల్లదనం, సువాసన- అనేవీటిని స్వభావంగా కల తిరుమేనిలో - అని అర్థం. భోగమంటే సర్పశరీరం.

(ప్రకృష్టవిజ్ఞానబలైకధామని) - దంపతులై ఉండే స్థితిలో కైంకర్యం

అవర్కళుక్కు ప్పాజ్గాయిరుక్కుమ్బడియాన జ్ఞానశక్త్యాదికళుక్కాశ్రయ-మాయిరుక్కుమవన్. ఒరుత్తనెన్డు అవర్కళుక్కు క్కూశవేణ్డాతే తుకైత్తు ప్పరిమాఅలామ్బడియాన ధారణసామర్థ్యత్తుక్కు ఆశ్రయమాయిరుక్కుమవన్.

**(ఫణామణీత్యాది)** తమ్ముడైయ ఫణామణిసమూహజ్గళినుడైయ రశ్మిమణ్డలజ్గళాలే ప్రకాశియానిన్ఱ మధ్యత్తై యుడైయ దివ్యాన్తః పురత్తై యుడైయవన్. "మణివిళక్కామ్" (ఇయఱ్పా 4-తిరువన్దాది 46) ఎన్గిఅపడియే దివ్యాన్తః పురత్తుక్కు మజ్గళదీపమాయితే ఇరుప్పతు.

**40శ్లో ॥** నివాసశయ్యాసనపాదుకాంశుకో
పధానవర్షాతపవారణాదిభిః ।
శరీరభేదై స్తన శేషతాం గతై
ర్యథోచితం శేష ఇతీర్యతే జనైః ॥

అవ : **(నివాసేత్యాది)** తిరువనన్దాఌ్వానుడైయ వృత్తివిశేషజ్గళై

---

చేసేటపుడు, వారికి తగిన జ్ఞానశక్త్యాదులను కలవాడు. "వేఱొకడు ఇక్కడ ఉన్నాడు'' అని సర్వేశ్వరుడు సంకోచించనక్కరలేనట్లుగా తనను మలచుకొని కైంకర్యం చేయగల్గిన ధారణసామర్థ్యాన్ని కలవాడు.

**(ఫణామణీత్యాది)** - తన పడగలలోని మణుల సమూహాల కాంతిమండలాలతో ప్రకాశిస్తున్న మధ్యభాగాన్ని కల దివ్యాంతపురాన్ని కలవాడు. **"మణివిళక్కామ్"** (మణిదీపమై ఆదిశేషుడు భగవంతుని సేవిస్తాడు) అనే రీతిలో దివ్యాంతపురానికి మంగళదీపంగా కదా, ఆదిశేషుడుంటాడు.

**40శ్లో ॥** అవ : (నివాస) - ఆదిశేషుని కైంకర్యవిశేషాలను తమకు కైంకర్యంలో



యనుభవిక్కిఱార్. తమక్కు అడిమైయిలుణ్డాన త్వరైయాలే "ఉపమాన మశేషాణాం సాధూనామ్" (విష్ణుపు 1-15-157) ఎన్నుమ్ న్యాయత్తినాలే అడిమైయిల్ రుచియుడైయార్క్కెల్లామ్ ఉదాహరణభూతనాయితే తిరువనన్దాఌ్వానిరుప్పతు. ఇవరుడైయ శేషత్వకాష్ఠైయై యరుళిచ్చెయ్కిఱార్.

వ్యా: (నివాస) ఎఴున్దరుళియిరుక్కిఅ తిరుమాళికైయామ్.

**(శయ్యా)** కణ్వళర్న్దరుళుకైక్కు ప్పడుక్కైయామ్.

**(ఆసన)** ఇరున్దాల్ శిజ్గాశనమామ్.

**(పాదుక)** నిన్ఱాల్ మరవడియామ్.

**(అంశుక)** "పూమ్బట్టామ్" (1-తిరువ-53) ఎన్ఱు పుంస్త్వావహమాన

---

ఉండే త్వరకారణంగా భావించి పల్కుతున్నారు. "ఉపమాన మశేషాణాం సాధూనాం యస్సదాఽభవత్'' (ఏ ప్రహ్లాదాఌ్వాన్, ఎల్లప్పుడు సాధుజనులందఱికి ఉపమానం అయ్యాడో) అనే విధంగా కైంకర్యంలో ఆసక్తిని కలవారికి అందఱికి ఉదాహరణంగా కదా ఆదిశేషుని కైంకర్య విశేషాలున్నాయి. ఇతని కైంకర్యకాష్ఠను (ప్రకారాలను) గూర్చి ఇందులో పల్కుతున్నారు.

వ్యా : **(నివాస)** - వేంచేసి ఉండేటపుడు తిరుమాళిగ అవుతాడు. (నివాసమై సేవచేస్తాడు)

**(శయ్యా)** - నిద్రించడానికి పడుక అవుతాడు.

**(ఆసన)** - **"ఇరున్దాల్ శిజ్గాశనమామ్"** (భగవంతుడు కూర్చున్నప్పుడు సింహాసనమై సేవిస్తాడు) అనే పాయ్కై ఆఌ్వార్ల సూక్తి స్మరణీయం.

**(పాదుకా)** - **"నిన్ఱాల్ మరవడియామ్"** (స్వామి వేచి నిలచినపుడు పాదుకలుగా మాఱి ఆదిశేషుడు సేవిస్తాడు) అనే పాయ్కై ఆఌ్వార్ల సూక్తి స్మరణీయం.

**(అంశుక)** - పుంస్త్వాన్ని కల్గించే దివ్యవస్త్రంగా మాఱి సేవిస్తాడు.

తిరుప్పరియట్టమామ్.

(ఉపధాన) "పుల్కు మణైయామ్" (1-తిరువ-53) ఎన్ఱు తழுవుకైక్కు అణైయామ్.

(వర్షాతపవారణాదిభిః) "శెన్ఱాల్ కుడైయామ్" (1-తిరువ-53) ఎన్గిఱపడియే వర్షత్తుక్కుమ్, ఆతపత్తుక్కుమ్ ఛత్రమామ్. ఆదిశబ్దత్తాలే అడిమైయిల్ అభినివేశానురూపమాక ప్పరిగ్రహిక్కిఱ శరీరఙ్గళుక్కు త్తొకైయిల్లై. "స ఏకధా భవతి" (ఛా-7-26-2) ఎన్ఱు తుడఙ్గి "సహస్రధా భవతి" (ఛా 7-26-2) ఎన్నక్కడవతిఱే.

(శరీరభేదైః) కైఙ్కర్యభేదమే శరీరభేదత్తుక్కు హేతు.

(తవ శేషతాం గతైః) దేవరుడైయ విగ్రహఙ్గళ్ రక్షణహేతు- వాయిరుక్కిఱాప్పోలే ఇవనుడైయ విగ్రహముమ్ శేషత్వత్తై యుడైత్తాయిరుక్కుమెన్గై.

---

(ఉపధాన) - "పుల్కుమ్ అణైయామ్" (ఆలింగనం చేసికొనే తలదిండుగా మాఱి సేవిస్తాడు) అనేసూక్తి భావ్యం.

(వర్షాతపవారణాదిభిః) - "శెన్ఱాల్ కుడైయామ్" (స్వామి సంచరిస్తే గొడుగుగా మాఱి సేవిస్తాడు) అనే రీతిలో ఎండకు, వానకు గొడుగు అవుతాడు. ఆదిశబ్దంతో, దాస్యంలో అభినివేశానికి అనుగుణంగా అతడు ఎత్తే శరీరాలకు అంతు లేదు- అని తెలుపబడింది. "స ఏకధా భవతి త్రిధా భవతి" అని ఆరంభించి, "సహస్రధా భవతి" అని ఉపనిషత్తులో ముక్తపురుషుడు పలు రూపాలను పొందుతాడని చెప్పబడిందికదా!

(శరీరభేదైః) - కైంకర్యంలోని భేదమే ఆదిశేషుడు ఎత్తే శరీరాల భేదానికి కారణం.

(తవ శేషతాం గతైః) - దేవరవారి రూపాలు అన్నీ రక్షణహేతువులైనట్లే ఆదిశేషుని రూపాలు అన్నీ శేషత్వాన్ని పొందినవే - అని భావం.



(యథోచితమ్) "యదా యదా హి కౌసల్యా" (రా-అ-12-68) ఎన్గిఱపడియే తత్తత్కాలోచితమాయిరుక్కై.

(జనైః శేష ఇతీర్యతే) శిఱియార్, పెరియారెన్నాతే సర్వరాలుమ్ శేషనెన్ఱుశొల్లప్పడుకై. శేషత్వన్దాన్ ఒరు వడివు కొణ్డువన్దాప్పోలే యిరుక్కై.

(జనైః) "పెరుమక్కళుళ్ళవర్" (తి-వాయ్-3-7-5) ఎన్గిఱపడియే నిత్యసిద్ధరై చ్చొల్లవుమామ్. "పరగతాతిశయాధానేచ్ఛాయా ఉపాదేయత్వమేవ యస్య స్వరూపం, స శేషః, పరః శేషీ" (భాష్యకారముక్తకమ్) ఎన్గిఱ

---

(యథోచితమ్) - "కిం చైనాం ప్రతివక్ష్యామి కృత్వా విప్రియమీదృశమ్; యదా యదా హి కౌసల్యా దాసీవచ్చ సఖీవ చ, భార్యావత్ భగినీ వచ్చ మాతృవచ్చోపతిష్ఠతి" (కౌసల్య, దాసివలె, సఖివలె, భార్యవలె, సహోదరివలె, తల్లివలె శుశ్రూషను చేసేటపుడదంతా, ఇటువంటి అప్రియమైన కార్యాన్ని చేసి, ఆమెకు ఏమని బదులివ్వగలను?) అనేవిధంగా ఆయా సమయాలకు తగిన కైంకర్యాలను చేస్తాడు.

(జనైః శేష ఇతీర్యతే) - చిన్నవారు, పెద్దవారు - అనే తేడా లేకుండా అందఱిచే శేషుడని చెప్పబడుతున్నాడు. శేషత్వమనేది ఒక రూపాన్ని పొందినట్లుంటాడు.

(జనైః) - "పెరుమక్కళుళ్ళవర్" (నిత్యులైన నిత్యసూరులు అనేటట్లు నిత్యసిద్ధులను ఈ పదం తెల్పుతున్నది. "పరగతాతిశయాధానేచ్ఛయోపాదేయ త్వమేవ యస్య స్వరూపం, సః శేషః, పరశ్శేషీ" (వేఱొకనికి గొప్పతనాన్ని - ఆనందాన్ని - కల్గించాలని భావనతో అంగీకరింపబడడమే ఎవనికి స్వరూపమో, అతడు శేషభూతుడు, అన్యుడు శేషి) అని నిర్వచింపబడిన శేషత్వానుగుణంగా ఆదిశేషుడు సేవిస్తాడు. "పారతంత్ర్యం పరే పుంసి ప్రాప్యనిర్గతబంధనః, స్వాతంత్ర్యమతులం ప్రాప్య తేనైవ సహ మోదతే" (కర్మలనుండి విముక్తుడైన ముక్తుడు, పరమపురుషునిపట్ల పారతంత్ర్యాన్ని

శేషత్వత్తిన్బడియే. "పారతన్త్ర్యం పరే పుంసి" (భగవ) ఇత్యాది.

**41శ్లో ॥** దాస స్సఖా వాహన మాసనం ధ్వజో
యస్తే వితానంవ్యజనం త్రయీమయః ।
ఉపస్థితం తేన పురో గరుత్మతా
త్వదఙ్ఘ్రిసమ్మర్దకిణాఙ్కశోభినా ॥

అవ : **(దాస స్సఖేతి) ఇతిల్ - వాహనధ్వజాదిసర్వవృత్తికళై యుముడైయనాయ్, ఈశ్వరనుక్కు మోప్పుழమ్బోలే సదా విరుమ్బుమ్బడి అభిమతనాయిరుక్కిఱ పెరియతిరువడియోట్టై చ్చేర్త్తియై అనుభవిక్కిఱార్.**

వ్యా : **(దాసః) తన్నుడైయ వ్యాపారఙ్గళడఙ్గ ఈశ్వరనుక్కు అతిశయత్తై విళైక్కుమవై యాయిరుక్కై.**

**(సఖా) జగద్వ్యాపారాదికళిల్ ఈశ్వరనుమ్ తన్నోడే**

---

పొంది, సాటి లేని స్వాతంత్ర్యాన్ని పొంది, ఆ పరమాత్మతోపాటు సదా ఆనందిస్తాడు) ఇత్యాదులు ప్రమాణాలు.

**41శ్లో ॥** అవ : **(దాసస్యేత్యాది) -** ఇందులో, వాహనం, గొప్పధ్వజం మొదలైన అన్ని కైంకర్యాలను చేసేవాడై, సర్వేశ్వరునకు **"మోప్పుழమ్"** (వాసనచూస్తూ ఆనందించే నిమ్మపండు వంటివాడు) వలె సదా ఆశపడేటట్లుగా ఇష్టసేవకుడై ఉండే (తిరువడిలో) గరుడునితో చేరికను అనుభవిస్తున్నారు.

వ్యా : **(దాసః) -** గరుడుడు చేసే పనులన్నీ భగవంతునకు ఆనందాన్ని కల్గించేవిగా ఉంటాయి.

**(సఖా) -** జగద్వ్యాపారాలలో ఈశ్వరుడు తనతో చర్చించే రీతిలోని



**ఉశావవేణ్డుమ్బడియాన పెరుమైయై యుడైయవన్.**

**(వాహనమ్) ఆశ్రితరుడైయ ఆపత్తుక్కళిలే ఈశ్వరనై క్కొణ్డువన్దు శేర్క్కుమవనాయిరుక్కై.**

**(ఆసనమ్) ఒరు కార్యమిల్లాతపోతు సింహాసనస్థనాయి-రున్దాలోపాతి తన్ మేన్మైక్కు సదృశమామ్బడి సింహాసనమాయిరుక్కై.**

**(ధ్వజః) ఈశ్వరన్ కిట్టువతఱ్కుమున్నే ఎழున్దరుళా విన్ఱానెన్ఱు ఆశ్రితర్క్కు ప్రీతిహేతువాన కొడియానవన్. అవనుడైయ రక్షకత్వ ప్రసిద్ధిక్కు హేతువాననెన్నవుమామ్.**

**(యః) "పొన్మలైయిన్ మీమిశైకార్ ముకిల్పోల్" (తి-వాయ్-9-2-6) ఎన్ఱుమ్, "పుళ్ళూర్ కొడియానే" (తి-వాయ్-3-8-1) ఎన్ఱుముణ్డాన ప్రసిద్ధియై చ్చొల్లుకిఱతు.**

---

గొప్పతనాన్ని కలవాడు.

**(వాహనమ్) -** ఆశ్రితుల (భక్తుల) ఆపదలలో ఈశ్వరుని తీసికొనివచ్చి చేర్చేవాడై ఉండడం.

**(ఆసనమ్) -** ఏ పని లేనపుడు, సింహాసనంపై వేంచేసి ఉండేటపుడు తన పరత్వానికి తగినది అనే రీతిలో ఉండే సింహాసనమై ఉంటాడు.

**(ధ్వజః) -** భగవంతుడు వచ్చి సమీపించడానికి ముందే "అతడు వేంచేస్తున్నాడు'' అని భక్తులకు తెలిపే ప్రీతిహేతువైన ధ్వజమై ఉంటాడు.

**(యః) - "పొన్మలైయిన్ మీమిశై క్కార్ముకిల్ పోల"** (బంగారుకొండ అయిన మేరుపరత్వంపై సంచరించే కాలమేఘంవలె) అని, **"పుళ్ళూర్ కొడియాన్"** (గరుడుని ధ్వజంగా కలవాడు) అని గల ప్రసిద్ధిని ఈ ప్రయోగం తెల్పుతున్నది.

(వితానమ్) "వినతైశిఱువన్ శిఱకెన్నుమ్ మేలాప్పిన్‌కీழ் వరువాన్" (నాతి-14-3) ఎన్గిఱపడియే ఆతపనివారణమాయిరుక్కై. "గరుడఞ్చ దదర్శోచ్చై రన్తర్ధానగతిం ద్విజ, కృతచ్ఛాయం హరేర్మూర్ధ్ని పక్షాభ్యాం పక్షిపుఙ్గవమ్" (వి-పు-5) ఇతి పరాశరః.

(వ్యజనమ్) తన్నైమేల్‌కొణ్డుపోమ్బోతు చామరఙ్గళ్ పోలే తిరుచ్చిఱకాలే ఆశ్వాసకరనాయిరుక్కై.

(త్రయీమయః) "త్రివృత్తే శిరో గాయత్రం చక్షుః" (తై యజు.సం) ఎన్గిఱపడియే వేదఙ్గళై అవయవఙ్గళాక వుడైయనాయిరుక్కై. "అవయవార్థే మయట్". ఈశ్వరన్ వేదప్రతిపాద్యన్, ఇవన్ వేదశరీరన్.

---

(వితానమ్) - "వినతై శిఱువన్ శిఱకెన్నుమ్ మేలాప్పిన్‌కీழ் వరువాన్" (వినతాదేవి కుమారుని రెక్క అనే వితానం కింద వచ్చేవాడు) అనే రీతిలో ఆతపనివారణమై ఉంటాడు. "గరుడం చ దదర్శోచ్చైరంతర్ధాన గతం ద్విజ, కృతచ్ఛాయం హరేర్మూర్ధ్ని పక్షాభ్యాం పక్షిపుంగవమ్" (మునివరా ! రెక్కలతో హరితలపై నీడను పడేటట్లు చేసేవాడు, పక్షిరాజు, అదృశ్యుడై ఉండేవాడైన గరుడుని కూడా ఆ ఇంద్రుడు ఆకాశంలో చూచాడు) అని పరాశరమహర్షి వితానమై గరుడుడు సేవించే రీతిని పలికాడు.

(వ్యజనమ్) - తనపై అధిరోహించి వెళ్ళేటపుడు, చామరాలతోవలె తన రెక్కలతో వీచి భగవంతుని శ్రమను తీరుస్తాడు.

(త్రయీమయః) - "సుపర్ణోసి గరుత్మాన్, త్రివృత్తే శిరః, గాయత్రం చక్షుః" (చక్కని రెక్కలను కలవాడవై, గరుత్మాన్ అనే నామాన్ని కలవాడవై ఉన్నావు. త్రివృత్ అనేది నీ శిరస్సు, గాయత్ర మనేది చక్షువు) అనేవిధంగా వేదాలను అవయవాలుగా కల్గినవాడు. ఇక్కడ "త్రయీమయః" అనే పదంలోని "మయట్" ప్రత్యయం అవయవార్థంలో వచ్చింది. భగవంతుడు వేదప్రతిపాద్యుడు, ఇతడు వేదశరీరుడు.



(తేన గరుత్మతా పురః ఉపస్థితమ్) సర్వేశ్వరన్తన్నై ప్రకాశిప్పిక్కుమ్ నిలైక్కణ్ణాడిపోలేయుమ్, మోమ్బుழమ్బోలేయుమ్, తిరుమున్బే సర్వదా సన్నిహితనాయుళ్ళవన్.

(త్వదఙ్ఘ్రిసమ్మర్దకిణాఙ్కశోభినా) తన్నైమేల్‌కొణ్డాల్ తిరువడికళాల్ నెరుక్కిన తழువమ్బు తనక్కు భోగచిహ్నమాకైయాలే అత్తాలే విళఙ్గానిఱ్కుమవన్. ఈశ్వరనుక్కు శ్రీకౌస్తుభమ్ లక్షణమానాప్పోలే, ఇవనుక్కుమ్ అతుదాస్యచిహ్నమాయిరుక్కిఱపడి.

**42.శ్లో ॥** త్వదీయభుక్తోజ్ఝిత శేషభోజినా
త్వయా నిసృష్టాత్మభరేణ యద్యథా ।
ప్రియేణ సేనాపతినా నివేదితం
తథాఽనుజానన్త ముదారవీక్షణైః ॥

అవ : (త్వదీయేతి) ఉభయవిభూతి విషయమాన తన్నుడైయ

---

(తేన గరుత్మతా పురః ఉపస్థితమ్) - సర్వేశ్వరుని ప్రకాశింపజేసే నిలువుటద్దంవలె, వాసన చూచే నిమ్మపండువలె సమక్షంలో ఎల్లప్పుడు సన్నిహితుడై ఉండేవాడు.

(త్వదంఘ్రిసమ్మర్దకిణాంకశోభినా) - తనపై అధిరోహించినపుడు, వేగాన్ని పెంచడంకోసం శ్రీచరణాలతో తన్నినపుడు ఏర్పడిన కిణాలు తనకు భోగచిహ్నాలు కనుక, వాటితో ప్రకాశిస్తున్నవాడు. ఈశ్వరునకు శ్రీకౌస్తుభరత్నం సర్వేశ్వరత్వ లక్షణమైనట్లే, ఇతనికి కిణాలు దాస్యలక్షణాలై ఉంటాయి.

**42.శ్లో ॥అవ : (త్వదీయ)** - ఉభయవిభూతి విషయమైన తన సర్వప్రదత్వం ఇతని (విష్వక్సేనుల) వద్ద అప్పగించి (ఉభయవిభూతినిర్వహణ బాధ్యతకు

సర్వభరత్తైయుమ్ ఇవన్బక్కలిలే వైత్తు ఈశ్వరన్ ఇవనిట్ట వழక్కామ్బడి యిరుక్కిఱ శ్రీసేనాపతియాழ్వానుడైయ దాస్యసామ్రాజ్యత్తై అనుభవిక్కిఱార్.

వ్యా : (త్వదీయేత్యాది) దేవరముతుశెయ్‌తు కైవాఙ్గిన ప్రసాదత్తాలే ధరిక్కుమవరాయిరుక్కై. "త్వదీయ" ఎన్గైయాలే వకుత్త స్వామియినుడైయ శేషమే భోజ్యమెన్గిఱతు. "యదుచ్ఛిష్ట మభోజ్యమ్" (యజు) ఎన్గిఱపడియే అల్లాతారుడైయ ఉచ్ఛిష్టమ్ అభోజ్య మెన్గై. "భుక్తోజ్ఝితమ్" ఎన్గైయాలే "కలత్తతుణ్డు" (తిరుప్పల్లాణ్డు-9) ఎన్గిఱపడియే అముతు శెయ్‌తుకైవాఙ్గిన పిన్బు గ్రహియతే భోజ్యమ్. మున్బుపాత్రశేషమ్ అభోజ్యమెన్గిఱతు.

(శేషభోజినా) ఇవరుక్కు ధారకమాయిరుక్కుమళవన్ఱియే "రసాన్

అప్పగించి), ఇతడు చెప్పినట్లు స్వామి నడచుకొంటాడని శ్రీసేనాపతియాழ్వాన్ యొక్క దాస్యసామ్రాజ్యాన్ని దర్శించి పల్కుతున్నారు.

వ్యా : (త్వదీయ) - దేవరవారు భుజించి విడచిన ప్రసాదంతో జీవించేవాడు. "త్వదీయ" అని అన్నందున ప్రాప్తశేషి (స్వరూపానికి తగిన స్వామి) యొక్క శేషమే భోజనంగా గ్రహిస్తాడని తెలుపబడింది. "**యదుచ్ఛిష్టమ్ అభోజ్యమ్ యద్వా దుశ్చరితం మమ సర్వం పునంతు మామాపః**" (తినరాని అయిన ఎంగిలిని తిన్నందువల్ల, దుష్కార్యాన్ని చేసినందువల్ల ఏ పాపం నాకు కల్గిందో, దానిని అంతటినుండి నన్ను "ఆపః" అనే శబ్దంతో నిర్దేశింపబడే పరమాత్మ పరిశుద్ధునిగా చేయుగాక) అని అన్నందున అందఱి ఉచ్ఛిష్టం అభోజ్యం కాదని అర్థం. "**భుక్తోజ్ఝితమ్**" అని అన్నందున "**ఉడుత్తు కళైన్ద నిన్ పీతకవాడై యుడుత్తు క్కలత్తదుణ్డు**" (నీవు ధరించి విడచిన నీపీతాంబరాన్ని ధరించి, నీ ప్రసాదశేషాన్ని భుజించి) అనేరీతిలో నీవు భుజించి విడచిన ప్రసాదమే భోజ్యం. పూర్వం పాత్రశేషమే అభోజ్యమనబడింది.

**(శేషభోజినా)** - తనకు ధారకమే కాకుండా, "**రసాన్ భక్తస్య జిహ్వాయాం**



భక్తస్య జిహ్వాయామ్" (పాంచ) ఎన్గిఱపడియే ఈశ్వరనుక్కు భోగ్యమావతుమ్ ఆழ్వారుముతుశెయ్‌తాలెన్గై.

(త్వయా నిసృష్టాత్మభరేణ) నమ్మిలుమ్ పెరియవన్, నమర్థనెన్ఱు దేవరాలే తన్బక్కలిలే వైక్కప్పట్ట ఉభయవిభూతిరూపమాన ధూరై యుడైయవన్.

(ప్రియేణ) సర్వదా అభిమతనానవన్.

(సేనాపతినా) సర్వసేనానిర్వాహకనాలే. "అశైవిలమరర్ తలైవర్‌తలైవా!" (తి-వాయ్-5-8-9) ఎన్నక్కవతిఱే.

(యద్యథా నివేదితమ్) యాతొరు కార్యమ్ యాతొరుపడి విణ్ణప్పమ్ శెయ్యప్పట్టతు.

(తథాఽనుజానన్తమ్) అతిలుళ్‌మానమ్, పుఱమానజ్గళ్ పార్ప్పత్తిలై.

గృహ్ణామి కమలోద్భవ! " (తామరపూవులో పుట్టినవాడా! భోగ్యమైన రసాలను భక్తుని జిహ్వనుండి గ్రహిస్తాను) అనేటట్లుగా ఈశ్వరునకు ఆழ్వార్లు ఆరగించినపుడే భోగ్యంగా ఉంటుందని భావం.

**(త్వయా నిసృష్టాత్మభరేణ)** - మనకంటే గొప్పవాడు, సమర్థుడని తలచి, నీచే తన వద్ద అప్పగింపబడిన ఉభయవిభూతుల నిర్వహణ భారాన్ని కలవానిచే- అనిభావం.

**(ప్రియేణ)** - అన్ని విధాలుగా ఇష్టుడైనవానిచే.

**(సేనాపతినా)**- సర్వసేనానిర్వాహకునిచే. "అశైయిల్ అమరర్‌తలైవర్ తలైవా! " (నాశమనేది లేని నిత్యసూరులలో ప్రధానులైన అనంతగరుడాదులలో ప్రధానమైనవాడా!) అని సేనాపతి యాழ్వాన్ చెప్పబడుతున్నాడు కదా.

**(యద్యథా న్యవేది)** - ఏకార్యం ఏవిధంగా చేయాలని విన్నపింపబడిందో,

**(తథాఽనుజానంతమ్)**- వాని లోపల సంగతులను, బయటి

శెయ్యుమ్ ప్రకారజ్గళుమ్ అనుసన్ధిప్పతిల్లై. ఈశ్వరన్ ఇవనుక్తియై ప్పిన్శెల్లుమత్తనై.

**(ఉదారవీక్షణైః)** "అవలోకనదానేన భూయో మాం పాలయ" **(వి-పు-1-20-16)** ఎన్నుమ్, "ఉయిర్క్కెల్లామ్ తాయా యళిక్కిన్న తణ్ణామరైక్కణ్ణా!" **(తి-వెఱు-7-1-9)** ఎన్నుమ్ శొల్లుకిఱపడియే అనవధికదయా సౌహార్దానురాగగర్భమాన కటాక్షజ్గళాలే యాయిఱ్ఱు. అప్పడి శెయ్‌వతెన్ను నినైప్పిడువతు.

**(తథాఽనుజానన్తమ్)** ఐయరాలే యాతొన్ను విణ్ణప్పమ్ శెయ్యప్పట్టతో?, అతప్పడియే ఎన్ను పాశురప్పరప్పఱ నియమిత్తరుళువతు.

---

సంగతులను **(ఉళ్‌మానమ్, పుఱమానమ్)** గమనించకుండా, చేసే విధానాలను గూర్చి భావించడంలేదు, పరమాత్మ ఇతని మాటలను అనుసరించి వర్తిస్తాడు- అని భావం.

**(ఉదారవీక్షణైః)** - "దేవ! ప్రపన్నార్తిహర ప్రసాదం కురు కేశవ, అవలోకనదానేన భూయో మాం పాలయాచ్యుత" (దేవా! శరణు పొందినవారి దుఃఖాన్ని పోగొట్టేవాడా! కేశవా! అనుగ్రహించు. అచ్యుతా! మాటిమాటికి కటాక్షించడంద్వారా నన్ను కాపాడు) అని, "ఉయిర్క్కెల్లామ్ తాయాయళిక్కిన్న తణ్ణామరైక్కణ్ణా!" (ప్రాణులందటికి తల్లియై కాపాడే, చల్లని తామరల వంటి కన్నులను కలవాడు) అని పల్కినట్లుగా అంతులేని సౌహార్దానురాగగర్భమైన ఈ కటాక్షాలతో అంగీకరిస్తాడని భావం.

**(తథాఽనుజానంతమ్)** - ఆరుడైన సేనాపతిచే ఏది ఏవిధంగా విన్నపింపబడిందో, "అది ఆ విధంగానే"- అని క్లుప్తంగా పల్కి స్వామి నియమిస్తాడు.



**43.శ్లో ॥** హతాఖిలక్లేశమలై స్స్వభావత
స్సదాఽనుకూల్యైకరసై స్తవోచితైః ।
గృహీతతత్తత్పరిచారసాధనై
ర్నిషేవ్యమాణం సచివైర్యథోచితమ్ ॥

అవ : అవ : **(హతాఖిలేత్యాది)**- "సదా పశ్యంతి సూరయః" **(సామ-ఉత్తరగ్ర)** ఇత్యాదికళ్ శొల్లుకిఱ నిత్యసూరికళుడైయ దాస్యైకసమృద్ధియై అనుభవిక్కిఱార్. "అడియార్‌కళ్ కుழాజ్గళైయుడన్ కూడువదు ఎన్నుకొలో!" **(తి-వాయ్-2-3-10)** ఎన్ఱితే ప్రాప్యప్రార్థనై యిరుప్పదు.

**(హతాఖిలక్లేశమలైః)** "అవిద్యాస్మితాభినివేశ రాగద్వేషాః పఞ్చక్లేశాః" **(పాతంజల సూ)** ఎన్గిఱవై క్లేశజ్గళ్ అవైకళుడైయ ప్రాగభావత్తై యుడైయవర్‌కళ్తై.

---

**43.శ్లో ॥** అవ : **(హతాఖిలేత్యాది)** - "తద్విష్ణోః పరమంపదమ్, సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతమ్, తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే" "విష్ణోర్యత్ పరమం పదమ్" (విష్ణువుయొక్క ఆపరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడు దర్శిస్తున్నారు; ఆ పరమపదం, అన్నిటిని ప్రకాశింపజేసేవాడు, ఆకాశంలో ఉండేవాడు, లోకాలకు అంతటికి నేత్రాలవంటివాడు అయిన సర్వేశ్వరునిచే ప్రకాశాన్ని కల్గినది. విష్ణువుయొక్క ఆ పరమపదంలో మేధావులు, స్తుతించడమే స్వభావంగా కలవారు, జాగరూకులై ఉండేవారైన నిత్యసూరులు ప్రకాశిస్తున్నారు) అని మొదలైన ప్రమాణాలలో చెప్పబడే నిత్యసూరుల కైంకర్య సమృద్ధిని అనుభవిస్తున్నారు. "అడియార్ కుழాజ్గళై ఉడన్ కూడువదు ఎన్నుకొలో" (భగద్భక్తుల బృందాలతో కలువడం ఎపుడోకదా) అని కదా ఆழ్వార్లవంటి వారిప్రార్థన.

వ్యా : "అవిద్యాస్మితాభినివేశరాగద్వేషాః పంచక్లేశాః" (అవిద్య, అహంకారం, అత్యాశ, రాగం, ద్వేషం - అనే అయిదు క్లేశాలు) అనేవి క్లేశాలనబడతాయి. ముక్తులు వీటి ప్రాగభావాన్ని కలవారని భావం. దీనివల్ల

ఇత్తాల్ బద్ధవ్యావృత్తియై చ్చొల్లుకిఱతు. మలమెన్ఱు ప్రకృతియాయ్, తత్సంసర్గానర్హతైయాల్ వన్ద ప్రాగభావత్తై యుడైయవర్కళ్నై. ఇత్తాల్ ప్రబుద్ధస్వభావయుక్తరాన ముక్తవ్యావృత్తియై చ్చొల్లుకిఱతు.

(స్వభావత స్సదాఽనుకూల్యైకరసైః) సత్తాప్రయుక్తమాన దేవర్తిరువడికళిల్. కైఙ్కర్యత్తైయే భోగమాకవుడైయరాయిరుక్కై. ఇత్తాలుమ్ ఒరు నాళ్ తొడఙ్గి అడిమై శెయ్య త్తుడఙ్గిన ముక్తవ్యావృత్తియై చ్చొల్లుకిఱతు.

(తవోచితైః) స్వరూపరూపగుణఙ్గళాలే దేవర్క్కే సదృశలక్షణరానవర్కళ్.

(గృహీతేత్యాది) కైఙ్కర్యోచిత పరికరఙ్గళై ఆదరాతిశయత్తాలే

బద్ధుల (సంసారులకంటే) వీరికి గల వ్యావృత్తి తెలుపబడింది. మలశబ్దానికి ప్రకృతి అని అర్థం. దానితో సబంధం లేనందువల్ల ఏర్పడిన ప్రాగభాగాన్ని (పూర్వం ఎప్పుడూ ఉండకపోవడం అనే స్థితిని) కలవారని తాత్పర్యం. దీనివల్ల ప్రబుద్ధ స్వభావులైన (స్వరూపావిర్భావాన్ని పొందిన) ముక్తులకంటే నిత్యసూరులకు ఉండే వ్యావృత్తి తెలుపబడింది.

**(స్వభావతః స్సదాఽనుకూల్యైకరసైః)** - నిత్యులు సత్తాప్రయుక్తమైన (సహజంగా కల్గి ఉండే) దేవరవారి శ్రీచరణాలలో చేసే కైంకర్యాన్నే భోగ్యంగా కలవారై ఉంటారు. దీనివల్లకూడా, ముక్తిని పొందిన ఏదో ఒకనాటినుండి ఆరంభించి కైంకర్యం చేయడం ఆరంభించిన ముక్తులకంటే వ్యావృత్తి తెలుపబడింది.

**(తవోచితైః)** - తమ స్వరూపరూపగుణాలతో నీకు తగిన లక్షణాలను కలవారై ఉంటాయి.

**(గృహీతత్తత్ పరిచారసాధనైః)** - కైంకర్యాలకు తగిన సాధనాలను కైంకర్యంలో తమ కుండే ప్రీత్యతిశయంవల్ల విడువలేనందున, **"శూట్టునన్ మాలైకళ్ తూయన వేన్ది విణ్ణోర్కళ్ నన్నీరాట్టి అన్దూపమ్ తరానిఱ్కవే"** (మంచి



విడమాట్టామైయాలే "శూట్టు నన్మాలైకళ్ తూయన వేన్ది" (తిరువి-21) ఎన్గిఱపడియే ధరిత్తుక్కొణ్డిరుక్కైయాలే దేవర్క్కే సదృశరానవర్ కళాలే సేవిక్కప్పడానిన్టుళ్ళ ఉన్నై.

(సచివైః) వాత్సల్యత్తాలే అవన్ముఱైయழియ ప్పరిమాఱ నినైత్తాలుమ్ అవనై ముఱై యుణర్త్తి అడిమై శెయ్యుమవర్కళ్, "నీతివానవర్"ఱే, ఆశ్రితరక్షణత్తిలే దేవరై ప్రేరిక్కుమవర్కళ్ ఎన్నవుమామ్.

(యథోచితమ్) స్వరూపానురూపమాక- ఎన్నుతల్, అవసరోచితమాక ఎన్నుతల్.

పరిశుద్ధ మాలికలను గ్రహించి అలంకరించి, పరిశుద్ధజలంతో అభిషేకించి, అందమైన ధూపాన్ని సమర్పిస్తూ ఉండగా) అనే పాశురంలో పల్కినట్లుగా ధరించి ఉంటారు కనుక, నీ కైంకర్యానికే తగినవారైన నిత్యసూరులచే సేవింపబడే నిన్ను - అని భావం.

**(సచివైః)** - వాత్సల్యంతో అతడు (పరమాత్మ) క్రమాన్ని మీఱి సేవించాలని కోరినా, శేషశేషీభావానికి వ్యుత్క్రమంగా వర్తించినా, అతనికి క్రమాన్ని తెలిపి, దాస్యాన్ని చేసేవారు. **"నీతివానవన్"** అనే సూక్తితో తిరుప్పాణ్ ఆழ్వార్లు ఈవిషయాన్ని తెలిపారుకదా! ఆశ్రితరక్షణలో నిన్ను నిత్యసూరులు ప్రేరేపిస్తారుకదా!

**(యథోచితమ్)** - స్వరూపానికి తగినట్లుగా- అని భావం. ఆయా కాలాలకు తగినట్లుగా - అని కూడా భావం.

**44.శ్లో॥** అపూర్వనానారసభావనిర్భర-
ప్రబుద్ధయా ముగ్ధవిదగ్ధలీలయా।
క్షణాణువత్ క్షిప్తపరాదికాలయా
ప్రహర్షయన్తం మహిషీం మహాభుజమ్ ॥

అవ : **(అపూర్వేతి) "భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే" (రా-అ-31-25)** ఎన్గిఱపడియే పిరాట్టియై నానారసభావఙ్గళాలే ఉకప్పిక్కుమ్బడియై అనుభవిక్కవేణుమెన్గిఱార్.

వ్యా : **(అపూర్వ)** ప్రతిక్షణముమ్ మున్బు కణ్డఱియాతతుపోలే యిరుక్కై.

**(నానారసభావనిర్భర)** బహుముఖమాన రసత్తాలుమ్, భావత్తాలుమ్ నెరుఙ్గుమ్బడి.

**(ప్రబుద్ధయా)** శృఙ్ఖలాబన్ధమాయ్ సమ్బుద్ధయా. రసమావతు చేతనర్

---

**44.శ్లో॥** అవ : **(అపూర్వేతి)** - **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (శ్రీరామా! నీవు సీతాదేవితో కలసి పర్వతచరియలలో విహరిస్తావు. నీవు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడు కూడా నీకు నేను అన్ని కైంకర్యాలను చేస్తాను) అనేటట్లు లక్ష్మీదేవిని నానారూపాలతో ఆనందింపజేసే రీతి దర్శించి అనుభవించాలని అటున్నారు.

వ్యా : **(అపూర్వ)** - ప్రతిక్షణం ఇంతకు ముందు పరిచయం లేనట్లుగా తెలియనట్లుగా ఉండడం.

**(నానారసభావనిర్భర)** - అనేకవిధాలైన రసాలతో, భావాలతో నిండిఉండేటట్లు,

**(ప్రబుద్ధయా)** - శృంఖలాబంధంగా ఒకదాని వెంట ఇంకొకటి అనుబంధించి ఉండడంచేత - అని భావం. రసమంటే - చేతనులు దేనిని



యాతొన్నై అనుభవిత్తాల్ "యేన మాద్యతి" ఎన్గిఱపడియే మదియానిఱ్పర్, అతిఱే రసమ్. భావమావతు- అతుక్కడియాన బాహ్యార్థాలంబనమాన సవికారారమ్భమ్.

**(ముగ్ధవిదగ్ధలీలయా)** అవ్వోదశైకళుక్కనుగుణమాయ్, సున్దరమాయుమ్, నిపుణమాయుముళ్ళ లీలైయాలే.

**(క్షణాణుత్ క్షిప్తపరాదికాలయా)** ఒరు క్షణత్తిలేక దేశమ్బోలే పోక్కప్పట్ట పరకాలమ్, పరార్ధకాలమ్ ఇవற்ற ఆదియాక వుడైత్తాయిరుక్కుమతినాలే. పరకాలమాకిఱతు- బ్రహ్మాయుస్సు. పరార్ధకాలమావతు- అతిల్ శెమ్బాతి.

**(మహిషీం ప్రహర్షయన్తమ్) "యస్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా" (రా-అయో-30-18), "త్వద్వియోగేన మే రామత్యక్తవ్య మిహ**

---

అనుభవిస్తే "యేన మాద్యతి" అనేటట్లు మదాన్ని పొందుతారో, అదే కదా రసం. దానికి మూలం భావం - అంటే మానసికమైన వికాసం.

**(ముగ్ధవిదగ్ధలీలయా)** - ఆయా దశలకు అనుగుణంగా, ముగ్ధంగా (అందంగా), విదగ్ధంగా (చతురంగా) ఉండే లీలతో- అని భావం.

**(క్షణాణువత్ క్షిప్తపరాదికాలయా)** - ఒక క్షణంలోని ఒక భాగంవలె పరకాలం, పరార్ధకాలం - అనే వీనిని గడిపిన ముగ్ధవిదగ్ధలీలతో - అని భావం. పరకాలమంటే - బ్రహ్మయొక్క ఆయుష్కాలం. పరార్ధమంటే - అందులో సగం.

**(మహిషీం ప్రహర్షయంతమ్)** - **'యస్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా, ఇతి జానన్ పరాం ప్రీతిం గచ్ఛ రామ! మయా సహ"** (శ్రీరామా! నీతో కలసి ఉండడమే నాకు స్వర్గం; నిన్ను వీడి ఉండడమే నరకం - అనే విషయాన్ని తెలిసి, నాతోపాటుగా గొప్ప ఆనందాన్ని పొందు) **"త్వయా చ సహ గంతవ్యం మయా గురు జనాజ్ఞయా, త్వద్వియోగేన మే రామ!**

జీవితమ్" (రా-అ-29-5), "సర్వధా తేన హీనాయా రామేణ విదితాత్మనా, తీక్ష్ణం విషమి వాస్వాద్యం దుర్లభం మమ జీవితమ్" (రా-సు-25-17), ''అకలకిల్లేనిఱై యుమ్'' (తి-వాయ్-6-10-10) ఎన్గిఱపడియే వ్యతిరేకత్తిలా**గ్**ఱమాట్టాత పిరాట్టియై మికవుమ్ ఉకప్పియానిన్ఱువనై.

(ప్రహర్షయన్తమ్) ఎన్ఱు వర్తమానకాలమాయ్ ఇవ్వుకప్పు ఇడైవిడాతే శెల్లు మెన్టై.

(మహాభుజమ్) కీழ్చ్చొన్న లీలారసత్తాలే ఉకప్పిక్కుమవళోపాతియన్ఱు. "అణిమాన త్తడవరై" (తి.వాయ్ 4-8-2) త్తోళాలే అణైత్తుకప్పిక్కుమ్ ఎన్ఱుమ్ స్వరూపగుణజ్గళిఱాట్టిల్ ఇనితాయిఱే రూపగుణ మిరుప్పతు.

---

త్యక్తవ్యమిహ జీవితమ్" (రాఘువా! పెద్దవారి ఆజ్ఞానుసారంగా నేనునీతో కూడా వెళ్ళాలి. నిన్ను విడిస్తే ఇక్కడే ప్రాణాలను త్యజించాలి), "సర్వధా తేన హీనాయా రామేణ విదితాత్మనా, తీక్ష్ణం విషమివాస్వాద్యం దుర్లభం మమ జీవితమ్" (మనస్సులో ఉండే దానిని తెలిసేవాడైన శ్రీరాముని విడచిన నాకు, తీక్షణమైన విషాన్ని తాగినట్లు, ప్రాణాలను ధరించడమనేది పూర్తిగా దుర్లభం) "అకలకిల్లేన్ ఇఱైయుమ్" (క్షణమైనా విడువలేను) అనే రీతిలో వ్యతిరేకంలో (విశ్లేషంలో) సహించలేని లక్ష్మీదేవిని చాలా ఆనందింపజేస్తున్నవానిని - అని భావం. "ప్రహర్షయంతమ్" అని వర్తమానకాలంలో పల్కినందున ఈ ఆనందం నిత్యమని భావం.

**(మహాభుజమ్)** - పూర్వం పల్కిన లీలారసంతో ఆనందింపజేసే లక్ష్మీదేవివలే కాదు. **"అణిమాన త్తడవరై త్తోళ్"** (అలంకారంగా ఉండే, పొడుగైన, విశాలమైన, పర్వతాలవలె బలిష్ఠమైన బాహువులతో స్వామి లక్ష్మీదేవిని ఆలింగనం చేసికొని ఆనందింపజేస్తాడు అనేటట్లు ఎల్లప్పుడు స్వరూపగుణాల కంటే రూపగుణాలే కదా భోగ్యాలై ఉంటాయి.



**45.శ్లో॥** అచిన్త్యదివ్యాద్భుతనిత్యయౌవన-
స్వభావలావణ్యమయామృతోదధిమ్ ।
శ్రియ శ్శ్రియం భక్తజనైకజీవితం
సమర్థ మాపత్సఖ మర్థికల్పకమ్ ॥

అవ : (అచిన్త్యేతి) ఇప్పడి పిరాట్టియై ఉకప్పిక్కిఱ రసభావజ్గళుక్కు ఆశ్రయమాన వడివైయుమ్, గుణజ్గళైయు మనుసన్ధిక్కిఱార్.

వ్యా : (అచిన్త్య) విగ్రహగుణజ్గళినుడైయ అవాఙ్మనసగోచరత్వత్తై చ్చొల్లుకిఱతు. స్వరూపత్తైయుమ్, గుణత్తైయుమ్ పరిచ్ఛేదిక్కిలుమ్, వడివిల్ భోగ్యతై పరిచ్ఛేదిక్కవొణ్ణాతెన్టై. "ఇచ్ఛాగృహీతాభిమతోరు దేహః" (వి-పు-6-7-84)

(దివ్య) అతినుడైయ అప్రాకృతత్వమ్ శొల్లుకిఱతు. ''న భూతసఙ్ఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః" (భార) ఎన్గిఱపడియే

---

**45.శ్లో॥** అవ : **(అచింత్యేత్యాది)** - ఇటువంటి లక్ష్మీదేవిని ఆనందింపజేసే రసభావాలకు స్థానమైన భగవానుని దివ్యమంగళవిగ్రహాన్ని గుణాలను ఇందులో అనుసంధిస్తున్నారు.

వ్యా : **(అచింత్య)** - దివ్యమంగళవిగ్రహ గుణాల వాక్కుకు, మనస్సుకు అందని స్వభావం తెలుపబడుతున్నది. స్వరూపాన్ని, గుణాలను పరిచ్ఛేదించినా, రూపంలోని భోగ్యతను పరిచ్ఛేదించడం సాధ్యం కాదని భావం. **"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"** (తన సంకల్పంతో స్వీకరించిన, తనకు మిక్కిలి అభిమతమైన, గొప్పదేహాన్ని కలవాడు) అని **"ఉరు"** శబ్దంతో దివ్యమంగళంయొక్క అపరిచ్ఛేద్యత్వం తెలుపబడింది.

**(దివ్య)** - ఆ రూపం అప్రాకృతమని తెలుపబడుతున్నది. **"న భూతసంఘ సంస్థానో దేహోఽస్య పరమాత్మనః"** (ఈ పరమాత్మయొక్క

అప్రాకృతమాయిరుక్కై.

(అద్భుత) గృహీతాంశమ్ ఆశ్చర్యమాయిరుక్కై. "ముழுశివణ్డాడియతణ్ణுழாయిన్ మొయ్మలర్క్కణ్ణి" (తి-మొ-2-8-7) ఎన్గిఱపాట్టిల్ పోలేయిరుక్కై.

(నిత్య) అకాలకాల్యత్వత్తై చ్చొల్లుకిఱతు.

(యౌవనస్వభావ) "యువా కుమారః" (ఋగ్వే-అ-2-8-25) ఎన్గిఱపడియేయిరుక్కై, "తరుణౌ రూపసమ్పన్నౌ సుకుమారౌ మహాబలౌ, పుణ్డరీకవిశాలక్షౌ చీర కృష్ణాజినామ్బరౌ" (రా-ఆ-19-14) ఎన్గిఱపడియే స్వాభావికమాన యౌవనత్తై యుడైత్తాయిరుక్కై.

---

తిరుమేని పంచభూతాల చేరికవల్ల ఏర్పడినది కాదు) అనే విధంగా అప్రాకృతం.

(అద్భుత) - దర్శించి అనుభవించిన అంశం ఆశ్చర్యాన్ని కల్గించేదిగా ఉంటుంది. "ముழுశివణ్డాడియ తణ్ణుழாయిన్ మొయ్మ్మలర్క్కణ్ణి" (తేనెలో మునిగి, తుమ్మెదలు ఆడే చల్లని తులసితో కూర్చిన పూమాలికను కలవారు) అనే పాశురంలో పల్కిన రీతిలో ఉండడం.

(నిత్య) - కాలం వల్ల కలిగే పరిణామాన్ని లేనిది.

(యౌవనస్వభావ) - "యువాకుమారః" (యౌవనాన్ని కలవాడుగా, కొంచెం కౌమారాన్ని కలవాడుగా ఉన్నాడు) అనేటట్లుగా ఉండడం. "తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ, పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ" (రామలక్ష్మణులు యౌవనాన్ని కలవారు, అందం నిండుగా ఉన్నవారు, సుకుమారులు, గొప్ప బలాన్ని కలవారు, తామరలవంటి విశాలమైన నేత్రాలను కలవారు, నారబట్టలను, కృష్ణాజినాన్ని ధరించినవారు,) అనే శ్లోకంలో వలె స్వాభావికమైన యౌవనాన్ని కలవాడై ఉండడం.



(లావణ్యమయ) ప్రచురమాన సముదాయశోభయైయుడైత్తాయిరుక్కై

(అమృతోదధిమ్) ఇప్పడి సర్వప్రకారభోగ్యతైయాలే "అప్రమేయో మహోదధిః" (రా-యు-19-31) ఎన్గిఱపడియే పరిచ్ఛేదిక్కప్పోకామై క్కొరు సముద్ర మెన్నుమత్తనై.

(శ్రియః శ్రియమ్) "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా" (తి-మొ-7-7-1) ఎన్గిఱపడియే పిరాట్టిక్కు మఙ్గళావహనా యిరుక్కుమవనై.

(భక్తజనైకజీవితమ్) "ఎల్లామ్ కణ్ణన్" (తి-వాయ్-6-7-1) ఎన్గిఱపడియే ఆశ్రితర్క్కు ధారకాదికళెల్లామ్ తానేయాయిరుక్కుమవనై.

---

(లావణ్యమయ) - ప్రచురమైన ప్రత్యంగశోభను కలవాడై ఉండడం,

(అమృతోదధిమ్) - అన్ని విధాలైన భోగ్యతలవల్ల, "సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి, ఖానిత స్సాగరేణాయ మప్రమేయో మహోదధిః" (ప్రభువైన శ్రీరాముడు సముద్రాన్ని శరణు వేడడం యుక్తం. ఈ అంతు లేని మహాసముద్రం సగరపుత్రులచే తవ్వబడింది) అనే రీతిలో పరిచ్ఛేదించడానికి వీలుకాని దానికి సముద్రం - అని అనాలి అంతే.

(శ్రియఃశ్రియమ్) - "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా" (లక్ష్మికి కూడా సంపద అయిన సంపద్రూపా!) అనేటట్లు లక్ష్మికి కూడా మంగళాన్ని కల్గించేవాడై ఉన్నాడు.

(భక్తజనైకజీవితమ్) - "ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెற்றிలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్" (భుజించే అన్నం, తాగే నీరు, తినే తాంబూలం వంటి భోగ్య పదార్థాలు - అన్నీ శ్రీకృష్ణుడే) అనేటట్లుగా ఆశ్రితులకు ధారకాదులన్నీ తానే అయి ఉండేవానిని - అని భావం. (లేక) భక్తజనులనే తనకు ధారకంగా కలవాడనికూడా భావం. "మమ ప్రాణా హి పాండవాః" (పాండవులు నా ప్రాణులు కదా) అని కదా భగవంతుని వాక్కు.

భక్తజనజ్ఞళైయే తనక్కు ధారకమాకవుడైయవన్ ఎన్నవుమామ్. "మమ ప్రాణా హి పాణ్డవాః" (భార) ఎన్నక్కడవతితే,

(సమర్థమ్) అళవుడైయరాన నిత్యసూరికళనుభవిక్కుమ్తన్నై నిత్యసంసారికళనుభవిక్కుమ్బడి, "ఆఱ్ఱనల్లవకై కాట్టు మమ్మానై" (తి-వాయ్-4-5-5) ఎన్గిఱపడియే సాత్మిక్క సాత్మిక్క అనుభవిప్పిక్కుమ్ సామర్థ్యత్తైయుడైయ ఉన్నై.

(ఆపత్సఖమ్) "కాణవారాయెన్నెన్ఱు కణ్ణుమ్ వాయుమ్ తువర్న్దు" (తి.వాయ్ 8-5-2) ఉకప్పార్క్కు ఉతవుమ్ స్వభావనానవనై.

(అర్థికల్పకమ్) "ఎన్నై యాక్కిక్కొణ్డెనక్కే తన్నై త్తన్ద కఱ్పకమ్" (తి-వాయ్-2-7-11) ఎన్గిఱపడియే తన్నై ఔదార్యమ్ పణ్ణుమవనై.

---

(సమర్థమ్) గొప్ప జ్ఞానాన్ని కలవారైన నిత్యసూరులు దర్శించి, ఆనందించతనను, నిత్యసంసారులు దర్శించి ఆనందించేటట్లుగా. "ఆఱ్ఱనల్లవకై కాట్టుమమ్మానై" (సహించేటట్లు చక్కని మార్గాన్ని చూపే స్వామి) అనేటట్లు కొంచెంకొంచెంగా, జీర్ణమయేటట్లు అనుభవింపజేసే సామర్థ్యాన్ని కల నిన్ను - అని భావం.

(ఆపత్సఖమ్) - "కాణవారాయ్ ఎన్ఱెన్ఱు కణ్ణుమ్ వాయుమ్ తువర్న్దు" (నేను సేవించేటట్లు వేంచేయాలి) - అని పలుమార్లు పల్కి, నేత్రాలు, నోఱు ఎండిపోయినపుడు సహాయపడే స్వభావాన్ని కల నిన్ను.

(అర్థికల్పకమ్) - "ఎన్నైయాక్కిక్కొణ్డు ఎనక్కే తన్నై తన్ద కఱ్పకమ్" (నన్ను సృష్టించి, నాకు తనను అనుగ్రహించిన కల్పవృక్షం) అనేటట్లు తననే ఉదారంగా దానం చేసేవాడు.



46.శ్లో॥ భవన్తమేవానుచరన్నిరన్తరం
ప్రశాన్తనిశ్శేషమనోరథాన్తరః ।
కదాఽహమైకాన్తికనిత్యకిఙ్కరః
ప్రహర్షయిష్యామి సనాథజీవితః ॥

అవ : (భవన్తమిత్యాది) కీழ்చ్చొన్న స్వరూపరూపగుణ-విభూతికళాల్ పరిపూర్ణనాయ్, నిత్యవిభూతియిలే కుఱైవఱ వెழுన్దరుళియాలుళ్ళ ప్రయోజనమ్ పెఱుమ్బడి నిత్యకైఙ్కర్యత్తాలే ఉకప్పిప్పతు-ఎన్ఱెన్గిఱార్.

వ్యా : (భవన్తమ్) స్వరూపరూపగుణ విభవైః పరిపూర్ణమ్. "ఇన్బమ్ పయక్క వెழிల్ మలర్ మాతరున్దానుమ్, ఇవ్వేழுలకై యిన్బమ్ పయక్క వినితుడన్ వీఱ్ఱిరున్దాళ్కిన్ఱ వెమ్బెరుమాన్" (తి-వాయ్-7-10-1) ఎన్గిఱ పూర్తియై చ్చొల్లుకిఱతు.

---

46.శ్లో॥ అవ : (భవంతమిత్యాది) - పూర్వం పల్కిన స్వరూపరూపగుణ విభూతులతో పరిపూర్ణుడవై, నిత్యవిభూతిలో ఏలోటు లేకుండా వేంచేసి ఉండే నిన్ను, బాహ్య విషయాలలోని ఆశను వీడి, నేను సత్తను కల్గి ఉన్నందులకు తగిన ప్రయోజనం పొందేటట్లుగా నిత్యకైంకర్యంతో ఎపుడు ఆనందింపజేస్తాను? - అని అంటున్నారు.

వ్యా : (భవంతమ్) - స్వరూపరూపగుణవిభూతులతో పూర్ణుడని అర్థం (ఇది "భవత్" అనే సర్వనామశబ్ద తాత్పర్యం) "ఇన్బమ్ పయక్క ఎழிల్మాతరుమ్ తానుమివ్వేழுలకై యిన్బమ్ పయక్క ఇనితుడన్ వీఱ్ఱిరున్దు ఆళ్కిన్ఱ ఎమ్బెరుమాన్" (అందంతో ప్రకాశించే లక్ష్మీదేవి, తాను ఆనందించేటట్లు, ఈ ఏడు లోకాలు సుఖాన్ని పొందేటట్లు, ప్రీతితో వేంచేసి ఉండి లోకాలను పాలించేస్వామి) పూర్తిని ఈ పదం తెల్పుతున్నది.

**(ఏవ) "తనక్కేయాక వెనై క్కొళ్ళుమీతే" (తి-వాయ్-2-9-4) ఎన్గిఱపడియే అనువృత్తి దేవర్క్కే అనుకూల మాయిరుక్కై.**

**(అనుచరన్) "యేన యేన ధాతా గచ్ఛతి" (పరమసంహ), "ఏత మానన్దమయ మాత్మాన ముపసఙ్క్రమ్య" (తై.భృ 10-5), "అనుసఞ్చరన్" (తై-భృ-10-5), "కురుష్వ మా మనుచరమ్" (రా-అ-31-22) ఎన్గిఱపడియే అనువర్తనత్తైయుడైయనాయ్.**

---

(ఏవ) - **"తనక్కే యాక ఎనై క్కొళ్ళుమీదే"** (నీకోసంగానే నన్ను పరిగ్రహించు, ఇదే నేను కోరేది) అనేటట్లుగా మేము చేసే దాస్యమనేది నీకే అనుకూలమైనది - అనే విషయాన్ని ఇది తెల్పుతున్నది.

**(అనుచరన్) - "యేన యేన ధాతా గచ్ఛతి తేన తేన సహ గచ్ఛతి, తత్ యథా తరుణవత్సా వత్సం వత్సోవా మాతరం ఛాయా వా సత్త్వ మనుగచ్ఛేత్ తథాప్రకారమ్"** (లేగదూడను కల ఆవు ఆదూడను, దూడతల్లి ఆవును, ఆ విధంగానే, ఏయే విధంగా పరమపురుషుడు వెడుతున్నాడో, ఆయా విధాలుగానే ముక్తుడు కూడా అనుసరిస్తాడు) అని, **"ఏత మానందమయ మాత్మన ముపసంక్రమ్య, ఇమాన్ లోకాన్ కామాన్నీ కామ్యరూప్యను సంచరన్, ఏతత్ సామ గాయన్నాస్తే, హావు హావు హావు"** (ఆనందమయుడైన ఈ పరమాత్మకు దరిచేరి, ఇష్టపడిన రూపాలను కలవాడై, ఈ కామాలలోను, లోకాలలోను పరమాత్మను అనుసరిస్తూ 'హావు హావు హావు' అని సామాన్ని గానం చేస్తూ ఉంటారు.) అని, **"కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోஉహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే"** (నన్ను నీ అనుచరునిగా చేసికో. ఇందులో ఏ తప్పులేదు. ఇందువల్ల నేను కూడా ధన్యుడనవుతాను. నీ కార్యంకూడా నెరవేరుతుంది) అనేవిధంగా అనువర్తనాన్ని కలవాడనై.



**(నిరన్తరమ్) ఇడైవిడాతే యిరుక్కై.**

**(ప్రశాన్తేత్యాది) "మఱ్ఱై నమ్ కామఙ్గళ్ మాఱ్ఱు" (తిరుప్పా-29) ఎన్ఱు దేవరై యొఴిన్ద విషయఙ్గళిల్ మనోవ్యాపారఙ్గళై సవాసనమాక త్తవిర్త్తు.**

**(కదా) "ఎన్ఱుకొల్ కణ్గళ్ కాణ్బతు?" (తి-వాయ్-5-9-5) ఎన్ఱుమ్ "ఎన్నాళ్ యానున్నై యిని వన్దు కూడువతు?" (తి-వాయ్-3-2-1) ఎన్నుమ్బడియే కాలత్తుక్కెల్లై యరుళిచ్చెయ్యవేణుమ్.**

**(అహమ్) రుచియే యొఴియ ఇత్తలైయిల్ ఉపాయమిల్లాత నాన్.**

**(ఐకాన్తికనిత్యకిఙ్కరః) ఏకరూపమాయ్, యావదాత్మభావియాన కైఙ్కర్యత్తై నిరూపకమాక వుడైయేనాయ్.**

---

**(నిరంతరమ్)** - ఏనాడూ విడువకుండా.

**(ప్రశాంతేత్యాది) - "మఱ్ఱై నమ్ కామఙ్గళ్ మాఱ్ఱు"** (మిగిలిన మా కోరికలను అన్నిటిని పోగొట్టి) అని దేవరవారు తప్ప అన్యవిషయాలలో మనోవ్యాపారాలను (కోరికలను) సవాసనగా పోగొట్టుకొని.

**(కదా) - "ఎన్ఱుకొల్ కణ్‌కణ్‌గళ్ కాణ్బదు?"** (నేత్రాలు దర్శించడం ఎపుడో కదా?) అని, **"ఎన్నాళ్ నాన్ ఇనివన్దు కూడువన్?"** (ఏనాడు నేను ఇక వచ్చి చేరగలను?) అనే రీతిలో కాలానికి అవధిని తెలుపాలి.

**(అహమ్)** - కేవలం అభిలాష (రుచి) తప్ప దానిని పొందే ఉపాయమేదీ తెలియని నేను.

**(ఐకాంతికనిత్యకింకరః)** - ఏకరూపమై, నిత్యమైన (ఆత్మ ఉన్నంతవరకు) కైంకర్యాన్ని నిరూపకంగా (లక్షణంగా) కలవాడనై - అని భావం.

**(సనాథజీవితః)** సనాథమాన సత్తైయై యుడైయేనాయ్, ఎన్ సత్తైయై సప్రయోజనమాక్కి-యెన్రై.

**(ప్రహర్షయిష్యామి)** మికవుమ్ ఉకప్పిక్కక్కడవేన్. తన్నుడైయ అనువృత్తియాల్ ఈశ్వరనుక్కు ప్పిఱక్కుమ్ హర్షమేయిఱే చేతనునక్కు ప్రాప్యమ్.

**47.శ్లో ॥** ధిగశుచి మవినీతం నిర్దయం మామలజ్జం
పరమపురుష! యోఽహమ్ యోగివర్యాగ్రగణ్యైః ।
విధిశివసనకాద్యైర్ధ్యాతు మత్యన్తదూరం
తవ పరిజనభావం కామయే కామవృత్తః ॥

అవ : **(ధిగిత్యాది)** ఇతిల్ పరమప్రాప్యనాన ఈశ్వరనుడైయ వైలక్షణ్యత్తైయుమ్, తమ్ముడైయ పూర్వవృత్తత్తైయుమ్ పార్త్తు, విధిశివసనకాదికళుడైయ మనస్సుక్కు మత్యన్తదూరమాయ్,

---

**(సనాథజీవితః)** - సనాథమైన (నాథుని కల్గిన) సత్తను కలవాడనై, నా సత్తను ప్రయోజనం కల్గిన దానినిగా చేసికొని - అని తాత్పర్యం.

**(ప్రహర్షయిష్యామి)** - మిక్కిలిగా ఆనందింపజేస్తాను? తన కైంకర్యంతో పరమాత్మకు కలిగే ఆనందమే కదా, జీవునకు ప్రాప్యం.

**47.శ్లో ॥అవ :** ఈ శ్లోకంలో పరమప్రాప్యమైన భగవంతుని గొప్పతనాన్ని, తమ గత చరిత్రను చూచి, విధిశివసనకాదుల మనస్సుకు కూడా మిక్కిలి అందనిదై, సంసారసంబంధం ఏమాత్రం లేని నిత్యసూరులు ఆశపడే నిత్యకైంకర్యాన్ని నిత్యసంసారి అయిన నేను ఆశపడడం ప్రభువు భుజించే అన్నం విషంతో కలసినట్లు అవుతుందే! - అని **"వళవేழులకు"** అనే దశకంలో



అస్పృష్టసంసారగన్ధరాన నిత్యసూరికళాశైప్పడుమతాన నిత్యకైఙ్కర్యత్తై నిత్యసంసారియాన నాన్ ఆశైప్పడుకైయావతు- "రాజాన్నమ్ విషసంసృష్టమావతే!" ఎన్ఱు వళవేழులకిలాழ్వారైప్పోలే తమ్మై నిన్దిక్కిఱార్.

వ్యా : **(అశుచిమ్)** అనాదియాక దేహసమ్బన్ధయుక్తనాన- ఎన్నై. దేహసమ్బన్ధాభావమ్ సత్తాప్రయుక్తమాన నిత్యసిద్ధరిఱే, శుద్ధర్.

**(అవినీతమ్)** ఇవ్వాత్మావుక్కు దేహసమ్బన్ధమ్ అశుచిహేతు వెన్ఱఱికైక్కడియాన ఆచార్యసేవై యిల్లామైయాలే సుశిక్షితనల్లాత ఎన్నై.

**(నిర్దయమ్)** అమృతత్తై విషత్తాలే దూషిత్తాప్పోలే విలక్షణభోగ్యమాన భగవతత్వత్తై క్కణ్ణాற్ఱు దూషిక్కప్పార్త్త నిర్దయనై.

**(అలజ్జమ్)** ఘటదాసి సార్వభౌమనై మేల్విழుమాపోలే "నమ్మై

---

ఆழ్వార్లు భగవదనుభవానికి తాము తగమని సంశయించి వెనుకంజ వేసిన రీతిలో పల్కుతున్నారు.

వ్యా : **(అశుచిమ్)** - అనాదిగా దేహసంబంధాన్ని (ప్రకృతిసంబంధాన్ని) కల నన్ను - అని భావం. కర్మకృత దేహసంబంధం సహజంగా లేని నిత్యసిద్ధులు (నిత్యసూరులు) కదా శుద్ధులు.

**(అవినీతమ్)** - ఈ ఆత్మకు దేహసంబంధం అశుచికి కారణం- అని తెలిసికోవడానికి మూలమైన ఆచార్యసేవలు చేయనందువల్ల, సుశిక్షితుడను కాని నన్ను.

**(నిర్దయమ్)** - అమృతంలో విషాన్ని కలిపి, దానిని పాడుచేసేటట్లు, విలక్షణభోగ్యమైన భగవంతుడనే తత్త్వాన్ని కంటితో దర్శించడం ద్వారా పాడు చేయాలని చూచిన నిర్దయుడైన నన్ను (నేను స్వామిని దర్శించడం అతనికి అపవిత్రత కల్గించడమేనని భావం).

**(అలజ్జమ్)** - ఘటదాసి (నీచదాసి) చక్రవర్తిని పొందాలని ఆశపడి

ప్పారాతే మేల్ విழுన్దోమ్; ఇతు- అపహాస్యమ్" ఎన్ఱు లజ్జిక్కవు మఱియాత ఎన్నై.

**(మాం ధిక్)** ఇప్పడి హేయగుణపూర్ణనాన ఎన్నై. "వేణ్డేన్" ఎన్ఱు తమ్మై కుత్సిక్కిఱార్.

**(పరమపురుష!)** సర్వాధికనాన పురుషోత్తమనే !

**(యోఽహమ్)** నిహీనాగ్రగణ్యనెన్ఱు ప్రసిద్ధనాన నాన్.

**(యోగివర్యేత్యాది)** యోగిశ్రేష్ఠరిల్ ప్రథమగణ్యరాన బ్రహ్మరుద్రాదికళెన్న; బ్రహ్మభావనానిష్ఠరాన సనకాదికళెన్న, ఇవర్కళాలే నినైక్కైక్కుమ్ అత్యన్తదూరమాయుళ్ళత్తై.

---

అతనిని బలవంతం చేసినట్లుగా "నన్ను గమనించకుండా, భగవంతుని పొందాలని ఆశపడ్డాను. ఇది అపహాస్యం'' అని సిగ్గుపడడం కూడా తెలియని నన్ను.

**(మాం ధిక్) -** ఈవిధంగా హేయగుణాలతో నిండిన నన్ను - అని భావం. తమను ఉద్దేశించి జుగుప్సతో పల్కిన మాట ఇది.

**(పరమపురుష!)-** సర్వాధికుడవైన ఓ పురుషోత్తమా!

**(యోఽహమ్)** - నిహీనులలో (మిక్కిలి హీనులలో) మొదట లెక్కింపబడవలసినవాడనైన నేను.

**(యోగివర్యేత్యాది)** - యోగిశ్రేష్ఠులలో అగ్రగణ్యులైన బ్రహ్మరుద్రాదులు కాని, బ్రహ్మభావననానిష్ఠులైన సనకాదులు కాని, వీరికి భావించడానికి కూడా వీలుకాని రీతిలో చాలా దూరంలో అందనివాడై ఉండేవాడవైన నేను - అనిభావం.



**(తవ పరిజనభావమ్)** ఆత్మస్వామియాయ్, నిరతిశయభోగ్యమాన దేవరుడైయ కైఙ్కర్యామృతత్తై, సత్తాప్రయుక్తమాన రుచియైయుమ్, వైలక్షణ్యత్తైయు ముడైయ నిత్యసూరికళాదరిక్కుమత్తైయన్ఱో నాన్ ఆదరిత్తతు.

**(కామయే)** సఙ్గత్తళవిలేనిన్ఱేనో?. పెற்றిల్లతు ధరియాతారైప్పోలే, "కదా ను సాక్షాత్కరవాణి!" (స్తోత్రరత్నమ్) ఎన్ఱుమ్ "కదా ప్రహర్షయిష్యామి!" (స్తోత్రరత్నమ్) ఎన్ఱుమ్ కూప్పిట్టేన్.

**(కామవృత్తః)** విషయప్రవణన్ యుక్తాయుక్తఙ్గళై ప్పారాతాప్పోలే తోற்றிற்றుచ్చెయ్త నాన్. రాగమ్ స్వరూపత్తై ప్పార్త్తు నిఱ్కవొట్టాతితే.

---

**(తవ పరిజనభావమ్)** - ఆత్మస్వామివై, నిరతిశయభోగ్యుడవైన నీకైంకర్యమనే అమృతాన్ని - సత్తాప్రయుక్తమైన (సహజమైన) రుచిని, వైలక్షణ్యాన్ని కల్గిన నిత్యసూరులు ఆదరించదగిన - ఆశపడదగిన - దానిని కదా నేను ఆశపడుతున్నాను.

**(కామయే)** - కోరుకోవడం మాత్రమేనా ? అది పొందలేక పోతే నిలువలేని వారివలె **"కదా ను సాక్షాత్కరవాణి?"** (ఎపుడు దర్శించగలను?) అని, **"కదా ప్రహర్షయిష్యామి?"** (ఎపుడు ఆనందింపజేస్తాను?) అని ఆక్రందించాను.

**(కామవృత్తః)** - లౌకిక విషయాలలో మిక్కిలి ఆసక్తిని కలవాడు ఇది తగినది, ఇది తగనిది - అని చూడనట్లు, తోచినదానినే చేసేవాడనైన నేను- అని భావం. రాగమనేది తనకు ఇది తగునా ? తగదా ? అని గమనించనీయదు కదా!

**48.శ్లో ॥** అపరాధసహస్రభాజనం
పతితం భీమభవార్ణవోదరే ।
అగతిం శరణాగతం హరే!
కృపయా కేవలమాత్మసాత్కురు ॥

అవ : **(అపరాధేత్యాది)** తమ్ముడైయ అయోగ్యతైయై అనుసన్ధిత్తు అకలప్పార్త్త ఇవర్ రుచియిన్ మికుతియాలే అకలమాట్టాతే నిఱ్క, అవన్ "ఇన్ద అయోగ్యతైక్కు ప్పరిహారమ్ కృపాజనకమాన ప్రపత్తియేకాణుమ్" ఎన్న మీణ్డారాయ్, ఇన్ద అయోగ్యతాహేతువాన సర్వాపరాధఙ్గళుక్కుమ్ పరిహారమ్ తన్నుడైయ వెఱుమైయై మున్నిట్టుక్కొణ్డు పణ్ణుమ్ ప్రపత్తియాకాతే!-ఎన్ఱు ఇన్ద వేదాన్తరహస్యత్తై మున్నిట్టుక్కొణ్డు కేవలకృపైయాలే దేవర్ అడియేనుడైయ పాపత్తై ప్పోక్కి యోగ్యనాక్కి విషయీకరిక్కవేణుమెన్గిఱార్.

అథవా, తామ్ ప్రార్థిత్తపోతే తమ్ముడైయ ప్రాప్యమ్ సిద్ధియామైయాలే "సంసారియాన నామ్ ఆశైప్పడక్కడవోమో!" ఎన్ఱు నిన్దిత్తు, పిన్బుమ్ రుచియాలే

---

**48.శ్లో ॥అవ : (అపరాధేత్యాది)** తమ అయోగ్యతను భావించి, తొలగిపోవాలని చూచిన వీరు, కైంకర్యంలోని అతిమాత్రమైన అభిలాషచేత తొలగిపోలేక నిలువగా, చూచి భగవంతుడు "ఈ అయోగ్యతకు పరిహారం నా కృపను కలుగజేసే ప్రపత్తియే సుమా!'' అని అనగా, మళ్ళీ తొలగిపోవడం నుండి విరమించినవారై, ఈ అయోగ్యతకు హేతువైన అన్ని అపరాధాలకు పరిహారం-తమ ఆకించన్యాన్ని పురస్కరించుకొని చేసే ప్రపత్తియే కదా- అని తలచి, ఈ వేదాంత రహస్యమైన శరణాగతిని పురస్కరించుకొని, కేవలం నీ కృపతోనే నీ దాసుడనైన నా అపరాధాలను తీర్చి, నీకరుణకు విషయంగా నన్ను చేసికోవాలి'' - అని పల్కుతున్నారు అని చెప్పవచ్చు.

లేక, తాము ప్రార్థించిన వెంటనే తాము కోరిన ప్రాప్యం



అకలమాట్టాతే ఇప్పడి విళమ్బిక్కైక్కు హేతువాన పాపత్తైయుమ్ దేవరుడైయ కేవలకృపైయాలే ప్పోక్కి త్తన్దరుళవేణుమెన్గిఱారెన్నుమామ్. అత్తలైయిల్ పెరుమైయైయినెల్లైయైప్పార్ త్తకన్ఱార్ అఙ్గు. ఇఙ్గు నీర్మైయినెల్లైయై అనుసంధిత్తుక్కిట్టుకిఱార్.

వ్యా : **(అపరాధసహస్రభాజనమ్)** దేవర్గుణైక భాజనరానాప్పోలే, అసంఖ్యాతమాన నపరాధఙ్గళుక్కు క్కొళ్కలమాన ఎన్నై. అపరాధశబ్దత్తాలే "పుణ్యపాపరూపమాన కర్మమాకిఱతు- భగవన్నిగ్రహానుగ్రహమ్" ఎన్గిఱ వేదార్థత్తై వెళియిడుకిఱార్.

**(పతితమ్)** అన్ద ప్పాపత్తై విళైక్కుమ్ సంసారత్తిలే యిరున్దిటే

---

లభించనందున "సంసారి అయిన నేను ఆశపడతగినదేనా?'' అని నిందించుకొని, తరువాత కూడా, కైంకర్యంలోని రుచివల్ల తొలగిపోలేక, "ఈ విధంగా నేను ప్రాప్యాన్ని పొందడంలో జరిగే ఆలస్యానికి హేతువైన పాపాన్ని కూడా నీవు నీ కృపతో పోగొట్టి అనగ్రహించాలి" - అని పల్కుతున్నారని కూడా చెప్పవచ్చు. పూర్వశ్లోకంలో, పరమాత్మలోని గొప్పతనం యొక్క పరమావధిని చూచి దూరంగా తొలగిపోయారు. ఈ శ్లోకంలో, స్వామిసౌలభ్యం యొక్క పరమావధిని చూచి దరిచేరుతున్నారు.

వ్యా : **(అపరాధసహస్రభాజనమ్)** - నీవు గుణాలకు మాత్రమే ఆశ్రయమైనట్లుగా, లెక్కలేనన్ని అపరాధాలకు ఆకంమైన నన్ను - అని భావం. ఇక్కడ అపరాధశబ్దంతో ''పుణ్యపాపరూపాలుగా ఉండే కర్మలు భగవన్నిగ్రహానికి, అనుగ్రహానికి హేతువులు.'' అనే వేదార్థాన్ని వ్యక్తం చేస్తున్నారు.

**(పతితమ్)** - ఆ పాపాన్ని కల్గించే సంసారంలో ఉండి కదా వీరు ఆక్రందిస్తున్నారు. **"జనిత్వా"** (పుట్టి) అనే శ్లోకార్థాన్ని, **"కొడువినై తూగ్గ్రుళ్**

కూప్పిడువతు. “జనిత్వా” (స్తోత్రరత్నమ్), “కొడువినై త్తూற்றுళ్ నిన్ఱు” (తి-వాయ్-3-2-2)

**(భీమ)** జ్ఞానమ్ పిఱన్దార్క్కు క్కట్టడఙ్గ భయావహమాయిరుక్కు మెన్రై. “అహం భీతోఽస్మి దేవేశ! సంసారేఽస్మిన్ భయావహే” (1-జిత)

**(భవార్ణవ)** పరిచ్ఛేదిక్క అరితాయ్, అత్తాలే దుస్తరమాయిరుక్కై. “పిఱవి క్కడలుళ్ నిన్ఱు నాన్ తుళఙ్గ” (తి-వా-5-1-9) సంసారమాకిఱ కడలిలే అழுన్దువార్క్కు విష్ణుపోత మొழிయ త్తన్దామాల్ కరైయేఱ వొణ్ణాతిరుక్కై. “వైకున్ద నెన్బతోర్ తోణి పెఱాతుழல్కిన్ఱేన్” (నాచ్చియార్.తి 5-4) ఎన్నక్కడవతిఱే.

---

నిన్ఱు” (క్రూరకర్మలనే వనంలో నిలచి) అనే సూక్తిని స్మరించాలి.

**(భీమ)-** జ్ఞానం కల్గినవారికి సంసారం పూర్తిగా భయాన్ని కల్గించేవిగా ఉంటుంది.- అని భావం. **“అహం భీతోఽస్మి దేవేశ! సంసారేఽస్మిన్ భయావహే”** (దేవేశా! నేను భయాన్ని కల్గించే ఈ సంసారంలో మిక్కిలి భయాన్ని పొందినవాడనై ఉన్నాను) అనే సూక్తి ప్రకారం సంసారం భయాన్ని కల్గిస్తుంది.

**(భవార్ణవ) -** (సముద్రరూపణం చేత) సంసారమనేది ఇదమిత్థంగా పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానిదై, అందువల్ల దాటరానిదై ఉంటుంది. **“పిఱవిక్కడలుళ్ నిన్ఱు నాన్ తుళఙ్గ”** (సంసార సముద్రంలో నేను పడి వణుకుతుండగా) అనే విధంగా సంసారమనే సముద్రంలో మునిగేవారికి **“విష్ణుపోతం వినా నాన్యత్ కించిదస్తి పరాయణమ్”** (విష్ణువనే నావ తప్ప వేఱొక సంసార తరణసాధనం ఏదీ లేదు) అనే విష్ణుపోతంతో తప్ప తమకు తామే తీరాన్ని దాటడం సాధ్యంకాదని భావం. **“వైకున్దనెన్బదోర్ తోణిపెఱా తుழల్కిన్ఱేన్”** (వైకుంఠుడనే అద్వితీయమైన నావను పొందలేక పరిభ్రమిస్తున్నాను) అని కదా గోదాదేవి సూక్తి.



**(ఉదరే)** మధ్యే, “నిన్ పన్మామాయప్పల్ పిఱవియిల్ పడుకిన్ఱ యాన్” (తి.వాయ్ 3-2-2) ఎన్గిఱపడియే నీయే ఎడుక్క ప్పార్త్తాలుమ్ ఉనక్కుమ్ ఎట్టాతపడియాయిరుక్కై.

**(పతితమ్)** కర్మమ్ పుకత్తళ్ళ విழுన్దుకిడక్కిఱపడి.

**(అగతిమ్)** ఉన్నై యొழிయ వేఱు పులకற்றிరుక్కిఱ ఎన్నై.

**(శరణాగతమ్)** శరణాగతిశబ్దయుక్తనాన ఎన్నై.

**(హరే!)** మిత్రభావమే అడియాక సమస్తదుఃఖఙ్గళైయుమ్ పోక్కుకైయే స్వభావమాక వుడైయవన్ !

**(కేవలం కృపయా)** ఆర్తప్రపన్ననల్లేనెన్నాతే “కృపామాత్రమనోవృత్తిః”

---

**(ఉదరే) -** మధ్యలో - అని అర్థం. **“నిన్పల్ మామాయ ప్పల్ పిఱవియిల్ పడుకిన్ఱ యాన్”** (నీ పలు విధాలైన మాయలవల్ల దేవమనుష్యాది పలు జన్మలను ఎత్తి బాధపడే నేను) అనే విధంగా నీవు నన్ను ఉద్ధరించాలని చూచినా నీకు కూడా అందని రీతిలో ఉన్నాను.

**(పతితమ్) -** కర్మలు నన్ను సంసార సముద్రంలో పడేటట్లు గెంటివేయగా పడిపోయినవాడనైన నన్ను.

**(అగతిమ్) -** నీవు తప్ప ఇంకొక గతి ఏదీ లేని నన్ను.

**(శరణాగతమ్) -** శరణాగతిశబ్దాన్ని ఉచ్చరించిన నన్ను

**(హరే!) -** మిత్రభావమే (ఆనుకూల్యమే) కారణంగా సమస్తపాపాలను పోగొట్టడమే స్వభావంగా కలవాడా!

**(కేవలం కృపయా) -** నీవు ఆర్తప్రపన్నుడవు కావు- అని అనకుండా, **“సోఽహం తే దేవదేవేశ నార్చనాదౌ స్తుతౌ న చ, సామర్థ్యవాన్ కృపామాత్రమనోవృత్తిః ప్రసీద మే”** (దేవతలకు కూడా దేవతలైన

**(విష్ణు.పు 5-7-70)** ఎన్గిఅపడియే సహకారమిల్లాత కృపైయాలే.

**(ఆత్మసాత్కురు)** ఆత్మసాత్తాక ప్పణియరుళ వేణుమ్. నమ్ముడైయవనెన్ఱు విషయీకరిత్తరుళవేణుమ్.

**49.శ్లో॥** అవివేకఘనాన్ధదిఙ్ముఖే
బహుధా సంతతదుఃఖవర్షిణి ।
భగవన్ ! భవదుర్దినే పథః
స్ఖలితం మామవలోకయాచ్యుత! ॥

అవ : **(అవివేకేత్యాది)** అపరాధబహుళనాన పిన్బు శాస్త్రీయమాన ఉపాయాన్తరఙ్గళై ప్పఱ్ఱిప్పోక్కుతల్. విట్టుప్పఱ్ఱుతల్ శెయ్కైయొఴియ, "కృపయా కేవలమాత్మసాత్కురు" (స్తోత్రరత్నమ్) ఎన్ఱు నమ్మై నిర్బన్ధిక్కిఅతెన్? ఎన్న; శాస్త్రీయానుష్ఠానత్తుక్కు జ్ఞానమేయిల్లై. వేఱుగతి యిల్లామైయాలే

నిత్యసూరులకు ప్రభూ! ఇటువంటి నేను నీ స్తుతిలో, అర్చన మొదలైనవానిలో సామర్థ్యం కలవాడను కాను. కృపతో కూడిన మనస్సు కలవాడవై నన్ను దయ చూపాలి) అనే రీతిలో వేఱొక సహకారం లేని కృపతో- అని భావం.

**(ఆత్మసాత్కురు)** - నీవాడను చేసికొని దయ చూపాలి. మనవాడితడు- అని అనుగ్రహించాలి.

**49.శ్లో॥** అవ : **(అవివేక)** పలు అపరాధాలను చేసినవాడనైన తరువాత, శాస్త్రాలతో తెలుపబడిన ఉపాయాంతరాలను అనుష్ఠించి కాలక్షేపం చేయడం, లేక వాటిని విడచి, ఆశ్రయించడం తప్ప, "కృపయా కేవల మాత్మసాత్కురు" (కేవలం కృపతో నన్ను స్వీకరించు) అని నన్ను ఎందుకు నిర్బంధిస్తున్నారు? అని భగవానుడు అనగా, "శాస్త్రీయాలైన సాధనాలను అనుష్ఠించడానికి



విడమాట్టేన్, ఆనపిన్బు దేవర్ కృపాకార్యమానవిశేష కటాక్షమే ఎనక్కు ఉజ్జీవనసాధనమెన్గిఱార్.

వ్యా : **(అవివేక)** అతావతు- వివేకాభావమ్, జీవపరవివేకాభావమ్, దేహాత్మవివేకాభావమ్, త్యాజ్యోపాదేయవివేకాభావమ్, బన్ధ విమోచన వివేకాభావమ్. ఇవైయాకిఅ మేఘపటలఙ్గళాలే తిరోహితమాన మనస్సైయుడైయవనాకైయాలే ఉజ్జీవనోపాయత్తిల్. దిఙ్మాత్రముమ్ తెరియాతిరుక్కుమ్. ఇతఱ్కుమేల్,

**(బహుధా సన్తతదుఃఖవర్షిణి)** బహుప్రకారమాయ్, ఇడైవిడాతేయుణ్డాన దుఃఖరూపమాన వర్షత్తై యుడైత్తాన్. అవివేకమ్ దుఃఖత్తై విళైక్కైయావతు- అజ్ఞానత్తాలే కర్మమాయ్, అత్తాలే దేవాది శరీరప్రవేశమాయ్, అత్తాలే తాపత్రయరూపమాన దుఃఖమ్. "పొయ్నిన్ఱ ఞానమ్

కావలసిన జ్ఞానమే లేదు. వేఱు గతి లేనందున నిన్ను విడువలేను. అందువల్ల నీ కృపవల్ల కలిగే నీ కటాక్షమే నాకు ఉజ్జీవించడానికి సాధనం- అని పల్కుతున్నారు.

వ్యా : **(అవివేక)** అవివేకమంటే - వివేకం పూర్తిగా లేకపోవడం. జీవ-పరమాత్మ వివేకం లేకపోవడం, దేహ-ఆత్మల వివేకం లేకపోవడం, త్యాజ్య-ఉపాదేయాల వివేకం లేకపోవడం, బంధ-విమోచనాల వివేకం లేకపోవడం, ఈ వివేకాభావాలనే మేఘసమూహాలతో ఆవరింపబడిన మనస్సును కలవాడనైనందున ఉజ్జీవనోపాయం ఏది? - అని దిఙ్మాత్రంగా కూడా తెలియకుండా ఉన్నది. ఇంతకుమించి,

**(బహుధా సంతతదుఃఖవర్షిణి)** - పలు రీతులను కల్గినదై, ఎడతెరిపి లేకుండా కలిగే దుఃఖాలనే వర్షాన్ని కల్గిన - అని అర్థం. దుఃఖాన్ని కల్గించడం అంటే- అజ్ఞానంవల్ల కర్మలు, వానివల్ల దేవాదిదేహప్రవేశం, ఈ దేహప్రవేశంవల్ల తాపత్రయరూపమైన దుఃఖం కల్గుతాయి. "పొయ్నిన్ఱ ఞానమ్

పొల్లావొ*ழு*క్కుమ*ழு*క్కుడమ్బుమ్" (తిరువి-1) ఎన్గిఅపడియే.

**(బహుధా)** ఆధ్యాత్మికాది బహుప్రకారమాయిరుక్కై.

**(భగవన్)** ఇన్ద దుఃఖత్తై ప్పరిహరిక్కైక్కు ఇత్తలైయిల్ జ్ఞానశక్త్యాద్యభావముమ్ దేవరాలల్లతు పరిహారమిల్లై యెన్గిఅ ఇతువుమ్ దేవరీర్ అఱియీరో? ఎన్లై.

**(భవదుర్దినే)** సంసారమాకిఅ మ*ழை*క్కాలిరుళే. దుర్దినమ్ - మేఘతిమిరమ్.

**(పథఃస్ఖలితమ్) "వ*ழி*తికైత్తలమరుకిన్టేన్" (తి-వాయ్-3-2-9)** ఎన్గిఅపడియే.

---

పొల్లా ఒ*ழு*క్కుమ్ అ*ழு*క్కుడమ్బుమ్" (అసత్యమైన జ్ఞానం, దానివల్ల అసద్వర్తనం, దానివల్ల మలినశరీరం) అని ఈవిషయం తెలుపబడింది.

**(బహుధా)** - ఆధ్యాత్మిక-ఆధిదైవిక-ఆధిభౌతిక రూపంగా అనేక ప్రకారాలను దుఃఖాలు కల్గి ఉంటాయి.

**(భగవన్!)** - ఈ దుఃఖాలను తీర్చుకోవడానికి నాకు ఏవిధమైన జ్ఞానం, శక్తి లేవు. నీవు తప్ప పరిహారం లేదు - అనే ఈ విషయాన్ని నీవు తెలియవా! - అని ఈ సంబోధనలోని భావం.

**(భవదుర్దినే)** - సంసారమనే వర్షాకాల సమయంలోని చీకటిలో - అని అర్థం. దుర్దినమంటే పగలు మేఘాలు ఆవరించినందున ఏర్పడిన చీకటి.

**(పథః స్ఖలితమ్) - "పావియేనై పలకాలమ్ వ*ழி*తికైత్తలమరుకిన్టేన్"** (పాపిష్ఠివాడను చిరకాలంగా దోవతప్పి భ్రమించి తిరుగుతున్నాను) అనే రీతిలో దారిలో తొట్రుపాటు పడినవాడను.



**(మామ్)** కర్మాద్యుపాయఙ్గళిల్ ప్రచ్యుతనాన ఎన్నై. నాన్ పడుకిఅ పాడు ఇతువానాల్ శాస్త్రీయానుష్ఠానత్తుక్కు నానార్? దేవరై యొ*ழி*య వేఱు గతి యుణ్డో? ఎన్ఱు కరుత్తు.

**(అవలోకయ) "అవలోకనదానేన భూయో మాం పాలయాచ్యుత!" (వి-పు-1-20-16)** ఎన్ఱు శొల్లుకిఅపడియే సకలక్లేశముమ్ పోమ్పడి పార్త్తరుళవేణుమ్. సాధనాన్తరనిష్ఠర్క్కుమ్ దేవర్‌కటాక్షమేయితే ఉత్తారకమ్. **"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః" (భార-మోక్ష)** ఎన్ఱు అధికారి సిద్ధియుమ్ దేవర్‌కటాక్షమేయితే. **"జితన్తే పుణ్డరీకాక్ష!" (1-జిత-1)**

---

**(మామ్)** - కర్మ, జ్ఞానం మొదలైన ఉపాయాలనుండి జారిపడిన నన్ను (వానిని అనుష్ఠించని నన్ను) నేను పడేపాట్లు ఇవి అయినపుడు శాస్త్రీయాలైన సాధనాలను అనుష్ఠించడానికి నేనెవడను? నీవు తప్ప ఇంకొక గతి ఉన్నదా? అని భావం.

**(అవలోకయ)- "దేవ ప్రపన్నార్తిహర! ప్రసాదం కురు కేశవ, అవలోకనదానేన భూయో మాం పాలయాచ్యుత!"** (దేవా! శరణుపొందిన వారి దుఃఖాన్ని పోగొట్టేవాడా! కేశవా! అనుగ్రహించు. అచ్యుతా! తిరిగి తిరిగి కటాక్షించడం ద్వారా నన్ను పాలించు) అని పల్కినట్లుగా అన్ని క్లేశాలు పోయేటట్లుగా కటాక్షించాలి. సాధనాంతరాల అనుష్ఠానానికి కూడా నీ కటాక్షమే కదా ఉత్తారకం. **"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్విక స్స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః"** (జన్మించే ఏపురుషుని మధుసూదనుడు కటాక్షిస్తాడో? అతడు సాత్త్వికుడుగా తెలియదగినవాడు, అతడే మోక్షపురుషార్థాన్ని గూర్చి చింతించేవాడు) అనే రీతిలో మోక్షాధికారి సిద్ధించడానికి కూడా నీ కటాక్షమే కదా మూలం. **"జితం తే పుండరీకాక్ష! నమఉస్తే విశ్వభావన! నమస్తేస్తు హృషీకేశ! మహాపురుష! పూర్వజ"** (పుండరీకాక్షా నీకు మంగళం!) అని బాహ్య విషయసంగాన్ని తీర్చేది కూడా

ఎన్ను పుఱమ్బుళ్ళ తువక్కై యఱుప్పతుమ్ ఉన్ విశేషకటాక్షమిఱే.

**(అచ్యుత!)** **''అడియవర్ వల్వినైత్తుప్పావమ్బులనైన్దుమ్ తుఞ్జక్కొడానవన్'' (తి-వాయ్-1-7-2)** ఎన్గిఱపడియే ఆశ్రితరై ఒరువఴియాలుమ్ నశిక్కవిట్టుక్కొడాతవరిఱే దేవర్. "అవరుయిరై చ్చోర్న్దే పోకల్ కొడాచ్చుడరై" **(తి-వాయ్-2-3-6)** ఎన్నక్కడవతిఱే.

**50.శ్లో** ॥న మృషా పరమార్థమేవ మే
శృణు విజ్ఞాపన మేక మగ్రతః ।
యది మే న దయిష్యసే తతో
దయనీయ స్తవ నాథ! దుర్లభః ॥

అవ : (న మృషేతి) దేవర్కృపైయాలల్లతు వేఱెనక్కు గతి యిల్లాతవోపాతి, దేవర్కృపైక్కుమ్ నానల్లతు విషయమిల్లై. ఇత్తై యిఴవాతే

---

నీ కటాక్షమే కదా!

**(అచ్యుత!)** - **"అడియవర్వల్ వినైతుప్పావమ్బులనైన్దుమ్ తుఞ్జక్కొడానవన్"** (దాసులను బలిష్ఠాలైన పంచేంద్రియాలచే దుఃఖాన్ని పొందకుండా ఉండేటట్లు చేసేవాడు) అనేటట్లు ఆశ్రితులను ఏవిధంగాను నశింపనీయకుండా చేసేవాడవు కదా నీవు. **"అవరుయిరై చ్చోర్న్దే పోకల్ కొడా చ్చుడరై"** (భక్తుల ఆత్మయై ఉండేవాడు, వారి ఆత్మ చెదటిపోకుండా- కరగిపోకుండా ఉండేటట్లు చేసే జ్యోతిఃస్వరూపుడవు) అని ఆఴ్వార్లు భక్తులకు చ్యుతి కలుగకుండా స్వామి చేస్తాడని అన్నారు కదా!

**50.శ్లో ॥అవ : (న మృషేతి)** - నీ కృప తప్ప వేఱు గతి నాకు లేనట్లుగా, నీ కృపకు కూడా నేను తప్ప ఇంకొక తగిన విషయం (లక్ష్యం) లేదు. నన్ను



కొళ్ళీరెన్గిఱార్.

వ్యా : **(న మృషా పరమార్థమేవ)** ఇతు సంసారత్తిల్ కేట్టఱివతొన్ఱల్లామైయాలే మెయ్యాకమాట్టాతు- ఎన్ఱు ఈశ్వరహృదయత్తిల్ పిఱన్ద అతిశఙ్కైయై త్తవిర్క్కైక్కాక అన్వయవ్యతిరేకత్తాలే సత్యమెన్గిఱార్.

**(న మృషా)** లౌకికర్ పక్కలిలే ఇరక్కమ్ పిఱక్కైక్కాక అబుద్ధ్యా శొల్లుమ్ వార్తైపోలే పొయ్యన్ఱు.

**(పరమార్థమేవ)** నినైవుక్కుమ్ వాయ్త్తలైయిలిరున్ద అఱియుమ్ దేవర్తిరుమున్బే; మెయ్యే విణ్ణప్పమ్ శెయ్యలామ్బడి సత్యమే.

**(మే విజ్ఞాపనమ్)** సర్వజ్ఞరాన దేవర్ తిరుమున్బే మెయ్యే విణ్ణప్పమ్

---

పోగొట్టుకోకు సుమా! - అని ఇందులో పల్కుతున్నారు.

వ్యా : **(న మృషా పరమార్థమేవ మే)** - ఇది ఈ సంసారంలో విని తెలిసికొన్న విషయం కాదు (ప్రసిద్ధం కాదు) కనుక వాస్తవం కాదని భగవంతుని హృదయంలో కల్గిన సందేహాన్ని పోగొట్టడంకోసం **"పరమార్థమేవ"** అని అన్వయ క్రమంలో, **"న మృషా"** అని వ్యతిరేకక్రమంలో ''ఇది సత్యమే సుమా!'' అని పల్కుతున్నారు.

**(న మృషా)** - లౌకికుల విషయంలో జాలి కల్గడం కోసంగా, బుద్ధిపూర్వకంగా కాకుండా పలికే మాటవలె అసత్యం కాదు.

**(పరమార్థమేవ)** - ఒకరి మనస్సులో భావనకు ప్రారంభంలో కూడా వారి మనస్సులో ఉండి దానిని తెలియగల్గిన నీ ముందే, వాస్తవాన్నే విన్నపించేటట్లుగా, ఇది సత్యమే. (మనస్సులో ఉండి భావనాప్రారంభదశను సైతం తెలియగల్గిన నీ ముందు అబద్ధం పల్కడం సాధ్యం కాదు, నేను పలికేది సత్యమే)

**(మే విజ్ఞాపనమ్)** - సర్వజ్ఞుడవైన నీముందే వాస్తవాన్నే విన్నపించడమే

శెయ్యుమతువే ఉజ్జీవనోపాయ మెన్ఱిరుక్కు మెన్నుడైయ విణ్ణప్పత్తై. "మెయ్ నిన్ఱు కేట్టరుళాయ్ అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్" (తిరువి-1) ఎన్నక్కడవతిత్తే.

(ఏకమ్) అద్వితీయమ్ ఇతుక్కుమేలాక నిష్కర్షిత్తు చ్చొల్లువతొరు వార్తై యిల్లై. ఇతువే యెల్లైయాన నిష్కర్షమ్.

(అగ్రతః శృణు) మేల్ కార్యమ్ శెయ్యిలుమ్, శెయ్యాతొழியిలుమ్ ముఱ్పడ క్కేట్టరుళవేణుమ్. సంసారత్తిల్ పరిమాఱాతతొన్ఱెన్ఱు అనాదరియాతే అవధానమ్ పణ్ణిక్కేట్టరుళవేణుమ్.

(యది మే న దయిష్యసే) దయైయొకరక్ష్యనాన ఎనక్కు దయై పణ్ణియరుళా యాకిల్.

---

ఉజ్జీవనోపాయమని తలచిఉండే నా విన్నపాన్ని - అని భావం. "ఎన్నిన్ఱ యోనియుమాయ్ పిఱన్దాయ్! ఇమైయోర్‌తలైవా! మెయ్ నిన్ఱు కేట్టరుళాయ్! అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే" (ఎన్నెన్ని జాతులలో పుట్టావో, ఓ నిత్యసూరినాథా! దాసుడనైన నేను చేసే ఈవిన్నపాన్ని విని అనుగ్రహించు) అని ఆழ்వార్లు తాము చేసే విన్నపం వాస్తవమని అన్నారుకదా!

(ఏవమ్) - అద్వితీయం. ఇంతకు మించి నిష్కర్షించి పలుకగల్గినమాట ఇంకొకటి లేదు. ఇదే పరమావధి అయిన నిష్కర్షం.

(అగ్రతః శ్రుణు) - తరువాత, కార్యాన్ని (నా రక్షణను) చేసినా చేయకపోయినా, ముందు నా మాటను వినాలి. సంసారంలో కన్పించే విషయం కాదిది- అని అనాదరించకుండా, శ్రద్ధగా వినాలి.

(యది మే న దయిష్యసే) - నీ దయచే మాత్రమే రక్షింపదగినవాడనైన నాకు దయ చూపించకపోతే,



(తతః) దేవరై క్కిట్టిన ఇవ్వస్తు తప్పిన పిన్బు.

(దయనీయ స్తవ) రక్ష్యవిషయార్థియాన దేవర్‌క్కు సాపరాధనాయ్, అనుతాపమ్ పిఱన్ద దయనీయ విషయమ్.

(నాథ!) రక్ష్యవిషయార్థియాకైక్కు దయైయేయన్ఱు. ప్రాప్తియు ముణ్డెన్గిఱార్.

(దుర్లభః) దయైయొకరక్ష్యరాయిరుప్పార్ దుర్లభర్. "స మహాత్మా సుదుర్లభః" (గీ-7-19) ఎన్నుమవరిత్తే దేవర్.

---

(తతః) - నిన్ను సమీపించిన ఈ ఆత్మవస్తువు తప్పిపోయిన తరువాత,

(దయనీయ స్తవ)- రక్షింపదగినవారి కోసం ఆశపడే నీకు అపరాధం చేసినవాడై, తరువాత పశ్చాత్తాపాన్ని పొందిన, దయనీయుడైనవాడు.

(నాథ!) - రక్షింపదగిన దానిని అన్వేషించడానికి దయ ఒక్కటియే చాలదు, రక్షింపదగిన ఆ వ్యక్తితో తగిన సంబంధంకూడా ఉండాలికదా. నీవు నాకు నాథుడవు, నేను నీచే రక్షింపబడవలసినవాడను, కనుక నీవు నన్ను రక్షించాలి - అని ఈ సంబోధనలోని తాత్పర్యం.

(దుర్లభః) - నీదయచేతనే రక్షింపదగిన నావంటి వారు దొరకడం చాలా కష్టం. "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః" (పలు జన్మల తరువాత యథార్థజ్ఞానాన్ని పొందినవాడు నన్ను శరణు పొందుతున్నాడు. కాని, వాసుదేవుడే ధారకపోషక భోగ్యాలుగా భావించే ఆ మహాత్ముడు మాత్రం దుర్లభుడు) అని కదా నీవు పలికావు.

51.శ్లో ॥ తదహం త్వదృతే న నాథవాన్
మదృతే త్వం దయనీయవాన్న చ ।
విధినిర్మిత మేతదన్వయం
భగవన్పాలయ మా స్మ జీహపః ॥

అవ : **(తదహమ్)** ఇప్పడి దయనీయదయావాన్గళాన ఇరువర్క్కుమ్ ముఖ్యమాన ఇస్సమ్బన్ధన్దానుమ్ దేవరుడైయ కృపైయాలేయాయిற்று. ఆనపిన్బు ఇత్తైక్కైవిడాతే రక్షిత్తరుళవేణుమెన్గిఱార్.

వ్యా : **(తత్)** ఆతలాల్, దయనీయర్ దేవర్క్కు దుర్లభరాన పిన్బు.

**(అహమ్)** సాపరాధనాయ్, అనుతాపమ్ పిఱన్ద నాన్.

**(త్వదృతే న నాథవాన్)** "భృశం భవతి దుఃఖితః" (రా-అ-2-41) ఎన్ఱిరుక్కుమ్ దేవరై యొழிయ నాథవానల్లేన్. పరదుఃఖాసహిష్ణుత్వమేయిఱే

---

51.శ్లో ॥ అవ : **(తదహమ్)** - ఈ విధంగా, నేను దయ చూపబడవలసినవాడను, నీవు దయ చూపించవలసినవాడవు - అనే మన ఇద్దఱికి ముఖ్యమైన ఈ సంబంధం నీ కృప వల్లనే ఏర్పడింది. దీనిని చేయివిడువకుండా, రక్షించు - అని పల్కుతున్నారు.

వ్యా : **(తత్)** - అందువల్ల, అంటే, దయనీయులు నీకు దుర్లభులైనందువల్ల - అని భావం.

**(అహమ్)** - అపరాధాలను చేసినవాడను, పశ్చాత్తాపాన్ని కల్గినవాడనైన నేను.

**(త్వదృతేన నాథవాన్)** - "వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుః ఖితః" (మానవుల కష్టాలను చూచి శ్రీరాముడు వారికంటే ఎక్కువ దుఃఖాన్ని పొందినవాడవుతున్నాడు) అనే రీతిలో ఉండే నిన్ను తప్ప ఇంకొకరిని నాథునిగా కలవాడను కాను. **"పరదుఃఖాసహిష్ణుత్వమే"** (ఇతరుల దుఃఖాన్ని



దయై.

**(మదృతే త్వం దయనీయవా న్నచ)** దయైకరక్ష్యనాన వెన్నై యొழிన్దాల్ దేవరుడైయ కృపై కుమరిరున్దు పోమిత్తనై.

**(ఏతదన్వయం విధినిర్మితమ్)** ఒరువరై యొழிయ ఒరువర్క్కు చ్చెల్లాత ముఖ్యసమన్బన్ధమ్ దేవరుడైయ కేవలకృపైయాలే వన్దతు. "విఠివాయ్క్కిన్ఱు కాప్పారార్?" (తి-వాయ్-5-1-1) ఎన్గిఱపడియే. తదహ మెన్గిఱ విడత్తిల్ తచ్ఛబ్దమ్ మేల్ పేற்றుక్కుడలాక ఇఙ్గే అన్వయిక్కక్కడవతు. అథవా, శాస్త్రసిద్ధమాన ఇన్ద సమ్బన్ధత్తై -ఎన్నుమామ్. విధియెన్ఱు- దైవమాయ్, "ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా" (వై-స్త) ఎన్గిఱపడియే సత్తాప్రయుక్తమాన

---

సహించలేకపోవడమే) కదా దయ.

**(మదృతే త్వం దయనీయవాన్ న చ)** - నీదయవల్లనే రక్షింపబడవలసినవాడనైన నన్ను తప్పిపోతే నీ కృప వెలవెలపోతుంది, అంతే.

**(ఏతదన్వయం విధినిర్మితమ్)** - ఒకరు లేకపోతే ఇంకొకరికి జరగని ఈ ముఖ్యమైన సంబంధం నీకృపవల్లనే ఏర్పడింది. "విదివాయ్క్కిన్ఱు కాప్పారార్?" (భగవత్కృప ఫలించేటపుడు దానిని అడ్డుకోగల్గినవారెవరు?) అనేటట్లుగా ఈసంబంధం విధిశబ్దంచేత చెప్పబడే భగవత్కృపవల్ల కల్గింది. **"తదహమ్"** అనే ప్రయోగంలోని తచ్ఛబ్దాన్ని తరువాత ప్రాప్యానికి తగినట్లుగా ఇక్కడ అన్వయించవచ్చు. (తత్ - అందువల్ల నన్ను పాలించు, విడవకు- అని) లేక, తచ్ఛబ్దానికి శాస్త్రంలో ప్రసిద్ధమైన ఈ సంబంధాన్ని అనే అర్థాన్ని చెప్పి, ప్రసిద్ధిద్యోతకంగా గ్రహించవచ్చు. విధి అంటే దైవం. ("దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః" - అని అమరం). "ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా నిత్యం ప్రియా స్తవతు కేచన తేఽపి నిత్యాః" (నీ ఇచ్ఛవల్లనే అన్ని వస్తువుల సత్త ఏర్పడుతున్నది. నీకు కొన్ని వస్తువులు ఎల్లప్పుడు ప్రియమైనందున అవి నిత్యంగా ప్రకాశిస్తున్నాయి) అనేటట్లు సత్తాప్రయుక్తమైన

సమ్బన్ధత్తై చ్చొల్లి***ఱ్ఱా***కవుమామ్.

**(భగవన్!) ఇవ*ఱ్ఱి*ల్ దేవర్క్కు అఱివిక్క వేణ్డువతుణ్డో?**

**(పాలయ) భోజయ ఇత్తై రక్షిత్తరుళ వేణు మెన్నుతల్; ఇత్తై భుజిత్తరుళవేణు మెన్నుతల్ స్వీకరిత్తరుళవేణు మెన్నుతల్, "భుజ పాలనాభ్యవహారయోః".**

**(మా స్మ జీహపః) న త్యజ. ఇత్తల్లైయిల్ పూర్వాపరాధత్తైయుమ్, దేవర్పూర్త్తియైయుమ్ పార్త్తు, కైవిట్టరుళాతొ*ఴి*యవేణుమ్.**

**52.శ్లో ॥ వపురాదిషు యోఽపి కోఽపి వా**
**గుణతోఽసాని యథాతథా విధః ।**
**తదయం తవ పాదపద్మయో**
**రహ మద్యైవ మయా సమర్పితః ॥**

**అవ : (వపురాదిషు) ఇతిల్ ఆత్మానురూపమాకవన్తో రక్షణమిరుప్పతు.**

---

(సత్తవల్ల ఏర్పడిన - సహజమైన) సంబంధాన్ని చెప్పినట్లయినదని కూడా చెప్పవచ్చు.

**(భగవన్!)** - వీటిలో నీకు తెలుపబడవలసినది ఏదయినా ఉన్నదా?

**(పాలయ)** - ఈ సంబంధాన్ని రక్షించాలి - అని భావం, లేక దీనిని భుజించాలి - అని భావం. ఈ రెండర్థాలు- **"భుజ పాలనాభ్యవహారయోః"** అనే ధాత్వర్థాలను బట్టి చెప్పబడ్డాయి.

**(మా స్మ జీహపః)** - విడిచిపెట్టకు. పూర్వం నేను చేసిన అపరాధాలను, నీ గుణపూర్తిని చూచి, నా చేయి విడువకుండా ఉండాలని భావం.

**52.శ్లో ॥అవ : (వపురాదిషు)** - ఈ శ్లోకంలో-ఆత్మకు అనురూపంగా కదా



**దయనీయరాన వుమ్ముడైయ స్వరూపత్తై నిష్కర్షిత్తు, అత్తై నమ్ పక్కలిలే సమర్పియు మెన్న; "శిఱప్పిల్ వీడు" (తి-వాయ్-2-9-5) ఎన్గిఱ పాట్టిన్పడియే ఎనక్కు ఇతిల్ ఒరు నిర్బన్ధమిల్లై. అహమ్ బుద్ధిబోధ్యతాయోగ్యమాన ఇవ్వాత్మవస్తు వదేవర్ తిరువడికళిలే ఎన్నాలే సమర్పిత మెన్గిఱార్.**

**వ్యా : (వపురాదిషు) వపుః-దేహః. ఆదిశబ్దత్తాలే ఇన్ద్రియమనః ప్రాణబుద్ధికళై చ్చొల్లుకిఱతు. ఇవ*ఱ్ఱి*ల్ ఒన్ఱై ఆత్మా వెన్బారుమ్, ప్రకృతే వరవాయ్, జ్ఞానానన్దలక్షణమెన్బారువాయ్ స్వరూపత్తిలే విప్రతిపత్తియుణ్డాయిరుక్కుమ్.**

---

రక్షణమనేది ఉంటుంది. దయనీయులైన మీరు మీ స్వరూపాన్ని గమనించి నిష్కర్షించి తెలిసికొని, దానిని నాకు సమర్పించండి'' అని భగంతుని భావంగా తలచి, **"శిఱప్పిల్ వీడు శువర్క్క నరకమ్ ఇఱప్పిలెయ్దుక వెయ్దఱ్క, యానుమ్ పిఱప్పిల్ పల్ నిఱవి ప్పెరుమానై మఱ్ఱైప్పొన్ఱిన్ఱి ఎన్ఱుమ్ మకి*ఴ్*వేనే"** (మిక్కిలి మహిమ గల మోక్షం, స్వర్గం, నరకం - అనే వీనిలో దేనిని నేను మరణంలో పొందినా సరే, జన్మించడానికి హేతువులేక పోయినా సరే, పలు అవతారాలను ఎత్తిన సర్వేశ్వరుని నేను ఏవిధమైన విస్మృతి లేకుండా సదా అనుభవిస్తాను) అనే పాశురంలో ఆఴ్వార్లు పల్కినట్లు నాకు మోక్షం, నరకం, స్వర్గం - అనే వీనిలో ఏమి కల్గినా సరే, ఇదే కలగాలనే నిర్బంధం లేదు. అహంబుద్ధిచే తెలిసికొనదగిన (బోధింపదగిన) ఈ ఆత్మ అనే వస్తువు ఈనాడు నీ శ్రీచరణాలలో సమర్పింపబడింది - అని అంటున్నారు.

**వ్యా : (వపురాదిషు) - "వపుః"** - దేహం ఇక్కడ ప్రయోగింపబడిన ఆదిశబ్దంచేత పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి చెప్పబడుతున్నాయి. ఆత్మ అనేది వీటిలో ఒకటి - అనేవారు, ఆత్మ ప్రకృతికంటే విలక్షణమై, జ్ఞానాన్ని, ఆనందాన్ని లక్షణంగా కల్గినదని అనేవారు - ఈ విధంగా ఆత్మ స్వరూపవిషయంలో పలు భేదాభిప్రాయాలున్నాయి.

**(యోఽపి కోఽపి వా)** ఇవఱ్ఱిల్ ఏతేను మొన్ఱు స్వరూపమాకవుమ్.

**(గుణతః)** స్వభావతోఽణుత్వవిభుత్వైకరూపత్వ పరిణామిత్వ నిత్యత్వానిత్యత్వజ్ఞాతృత్వాదికళిలే విప్రతిపత్తియుణ్డా యిరుక్కుమ్.

**(యథాతథా విధః అసాని)** అతిల్ ఏతేను మొరు స్వభావమాకిలుమ్ అతిలుమ్ ఎనక్కొరు నిర్బన్ధమిల్లై.

**(తత్)** తస్మాత్. కీழ్చ్చొన్న స్వరూపస్వభావఙ్గళిల్ నిర్బన్ధమిల్లామైయాలే.

**(అయమహమ్)** పరాగర్థవ్యావృత్తనాయ్, ప్రత్యగర్థభూతనాయ్ ప్రత్యక్షిక్కిఱ నాన్.

---

**(యోఽపి కోఽపి వా)** ఆత్మ వీటిలో ఏదయినా ఒకటిని స్వరూపంగా కల్గినది కానీ.

**(గుణతః)** - ఆత్మ, స్వభావం విషయంలోని అణుత్వ, విభుత్వ, ఏక. రూపత్వ పరిణామిత్వ నిత్యత్వానిత్యత్వజ్ఞాతృత్వాదులలో అణువు, విభువు, ఏకరూపమైనది, పరిణామాన్ని పొందేది, నిత్యమైనది, అనిత్యమైనది, జ్ఞాత అనే ఈ అంశాలలో పలు భిన్నాభిప్రాయాలున్నాయి.

**(యథాతథావిధః అసాని)** వీటిలో ఏదయినా ఒక స్వభావాన్ని కల్గినదిగా కానీ. దీనిలోకూడా నాకేవిధమైన నిర్బంధం లేదు.

**(తత్)** - అందువల్ల, పూర్వం పల్కిన, ఆత్మయొక్క స్వరూపస్వభావాలలో ఏనిర్బంధం లేనందున,

**(అయమహమ్)** - **"పరాక్"** అనబడే ప్రకృతికంటే భిన్నుడనై, ప్రత్యక్ శబ్దవాచ్యుడనై కన్పించే (భాసించే) నేను,



**(తవ పాదపద్మయోః)** రక్షకరాన దేవరుడైయ భోగ్యమానతిరువడికళిలే.

**(అద్యైవ)** ఆత్మా క్షణికమాకిలుమ్ ఇన్ద క్షణత్తిలే సమర్పిత మెన్నై.

**(మయా సమర్పితః)** ఎన్నాలే సమర్పితన్. **"యోఽహ మస్మి స సన్యజే" (యజు-అ-3-7), "యస్యాస్మి న తమన్తరేమి" (యజు-2-3-7), "ఆత్మా రాజ్యం ధనం మిత్రం కళత్రం వాహనాని చ, ఏతద్భగవతే సర్వ మితి తత్ప్రేక్షితరి సదా" (భార.శాన్తి 343-24)** ఇతి ఉపరిచరవసువృత్తాన్తే. **"రాజ్య ఞ్చాహఞ్చ రామస్య ధర్మం వక్తుమిహార్హసి" (రా-అ-82-12)** ఇతి భరతః.

---

**(తవ పాదపద్మయోః)** - రక్షకుడవైన నీ, భోగ్యమైన శ్రీచరణాలలో,

**(అద్యైవ)** - ఆత్మక్షణికమైనా, ఈక్షణంలో సమర్పించాను -అని భావం. ఆత్మక్షణికమని వాదించే బౌద్ధాది పక్షాన్ని బట్టి ఈవిధంగా చెప్పబడింది.

**(మయా సమర్పితః)** - నాచే సమర్పింపబడింది. **"యోఽహ మస్మి స సన్ యజే"** (నేను ఎటువంటివాడనై ఉన్నానో, అటువంటి వాడనుగానే ఉంటూ ఆత్మసమర్పణ రూపయాగాన్ని చేస్తున్నాను) **"యస్యాస్మి న తమంతరేమి"** (నేను ఎవనికి శేషమై ఉన్నానో, అతనిని విడచి వేఱొకనివద్దకు పోను) **"ఆత్మా రాజ్యం ధనం మిత్రం కళత్రం వాహనాని చ, ఏతత్ భగవతే సర్వమితి తత్ ప్రేక్షితం సదా"** (ఆత్మ, రాజ్యం, ధనం, మిత్రులు, భార్యలు, వాహనాలు- అనే ఇవి అన్నీ భగవానునకే - అని ఉపరిచరవసువుచే సదా భావింపబడింది) **"కథం దశరథాజ్జాతో భవేద్రాజ్యాపహారకః, రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తు మిహార్హసి"** (దశరథుని వల్ల పుట్టిన వాడనైన నేను ఏవిధంగా రాజ్యాన్ని అపహరించేవాడను కాగలను? రాజ్యం, నేను శ్రీరామునివే నీవు ఈ విషయంలో ధర్మాన్ని పలకాలి) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

53.శ్లో ॥ మమ నాథ యదస్తి యోఽస్మ్యహం
సకలం తద్ధి తవైవ మాధవ! ।
నియతస్వ మితి ప్రబుద్ధధీ
రథవా కిం ను సమర్పయామి తే ॥

అవ : (మమ నాథేతి) "ఇవరై భ్రమత్తోడే విడుకిఱతెన్?" ఎన్ఱు పార్త్తరుళి, "నీర్ ఆరత్తై యారుక్కు సమర్పిత్తీర్" ఎన్న నిరూపిత్తవిడత్తు "ఎనతావి యావియుమ్ నీ ఎనతావియార్ యానార్?" (తి-వాయ్-2-3-4) ఎన్గిఱపడియే, ఉమ్మత్తై నీరే స్వీకరిత్తీరిత్తనై, "ఆత్మసమర్పణముమ్ ఆత్మాపహారత్తోపాతి" ఎన్ఱు పణ్ణిన ఆత్మసమర్పణత్తై అనుశయిక్కిఱార్. ఆత్మసమర్పణమావతు- భగవత్పరతన్త్రమాన ఆత్మావుక్కు అనాద్యవిద్యాసిద్ధమాన స్వస్వాతన్త్ర్యమడియాక భగవద్వైముఖ్యమ్ పిఱన్దు,

53.శ్లో ॥ అవ : (మమ నాథేతి) "వీరికి భ్రమను కల్గించడం ఎందుకు?'' అని భగవంతుడు తలచి, మీ ఆత్మను సమర్పించడానికి మీరెవరు?'' అని అనగా, జాగ్రత్తగా గమనించి చూస్తే, "ఎనతావియావియుమ్ నీ, ఎనతావి యార్? యానార్?" (నా ఆత్మకు ఆత్మకూడా నీవే, నా ఆత్మ ఎవరిది? నేనెవరు?) అనేవిధంగా, నీవస్తువును నీవే కదా స్వీకరించావు; అంతే. తమదికాని ఆత్మను సమర్పించడంకూడా ఆత్మను సమర్పించడం వంటిదే- అని తలచి తాము చేసిన ఆత్మసమర్పణానికి పశ్చాత్తాపాన్ని పొందుతున్నారు. ఆత్మాపహారమంటే - భగవానునకు పరతంత్రమైన ఆత్మకు, అనాది అయిన, ప్రకృతివల్ల కల్గిన స్వస్వాతంత్ర్యం కారణంగా భగవంతునిపట్ల విముఖతకల్గి, వానివల్ల "అయ్యో! నశించానే !'' అనే భయం కల్గినపుడు, తాను భగవంతునకు చెందినవాడననే అనుసంధానం కల్గి, దానివల్ల ఏర్పడిన దాస్యం చేయాలనే సంకల్పం కాని, ప్రభువుయొక్క ఆభరణాన్ని రక్షించి, తగిన సమయంలో అతనికి ఇచ్చినట్లుగా,



అత్తాలే హతనెన్ఱు భీతి పిఱన్ద వళవిల్, తదీయత్వానుసన్ధానత్తాలే వన్ద దాస్యసఙ్కల్పమాతల్, రాజాభరణత్తై రక్షిత్తువైత్తు ప్రాప్తకాలఙ్గళిలే కొడుక్కుమాపోలే ఆత్మావై ఈశ్వరన్బక్కలిలే సమర్పిక్కై యెన్నుతల్. ఇవై యిరణ్డు మర్థ మన్ఱు. పణ్డే అవనతానవస్తువై అవనతాక ఇశైయు మతొழிయ ఆత్మసమర్పణముమ్ ఆత్మాపహారత్తోడొక్కుమ్.

వ్యా : (నాథ!) అఖిలజగత్స్వామిన్! అవనతానసమ్బన్ధత్తై చ్చొల్లుకిఱతు.

(మమ యదస్తి యోఽహ మస్మి) గుణమాయుమ్, విభూతియాయుమ్, మమతావిషయమాయు ముళ్ళతు యాతొన్ఱు. అతుక్కాశ్రయమాన నాన్ యావనొరువనాకిఱేన్.

(తత్సకలమ్) ఔపాధికమాయుమ్, స్వాభావికమాయు ముళ్ళతెల్లామ్,

ఆత్మను సర్వేశ్వరుని సన్నిధిలో సమర్పించడం - అని కాని చెప్పవచ్చు. కాని, ఇవి రెండు అర్థం కాదు. పూర్వం ఆ పరమాత్మకు చెందిన ఆత్మవస్తువును అతనిదే అని అంగీకరించడం తగును తప్ప, ఆత్మసమర్పణం కూడా ఆత్మాపహారంతో సమానవుతుంది.

వ్యా : (నాథ!) - అఖిలజగత్స్వామీ! జగత్తుకు అంతటికి నాథుడై ఉండడమనే అతనికి మాత్రమే చెందిన సంబంధం చెప్పబడింది.

(మమ యదస్తి యోఽహ మస్మి) - గుణాలుగా, విభూతిగా, నాది అనే భావానికి విషయమై ఉండేదిగా ఏది ఉన్నదో- అది అంతా, ఆ మమతాభావానికి ఆశ్రయమైన, అహం శబ్దవాచ్యుడనైన నేను ఎవడనై ఉన్నానో- అని భావం.

(తత్ సకలమ్) - సోపాధికంగాను, స్వభావసిద్ధంగా ఉన్నది అంతా.

**(మాధవ! తవైవ)** శ్రియఃపతియాయ్, సర్వశేషియాయుళ్ళ ఉన్నుడైయతే. అవధారణత్తాలే అన్యశేషత్వత్తై వ్యావర్తిక్కిఱతు.

**(హి)** "సర్వేషా మేవ లోకానాం పితా మాతా చ మాధవః" (భార-జర-189-58) ఇత్యాది ప్రమాణప్రసిద్ధియై చ్చొల్లుకిఱతు.

**(నాథ! మాధవ!)** సర్వస్వామియాయ్, శ్రియఃపతియాన వునక్కే అనన్యార్హశేషమ్ సకలపదార్థఙ్గళుమెన్రై. "యానే నీ యెన్నుడైమైయుమ్ నీయే" (తి-వాయ్-2-9-9).

**(నియతస్వ మిత్యాది)** సమర్పణమ్ మికైయామ్బుడి జ్ఞానమ్ పిఱన్ద కాలత్తుడన్ భ్రమిత్త కాలత్తుడన్ వాశియఱ "నియతస్వమ్" ఎన్ఱు తెళిన్ద బుద్ధియై యుడైయ నాన్. అథవా కీழ్చ్చొల్ సమర్పణపక్షవ్యావృత్తి.

---

**(మాధవ! తవైవ)** - శ్రియఃపతివి, సర్వశేషివి అయిన నీదే. "ఏవ" అనే అవధారణ తెలిపే శబ్దంతో ఇంకొకరి శేషం అనే విషయం (అన్యశేషత్వం) వ్యావర్తింపబడింది.

**(హి)** - "సర్వేషామేవ లోకానాం పితా మాతా చ మాధవః" (అన్ని లోకాలకు తల్లి, తండ్రి మాధవుడే) ఇత్యాది ప్రమాణప్రసిద్ధి ఇక్కడ సూచింపబడింది.

**(నాథ! మాధవ!)** - సర్వస్వామివి, శ్రియఃపతివి అయిన నీ అన్ని పదార్థాలు అనన్యార్హశేషాలు - అని భావం. **"యానే నీ ఎన్నుడైమైయుమ్ నీయే"** (నేను నీవాడనే, నా సొత్తుకూడా నీవే) అనే ఆழ్వార్లసూక్తి స్మరణీయం.

**(నియతస్వమితి)** - ఆత్మసమర్పణం కూడా అధికమనే రీతిలో జ్ఞానం కల్గిన కాలంతోపాటు, సమర్పణం చేయాలనే భ్రమ కల్గిన కాలంతో పాటు సర్వదా **"నియతస్వమ్"** (ఎల్లప్పుడు సొత్తుగా ఉన్నది) అనే స్పష్టమైన జ్ఞానాన్ని కల్గిన నేను,-అని భావం. లేక, పూర్వం తెలుపబడిన, ఆత్మసమర్పణ పక్షం కంటే వ్యావృత్తి దీనివల్ల తెలుపబడింది.



**(తే కిం ను సమర్పయామి?)** ఇత్తై యుడైయ వునక్కు ఎత్తై సమర్పిప్పేన్? సమర్పణీయ మేతు? సమర్పకరార్ ? సమర్పణీయమాకైక్కు స్వామ్యమిల్లై. సమర్పిక్కైక్కు స్వాతన్త్ర్యమిల్లై. సంసారభీతియాల్ సమర్పిక్కైయుమ్, స్వరూపయథాత్మ్య జ్ఞానత్తాల్ అనుశయిక్కైయు మిరణ్డుమ్, యావన్మోక్ష మనువర్తిక్కక్కడవతు.

**54.శ్లో॥** అవబోధితవా నిమాం యథా
మయి నిత్యాం భవదీయతాం స్వయమ్।
కృపయైతదనన్యభోగ్యతాం
భగవన్భక్తిమపి ప్రయచ్ఛ మే ॥

అవ : **(అవబోధితేత్యాది)** ఆత్మాపహారపర్యాయమాన ఆత్మసమర్పణత్తళవిలే నాన్ నిల్లామైయాలే నిర్హేతుకకృపైయాలే ఇన్ద శేషత్వత్తై

---

**(తే కిం ను సమర్పయామి?)** - ఈ ఆత్మను సొత్తుగా కల నీకు ఏది సమర్పించగలను? సమర్పించదగినది ఏది? సమర్పించేవారెవరు ? సమర్పించడానికి సొత్తు అనేది లేదు. సమర్పించే స్వాతంత్ర్యం లేదు. సంసారభయంవల్ల సమర్పించడం, స్వరూపయాథాత్మ్యజ్ఞానం వల్ల పశ్చాత్తాపాన్ని పొందడం - అనే రెండు మోక్షం కలిగేవరకు అనువర్తిస్తూనే ఉంటాయి (ప్రాప్యత్వం వల్ల ఆత్మసమర్పణం, స్వరూపయాథాత్మ్యజ్ఞానం వల్ల పశ్చాత్తాపం అనువర్తిస్తూనే ఉంటాయి).

**54.శ్లో॥** అవ : **(అవబోధితేత్యాది)** ఆత్మాపహారానికి పర్యాయమైన ఆత్మసమర్పణావధిలో నేను లేనందున, నీవు నీ నిర్హేతుకకృపతో నేను నీకు అనన్యార్హశేషమని నాకు తెల్పినట్లే, ఈ స్వరూపయాథాత్మ్యజ్ఞానం కూడా

యుణర్త్తినాప్పోలే, ఇన్ద జ్ఞానమ్ పురుషార్థోపయోగియామ్బడి ఇన్ద కృపైయాలే స్థానత్రయోదిత పరభక్తియై త్తన్దరుళవేణుమెన్గిఱార్.

వ్యా : **(మయి నిత్యాం భవదీయతామ్)** ఎన్బక్కలిలే నియతైయాన త్వద్విషయశేషత్వత్తై "భవదీయతామ్" ఎన్గైయాలే - అన్యశేషత్వవ్యావృత్తి, "మయి నిత్యామ్" ఎన్గతు - ఇత్తలైయిల్ భగవచ్ఛేషత్వమ్ స్వరూపమెన్గై. "స్వత్వ మాత్మని సఞ్జాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్" (విష్ణుతత్త్వమ్), "ఇమామ్" ఎన్ఱు శేషత్వత్తిలినిమైయాలే కొణ్డాడుకిఱార్.

**(యథా అవబోధితవాన్)** యాతొరుపడి అఱివిక్కప్పట్టేన్.

**(స్వయం కృపయా)** కేవలకృపైయాలే స్వయమ్ - కేవలమ్.

**(ఏతదనన్యభోగ్యతామ్)** ఇతొழிయ వేఱొన్ఱుమ్ నెఞ్జుక్కు

---

పురుషార్థమైన కైంకర్యానికి ఉపయోగపడేటట్లుగా ఈ (నీ)కృపతో స్థానత్రయోదితమైన పరభక్తిని అనుగ్రహించాలి- అని పల్కుతున్నారు.

వ్యా : **(మయి నిత్యాం భవదీయతామ్)-** నాపట్ల నియతమైన, నీకు మాత్రమే శేషమై ఉండే స్థితిని-అని భావం. "నియతామ్" అని అన్నందున జీవునకు అన్యశేషత్వం లేదని తెలుపబడింది. "మయి నిత్యామ్" అని అన్నందున ఆత్మకు భగవచ్ఛేషత్వం స్వరూపగతమైనదని తెలుపబడింది. స్వరూపగతమైనపుడు కదా నిత్యం. సోపాధికమైతే అనిత్యం. **"స్వత్వ మాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్, ఉభయో రేష సంబంధో న పరోభిమతో మమ"** (సొత్తుగా ఉండడం అనేది ఆత్మలో ఉన్నది. స్వామియై ఉండడం పరమాత్మలో ఉన్నది. ఇద్దరికీ ఇదే సంబంధం. వేఱు సంబంధం ఏదీ నాకు అభిమతం కాదు.) అనే ప్రమాణార్థం స్మరణీయం. **"ఇమామ్'** అని శేషత్వంలోని భోగ్యతవల్ల ప్రశంసిస్తూ పల్కుతున్నారు.

**(యథా అవబోధితవాన్)** - ఏవిధంగా తెలియజేయబడ్డానో,

**(స్వయం కృపయా)-** కేవలం కృపతో స్వయం- కేవలం.



విషయమాకాతపడి యిరుక్కుమ్ భోగ్యతైయుడైత్తాన భక్తియై.

**(భగవన్!)** ఫలప్రదానోచితమాన గుణపూర్త్తియై చ్చొల్లుకిఱతు. ఒన్ఱై ఒరుత్తనుక్కు క్కొడుప్పో మెన్ఱాల్ ఒరు తడైయిల్లాత జ్ఞానశక్త్యాదికళాల్ పూర్ణ నెన్గై.

**(భక్తిమపి ప్రయచ్ఛ)** యాతొరుపడి జ్ఞానత్తై త్తన్దాయ్. అప్పడియే భక్తియైయుమ్ తన్దరుళవేణుమ్.

**(మే)** అజ్ఞనాయ్ అశక్తనాయ్, రుచిమాత్రమేయా యిరుక్కిఱ ఎనక్కు.

---

**(ఏతదనన్యభోగ్యతామ్)** - ఇది తప్ప వేఱేమీ మనస్సుకు విషయం (ఇష్టం) కాని రీతిలో ఉండేటట్లు భోగ్యతను కల భక్తిని.

**(భగవన్!)** - ఫలాన్ని ఇవ్వడానికి తగిన భగవంతుని గుణపూర్తి ఈ సంబోధనతో తెలుపబడింది. ఒకడు, ఒక వస్తువును, ఒకనికి ఇస్తున్నాడు అంటే- ఏవిధమైన అడ్డు లేని జ్ఞాన, శక్తులను పూర్ణంగా కలవాడని భావం.

**(భక్తిమపి ప్రయచ్ఛ)** - ఏ రీతిలో జ్ఞానాన్ని అనుగ్రహించావో, ఆ రీతిలోనే భక్తిని కూడా ఇవ్వాలి.

**(మే)** - అజ్ఞుడనై, అశక్తుడనై, నీ కైంకర్యంలో రుచిని మాత్రం కల నాకు - అనిభావం.

**55శ్లో॥** తవ దాస్యసుఖైకసంగినాం
భవనేష్వస్త్వపి కీటజన్మ మే।
ఇతరావసథేషు మా స్మ భూః
అపి మే జన్మ చతుర్ముఖాత్మనా॥

అవ : (తవ దాస్యేతి) భగవత్ప్రసాదత్తాలే లబ్ధమానభక్తి ప్రాచుర్యత్తాలే తచ్ఛేషత్వత్తళవిలే పర్యవసియాతే తదీయశేషత్వత్తై ప్రార్థిక్కిఱార్. ఆఴ్వార్ "కణ్గళ్ శివన్ద" (తి.వాయ్ 8-8) విలే భగవచ్ఛేషత్వత్తై యనుసన్ధిత్తు, "కరుమాణిక్కమలై" (తి.వాయ్ 8-9) యిలే అనన్యార్హశేషత్వత్తై యనుసన్ధిత్తు, ఇతిలినిమైయాలే అవ్వళవిలుమ్ పర్యవసియాతే, నెడుమాఱ్కడిమైయిలే తదీయశేషత్వత్తై అనుసన్ధిత్తాప్పోలేయుమ్, శ్రీరామాయణ-పురుషర్కళిల్ శ్రీశత్రుఘ్నాఴ్వానై ప్పోలేయుమ్, తదీయశేషత్వత్తై ప్రార్థిక్కిఱార్.

వ్యా : (తవ దాస్యసుఖైకసఙ్గినామ్) ఐశ్వర్యకైవల్యసుఖఙ్గళ్ విఘ్నమామ్పడియితే, దాస్యసుఖమిరుప్పతు. "తస్యాన్తరాయో మైత్రేయ!

---

**55శ్లో॥** అవ : భగవదనుగ్రహంవల్ల పొందిన భక్తి ప్రాచుర్యంతో (గొప్ప భక్తితో) భగవచ్ఛేషత్వ పర్యంతంవరకే కాకుండా, భాగవతశేషత్వాన్ని కూడా అర్థిస్తున్నారు. నమ్మాఴ్వార్లు "కణ్గళ్ శివన్దు" అనే దశకంలో ఆత్మయొక్క భగవచ్ఛేషత్వాన్ని అనుసంధించి, తరువాత "కరుమాణిక్కమలై" అనే దశకంలో అనన్యార్హశేషత్వాన్ని అనుసంధించి, దాని భోగ్యతవల్ల, తావన్మాత్రంలో నిలువకుండా, "నెడుమాఱ్కడిమై" అనే తరువాత దశకంలో తదీయ (భాగవత) శేషత్వాన్ని అనుసంధించినట్లుగా, శ్రీరామాయణపురుషులలో శ్రీశత్రుఘ్నాఴ్వాన్‌వలె, తదీయశేషత్వాన్ని ప్రార్థిస్తున్నారు.

వ్యా : (తవ దాస్యసుఖైకసంగినామ్) - ఇహలోకైశ్వర్యం, కైవల్యమనే సుఖాలు కైంకర్యానికి విఘ్నాలు అనేటట్లుగా కదా కైంకర్యంలోని ఆనందం



దేవేన్ద్రత్వాదికం పదమ్" (విష్ణుపు 2-6-40, 41)ఎన్నుమ్, "అ***న్ఱ***తు ప***న్ఱ***నిల్‌ఉ***న్ఱ***తు వీడుయిర్ శె***న్ఱ***తు" (తి-వాయ్-1-2-5) ఎన్నుమ్, "ఇఱుకలిఱప్పు" (తి-వాయ్-4-1-10) ఎన్నుమ్ ఇవై దాస్యరసత్తుక్కు విరోధియాయితే యిరుప్పతు.

(ఏకసఙ్గినామ్) "నిస్తరన్తి మనీషిణః" (జిత-1-4) ఎన్నుమ్, "సోధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" (పురుషసూ) ఎన్నుమ్, సంసారనివృత్తియాల్ వన్ద సుఖముమ్, పరమపదప్రాప్తియాల్ వన్ద సుఖముమ్,

---

ఉంటుంది. "విష్ణుసంస్మరణాత్ క్షీణసమస్తక్లేశసంచయః, ముక్తిం ప్రయాతి స్వర్గాప్తి స్తస్యవిఘ్నోఽనుమీయతే, వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు, తస్యాంతరాయో మైత్రేయ దేవేంద్రత్వాదికం ఫలమ్" (విష్ణువును స్మరించినందున దుఃఖసమూహాలన్నీ తొలగినవాడై, అతడు మోక్షాన్ని పొందుతున్నాడు. స్వర్గాన్ని పొందడంకూడా అతని చేత అంతరాయంగా భావింపబడుతున్నది. మైత్రేయా! జపం, హోమం, అర్చనం మొదలైన వానిలో ఎవని మనస్సు వాసుదేవునిలో లగ్నమై ఉన్నదో, అతనికి దేవేంద్రుడై ఉండే స్థితి మొదలైన ఫలాలు అంతరాయాలుగానే అవుతున్నాయి) అని, "అ***న్ఱ***దు ప***న్ఱ***నిల్ ఉ***న్ఱ***దు వీడుయిర్ శె***న్ఱ***దు" (ప్రకృతి సంబంధం పోయినట్లయితే, ఆత్మ ఆత్మప్రాప్తిరూప మోక్షాన్ని పొందినదే) అని, "ఇరుకలిఱప్పు" (స్వల్పసుఖమైన ఆత్మానుభవమనే ఈ కైవల్యాన్నే మోక్షమని) అనే విధంగా ఇవి అన్నీ (ఇహలోకైశ్వర్యం, ఆత్మప్రాప్తి) కైంకర్యానుభవానికి విరోధిగా కదా ఉంటాయి.

(ఏకసంగినామ్) "సంసారం సాగరం ఘోరమనంతక్లేశభాజనమ్, త్వామేవ శరణం ప్రాప్య నిస్తరంతి మనీషిణః" (సంసారమనేది గొప్ప సముద్రం, భయాన్ని కల్గించేది, అంతులేని క్లేశాలకు నిలయం. అటువంటి సంసారాన్ని నిన్ను ఉపాయంగా పొంది, బుద్ధిమంతులు దానిని దాటుతున్నారు) అని,

దాస్యసుఖతుక్కు ఉపయోగి యెన్నై. "తస్య యజ్ఞవరాహస్య విష్ణో రమితతేజసః, ప్రణామం యేఽపి కుర్వన్తి తేషామపి నమో నమః" (వి-ధ-90-55), "వాసుదేవస్య యే భక్తా శ్శాన్తా స్తద్గతమానసాః తేషాఞ్చ దాసదాస్యం మే భవేజ్జన్మని జన్మని", "అడియారెజ్గోక్కళ్ అవర్క్కే కుడికళాయ్ చ్చెల్లుమ్ నల్ల కోట్పాడు వాయ్క్క" (తి-వాయ్-8-10-10) ఎన్నక్కడవతిఱే.

దాస్యరసమ్ రసిత్తాల్, **(తేషాం భవనేషు కీటజన్మ మేఽప్యస్తు)** అవర్కళ్ తిరువడికళిలడిమై శెయ్యవేణ్డా. అవర్కళ్ తిరుమాళికైకళిల్

"విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహమేవ చ, సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" (ఎవడు గొప్ప జ్ఞానాన్ని సారధిగా, మనస్సు పగ్గాలుగా కల్గి ఉన్నాడో, అతడు సంసారానికి ఆవలితీరమైన విష్ణువుయొక్క పరమపదాన్ని పొందుతున్నాడు.) అని సంసారనివృత్తివల్ల కల్గిన సుఖం, పరమపదప్రాప్తి వల్ల కల్గిన సుఖం భగవద్దాస్య సుఖానికి అంతరాయాలని భావం. "తస్య యస్య వరాహస్య విష్ణో రమిత తేజసః, ప్రణామం యేఽపి కుర్వంతి తేషామపి నమో నమః" (యజ్ఞవరాహస్వామి, అంతు లేని తేజస్సును కలవాడైన ఆ విష్ణువుకు ఎవరు ఒకసారి నమస్కరిస్తున్నారో, వారికి పలుమార్లు నమస్కారం) అని, "వాసుదేవస్య యే భక్తాః శాంతాస్తద్గత మానసాః, తేషాం చ దాసదాసస్య మే భవేజ్జన్మని జన్మని" (శాంతులై, భగవంతుని పట్ల మనస్సును లగ్నం చేసినవారై ఉండే వాసుదేవ భక్తులు ఎవరున్నారో, ఈ ఆత్మవస్తువు, వారి దాసులకు దాసుడుగా ప్రతిజన్మలోను కావాలి) అని, "అడియారడియార్ నమ్కోక్కళ్ అవర్క్కే కుడికళాయ్ చ్చెల్లుమ్ నల్లకోట్పాడు వాయ్క్క" (భగవద్దాసులకు దాసులమై వర్తించే మంచి పురుషార్థం. అద్వితీయుడనైన నాకు ప్రతికల్పంలోను ప్రతియుగంలో కలుగుగాక) అని చెప్పబడుతున్నదికదా!

భగవద్దాస్యం ఇష్టపడితే, **(తేషాం భవనేషు కీట జన్మ మేఽప్యస్తు)** వారి (భగవద్భక్తుల) శ్రీచరణకైంకర్యం చేయనక్కరలేదు, వారి



ఒరుకీటమాయ్ జనిక్కుమతాకిలు ముణ్డాకవేణుమ్. అపిశబ్దమ్ - అవధారణత్తిలేయాయ్, కీటజన్మ వే ఉణ్డాకవేణువెన్నువామ్. మనుష్యాదికజన్మజ్గళై ఆశైప్పడాతొழిన్దతు దేశాన్తరభ్రమణ సంభావనైయాలే ఉత్పత్తిస్థితిలయజ్గళ్ అజ్గేయాక క్కిడైయాతెన్నుమత్తాలే.

**(మే)** ఎల్లారు ముత్కృష్ట జన్మజ్గళైయన్త్రో ఆశైప్పడువతు- ఎన్న, తన్దాముకన్దతన్త్రో? పురుషార్థమ్; ఎనక్కు ఇతువే పెఱవేణుమెన్నై.

**(ఇతరావసథేషు)** దాస్యరసమఱియాతే ఎనక్కెన్ను-మవర్కళిరుప్పిడత్తిలే.

**(చతుర్ముఖాత్మనా జన్మాఽపి వే మా స్మ భూత్)** చతుర్ముఖరూపేణ వరుమ్ జన్మముమ్ ఎనక్కుణ్డావతన్రు; చతుర్ముఖాది

తిరుమాళిగలలో ఒక కీటకంగా జన్మించే స్థితి అయినా నాకు సిద్ధించాలి. ఇక్కడ "అపి" శబ్దం అవధారణార్థకంగా గ్రహించి, కీటజన్మమే కలగాలి - అని ప్రార్థిస్తున్నట్లు చెప్పవచ్చు. మనుష్యాది జన్మలను ఎందుకు ఆశపడలేదు? అంటే, మానవులైతే దేశాంతరాలకు వెళ్ళే అవకాశం ఉన్నందున జన్మస్థితి నాశాలు భాగవతుల తిరుమాళిగలలో సంభవించదు - అనే అభిప్రాయంతో ఈ విధంగా ఆశపడలేదు.

**(మే)** - అందఱు గొప్ప జన్మలు కలగాలని కదా ఆశపడతారు? అంటే, ఎవరికైనా తాము అభిమానించినదే కదా పురుషార్థం అవుతుంది. ఇదే నాకు అభిమతం, కనుక ఇదే కలగాలి - అని భావం.

**(ఇతరావసథేషు)** - భగవద్దాస్యంలోని రుచిని తెలియక, "నాకు" అని భావించేవారుండే చోట,

**(చతుర్ముఖాత్మనా జన్మాఽపి మే మా స్మభూత్)** - చతుర్ముఖుని రూపంలో కలిగే జన్మ నాకు కల్గుతుందని అర్థం కాదు, చతుర్ముఖాదిజన్మం

జన్మమ్ లౌకికర్క్కు శ్లాఘ్యమానాలుమ్ దాస్యరుచియై యుడైయ ఎనక్కు వేణ్డా ఎన్గిఱార్. అన్వయత్తిలుమ్, వ్యతిరేకత్తిలుమ్ ఇరణ్డిలుముణ్డాన నిర్బన్ధమ్ తోఱ్ఱవిరుక్కలామెన్గిఱార్.

56.శ్లో॥ సకృత్త్వదాకార విలోకనాశయా
తృణీకృతానుత్తమ-భుక్తిముక్తిభిః ।
మహాత్మభిర్మా మవలోక్యతాం నయ
క్షణేఽపి తే యద్విరహోఽతిదుస్సహః॥

అవ : (సకృదితి) వైష్ణవగృహత్తిల్ పిఱక్కుమ్ పిఱప్పాల్ వన్ద ఏఱ్ఱమెల్లామ్ వేణుమో, అవర్కళ్ కణ్డాల్ ఉపేక్షియాతే నమ్ముడైయవనెన్ఱు విశేషకటాక్షమ్ పణ్ణుకైక్కు అర్హనామ్పడి పణ్ణియరుళవేణుమెన్గిఱార్.

వ్యా : (సకృత్త్వదాకారవిలోకనాశయా) "సదా పశ్యన్తి సూరయః" (సామోత్తర-18-2-4) ఎన్గిఱపడియే సదా దర్శనమ్ పణ్ణవేణ్డి యిరుక్క

నాకు వద్దు - అని ప్రార్థిస్తున్నారు. అన్వయక్రమంలో, వ్యతిరేకక్రమంలో- రెండిటిలోను తమకు ఉండే నిర్బంధం స్ఫురించేటట్లు ఈవిధంగా పల్కుతున్నారు. (భాగవతుల గృహాలతో కీటజన్మే కలగాలనేది అన్వయక్రమంలో నిర్బంధం, ఇతరుల గృహాలలో చతుర్ముఖ జన్మ కల్గినా వద్దు - అనేది వ్యతిరేకక్రమంలోని నిర్బంధం).

56.శ్లో॥ అవ : (సకృదితి) - వైష్ణవ గృహంలో కలిగే జన్మవల్ల కలిగే గొప్పతనం కావాలా? వారు నన్ను చూచినపుడు నన్ను ఉపేక్షించకుండా 'వీడు మనవాడు' అని అభిమానించి విశేషంగా కటాక్షించడానికి యోగ్యుడను అయ్యేటట్లు నన్ను అనుగ్రహించు - అని పల్కుతున్నారు.

వ్యా : (సకృత్త్వదాకారవిలోకనాశయా) "తద్విష్ణోః పరమం పదం సదా



"సకృత్" ఎన్గిఱతు - సత్తై ధరిక్కైక్కు ఒరు కాలమైయుమ్, భోగమోక్షఙ్గళై ఉపేక్షిక్కైక్కుమ్ ఒరు కాలమైయుమెన్గైక్కాక. "ఒరు నాళ్ కాణవారాయ్" (తి-వాయ్) ఎన్ఱితే విడాయ్త్తవర్ వార్తై. "నమ్మై యొరుకాల్ కాట్టినడన్దాల్ నాఙ్గళుయ్యోమో?" (పె.తిరు 4-9-1)

(త్వదాకారవిలోకన) స్వరూపత్తళవిలుమ్, తదాశ్రయమాన గుణత్తళవిలుమ్ పర్యవసియాతే ఉభయత్తుక్కుమ్ ప్రకాశమాన విగ్రహత్తళవిలే అవగాహిత్తవర్కళ్.

(విలోకన) "సుగాఢం పరిషస్వజే" (వి-పు-5-18-2) ఎన్నుమళవెల్లామ్

పశ్యంతి సూరయః" (విష్ణువుయొక్క ఆపరమపదాన్ని నిత్యసూరులు సదా దర్శిస్తారు) అనే రీతిలో సదా దర్శనం చేయవలసి ఉండగా, "సకృత్" అని అనడం, సత్తను ధరించడానికి (ప్రాణాలను నిలుపుకోవడానికి) ఒక పర్యాయం కటాక్షిస్తే చాలు - అని తెలుపడంకోసం. (అంతేకాక) భోగ, మోక్షాలను ఉపేక్షించడానికి ఒక పర్యాయం చాలు - అని సూచించడంకోసం - అని చెప్పవచ్చు. "తామరైనీళ్ వాశత్తడమ్ పోల్ వరువానే ఒరునాళ్ కాణ వారాయే" (తామరపూలను కల, గొప్ప సువాసనను కల, తటాకంవలె వచ్చేవాడా! ఒకనాడు నేను సేవించేటట్లు వేంచేయాలి) అని కదా ఆర్తిని పొందినవారు పల్కిన సూక్తి. "నమ్మై ఒరుకాల్కాట్టి నడన్దాల్ నాఙ్గళ్ ఉయ్యోమే" (తమను ఒకసారి మాకంటికి కన్పించేటట్లు నడిస్తే మేము ఉజ్జీవించమా?) ఇత్యాది దివ్యసూరిసూక్తులు ఇక్కడ స్మరణీయాలు.

(త్వదాకారవిలోకన) - స్వరూపదర్శనం వరకుగాని, ఆ స్వరూపాన్ని ఆశ్రయంగా కల గుణాల దర్శనం వరకు గాని పర్యవసించకుండా, ఈ రెండిటిని ప్రకాశింపజేసే దివ్యమంగళవిగ్రహదర్శనం వరకు కొనసాగేటట్లు అవగాహించినవారు.

(విలోకన) - "సోఽప్యేనం ధ్వజవజ్రాబ్జకృతచిహ్నేన పాణినా,

**వేణ్డా, ఒరుకాల్ కాణ వమైయుమ్.**

**(ఆశయా తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః) కాణవేణ్డా. కాణవేణు మెన్న మాశైతానే తృణీకరిప్పిక్కుమ్, అనుత్తమభుక్తిః - ముక్తిః పరమపురుషార్థ లక్షణమోక్షమ్. "అలమద్య హి భుక్తైర్నః పరమార్థై రలఙ్చనః, యథా పశ్యేమ నిర్యాంతం రామం రాజ్యే ప్రతిష్ఠితమ్" (రా-అ), "త్వయాఽపి ప్రాప్త మైశ్వర్యమ్" (భార), "ఏతే వై నిరయా స్తాత! స్థానస్య పరమాత్మనః" (విష్ణుధర్మమ్ 2-14).**

---

**సంస్పృశ్యాకృష్య చ ప్రీత్యా సుగాఢం పరిష్వజే"** (ఆ శ్రీకృష్ణుడు ఈ అక్రూరుని, ధ్వజం, వజ్రం, తామరపూవు - అనే వీని ముద్రలచే అంకితమైన తన శ్రీహస్తంతో తాకి, దగ్గరకు లాగి, ప్రీతితో చక్కగా కౌగలించుకొన్నాడు) అనే పర్యంతం అక్కరలేదు. ఒకసారి కటాక్షిస్తే చాలు.

**(ఆశయా తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః)** - దర్శించనక్కరలేదు, దర్శించాలనే ఆశయే మిగిలినవానిని తృణీకరింపజేస్తుంది. అనుత్తమ భుక్తి అంటే ముక్తి. అంటే పరమపురుషార్థమనబడే మోక్షం. **"అల మద్య హి భుక్తైర్నః పరమార్థై రలం చ నః, యథా పశ్యేమ నిర్యాంతం రామం రాజ్యే ప్రతిష్ఠితమ్, తతో హి నః ప్రియతరం నాన్యత్ కించిద్భవిష్యతి"** (భుజించడం మొదలైన ఇహలోక భోగాలు అక్కరలేదు. మోక్షం మొదలైన గొప్ప భోగాలుకూడా అక్కర లేదు. రాజ్యంలో అభిషేకింపబడ్డవాడు, ఊరేగింపుగా వచ్చేవాడు అయిన శ్రీరాముని దర్శించడం కంటే గొప్ప ప్రియమైనది మనకు ఇంకొకటి లేదు), **"త్వమింద్ర స్సత్యమే వైతత్ దేవస్త్రిభువనేశ్వరః, త్వయాఽపి ప్రాప్తమైశ్వర్యం యత స్తం తోషయామ్యహమ్"** (నీవు ఇంద్రుడవే. ఇది నిజమే. నీవు దేవుడవే. ముల్లోకాలకు ఈశ్వరుడవే. అయితే, నీవు కూడా ఎవరివల్ల ఐశ్వర్యాన్ని పొందావో, అతనినే నేను ఆరాధిస్తాను) **"ఏతే వై నిరయా స్తాత! స్థానస్య పరమాత్మనః"** (నాయనా! పరమాత్మ స్థానంతో పోల్చిచూచినపుడు ఈ



**(మహాత్మభిః) "మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః" (గీ-9-13), "స మహాత్మా సుదుర్లభః" (గీ-3-19)ఎన్ఱుమ్, "పేరాళన్ పేరోతుమ్ పెరియోర్" (తి-మొ) ఎన్ఱుమ్ ఈశ్వరన్ఱానుమ్, ఆழ్వార్కళుజ్గాడ క్కవిపాడుకిఱవర్కళాలే.**

**(మామ్) పురుషార్థత్తిన్ మేలెల్లైయిలే రుచియుడైయ ఎన్నై.**

**(అవలోక్యతామ్) అవలోకన విషయనామ్బడి.**

**(నయ) సర్వశక్తియాన దేవర్ నిర్వహిక్కవేణుమ్, నమ్బుక్కలోழియ నమ్ముడైయార్పక్కల్, "కీటజన్మ మేఽప్యస్తు" (స్తోత్రరత్నమ్) ఎన్ఱుమ్,**

---

స్వర్గాదులన్నీ నరకాలే) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(మహాత్మభిః) - "మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతిమాస్థితాః, భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్"** (అర్జునా! దేవస్వభావంతో కూడిన మహాత్ములయితే, సకలభూతాలకు కారణమైనవాడను, ఏకొఱత లేనివాడను అయిన నన్ను తెలిసికొని, వేఱు దేనిలోను మనస్సును ప్రవర్తింపజేయనివారై ఉపాసిస్తాడు) **"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవ స్సర్వ మితి స మహాత్మాసుదుర్లభః"** (పలుజన్మలకు పిమ్మట జ్ఞానాన్ని పొందినవాడు "వాసుదేవుడే నాకు అన్నీ'' అని నన్ను ఉపాసిస్తాడు. అటువంటి మహాత్ముడు చాలా దుర్లభుడు) అని, **"పేరాళన్ పేరోదుమ్ పెరియోర్"** (భగవంతుని నామాలను అనుసంధించే మహాత్ములు) అని ఈశ్వరుడు, ఆழ్వార్లు కూడా స్తుతించేవారిచే - అని భావం.

**(మామ్)** - పురుషార్థం యొక్క పరమావధిలో రుచిని కల నన్ను,

**(అవలోక్యతామ్)** - కటాక్షానికి విషయం అయేటట్లు,

**(నయ)**- సర్వశక్తివి అయిన నీవు నిర్వహించాలి (చేయాలి). "నా విషయంలో తప్ప, నా భక్తుల విషయంలో **"కీటజన్మ మేఽస్తు"** అని,

"అవలోక్యతాం నయ" (స్తోత్రరత్నమ్) ఎన్టుమ్ అత్యాదరత్తై పణ్ణుకిఱతెత్తాలే యెన్న; సాపేక్షనాన నాన్ ఆదరిక్కైక్కు హేతుశొల్లుకిఱేన్. స్వతః పూర్ణరానదేవరుక్కు అవంకళుడైయ విశ్లేషమ్ అసహ్యమాయిరుక్కిఱ వితుక్కు హేతు అరుళిచ్చెయ్య వేణుమెన్గిఱార్. స్వతః పూర్ణనాయ్ అవాప్తసమస్తకామనాన దేవరుక్కు.

(క్షణేఽపి యద్విరహోఽతిదుస్సహః) క్షణమాత్రత్తిలుమ్ యాతొత్తరుడైయ విరహమానతు దుస్సహమాత్రమన్టు; అతి దుస్సహమెన్టై. "చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి" (రా), "న జీవేయం క్షణమపి వినా తామసితేక్షణామ్" (రా-సు-66-10), "యద్వినా భరతంత్వాన్తు శత్రుఘ్నం

"అవలోక్యతాం నయ" అని అత్యాదరాన్ని చూపిస్తున్నారే! ఎందువల్ల? - అని భగవానుడు అనగా, "అపేక్షను కలవాడనైన (పూర్ణుడనుకాని) నేను, ఆదరించడానికి హేతువును తెల్పుతాను. కాని, స్వతఃపూర్ణుడవైన నీకు వారి విశ్లేషం సహించరానిదిగా ఉండడానికి హేతువు ఏది? ముందు దానిని గూర్చి పల్కు" అని అంటున్నారు.

(క్షణేఽపి యద్విరహోఽతిదుస్సహః) - సహజంగానే పూర్ణుడవై, అవాప్తసమస్తకాముడవైన నీకు, క్షణమాత్రం దుస్సహం మాత్రమే కాదు, అతిదుస్సహం - అని భావం. "చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి, న జీవేయం క్షణమపి వినా తామసితేక్షణామ్" (సీత ఒకనెల కాలం జీవించిఉంటే, చిరకాలం జీవించినట్లే, నేనయితే నల్లని కన్నులను కల ఆమెను వీడి క్షణమైనా జీవించలేను) అని, "యద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద, భవేన్మమ సుఖం కించిత్ భస్మసాత్కురుతాం శిఖీ!" (గొప్పతనాన్ని కల్గించేవాడా! భరతుని, నిన్ను, శత్రుఘ్నుని కూడా లేకుండా, ఏదయినా ఒక సుఖం నాకు కల్గితే, దానిని అగ్ని భస్మంచేయుగాక) "సంస్మరామ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ, హృద్యాన్యమృతకల్పాని,



చాపి మానద!" (రా-అ-97-8), "సంస్మరామ్యస్య హక్యాని" (రా-అ-16-39), "జ్ఞానీ త్వాత్మైవమే మతమ్" (గీ-7-17), "మమ ప్రాణా హి పాణ్డవాః" (భార-ఉద్యో-90-32), "కిం కార్యం సీతయా మమ" (రా-యు-41-4).

57శ్లో॥ న దేహం న ప్రాణాన్ న చ సుఖమశేషాభిలషితం
న చాత్మానం నాన్యత్ కిమపి తవ శేషత్వ విభవాత్।
బహిర్భూతం నాథ! క్షణమపి సహే యాతు శతధా
వినాశం తత్ సత్యం మధుమథన! విజ్ఞాపనమిదం॥

అవ : (న దేహమితి) కీழ் శేషత్వకాష్ఠైయాన తదీయశేషత్వత్తై యనుసన్ధిత్తార్. ఇతిల్ శేషత్వత్తుక్కు పుఱమ్బానవట్రిల్ అరుచియైచ్చొల్లి,

మనః ప్రహ్లాదనాని చ" (ప్రియమైనవి, మధురమైనవి, హృదయంనుండి వెలువడినవి, అమృతం వంటివి, మనస్సుకు ఆనందాన్ని ఇచ్చేవి అయిన ఆ భరతుని మాటలను నేను స్మరిస్తున్నాను) "ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" (నావద్దనుండి పురుషార్థాలను వేడి పొందే వీరంతా ఉదారులు. జ్ఞాని అయితే నాకే ఆత్మ - అని నా అభిప్రాయం), "మమ ప్రాణా హి పాండవాః" (పాండవులు నాప్రాణాలు) "త్వయి కించిత్ సమాపన్నే కిం కార్యం సీతయా మమ?, భరతేన మహాబాహో! లక్ష్మణేన చ సీతయా, శత్రుఘ్నే చ శత్రుఘ్న! స్వశరీరేణ వా పునః" (దీర్ఘబాహువులను కల సుగ్రీవా! నీకేదయినా అవమానం జరిగితే, సీతతో నాకేమి పని? భరతునితో, లక్ష్మణునితో శత్రుఘ్నునితో ఏమి ప్రయోజనం? శత్రువులను నశింపజేసేవాడా! నా శరీరంతో అయినా ఏమి ప్రయోజనం?) ఇత్యాది ప్రమాణాలు అనుసంధేయాలు.

57శ్లో॥ అవ : (న దేహమితి) - ఇంతకు ముందు భగవచ్ఛేషత్వానికి పరమావధి అయిన భాగవతశేషత్వాన్ని అనుసంధించారు. ఇందులో

అవ*ఱ్ఱ*జాత్తవిర్త్తన్దరుళ వేణుమెన్గిఱార్.

వ్యా : **(న దేహమ్)** అహమభిమానత్తుక్కర్హమామ్బడి అన్తరఙ్గమాన శరీరత్తైయుమ్, దేవరుడైయ శేషత్వతుక్కు పుఱమ్బాకిల్ వేణ్డేన్.

**(న ప్రాణాన్)** దేహాదికళుక్కు ధారకమాన ప్రాణఙ్గళైయుమ్ శేషత్వబహిర్భూతమాకిల్ వేణ్డేన్.

**(న చ సుఖమ్)** దేహాదికళైయుమ్, ప్రాణఙ్గళైయుమ్ ఆదరిప్పతు సుఖార్థమాకవిఱే. అన్ద సుఖముమ్ వేణ్డా. సుఖమెన్ఱు మోక్షసుఖత్తై చ్చొల్లవుమామ్.

**(అశేషాభిలషితం సుఖమ్)** ఎల్లారుమాదరిక్కుమ్ సుఖమెన్ఱుమామ్. సుఖమెన్ఱాల్, దేవాదిసకలజన్తుక్కళుమ్ ఆదరిక్కుమిఱే. సుఖమెన్ఱు పిరియ చ్చొన్నపోతు "అశేషాభిలషితం నాన్యత్కిమపి" ఎన్ఱు మేలే కూట్టువతు.

---

భగవచ్ఛేషత్వానికి ఉపయోగపడని వాని పట్ల తమ అరుచిని పల్కుతూ, వాటిని పోగొట్టాలని పల్కుతున్నారు.

వ్యా : **(న దేహమ్)** - "నేను" అని అభిమానించడానికి అర్హమైన రీతిలో ఉండే అంతరంగమైన శరీరం దేవరవారి శేషత్వానికి నోచుకోకపోతే (బాహ్యమైతే) దానిని కోరను.

**(న ప్రాణాన్)** - దేహాదులకు ధారకాలైన (దేహాదులను ధరించే) ప్రాణాలను, శేషత్వానికి బాహ్యమైతే, కోరను.

**(న చ సుఖమ్)** - దేహాదులను, ప్రాణాలను ఆదరించడం సుఖం కోసమేకదా! ఆ సుఖం కూడా అక్కరలేదు. ఇక్కడ సుఖశబ్దం మోక్షసుఖాన్ని తెల్పుతున్నదని చెప్పవచ్చు.

**(అశేషాభిలషితమ్ సుఖమ్)** - అందరు ఆదరించే సుఖమని చెప్పవచ్చు. సుఖాన్ని దేవాది సకల ప్రాణులు ఆదరిస్తాయి కదా! **"సుఖ"** మనే పదాన్ని వ్యస్తంగా గ్రహించినపుడు, **"అశేషాభిలషితం నాన్యత్ కిమపి"** అని



**(నాన్యత్కిమపి)** ఎన్గిఱతు- పుత్రమిత్రకళత్రఙ్గళెన్గిఱతు.

**(న చాత్మానమ్)** కీ*ழ்*చ్చొన్న సకలత్తుక్కు మాశ్రయమాయ్, జ్ఞాతృత్వకర్తృత్వభోక్తృత్వఙ్గళై యుడైయనాన ఆత్మావై.

**(తవ శేషత్వవిభవాద్బహిర్భూతమ్)** ప్రాప్తవిషయత్తిల్ శేషత్వమాకిఱ పెరుమైక్కు పుఱమ్బానతై అన్తర్భూతమానవన్ఱు ఎల్లామ్ ఉపాదేయమెన్ఱై.

**(నాథ!)** శేషత్వత్తుక్కు పుఱమ్బానవై అసహ్యామాకైక్కడియాన అవర్జనీయసమ్బన్ధత్తై చ్చొల్లుకిఱతు.

**(క్షణమపి న సహే)** క్షణకాలముమ్ సహిక్కిఱిలేన్. కామినిక్కు భర్తృవిరహత్తిల్ చన్దనకుసుమాదికళ్ అసహ్యామామాపోలే; "మాఱాళన్ కవరాత

---

పైకి అన్వయించాలి.

**(నాన్యత్కిమపి)** - అనే ఈ ప్రయోగానికి పుత్రమిత్ర కళత్రాలని అర్థం.

**(న చాత్మానమ్)** - పూర్వం తెల్పిన అన్నిటికి ఆశ్రయమై, జ్ఞాతృత్వ కర్తృత్వ భోక్తృత్వాలను కల ఆత్మను కూడా కోరను.

**(తవ శేషత్వవిభవాద్బహిర్భూతమ్)** - ప్రాప్తవిషయంలో- స్వరూపానికి తగిన భగవద్విషయంలో- శేషత్వమనే గొప్పతనానికి దూరమైనది అంతర్భూతం కానపుడు, అన్నీ ఉపాదేయాలే - అని భావం.

**(నాథ)** - శేషత్వానికి బాహ్యాలైనవి (విషయం కానివి) సహించరానివిగా కావడానికి మూలమైన, అవర్జనీయమైన (విడువడానికి సాధ్యం కానిదైన) సంబంధాన్ని ఈ సంబోధన తెల్పుతున్నది.

**(క్షణమపి న సహే)** - క్షణకాలం అయినా సహించలేను. కామినికి (భర్తపట్ల కోరికను కల స్త్రీకి) భర్తవిరహం కల్గినపుడు, చందనం, పూలు

**మణిమామై కుఱైవిలమే" (తి-వాయ్-4-8-1), "ఉడమ్బినాల్ కుఱైవిలమే" (తి-వాయ్-4-8-9), "ఉయిరినాల్ కుఱైవిలమే" (తి-వాయ్-4-8-10) ఎన్నుమాపోలే. "న దేవలోకాక్రమణమ్" (రా-అ-31-5) ఇతు-ఇళైయ పెరుమాళుడైయ ఏఱాళుమిఱైయోన్. "న హి మే జీవితేనార్థః" (రా-సు-26-5) ఇతు పిరాట్టి ఏఱాళుమిఱైయోన్.**

**(యాతు శతధా వినాశమ్) ఉరుమాయ్న్దు పోకవేణుమ్, అడిమైక్కు పుఱమ్బానవై అసహ్యమానాలుమ్, పోక్కుకై ఈశ్వరకృత్యమ్. అనుకూల్యజ్ఞళుణ్డానాలుమ్ ఉణ్డాక్కుకై ఈశ్వరకృత్యమ్.**

---

మొదలైన భోగ్యవస్తువులు సహించరానివి అయినట్లే, ఇవి అన్నీ అసహ్యాలే. **"మాఱాళన్ కవరాత మణిమామై కుఱైవిలమే"** (బలిష్ఠుడైన స్వామి ఆదరించని లావణ్యం వల్ల మాకు ఏ ప్రయోజనం లేదు) అని, **"యోగణైవాన్ కవరాద ఉడమ్బినాల్ కుఱైవిలమే"** (యోగనిద్రను పొందిన స్వామి ఆశించని దేహంతో మాకు ఏప్రయోజనం లేదు) అని, **"శడైముడియన్ తనియొరుకూర్ అమర్న్దుఱైయుమ్ ఉడమ్బుడైయాన్ కవరాద ఉయిరినాల్ కుఱైవిలమే"** (జటలను శిరస్సులోకల రుద్రుడు వేఱుగా ఒక భాగంలో అమరిఉండే శరీరాన్ని కల స్వామి ఆదరించని ఆత్మతో మాకు పని లేదు) అనే రీతిలో **"న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా"** (నిత్యసూరులు నివసించే లోకమైన శ్రీవైకుంఠంలో ఉజ్జీవనాన్ని, కైవల్యాన్ని లోకాలలోఉండే ఐశ్వర్యాన్ని నిన్ను విశ్లేషించిన నేను అభిలషించను) అని లక్ష్మణుడు పలికాడు. ఇది లక్ష్మణుని **"ఏఱాళు మిఱైయోన్"** (**"ఏఱాళు మిఱైయోన్"** దశకంలో ఆఴ్వార్లు భగవచ్ఛేషత్వానికి ఉపయోగపడని ఆత్మ-ఆత్మీయాలను తమకు అక్కరలేదని అన్నట్లే, ఈశ్లోకంలో కూడా లక్ష్మణుడు శ్రీరాముని శేషత్వానికి బహిర్భూతాలను తాను ఆదరించనని అన్నాడు - అని ఈసూక్తి తాత్పర్యం).



**(తత్సత్యమ్) - ఇతు లోకత్తిల్ కేట్టఱివతొన్ఱన్ఱు, మెయ్యాకక్కూడుమో? ఎన్న; ఇతు అహృదయమాక చ్చొన్నతన్ఱు; మెయ్.**

**(మధుమథన!) తిరుమున్బే పొయ్‌శొన్నేనాకిల్ ఉమక్కుప్పొయ్యానాన మధుపట్టతు పడుకిఱేన్. శేషత్వత్తుక్కు పుఱమ్బానవఴ్ఱై, మధువై ప్పోక్కినాప్పోలే పోక్కియరుళవేణు మెన్నవుమామ్.**

**(ఇదం విజ్ఞాపనం తత్సత్యమ్) ప్రాప్యాపేక్షైయిల్ పుఱై యుణ్డాకిలుమ్ విరోధివర్గత్తిల్ అరుచియిల్ పొయ్యిల్లై. "మధుమథనవిజ్ఞాపన మిదమ్" ఎన్ఱు పాఠమాకవుమామ్, అఱివిక్కుమిత్తనై యొఴియ నియమిక్కవొణ్ణాతెన్ఱై.**

---

**(యాతు శతధా)** - రూపు లేకుండా పోవాలి. దాస్యానికి ఉపయోగపడనివి అసహ్యమైనా, వాటిని పోగొట్టడమనేది భగవంతుని పని. అనుకూలంగా ఉండేవి ఆదరణీయాలయినా, వాటిని సృష్టించడం ఈశ్వరకృత్యం.

**(తత్ సత్యమ్)** - "ఈ మాట లోకంలో విని తెలిసినది కాదు. (ఎక్కడా వినలేదు) ఇది నిజమవుతుందా?'' అని అంటే, ఇది అహృదయంగా పల్కినది కాదు. సత్యం.

**(మధుమథన!)** - నీ సమక్షంలో నేను అసత్యం పల్కి ఉంటే, నీకు శత్రువైన మధువు అనే అసురుడు పడిన పాట్లు పడగలను. నీ శేషత్వానికి పనికిరానివాడైన మధువును లేకుండా చేసినట్లుగా, పోగొట్టాలని దీని తాత్పర్యం.

**(ఇదం విజ్ఞాపనం తత్ సత్యమ్)** - ప్రాప్యాపేక్షలో దోషం ఉన్నా, విరోధివర్గం పట్ల అరుచిలో అసత్యం లేదు. "మధుమథన విజ్ఞాపనమిదమ్' అనే పాఠాంతరం కూడా ఉన్నది. తెలుపడం తప్ప (విజ్ఞాపించడం తప్ప) నియమించడం సాధ్యం కాదని భావం.

**58.శ్లో ॥ దురన్తస్యానాదే రపరిహరణీయస్య మహతో**
**నిహీనాచారోఽహం నృపశు రశుభస్యాస్పదమపి ।**
**దయాసిన్ధో! బన్ధో! నిరవధిక వాత్సల్యజలధే!**
**తవ స్మారంస్మారం గుణగణ మితీచ్ఛామి గతభీః ॥**

అవ : **(దురన్తస్యేతి)** నిగ్రహహేతువాన భగవదపచారాద్యశుభజ్గళ్ సఞ్చరిక్కిఱ సంసారత్తిలే కైఙ్కర్యవిరోధికళ్ అసహ్యమామ్బడి అతిలే అరుచి పిఱన్దు, అవైకళై ప్పోక్కిత్తన్దరుళ వేణుమెన్డు యోగికళుక్కుమ్ దుర్లభమాన విత్తై అపేక్షిప్పారుణ్డావతే! ఎన్న; అన్ద అశుభజ్గళుక్కుమ్ అవధియిన్డిక్కే యిరానిఱ్క, అవైకళై ప్పరిహరిక్కవల్ల దేవర్ అపరిచ్ఛిన్న గుణజ్గళై నినైత్తు అపేక్షిక్కిఱేన్- ఎన్గిఱార్.

వ్యా : **(దురన్తస్య)** ముడివిన్డిక్కే యిరుక్కుమశుభమ్. ప్రాయశ్చిత్తత్తాలాతల్, అనుభవత్తాలతల్, ఉత్తారకోటి కాణవొణ్ణాతిరుక్కై.

---

**58.శ్లో ॥అవ : (దురంతస్యేతి)** - భగవన్నిగ్రహానికి హేతువులైన భగవదపచార-భాగవతాపచార-అసహ్యాపచారాదులైన అమంగళాలు వర్తించే ఈ సంసారంలో కైంకర్య విరోధులు సహించలేనివిగా వాటిలో అరుచిని కలిగించి అనుగ్రహించాలని పల్కుతూ, యోగులకు కూడా లభించడానికి కష్టమైన దీనిని అపేక్షించేవారున్నారా! ఆహా! - అని స్వామి పలుకగా, ఆ భగవదపచారాది అశుభాలు కూడా లెక్కలేకుండా ఉన్నప్పటికీ, వాటిని పోగొట్టగల్గిన దేవరవారి అపరిచ్ఛిన్నాలైన (ఇంత అని లెక్క కట్టడానికి సాధ్యం కాని) కల్యాణగుణాలను భావించి, వానిని అపేక్షిస్తున్నాను - అని పల్కుతున్నారు.

వ్యా : **(దురంతస్య)** - అంతు లేకుండా ఉండే అశుభాలు. ప్రాయశ్చిత్తం వల్ల కాని, అనుభవంతో కాని అంతాన్ని చూడడం సాధ్యం



దుర్విపాకమాయిరుక్కుమతు- ఎన్నవుమామ్. ఉదర్కత్తిల్ నరకగర్భవాసజ్గళై ఫలిప్పిక్కై.

**(అనాదేః) "మున్శెయ్త ముఴువినై" (తి-వాయ్-1-4-2)** ఎన్నక్కడవతిఱే.

**(అపరిహరణీయస్య)** సర్వశక్తియాన దేవర్క్కుమ్ పిఱ్కాలిక్కుమ్బడియా యిరుక్కై.

**(మహతః)** సఙ్ఖ్యావధిరహితమాయిరుక్కై. కాలతత్త్వ ముళ్ళతనైయుమ్ అనుభవియానిన్డాలుమ్ అవధి కాణవొణ్ణాతిరుక్కైయుమ్, ఇప్పడిప్పట్ట అశుభత్తుక్కు త్తొకైయిన్డిక్కే యిరుక్కైయుమ్. "యద్బ్రహ్మ-కల్పనియమానుభవేఽప్యనాశ్యమ్" (వై-స్త 60) అణుపరిమాణనాన చేతనన్ ఇవఱ్ఱై యెల్లామ్ శెయ్తానెన్డు విస్మయప్పడుమ్బడియా యిరుక్కై.

---

కానివిగా ఉండే అశుభాలు, దుర్విపాకం - చెడు పర్యవసానాన్ని కల్గినవి - అని కూడా భావం. రాబోయే కాలంలో ఫలదశలో నరక, గర్భవాసాలను కలుగజేసేవి.

**(అనాదేః) - "మున్ శెయ్ద ముఴువినై"** (పూర్వం చేసిన పూర్ణమైన పాపాలు) అని పాపాలు అనాది అని చెప్పబడుతున్నవి కదా!

**(అపరిహరణీయస్య)** - సర్వశక్తివి అయిన నీకు కూడా వెనుకంజ వేయవలసినట్లుండేవి.

**(మహతః)** - లెక్క లేనన్నివిగా ఉండేవి. కాలం ఉన్నంతవరకు అనుభవించినా, వాటి అవధిని చూడడానికి సాధ్యం కాకుండా ఉండడం, ఇటువంటి అశుభానికి సమూహాలకు కూడా అంతు లేకుండా ఉండడం. **"యద్బ్రహ్మకల్పనియతానుభవేఽప్యనాశ్యం తత్కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే"** (పలు వేల బ్రహ్మకల్పాల కాలం అనుభవించినా తీరని పాపాన్ని ఈ జీవుడు ఇక్కడ అరక్షణ కాలంలో చేస్తాడు) అనేవిధంగా

**"శీలమిల్లా చ్చిఱియన్" (తి-వాయ్-4-7-1).**

**(నిహీనాచారోఽహమ్)** అహంబుద్ధిబోద్ధవ్యమాన ధర్మిస్వరూపమ్ అధమాచారనిరూప్యమాయిరుక్కై. ఆచారమాకిఱతు - విలక్షణధర్మత్తిలే ఇழிకైక్కు యోగ్యతాపాదకమాన సన్ధ్యావన్దనాదికర్మానుష్ఠానఙ్గళ్, అవైకళైయిన్ఱి పాపానుష్ఠానమానత్తుక్కే యోగ్య నెన్ఱై.

**(నృపశుః)** చతుష్పాత్తుక్కళిల్ కాట్టిల్ ద్విపాత్త్వమే విశేషమెన్ఱై. **"జ్ఞానేన హీనః పశుభి స్సమానః"** శాస్త్రవశ్యజన్మమాకైయాలే పశు వెన్నవొణ్ణాతు.

---

అణుపరిమాణుడైన జీవుడు వీటిని అన్నిటిని చేశాడా! అని ఆశ్చర్యపడేటట్లు ఉంటాయి. **"శీలమిల్లా చ్చిఱియన్"** (మంచి వర్తనం లేని చిన్నవాడను-క్షుద్రుడను) అని కదా ఆழ்వార్లు ఆత్మను **"శఱియన్"** అని నిర్దేశించారు.

**(నిహీనాచారోఽహమ్)** - అహంబుద్ధిచే బోధింపబడే జీవస్వరూపం అధర్మాచారుడని నిరూపకంగా (అధర్మాలు చేసేవాడనే తక్షణాన్ని కల్గినదిగా) చెప్పేటట్లున్నది. ఆచారమంటే విలక్షణమైన ధర్మాన్ని ఆచరించడానికి యోగ్యతను కల్గించే సంధ్యావందనాది కర్మలు. నిహీనాచారుడను - అని అన్నందున పాపానుష్ఠానానికి యోగ్యుడని చెప్పబడినట్లయినది.

**(నృశంసః)** - చతుష్పాత్తుల (నాల్గు కాళ్ళను కల జంతువుల) కంటే ద్విపాదమే (రెండు కాళ్ళు కల నావంటి పశువే) విశేషమని భావం. **"ఆహారనిద్రాభయజమైథునాని తుల్యాని ఖల్వత్ర సమస్తజంతోః, జ్ఞానాద్విశిష్టో హి నరః పరేభ్యో జ్ఞానేన హీనః పశుభిః సమానః"** (ఆహారం, నిద్ర, భయం, స్త్రీపురుషసంగమం, ఇక్కడ అన్ని జంతువులకు సమానం. మిగిలిన ప్రాణులకంటే మానవుడు జ్ఞానంచేత గొప్పవాడు అవుతున్నాడు. జ్ఞానం లేనివాడు పశువుతో సమానం) అనికదా చెప్పబడుతున్నది. శాస్త్రానికి లోబడి ఉండే జన్మను కలవాడనైనందున పశువని చెప్ప వీలు లేదు. ఆహారనిద్రాభయమైథునాలలో నియమం లేనందున మనుష్యుడని చెప్ప వీలు



ఆహారనిద్రాభయమైథునాదికళిల్ నియతియిల్లామైయాలే మనుష్య నెన్నవొణ్ణాతు. ఇరణ్డు జన్మత్తైయుమ్ తప్పినేన్- ఎన్ఱై.

**(అశుభస్యాస్పదమ్)** అశుభమాకిఱతు- శుభవిరోధి. శుభమాకిఱతు- పురుషార్థమ్. తద్విరోధికళుక్కెల్లా మాశ్రయ మెన్ఱై. అకృత్యకరణమ్ ముతలాక అసహ్యాపచారమ్ ముడివానవఱ్ఱుక్కు ఆకరమాయిరుక్కై, దేవర్ గుణానామాకరరానాప్పోలే, నాన్- అశుభానామాకరన్ ఎన్ఱై.

**(అపి)** ఇప్పడిప్పట్టవనాయిరుక్క చ్చెయ్తేయుమ్, **"క్షణమపి స హే యాతు శతధా వినాశమ్"** (స్తోత్రరత్నమ్)ఎన్ఱు అపేక్షిక్కైక్కు మొరువழியుణ్డు. అతెన్? ఎన్నిల్,

**(దయాసిన్ధో!)** కీழ்చ్చొన్న అశుభసాగరమెల్లామ్ దేవరుడైయ దయార్ణవత్తిల్ ఒరుకుళప్పడియామ్బడియన్ఱో దేవరుడైయకృపావత్తై. "వధార్హ

---

లేదు. రెండు జన్మలకు తప్పినవాడనని భావం.

**(అశుభస్యాస్పదమ్)** - అశుభమంటే - శుభవిరోధి. శుభమంటే పురుషార్థం. దాని విరోధులైన వానికన్నిటికి ఆశ్రయం. అకృత్యకరణ-కృత్యాకరణాదులనుండి అసహ్యాపచారాలవరకు ఆశ్రయమై ఉండడం. నీవు **"గుణానా మాకరః"** అన్నట్లు సద్గుణాలకు ఆకరం అయినట్లు, నేను అశుభాలకు అకరమనిభావం.

**(అపి)** - ఇటువంటివాడనైఉన్నా, **"క్షణమపి సహే యాతు శతధా వినాశమ్"** (నీకైంకర్యానికి పనికిరానివి అన్నీ నూఱు ముక్కలుగా వినాశం పొందనీ, వానిని సహించలేను) అని అపేక్షించడానికి ఒక మార్గం ఉన్నది. అది ఏది? అంటే,

**(దయాసింధో!)**- పూర్వం పల్కిన అశుభసాగరం అంతా నీ దయాసముద్రంలో ఒక గోష్పాదమంత అయేటట్లుగా కదా నీ కృపాసత్త

**మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్" (రా-సు-38-34), "వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః" (రా-అ-2-41), "గచ్ఛానుజానామి" (రా-యు-59-144).**

**(బన్ధో!) ఆశ్రితరుడైయ ఇ*ఱ*వుపేఱుకళ్ తన్నతామ్బుడియాన నిరుపాధికసమ్బన్ధత్తై చ్చొల్లుకిఱతు. "అహం వో బాన్ధవో జాతః" (వి-పు-5-**

---

ఉంటుంది. **"స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"** (అలసి భూమిపై పడినవాడు, శరణాగతుడైన ఆ కాకాసురుడు వధింపదగినవాడైనా, అతనిని శ్రీరాముడు దయతో రక్షించాడు.) అని, **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** (మానవుల కష్టాలలో శ్రీరాముడు వారికంటే ఎక్కువగా దుఃఖాన్ని పొందేవాడు) అని, **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా, విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్"** (వానరులలో గొప్పవాడవైన సుగ్రీవా! ఇతనిని పిలుచుకొని రా. ఇతడు విభీషణుడైనా, లేక, స్వయంగా రావణుడే అయినా, ఇతనికి నేను అభయమిచ్చాను) అని, **"గచ్ఛానుజానామి రణార్దిత స్త్వం ప్రవిశ్య రాత్రించరరాజ! లంకామ్, అశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః"** (రాక్షసరాజా! నీవు యుద్ధంలో అలసిపోయావు. తిరిగివెళ్ళు. నేను నిన్ను అనుమతిస్తున్నాను. లంకలోకి పోయి అలసట తీర్చుకొని, రథాన్ని, ధనుస్సును కలవాడవై యుద్ధానికి తిరిగి రా. రథంలో ఉండి అపుడు నా బలాన్ని చూస్తావు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(బంధో!)** - భక్తుల లాభనష్టాలు తన లాభనష్టాలుగా భావించే నిరుపాధిక సంబంధం దీనివల్ల తెలుపబడింది. **"నాహం దేవో న గంధర్వో న యక్షో వ చ దానవః అహం నో బాంధవో, జాతో నైతచ్చింత్య మితోన్యథా"** (నేను దేవుడను కాను, గంధర్వుడను కాను, యక్షుడను కాను, అసురుడను కాను. నేను మీకు బంధువునై జన్మించాను. నా జన్మను ఈవిధంగా తప్ప



**13-13), "కృతకృత్య స్తదా రామః" (రా-బా-1-85), "ఋణం ప్రవృద్ధమివ మే" (భార-ఉద్యో-58-22), "ఉరసా ధారయామాస పార్థం సఞ్ఛాద్య మాధవః" (భార-ఉద్యో-29-18), "మమ ప్రాణా హి పాణ్డవాః" (భార-ఉద్యో-90-32).**

**(నిరవధికవాత్సల్యజలధే!) వాత్సల్యమాకిఱతు- అన్రీన్ఱ కన్రిన్బక్కల్ దోషమ్ తాయ్క్కు భోగ్యమాయిరుక్కుమాపోలే, ఆశ్రితర్కళ్ దోషమ్ భోగ్యమాయిరుక్కై. కృపాసముద్రత్తుక్కు క్కరైయుణ్డాకిలుమ్**

---

వేఱు విధంగా మీరు భావించవద్దు), **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ"** (లంకలో, రాక్షసశ్రేష్ఠుడైన విభీషణుని అభిషేకించి, కృతకృత్యుడైన తాను చేయవలసిన కార్యాన్ని చేసినవాడైన - రాముడు, మనస్సులోని క్లేశం తీరినవాడై, సంతోషించాడు), **"గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్, ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి"** (ద్రౌపది చాలా దూరంలో ఉండే నన్ను ఉద్దేశించి గోవిందా! అని ఆక్రందించింది. ఈ ఆక్రందన వడ్డీతో వృద్ధి అయిన ఋణం వలె నా హృదయం నుండి తొలగిపోవడం లేదు), **"విసృష్టం భగవదత్తేన తదస్త్రం సర్వఘాతుకమ్, ఉరసా ధారయామాస పార్థం సంఛాద్య మాధవః"** (భగదత్తునిచే విడువబడినది, అన్నిటిని సంహరించగల్గినది అయిన ఆ బాణం నుండి అర్జునుని మఱుగుపరుస్తూ, దానిని మాధవుడు తన వక్షస్సులో ధరించాడు) అని, **"మమ ప్రాణాః హి పాండవాః"** (పాండవులు నా ప్రాణాలు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

**(నిరవధిక వాత్సల్యజలధే!)** - వాత్సల్యమంటే - అపుడే పుట్టిన లేగదూడకు కల మలినం తల్లి ఆవుకు భోగ్యంగా ఉండేటట్లే, ఆశ్రితుల దోషం భోగ్యంగా ఉండడం. కృపాసముద్రానికి తీరం ఉన్నా, వాత్సల్యసముద్రానికి తీరం లేదని భావం. **"విదితః స హి ధర్మజ్ఞః శరణాగత వత్సలః"** (రావణా! శ్రీరాముడు ధర్మాన్ని తెలిసినవాడుగా, శరణాగతులపట్ల

వాత్సల్యసాగరత్తుక్కు క్కరైయిల్లై. "శరణాగత వత్సలః" (రా-సు), "రిపూణామపి వత్సలః" (రా-యు-50-56), "దోషో యద్యపి తస్య స్యాత్" (రా-యు-18-3), "త్వయి కిఞ్చిత్సమాపన్నే కిం కార్యం సీతయా మమ"(రా-యు-41-4), "అప్యహం జీవితం జహ్యామ్" (రా-ఆ-10-19).

(తవ గుణగణం స్మారంస్మారమ్) కీழ్చ్చొన్న-గుణజ్గళైయుడైయ

---

వాత్సల్యాన్ని కలవాడుగా ప్రసిద్ధుడు) అని, **"సఖే ! రాఘవ! ధర్మజ్ఞ! రిపూణామపి వత్సల!, అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి గమిష్యామి యథాగతమ్"** (మిత్రమా! రాఘవా! ధర్మాన్ని తెలిసినవాడా! శత్రువులపట్ల కూడా వాత్సల్యాన్ని కలవాడా! నీ అనుమతి పొందగోరుతున్నాను. వచ్చిన రీతినే తిరిగి వెళ్ళగలను) అని, **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్"** (మిత్రభావంతో దగ్గరకు వచ్చిన ఈ విభీషణుని ఏ విధంగాను విడువను. ఇతనివద్ద దోషం ఉంటే ఉండనివ్వండి. సత్పురుషులకు ఇతనిని స్వీకరించడం నిందించదగినది కాదు), **"త్వయి కించిత్ సమాపన్నే కిం కార్యం సీతయా మమ, భరతేన మహాబాహో! లక్ష్మణేన యవీయసా, శత్రుఘ్నేన శత్రుఘ్న! స్వశరీరేణ వా పునః"** (దీర్ఘమైన బాహువులను కల సుగ్రీవా! నీకు ఏదయినా అవమానం జరిగితే, ఇక సీతతో నాకేమి పని? భరతునితో నాకంటే చిన్నవాడైన లక్ష్మణునితో, శత్రుఘ్నునితో ఏమి పని? నాశరీరంతో అయినా ఏమి పని?) అని, **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** (నా జీవితాన్ని అయినా విడుస్తాను. ఓ సీతా! నిన్ను లక్ష్మణునితో పాటుగా విడుస్తాను. అంతే తప్ప చేసిన ప్రతిజ్ఞను, విశేషించి బ్రాహ్మణులకు ఇచ్చిన ప్రతిజ్ఞను మాత్రం విడువను) అని గల ప్రమాణాలు స్మరణీయాలు.

**(తవ గుణగణం స్మారంస్మారమ్)** - స్మరించి, స్మరించి **(స్మృత్వా స్మృత్వా)** పూర్వం పల్కిన గుణాలను కల దేవరవారి కల్యాణగుణ సమూహాన్ని



దేవరుడైయ తిరుక్కల్యాణగుణసమూహత్తై ఎప్పోతుమ్ శిన్దై శెయ్తు శెయ్తు.

(స్మారంస్మారమ్) స్మృత్వాస్మృత్వా, "గుణానా మాకరో మహాన్" (రా-కి-15-30), "యథా రత్నాని జలధేః" (వామనపు-94-40), "చతుర్ముఖాయుః" (వరాహ-73-64)

(ఇతీచ్ఛామి గతభీః) అశుభాస్పదనాన ఎన్నై నినైత్తఞ్జాతే దేవర్గుణత్తైయే నినైత్తు "న దేహం న ప్రాణాన్" (స్తోత్రరత్నమ్ 57) ఎన్గిఅపడియే ఇచ్ఛియానిన్టేన్.

---

ఎల్లప్పుడు చింతించి - అని అర్థం.

**(స్మారంస్మారమ్)** - **"ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్"** (ఒక గొప్ప పర్వతం ధాతువులకు అన్నిటికి స్థానమై ఉన్నట్లు, శ్రీరాముడు గుణాలకు అన్నిటికి గొప్ప ఆశ్రయం), **"యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక!, తథా గుణాహ్యనంతస్య అసంఖ్యేయో మహాత్మనః"** (పుత్రా! ఏవిధంగా సముద్రంలో ఉండే రత్నాలు లెక్కలేనివో, ఆ రీతిలోనే, మహాత్ముడైన అనంతుని గుణాలు అంతులేనివి), అని, **"చతుర్ముఖాయుర్యది కోటివక్త్రో భవేన్నరః క్వాపి విశుద్ధచేతాః, న తే గుణానా మయుతైక దేశం వదేన్నవా దేవవర! ప్రసీద"** (పలు బ్రహ్మల ఆయుష్కాలాన్ని కలవాడై, కోటి సంఖ్యలలోని ముఖాలను కలవాడై, చాలా శుద్ధమైన మనస్సును కలవాడైన ఒక మానవుడు ఉన్నట్లయితే, అతడు నీ గుణాలలో పదివేల భాగాలలోని ఒక భాగాన్ని పలుకగలడో, లేడో తెలియలేము. దేవతలలో గొప్పవాడా! అనుగ్రహించు) ఇత్యాదులు స్మరణీయాలు.

**(ఇతీచ్ఛామి గతభీః)** అశుభాలకు ఆశ్రయమైన నన్ను భావించి భయపడకుండా నీ గుణగణాన్ని తలచి, "న దేహం న ప్రాణాన్" ఇత్యాది రీతిలో కోరుతున్నాను.

**59.శ్లో ॥అనిచ్ఛన్నప్యేవం యది పునరితీచ్ఛన్నివరజ-**
**స్తమశ్ఛన్నశ్ఛద్మస్తుతివచనభఙ్గీ మరచయమ్ ।**
**తథాపీత్థం భూతం వచనమవలంబ్యాపి కృపయా**
**త్వమేవైవం భూతం ధరణీధర! మే శిక్షయ మనః ॥**

అవ : **(అనిచ్ఛన్నితి) "ఇచ్ఛామి"** ఎన్గిఱ ఇచ్ఛైతాన్ సత్యైయో? ఎన్న; మన్దబుద్ధియాన నాన్ విషయానురూపమాన ఇచ్ఛై ఎనక్కుణ్డెన్ఱు తిరుమున్బే విణ్ణప్పమ్ శెయ్యప్పోకాతు. ఇచ్ఛాసూచకమాన వచనత్తై అవలంబిత్తు మెయ్యామ్బడి ఎన్నుడైయ మనస్సై శిక్షిత్తరుళవేణుమెన్గిఱార్.

వ్యా : **(ఏవ మనిచ్ఛన్ యద్యపి)** ఉక్తమాన ప్రకారత్తుక్కు అనురూపమాన ఇచ్ఛై యిన్ఱిక్కే యిరున్దతే యాకిలుమ్, నాస్తికరల్లామైయాలే ఇచ్ఛై యిల్లై యెన్నమాట్టార్. పేఱ్ఱుక్కు అనురూపమాన ఇచ్ఛై పోరామైయాలే ఉణ్డెన్నవుమ్ మాట్టార్

**(పునరితీచ్ఛన్నివ)** మెయ్యాన ఇచ్ఛై యుడైయార్ శొల్లుమాపోలే;

---

**59.శ్లో ॥అవ : (అనిచ్ఛన్నితి) - "ఇతీచ్ఛామి"** అనే మీ ఇచ్ఛ సత్యమా? అని భగవంతుడు అనగా, "మందబుద్ధి అయిన నేను విషయానురూపమైన ఇచ్ఛ ఉన్నది - అని సమక్షంలో విన్నపం చేయరాదు. ఇచ్ఛాసూచకమైన వచనాన్ని అవలంబించి, అది వాస్తవమయేటట్లు నా మనస్సును శిక్షించాలి (సంస్కరించాలి)" అని పల్కుతున్నారు.

**(ఏవమవిచ్ఛన్నపి)** - ఇంతకు ముందు పల్కిన ప్రకారానికి అనురూపమైన ఇచ్ఛ లేకుండా పోయినా, నాస్తికులు కానందున, ఇచ్ఛ లేదని అనలేరు. ప్రాప్యానికి తగినట్లుగా (అంతగొప్ప) ఇచ్ఛలేనందున ఇచ్ఛ ఉన్నదని అనలేదు.

**(పునరీతీచ్ఛన్నివ)** - వాస్తవమైన ఇచ్ఛను కలవారు పల్కినట్లుగా.



**(ఛద్మస్తుతివచనభంగీమరచయమ్)** - కృత్రిమస్తుతివచనభంగియై పణ్ణినేన్. వచనక్రారత్తై ప్పార్త్తాల్ సర్వజ్ఞరాన దేవరుమ్ మెయ్యెన్ఱు భ్రమిక్కుమ్బడి శొన్నేన్, **"పొయ్యే కైమ్మై శొల్లి" (తి-వాయ్-5-1-1)** ఎన్నుమాపోలే. ఇతుక్కు హేతు ఎన్? ఎన్న,

**(రజస్తమశ్ఛన్నః)** అన్యథాజ్ఞాన విపరీతజ్ఞాన హేతువాన రజస్తమస్సుక్కళాలే మఱైక్కప్పట్టవనాయ్ క్కొణ్డు - ఎన్ఱపడి. అనాదికాలమ్ ఇన్ద దేహమ్ స్వస్వరూపపరస్వరూపఙ్గళై మఱైత్తు పోన్దతు- రజస్తమోద్వారత్తాలేయిఱే.

**(తథాపి)** ఇప్పడి త్యాజ్యమాకవేణ్డుమ్ శెయలై చ్చెయ్తేనేయాకిలుమ్ **"యాథాతథ్యేన వర్ణితమ్"** ఎన్గిఱపడియే సర్వజ్ఞసకాశత్తిలే మెయ్యేశొల్లి

---

**(ఛ్ఛద్మస్తుతివచనభంగీ మరచయమ్)** - కృత్రిమమైన స్తుతివచనాన్ని వాస్తవమని భ్రమించేటట్లు పలికాను. నేను పలికే వచనప్రకారాన్ని గమనిస్తే సర్వజ్ఞుడవైన నీవు కూడా నిజమని భ్రమించేటట్లుగా పలికాను. **"కైయార్ శక్కరత్తు ఎన్ కరుమాణిక్కమే! ఎన్ఱెన్ఱు పొయ్యే కైమ్మై శొల్లి"** (చేతిలో అమరి ఉండే చక్రాన్ని కల నా నీలమాణిక్యమా! - అని పలుమార్లు గొప్ప అసత్యాన్ని పల్కి) అనే విధంగా అసత్యంగా పలికాను. దీనికి హేతువేమి? అంటే,

**(రజస్తమచ్ఛన్నః)** - అన్యధాజ్ఞాన-విపరీతజ్ఞానాలకు హేతువైన రజస్తమోగుణాలతో ఆవరింపబడినవాడనైనందున - అని భావం. అనాదికాలంగా ఆ దేహం స్వస్వరూప - పరస్వరూపాలను మఱుగుపరచి వర్తించడం- రజస్తమస్సుల కారణంగా - అని భావం.

**(తథాపి)**- ఈవిధంగా త్యాజ్యాలైన (విడువదగిన) కార్యాలను చేసేవాడనైనా, **"యాథాతథ్యేత వర్ణితమ్"** (యథాతథంగా వర్ణింపబడింది) అనేటట్లు సర్వజ్ఞుడవైన నీ సమక్షంలో నిజం పల్కి ఉజ్జీవించవలసి ఉండగా,

ప్పి**ழై**క్కవేణ్డియిరుక్క, అజ్గే పోయ్ పరిమాఱినాల్ త్యాజ్యనిఱే.

**(ఇత్థంరూపం వచనమవలంబ్య) "న దేహం న ప్రాణాన్", "దయాసిన్ధో! బన్ధో!"** ఎన్గిఱ వచనమాత్రత్తైయే ప**ఱ్ఱ్**ఱాశాకక్కొణ్డు **"మాతవనెన్ఱతే కొణ్డు" (తి-వాయ్-2-7-3)** ఎన్ఱుమ్, **"తిరుమాలిరుఞ్జోలైమలై యెన్నే నెన్న" (తి-వాయ్-10-8-1)** ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే ఉక్తిమాత్రమే జీవిక్కైయామ్ విషయమిఱే.

**(కృపయా) "అవిజ్ఞాతా" (భార-ఆ-ను-149-65), "వధార్హమపికృపయా" (రా-సు-38-34)** ఎన్గిఱపడియే దోషత్తిల్

అక్కడ అసత్యం పల్కితే విడువదగినవాడే కదా అవుతాడు.

**(ఇత్థంరూపం వచనమవలంబ్య)- "న దేహం న ప్రాణాన్"** (నీశేషత్వానికి పనికిరాని దేహం, ప్రాణం ఇత్యాదులను నేను కోరను) అని, **"దయాసింధో! బంధో!"** (దయకు సముద్రమా ! సర్వవిధబంధూ!) అని పల్కిన మాటలనే ఆలంబనంగా చేసికొని- అని భావం. **"మాదవన్ ఎన్ఱదే కొణ్డు"** (మాధవుడు - అని నేను పల్కిన మాటనే గ్రహించి) అని, **"తిరుమాలిరుమ్ శోలైమలై యేన్నెనెన్న"** (తిరుమాలిరుమ్ శోలై పర్వతం- అని పల్కినంతనే) అని ఆ**ழ**్వార్లు పల్కినట్లు (మనఃపూర్వకంగా కాకపోయినా, అహృదయంగా పల్కిన) ఉక్తిమాత్రంతోనే ఉజ్జీవింపజేసే విషయం (భగవంతుడు) కదా!

**(కృపయా) - అవిజ్ఞాతా"** (భక్తుల దోషాలను చూడనివాడు) అని, **"స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"** (శరణు పొందినవాడు, అలసి భూమిపై పడినవాడైన అతడు, వధింపదగినవాడైనా, శరణు పొందదగినవాడైన శ్రీరాముడు అతనిని కృపతో రక్షించాడు) అనే విధంగా భక్తుల దోషాల విషయంలో గమనించనివాడై,



అవిజ్ఞాతావాయ్, కృపాపరతన్త్రనాకైయాలే.

**(ఏవమ్భూతం మే మన స్త్వమేవ శిక్షయ)** స్తుతిక్కు ఉపకరణమాన మనస్సై అడిమైకొళ్ళక్కడవ దేవరే త్వదుపకరణమామ్బడి శిక్షిత్తరుళవేణుమ్. **"తీ మనమ్ కెడుత్తాయ్" (తి-వాయ్-2-7-8), "మరువిత్తొ**ழ**ుమ్ మనమే తన్దాయ్" (తి-వాయ్-2-7-7)** ఎన్గిఱపడియే పణ్ణియరుళవేణుమ్. **"మననకమలమఱ క్క**ழ**ువి" (తి-వాయ్-1-3-8)** ఎన్గిఱపడియే మనోనైర్మల్యమ్ యోగత్తాలే పిఱక్కక్కడవతు ఉపాసకనుక్కు. అన్ద యోగస్థానత్తిలే భగవదనుగ్రహమాయిఱే ఇవ్వధికారిక్కిరుప్పతు.

**(ధరణిధర!)** రసాతలగతైయాన భూమియై ఆపత్తే హేతువాక ఉద్ధరిత్తవరల్లీరో దేవర్. **"ఏనమాయ్ నిలజ్గీణ్డ వెన్నప్పనే!" (తి-వాయ్-5-7-6)**

కృపాపరతంత్రుడైనందున.

**(ఏవంభూతం మే మనః త్వమేవ శిక్షయ) -** నీ స్తుతికి సాధనమైన మనస్సును శేషంగా పరిగ్రహించగల్గిన నీవే నీకు సాధనమయేటట్లు సంస్కరించాలి. **"ఎన్నై త్తీమనమ్ కెడుత్తాయ్! ఉనక్కెన్ శెయ్‌కేన్!"** (నాచెడ్డ మనస్సును పోగొట్టినవాడా! నేనేమి నీకు ప్రత్యుపకారం చేయగలను?) అని **"నిన్‌పాద పఙ్కయమే మరువిత్తొ**ழ**ుమ్ మనమే తన్దాయ్"** (నీ శ్రీచరణపద్మాలలో అమరి ఆశ్రయించి ఉండి కొలిచే మనస్సును నాకిచ్చావు) అని అనే విధంగా నన్ను చేసి అనుగ్రహించాలి **"మననక మలమఱ క్క**ழ**ువి"** (మనస్సు లోని మాలిన్యాన్ని పోగొట్టేటట్లు క్షాళనచేసి) అనేటట్లు మనస్సులోని స్వచ్ఛత యోగంద్వారా ఉపాసనకు కల్గుతుంది. ఆ యోగస్థానంలో ఈ ప్రపన్నుడనే అధికారి భగవదనుగ్రహం నిలచి, ఆ స్వచ్ఛతను కల్గిస్తుంది.

**(ధరణిధర) -** రసాతలగత అయిన భూమిని, ఆమెకు కల్గిన ఆపదయే హేతువుగా చేసికొని, రక్షించావుకదా, నీవు. **"ఏనమాయ్ నిలమ్ కీణ్డ ఎన్నప్పనే!"** (వరాహమూర్తివై భూమిని ఉద్ధరించిన నాతండ్రీ!) అని, **"పన్నియా యన్ఱు**

ఎన్నుమ్, "పన్నియాయన్ను పారకమ్ కీణ్డ పాழியాన్" (తి-మొ-1-1-4) ఎన్నుమ్ ఇప్పడి సమ్బన్ధముమ్, శక్తియు ముణ్డు. ఇవనిడత్తిల్ ఇని ఇచ్చైయే దేవర్క్కు వేణ్డువతు. అత్తై యుణ్డాక్కి రక్షిత్తరుళవేణుమెన్గిఱార్.

60.శ్లో ॥ పితా త్వంమాతా త్వం దయితతనయ స్త్వం ప్రియసుహృ-
త్త్వమేవ త్వం మిత్రం గురురపి గతిశ్చాసి జగతామ్ ।
త్వదీయ స్త్వద్భృత్య స్తవ పరిజన స్త్వద్గతిరహం
ప్రపన్న శ్చైవం సత్యహమపి తవైవాస్మి హి భరః ॥

అవ : (పితా త్వమితి) ఇచ్చైయుమిన్ఱిక్కే యిరుక్క, ఉక్తిమాత్రత్తైయేకొణ్డు ఇచ్చైయైయు ముణ్డాక్కి రక్షిక్కవేణు మెన్గిఱ నిర్బన్ధమెన్? ఎన్న; అవర్జనీయ సమ్బన్ధత్తాలే - ఎన్గిఱార్.

వ్యా : (పితా త్వమ్) ఉత్పాదకరాయ్, హితకామరాయిరుక్కిఱ దేవర్.

---

పారకమ్ కీణ్డ పాழியాన్" (వరాహమూర్తియై, ఆనాడు ప్రళయసమయంలో సముద్రంలో మునిగిన భూమిని ఉద్ధరించిన బలశాలి) అనే రీతిలో సంబంధం, శక్తి కూడా ఉన్నది. ప్రపన్నుని విషయంలో నీవు కోరేది కేవలం ఇచ్ఛయే. దానిని నీవే కల్గించి రక్షించాలి - అని పల్కుతున్నారు.

60.శ్లో ॥అవ : (పితా త్వమ్) - నాకు ఇచ్ఛకూడా లేకపోయినా, కేవలం ఉక్తి మాత్రమే హేతువుగా చేసికొని మిమ్ములను రక్షించాలనే ఈ నిర్బంధం ఏమి? అని స్వామి అనగా, నీకు నాకు మధ్య ఉండే విడువడానికి సాధ్యం కాని సంబంధంవల్ల నీవు నన్ను రక్షించాలి సుమా - అని ఇందులో పల్కుతున్నారు.

వ్యా : (పితా త్వమ్) - ఉత్పాదకుడవై (ఉత్పాదన చేసేవాడై), హితాన్ని కోరే వాడవై ఉండే నీవు.



(మాతా త్వమ్) గర్భధారణమ్పణ్ణి, ప్రసవక్లేశత్తై అనుభవిత్తు అశుచిప్రసవజ్గళైయుమ్ మతియాతే రక్షిత్తు ప్పిన్బు. ఇవన్ ప్రియమే అపేక్షిత్తిరుక్కుమ్ తాయైప్పోలే పరివుడైయార్ దేవర్. "పితాహ మస్య జగతః "(గీ), "భూతానాం యోஉవ్యయః పితా" (భా-ఆ-149-10), "సర్వేషా మేవ లోకానాం పితా మాతా చ మాధవః" (భార-ఆర), "తఞ్జమాకియ తన్దై తాయ్" (తి-వాయ్-3-6-9).

(దయితతనయ స్త్వమ్) అభిమతనాయ్, నిరయనిస్తారకనాన పుత్రనైప్పోలే నిన్ఱు ఉపకరిప్పిర్ దేవర్., "నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయు మవరే" (తి-వాయ్-5-1-8).

---

(మాతా త్వమ్) - గర్భధారణం చేసి, ప్రసవవేదనను అనుభవించి, విడిచే మలినాలను చూచి అసహ్యించుకోకుండా రక్షించిన తరువాత, ఇతని ప్రియాన్నే కోరేతల్లివలె ప్రేమను కల్గిన నీవు - అని భావం. "పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః" (నేను ఈ లోకానికి తండ్రిగా, తల్లిగా, ధారకునిగా, పితామహునిగా ఉన్నాను) అని "పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్, దైవతం దేవతానాం చ భూతానాం యోஉ వ్యయః పితా" (భగవంతుడు పవిత్రాలన్నిటిలో పవిత్రుడు; మంగళాలన్నిటిలో మంగళం, దేవతలందరిలో గొప్ప దేవత, జీవరాసులకన్నిటికి నాశం లేని తండ్రి), "తఞ్జమాకియ తన్దై తాయొడు" (రక్షకుడైన తండ్రి, తల్లియై భగవంతుడున్నాడు) ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు.

(దయితతనయస్త్వమ్) - మిక్కిలి ఇష్టుడై, పున్నామనరకంలో పడకుండా రక్షించేవాడైన పుత్రునివలె నిలచి సహకరించే నీవు. "నన్మక్కళుమ్ మేలాత్తాయ్ తన్దైయుమ్ అవరే" (మంచి సంతానం, ఇంకా తల్లి, తండ్రి ఆ భగవంతుడే) అని ఆழ்వార్లసూక్తి.

**(ప్రియసుహృత్త్వమేవ)** అభిమతముమాయ్, సర్వకాలత్తిలుమ్ శోభనత్తైయే పణ్ణుమ్ తిరువుళ్ళత్తై యుడైయరా యిరుప్పీర్ దేవరీర్. అనర్థత్తై ప్పణ్ణినాలుమ్ విడవొణ్ణాత ప్రియత్వమ్. అప్రియనానాలుమ్ విడవొణ్ణాత సుహృత్త్వమ్. అవధారణమ్ సర్వత్తిలు మన్వయిక్క క్కడవతు.

**(త్వం మిత్రమ్)** అర్జునన్ సుభద్రైయుడైయ స్వయంవరత్తై దేవర్క్కఱివిత్తు లభిత్తాప్పోలే, అశేషరహస్యఙ్గళుమ్ అఱివిక్కలామ్బడి విశ్వసనీయరామ్బడి యిరుప్పీర్ దేవర్,

**(గురురపి)** **"మన్మనా భవ మద్భక్తః" (గీ-9-34)** ఎన్నుమ్, **"మామేకం శరణం వ్రజ" (గీ-18-66)** ఎన్నుమ్ నిన్ఱునిన్ఱ నిలైకళిలే హితోపదేశమ్ పణ్ణు

---

**(ప్రియసుహృత్ త్వమేవ)** - మిక్కిలి ఇష్టమైనవాడవై, అన్ని సమయాలలోను మంచినే చేసే మనస్సును కలవాడవై ఉండే నీవు అని భావం. అనర్థాన్ని కల్గించినా విడువలేని ప్రియత్వం, ప్రియంకానివాడైనా విడువలేని సుహృత్త్వం నీలో ఉన్నది. ఇక్కడి **"ఏవ"** కారాన్ని అన్నిటిలోను అన్వయించి అర్థాన్ని చెప్పాలి.

**(త్వం మిత్రమ్)** - అర్జునుడు సుభద్రా స్వయంవరవృత్తాంతాన్ని నీకు తెల్పి, రహస్యాలను తెలిసికొన్నట్లు, అన్ని రహస్యాలు నీవల్ల నేను పొందదగినట్లుగా నమ్మదగినవాడవై ఉండేవాడవు నీవు.

**(గురురపి)** - **"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు, మా మేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోஉసి మే"** (నాపట్ల మనస్సును నిలిపినవాడవై, నాకు భక్తుడవై, నన్ను ఆరాధించేవాడవై ఉండు. నన్ను నమస్కరించు. నన్నే పొందగలవు. ఇది నిజం. నీకు ప్రతిజ్ఞ చేస్తున్నాను. నీవు నాకు ప్రియమైనవాడవు), **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** (ధర్మాలన్నిటిని విడిచి



మాచార్యరుమ్ దేవరే.

**(గతిశ్చాసి)** పురుషార్థోపాయభూతర్ దేవరెన్నుతల్, **"గన్తవ్యత్వాద్గతిః"** ఎన్ను పరమప్రాప్యర్ దేవరెన్నుతల్.

**(జగతామ్)** ఇన్ద సమ్బన్ధమ్ - దేవాదిసర్వప్రాణికళుక్కుమ్ సాధారణమ్, ఉభయవిభూతిక్కుమ్ సాధాణమెన్నవుమామ్.

**(త్వదీయః)** అన్ద సమ్బన్ధసామాన్య మొ***ழி***య, తమక్కుణ్డాన విశేషప్రతిపత్తియై యరుళిచ్చెయ్‌కిఱార్, **"ఈశ్వరోஉహమ్" (గీ-16-14)** ఎన్టిరుక్కుమవనల్లేన్. **"యస్యాస్మి" (యజు-2-3-7)** ఎన్గిఱపడియే దేవర్క్కే శేషభూతన్, దేవర్క్కతిశయత్తై విళైత్తు స్వరూపమ్బెఱుమ్ సమ్బన్ధత్తై యుడైయవన్- ఎన్గై.

**(త్వద్భృత్యః)** అతినాలే దేవర్క్కు భరణీయ నెన్నుతల్, **"ఆత్మదాస్యం**

---

నన్ను ఒక్కని మాత్రమే శరణుపొందు. నిన్ను నీ పాపాలన్నిటినుండి విడిపిస్తాను; శోకించకు) అని ఉండే స్థితిలో హితోపాదేశాన్ని చేసే ఆచార్యుడవు నీవే.

**(గతి శ్చాసి)** - పురుషార్థంగా, ఉపాయంగా (ప్రాప్యంగా, ప్రాపకంగా) ఉండేవాడవు నీవే. **"గంతవ్యత్వాత్ గతిః"** (పొందదగినవాడైనందున గతి) అనేరీతిలో పరమప్రాప్యుడవు నీవే- అని కూడా భావం.

**(జగతామ్)** - ఈ సంబంధం దేవాది సకల ప్రాణులకు సాధారణం అని భావం. ఉభయవిభూతికి కూడా సాధారణం - అని కూడా భావం.

**(త్వదీయః)** - ఈ సామాన్యప్రతిపత్తినే కాక తమకు ఉండే విశేషప్రతిపత్తిని (అభిప్రాయాన్ని) కూడా వ్యక్తం చేస్తున్నారు. **"యస్యాస్మి న తమంతరేమి"** (ఏ పరమాత్మకు నేను శేషమై ఉన్నానో, ఆ పరమాత్మను ఏనాడూ విడచి ఉండను) అనే రీతిలో నీకు శేషభూతుడను.

**(త్వద్భృత్యః)** - నీకు ఆనందాన్ని కల్గించి, స్వరూపాన్ని పొందే

హరే స్స్వామ్యమ్" (హారీత స్మృతి) ఎన్గిఱపడియే నిరుపాధికదాసభూతన్ - ఎన్నుతల్. "దాసభూతా స్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః" (హారీతస్మృతి) ఎన్నక్కడవతిఱే.

(తవ పరిజనః) "అహం సర్వం కరిష్యామి" (రా-అ-31-25) ఎన్గిఱపడియే సర్వకైఙ్కర్యత్తుక్కుమర్హన్

(త్వద్గతిః) దేవరే ప్రాప్యభూతరెనిఱ్ఱిరుక్కిఱేన్.

(అహం ప్రపన్నశ్చ) ప్రాప్యమ్ పెఱుకైక్కు దేవరే ఉపాయభూతరాక అధ్యవసిక్కిఱేన్.

---

సంబంధాన్ని కలవాడనని భావం. లేక, నీకు భృత్యుపననే సంబంధంచేత నీచే భరింపదగిన-పోషింపదగినవాడనని కూడా భావం.

(తవ పరిజనః) - "స్వోజ్జీవనేచ్ఛా యది తే స్వసత్తాయాం స్పృహా యది, ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావం చ సదా స్మర" (నీ ఉజ్జీవనంలో నీకు ఆశ ఉంటే, నీ సత్తలో నీకు ఆశ ఉంటే, ఆత్మయొక్క భగవద్దాస్యాన్ని - ఆత్మ భగవంతునకు దాసుడై ఉన్నాడనే స్థితిని, హరి అందఱికి స్వామియై ఉన్నాడనే స్థితిని సదా భావించు) అనేవిధంగా నీకు సహజంగా, నిరుపాధికంగా దాసుడనై ఉన్నాను - అని భావం. "దాసభూత స్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః" (జీవులందఱు పరమాత్మలు దాసులు కదా) అని, "భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే" (శ్రీరామా! నీవు సీతతో పాటు గిరిసానువులలో విహరిస్తావు. అపుడు నీవు మేల్కొన్న సమయంలో, నిద్రించే సమయంలో అన్ని కైంకర్యాలను చేస్తాను) అనే విధంగా అన్ని కైంకర్యాలకు అర్హుడను.

(త్వద్గతిః) - నీవే ప్రాప్యభూతుడవు - అని నమ్మి ఉన్నాను.

(అహం ప్రపన్నశ్చ) - ప్రాప్యాన్ని పొందడానికి నిన్నే ఉపాయంగా, దృఢంగా నమ్మాను.



(ఏవం సతి) దేవర్ సర్వవిధబన్ధువుమాయ్, అడియేన్ అనన్యగతియాన పిన్బు,

(అహమపి) అహృదయోక్తియై యుడైయ నానుమ్

(తవైవ భరోఽస్మి) దేవర్క్కే భరనాకానిన్ఱేన్. జ్ఞానశక్త్యాదికళాలుమ్ ప్రాప్తియాలుమ్ ఎన్కార్యమ్ దేవర్క్కే భరమెన్ఱై. భర మాకైయావతు- సర్వదేశత్తిలుమ్ సర్వప్రకారత్తాలుమ్ నిర్వాహ్యనాకై.

61.శ్లో॥ జనిత్వాహం వంశే మహతి జగతి ఖ్యాతయశసాం
శుచీనాం యుక్తానాం గుణపురుషతత్త్వస్థితివిదామ్ ।
నిసర్గాదేవ త్వచ్చరణకమలై కాన్తమనసా-
మధోధః పాపాత్మా శరణద! నిమజ్జామి తమసి ॥

అవ : (జనిత్వేతి) నీర్ మహావంశప్రసూతరల్లీరో? నిరాలమ్బరైప్పోలే

---

(ఏవం సతి) - నీవు సర్వవిధబంధువై, నేను అనన్యగతినై ఉన్న తరువాత,

(అహమపి) - నేను పలికేది అహృదయోక్తి అయినా,

(తవైవ భరోఽస్మి) - నీకే భారమై (రక్షింపదగినవాడనై) ఉన్నాను. జ్ఞానశక్త్యాదులు కల్గి ఉన్నందున సంబంధంవల్ల నా కార్యాన్ని నిర్వహించవలసినవాడవు నీవే. భరం కావడం అంటే సర్వదేశసర్వకాల సర్వావస్థలలోను సర్వప్రకారంగా నిర్వహింపదగినవాడవని భావం.

61.శ్లో॥ అవ : (జనిత్వేతి) - "మీరు గొప్ప వంశంలో జన్మించినవారే కదా ! ఆలంబనం లేనివారివలె ఈవిధంగా పల్కుతున్నారేమి?'' అని భగవంతుడనగా, "ఈ వంశంలో జన్మించినా, నేను పాపప్రాచుర్యాన్ని

ఇజ్జనే శొల్లుకిఱతెన్? ఎన్న, ఇవ్వంశత్తిలే పిఱన్దేనేయాకిలుమ్ పాపప్రచురనాకైయాలే సంసారత్తిలే అழுన్దానిన్జేన్; ఎడుత్తరుళవేణుమెన్గిఱార్.

వ్యా : (మహతి వంశే అహం జనిత్వా) వంశత్తుక్కు మహత్తై యావతు- మహాత్మాక్కళ్ వన్దు జనిక్కై. "ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్" (గీ-6-42) ఎన్నుమ్ వంశత్తిలే పిఱన్దు వైత్తు, అనర్థప్పడానిన్జేన్.

(జగతి ఖ్యాతయశసామ్) చతుస్సాగరపర్యన్తైయాన భూమి ప్పరప్పెల్లామ్ ప్రసిద్ధమాన పుకழை యుడైయవర్కళ్. "తికழுన్దణ్ తిరువరుళ్ శెయ్‌తులకత్తార్ పుకழுమ్ పుకழ் తానతు కాట్టి త్తన్దు" (తి-వాయ్-8-7-5) ఎన్గిఅపడియే భగవద్విషయాకారముడై-యవర్కళెన్ఱు లోకప్రసిద్ధమాయిరుక్కై.

---

కల్గినవాడైనందున సంసారంలో మునిగి ఉన్నాను. నన్ను ఉద్ధరించాలి - అని అంటున్నారు.

వ్యా : (మహతి వంశే అహం జనిత్వా) - వంశానికి గొప్పతనం అంటే- మహానుభావులు వచ్చి అవతరించడం. "అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్, ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్" (లేక, బుద్ధిమంతులైన యోగులకులంలో, యోగంనుండి భ్రష్టులైనవాడు జన్మిస్తాడు. ఇటువంటి జన్మ లోకంలో చాలా దుర్లభం) అనే వంశంలో జన్మించి, అనర్థాన్ని పొందుతున్నాను - అని భావం.

(జగతి ఖ్యాతయశసామ్) - చతుఃసాగరపర్యంతమైన భూమి అంతా ప్రసిద్ధమైన కీర్తిని కలవారు. "తికழுమ్ తన్‌తిరువరుళ్ శెయ్‌దులకత్తార్ పుకழுమ్ పుకழ் తానదు కాట్టి త్తన్దు" (ప్రకాశించే తమ నిర్హేతుకకృపను చూపి, లోకంలో ఉండేవారు ఆదయను కొనియాడడాన్ని తాను చూపించి) అనేవిధంగా భగవద్విషయాకారంతో (భగవత్కృపతో) కల్గిన కీర్తి.



(శుచీనామ్) భగవద్వ్యతిరిక్త విషయఙ్గళిల్ భోగ్యతాగన్ధరహితరాయిరుక్కై. ఆన్తరబాహ్యమాన ఉభయశుద్ధియై చ్చొల్లవుమామ్. ఇవ్వంశత్తిలే పిఱన్దువైత్తు అశుభాస్పద నెన్నక్కడవీరో?

(యుక్తానామ్) "కృతకృత్యాః ప్రతీక్షన్తే" (ఇతిహాససముచ్చయే) ఎన్గిఅపడియే నిత్యయోగాకాఙ్క్షమనస్కరా యిరుక్కుమవర్కళ్. "మాక వైకున్దమ్ కాణ్బతఱ్కెన్మన మేక మెణ్ణుమ్" (తి-వాయ్-9-3-8) ఎన్నుమ్బడియిరుక్కై. ఇళైయ పెరుమాళైప్పోలే దేవరోడల్లతు కాలక్షేప మరితా యిరుక్కుమవర్కళ్- ఎన్నుమామ్. ఇప్పడిప్పట్ట వంశత్తిలే పిఱన్దు ఇచ్చైపోరాతెన్నక్కడవీరో? ఎన్టై.

(గుణపురుషతత్త్వస్థితివిదామ్) చిదచిదీశ్వరర్కళుడైయ

---

(శుచీనామ్) - భగవంతుని కంటే అన్యమైన విషయాలలో భోగ్యతా గంధరహితులై ఉండడం (కొంచెం కూడా సంబంధం లేకుండా ఉండడం) ఆంతరమైన, బాహ్యమైన - పవిత్రతను కల్గినవారని కూడా చెప్పవచ్చు. ఈ వంశంలో జన్మించి అశుభాస్పదమని చెప్పదగునా? అంటే,

(యుక్తానామ్) - "ప్రాయశః పాపకారిత్వాత్ మృత్యో రుద్విజతే జనః ,కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిమ్" (సామాన్యంగా పాపం చేసిన వారైనందున మానవుడు మరణాన్ని చూచి భయపడతాడు. కాని, చేయవలసిన కృత్యాన్ని చేసి పూర్తిచేసిన వారయితే మృత్యువును ప్రియమైన అతిథినివలె ఎదురుచూస్తారు) అనే రీతిలో నిత్యయోగాన్ని కోరేవారు - అని భావం. "మాక వైకున్దమ్ కాణ్బదఱ్కు ఎన్‌మనమేకమెణ్ణుమ్" (గొప్పదైన వైకుంఠాన్ని దర్శించాలని నామనస్సు సదా కోరుతున్నది) అని ఆశించి ఉండడం. లక్ష్మణునివలె నీతో కలసి ఉండకపోతే నిలువలేనివారని భావం. ఇటువంటి వంశంలో జన్మించి "నాకుండే ఇచ్ఛ చాలదు" అని అనగలరా? అని అంటే,

(గుణపురుషతత్త్వస్థితి విదామ్) - చిదచిదీశ్వరుల స్వరూపస్వభావ

స్వరూపస్వభావ సమ్బన్ధజ్ఞళై అఱియుమవర్కళ్ గుణమెన్ను - గుణాశ్రయమాన ప్రకృతియైచ్చొల్లుకిఱతు. స్థితియావతు- స్వరూపస్వభావాదికళ్.

**(నిసర్గాదేవేత్యాది)** వత్సమానతు - జనిత్తపోతే తాయ్ముల్తైయిలే వయ్వైక్కుమాపోలే త్వచ్చరణారవిన్దజ్ఞళిలే ఏకాన్తమానమనస్సై జన్మప్రభృతియాకవుడైయవర్కళ్. కీழ்చ్చొన్న శుద్ధియోగాదికళ్ నైసర్గికమెన్నై.

**(పాపాత్మా)** పాపన్దానొరు వడివు కొణ్డాప్పోలే యిరుక్కుమవన్. జ్ఞానానన్దమొழియ పాపమే నిరూపకమాయిరుక్కై.

**(శరణద!)** ఇవ్వళవిలుమ్ ఉన్బక్కలవకాశముణ్డామ్బడి ఆళ్పార్త్తుళితరుమవరితే దేవరీర్.

**(తమసి అధోధో నిమజ్జామి)** - ప్రకృతియిలే దేవరెడుక్కనినైత్తాలుమ్

---

సంబంధాలను తెలిసినవారు- అని భావం. ఇక్కడ గుణశబ్దానికి గుణాలకు ఆశ్రయమైన ప్రకృతి చెప్పబడుతున్నది. స్థితి అంటే- స్వరూపస్వభావాదులు.

**(నిసర్గాదేవేత్యాది)** - బిడ్డ జన్మించినపుడే తల్లిస్తన్యంతో పాలు తాగాలని సహజంగానే నోరు పెట్టినట్లుగా నీ శ్రీచరణారవిందాలలో ఏకాంతమైన మనస్సును జన్మనుండి కల్గినవారివలె ఉండేవారు. ఇంతకుముంది చెప్పిన పరిశుద్ధిని కలిగి ఉండడం సహజమని అర్థం.

**(పాపాత్మా)** - పాపం అనేది మూర్తీభవించినట్లుగా ఉండేవాడు అని అర్థం. అంటే, జ్ఞానానందాలు ఆత్మకు నిరూపకం కాకుండా, పాపమే నిరూపకంగా కలిగినవాడని భావం.

**(శరణద!)** - ఈస్థితిలో కూడా నీపట్ల అవకాశం ఉండేట్లు అనుగ్రహించేవాడవుకదా నీవు - అని భావం.

**(తమసి అధోధో నిమజ్జామి)** - సంసారంనుండి దేవరవారు ఉద్ధరించాలని చూచినా నీచేతికి అందనంతంగా లోపలకు మునిగిపోయాను.



కైక్కెట్టాతపడి అమిழ்నిన్టేన్. "పన్ మామాయప్పల్ పిఱవియిల్ పడుకిన్ట యాన్" (తి.వాయ్ 3-2-2) ఎన్గిఱపడియే ఇన్నమ్ తరైకణ్డిలేనెన్గిఱార్. ఇత్తాల్ సాన్తానికర్ దేవర్పక్కలవగాహిత్తవళవుమ్ నాన్ ప్రకృతియిలే అవగాహిత్తేనెన్గిఱార్.

జనిత్తవంశమితు. దేవర్శరణ్యర్. ఇప్పడి యిరుక్క, నాన్ పడుకిఱపాడు ఇతువితే. అసమఞ్జననైప్పోలే వంశప్రభావముమ్ జీవియాతే, దేవరుడైయ నీర్మైయుమ్ జీవియాతే యిరుక్కిఱపడియితే ఎన్నుడైయ పాపప్రాచుర్యమెన్గిఱార్.

---

"పన్మా మామాయప్పల్ పిఱవియిల్ పడికిన్ట యాన్" (నీ పలువిధాలైన మాయలవల్ల కల్గిన పలు జన్మలలో పడి ఉండే నేను) అనే రీతిలో ఇంకా తీరాన్ని (అవధిని) చూడలేకున్నాను - అని పల్కుతున్నారు. ఇందువల్ల సాంతానికులు (సంతానాన్ని పొందగోరేవారు) నీపట్ల అవగాహించిన అవధిలో నేను ప్రకృతి (సంసారం) లోపల కూరుకుపోయాను - అని భావం.

నేను పుట్టిన వంశం ఇంత గొప్పది. దేవరవారు శరణ్యులు. కాని, నేను పడే పాట్లు ఇవి కదా! అసమంజసుని (సగరుని పుత్రుడు) వలె వంశ ప్రభావం నిలువకుండా, నీ సౌలభ్యం కూడా నిలువకుండా ఉన్నదికదా, నా పాపప్రాచుర్యం - అని పల్కుతున్నారు.

62శ్లో॥ అమర్యాదః క్షుద్రః చలమతిరసూయాప్రసవభూః
కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచనపరః।
నృశంసః పాపిష్ఠః కథమిహమతో దుఃఖజలధేః
అపారాదుత్తీర్ణః తవ పరిచరేయం చరణయోః॥

అవ : (అమర్యాద ఇతి) ఇవ్వంశత్తిల్ జన్మత్తైయుమ్ అసత్సమమాక్క వల్ల పాపమ్ ఉమక్కేతెన్న; "పాపాత్మా" ఎన్గిఱవిత్తై ప్పరక్క ప్పేశుకిఱార్.

వ్యా : (అమర్యాదః) వేదమర్యాదైక్కు బహిర్భూతన్,

(క్షుద్రః) క్షుద్రత్వమావతు - నీచవిషయాదికళిల్ అతిచాపల్యమ్. ఉజ్జీవనహేతువాన వేదమర్యాదైయై అనాదరిత్తు అతుక్కుమేలే వినాశహేతువాన నీచసేవైయిలే అతిచపలనెన్నై.

(చలమతిః) ఒరు జ్ఞానాధికన్ "నీచ విషయప్రావణ్యమ్ - నాశహేతు; వేద ప్రతిపాద్యవిషయమే ఉజ్జీవనమ్" ఎన్ఱు హితమ్ శొన్నాల్, అతిల్ వ్యవస్థితచిత్తనల్లేన్.

---

62శ్లో॥ అవ : (అమర్యాదః) - ఈ వంశంలో కల్గిన జన్మకు సైతం విలువలేకుండా చేయగల్గిన పాపం మీకు ఏది? - అంటే, "పాపాత్మా" అనే విషయాన్ని వివరిస్తూ ఇందులో పల్కుతున్నారు.

వ్యా : (అమర్యాదః) - వేదమర్యాదకు (సంప్రదాయానికి) బాహ్యుడను.

(క్షుద్రః) - క్షుద్రత్వమంటే నీచమైన విషయాలపట్ల అధికమైన చాపల్యం. ఉజ్జీవనహేతువైన వేదమార్గాన్ని అనాదరించి, అంతకు మించి వినాశహేతువైన నీచ సేవలో చాలా చాపల్యాన్ని కలవాడనని భావం.

(చలమతిః) - గొప్ప జ్ఞానాన్ని కలవాడొకడు "నీచ విషయాలలో మిక్కిలి ఆశను కల్గిఉండడం వినాశానికి కారణం" పల్కినా, అందులో మనస్సును నిలుపలేనివాడను.



(అసూయప్రసవభూః) పరగుణఙ్గళిలే దోషత్తైయుణ్డాక్కుకిఱ దోషత్తుక్కు ఉత్పత్తిస్థానమ్, ఎనక్కు దోషముణ్డామళవే యన్ఱిక్కే పిఱర్గుణఙ్గళిలుమ్ దోషత్తై యుణ్డాక్కుమవనెన్నై.

(కృతఘ్నః) ఉపకరిత్తవిషయత్తిలే అపకారత్తై ప్పణ్ణునై. "గోఘ్నే చైవ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా, నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః" (రా-కి-34-12) ఎన్ఱు మాతృపితృశతత్తిలుమ్, వత్సలతరమాన శాస్త్రత్తిలుమ్ బహిష్కృతనెన్నై.

(దుర్మానీ) ఇప్పడి నికృష్టనాయిరుక్క చ్చెయ్తేయుమ్, సర్వోత్కృష్టర్క్కు మవ్వరుకేయాక త్తన్నై నినైత్తు "ఈశ్వరోఽహమ్" (గీ-16-14) ఎన్ఱిరుక్కుమవన్.

---

(అసూయాప్రసవభూః) - ఇతరుల సద్గుణాలలో దోషాలను కల్పించే గుణమైన అసూయకు జన్మస్థానం. నాకు దోషాలుండడమేకాదు, ఇతరుల గుణాలను కూడా దోషాలుగా చేసేవాడనని భావం.

(కృతఘ్నః) - ఉపకారం చేసినవారి విషయంలో అపకారాన్ని చేసేవాడను. "గోఘ్నే చైవ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా, నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః" (గోవును చంపినవానికి, సురను తాగినవానికి, దొంగకు, చేసిన వ్రతాన్ని తప్పినవానికి నిష్కృతి పెద్దలచే తెలుపబడింది. కాని, చేసిన మేలును మరచిన కృతఘ్నునకు మాత్రం నిష్కృతి చెప్పబడలేదు) అనేరీతిలో వందమంది తల్లితండ్రులకన్నా ఎక్కువ వాత్సల్యాన్ని కల శాస్త్రంలో కూడా బహిష్కృతుడను - అంటే నిష్కృతి తెలుపబడనివాడను - అని భావం.

(దుర్మానీ) - ఈ విధంగా నికృష్టుడనైనా, సర్వోత్కృష్టుల కంటే గొప్పవాడనని నన్ను భావించేవాడను. "ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ" (నేనే ఈశ్వరుడను, నేనే భోగాన్ని పొందేవాడను, నేను సహజంగానే సిద్ధిని కలవాడను, బలవంతునిగా, సుఖాన్ని కలవాడనుగా నేనున్నాను.)

**(స్మరపరవశః)** తన్నై ఉత్కృష్టజన్మాక్కళుక్కు మేలాక నినైత్తిరుక్కుమళవిన్‌ఱిక్కే, విషయప్రావణ్యహేతువాన కామనుక్కు ప్పరతన్త్రనాకవుమ్, భగవత్ప్రావణ్య హేతుభూతరానారై త్తాழనినైత్తుమనర్థప్పట్టే న్నై,

**(వఞ్చనపరః)** కామపారవశ్యత్తాలే విషయఙ్గళిలే ప్రవణనాయ్, అవ్విషయఙ్గళిలుమ్ ద్రవ్యఙ్గళై వఞ్చిత్తు వర్తిక్కుమవన్. 'ఘూతనాయ్ క్కళ్వనాకి" (తిరుమా-16), "ఘూతినై ప్పెరుక్కి క్కళవినై త్తుణిన్దు" (తి-మొ-1-6-3) ఎన్‌ఱుమ్ శొల్లుకిఱపడియే.

**(నృశంసః)** తాన్ విరుమ్బిన విషయఙ్గళిల్ వఞ్చనాకైయన్‌ఱిక్కే, తన్నై విశ్వసిత్తిరుప్పార్‌పక్కల్ క్రూరకర్మావా యిరుక్కుమవన్.

---

**(స్మరపరవశః)** - తనను ఉత్కృష్టులకంటే గొప్పగా భావించడం మాత్రమేకాకుండా, విషయప్రావణ్యానికి (లౌకిక సుఖాలలో మితిమీరిన ఆశను కల్గి ఉండడానికి) హేతువైన కామానికి పరతంత్రుడనై, భగవత్ప్రావణ్యాన్ని పొందడానికి హేతుభూతులైనవారిని గూర్చి తక్కువగా తలచి అనర్థాన్ని పొందాను.

**(వంచనపరః)** - కామపారవశ్యంతో విషయాలలో (స్త్రీలపట్ల) ప్రావణ్యాన్ని కలవాడనై, ఆ విషయాలలోకూడా (స్త్రీలవద్దకూడా) ద్రవ్యాలను (ధనాన్ని) వంచించి వర్తించేవాడను. **"ఘూదనాయ్ కళ్వనాకి తూర్త్తరోడిశైన్ద కాలమ్"** (జూదగాడనై, దొంగనై, ధూర్తులతో వర్తించిన కాలం) అని, **"ఘూదినై ప్పెరుక్కి క్కళవినై త్తుణిన్దు"** (జూదాన్ని ఆడి, దొంగతనాన్ని చేసి) అని పల్కినట్లు వంచనపరుడను.

**(నృశంసః)** - తాను కోరిన విషయాలలో (స్త్రీలపట్ల) వంచనను కలవాడనై ఉండడమే కాక, తనను నమ్మినవారి విషయంలో క్రూరకర్మను చేసేవాడను.



**(పాపిష్ఠః)** ఇతుక్కెల్లామడి పాపరుచియేయాయ్, అతిలే వ్యవస్థితనాయిరుక్కై. "పావమే శెయ్‌తు పావియానేన్" (తి-మొ-1-9-9), "ఒప్పిలా త్తీవినైయేనై" (తి-వాయ్-7-9-4), "నానే నానావితనరకమ్ పుకుమ్ పాపమ్ శెయ్‌తేన్" (తి-మొ-1-9-2), "అహమస్మ్యపరాధానా మాలయః" (అహిర్బు-సం-36-38), "రావణో నామ దుర్వృత్తః" (రా-యు-18-10), "నీశనేన్ నిఱై వొన్ఱు మిలేన్" (తి-వాయ్-3-3-4) ఎన్‌ఱితే అఱివుడైయార్ తన్దామై ప్పేశుమ్బడి.

**(అపారాదితో దుఃఖజలధే కథ ముత్తీర్ణోఽహమ్)** ఒరు నాళిలే తుడఙ్గిన దుఃఖమాతల్, మేలొరు నాழிలే ముడివు కాణుతల్, శెయ్యుమతల్లామైయాలే కరైయిన్‌ఱిక్కే యిరుక్కై. "ఇతో దుఃఖజలధేః" ఎన్‌ఱు దృష్టివిషమ్బోలేకాణ భయమాయిరుక్కిఱ దుఃఖసాగరత్తి నిన్‌ఱుమ్.

---

**(పాపిష్ఠః)** - దీనికి అంతటికి కారణం పాపరుచియై, అందులో (పాపాలలో) వ్యవస్థితుడనై, మిక్కిలి స్థిరమైన నిష్ఠను కలవాడనై ఉన్నాను. **"పావమే శెయ్‌దు పావియానేన్"** (కేవలం పాపాన్నే చేసి పాపిష్ఠివాడనయ్యాను), **"ఒప్పిలా త్తీవినైయేన్"** (సాటి లేని పాపిష్ఠివాడను), **"నానే నానావిద నరకమ్ పుకుమ్ పావమ్ శెయ్‌దేన్"** (నేనే పలువిధాలైన నరకంలో ప్రవేశించే పాపం చేశాను), **"అహ మస్మ్యపరాధానా మాలయః"** (నేను అపరాధాలకు నిలయాన్ని), **"రావణో నామ దుర్వృత్తః"** (రావణుడనే చెడ్డవర్తనాన్ని కలవాడు) ఇత్యాదులు స్మరణీయాలు. **"నీశనేన్ నిఱై వొన్ఱుమిలేన్"** (నీచుడను, ఏగుణం లేనివాడను) అని జ్ఞానులు తమను గూర్చి పలికే రీతిలోని పాపంలో నిష్ఠను కలవాడను.

**(అపారాదితో దుఃఖజలధే కథ ముత్తీర్ణోఽహమ్)** - ఒకనాడు ఆరంభమైన దుఃఖమనిగాని, తరువాత ఒకనాడు అంతం చూచేటట్లుండే దుఃఖంగా గాని కానందున, దృష్టివిషం వలె చూస్తే భయం కలిగేటట్లుండే దుఃఖం సాగరం నుండి,

**(కథముత్తీర్ణః)** ఇతిలే అழுన్ది క్కిడక్కిఱ నాన్ కరైయేఱ ఎన్బతొన్డుణ్డో? ''ముత్తనార్'' (తి-చ-వి-105) ఎన్గిఱపడియే అస్పృష్టసంసారగన్ధరాన దేవరే కరైయేற்றవేణుమెన్డై.

**(తవ చరణయోః కథం పరిచరేయమ్?)** దుఃఖనివృత్తిక్కుమ్ అక్షమనాయిరుక్కిఱ నాన్. నిత్యసూరికళడిమై శెయ్యు ఇరుక్కిఱ దేవర్‌తిరువడికళిలే ఎఙ్గనే పరిచర్యై పణ్ణువన్? దుఃఖనివృత్తియుమ్ దేవర్క్కే భరమ్. అడిమైకొళ్ళుకైయుమ్ దేవర్క్కే భరమెన్డై.

---

**(కథముత్తీర్ణః)** ఈ సంసార సముద్రంలో మునిగి ఉండే నేను ఆ సముద్రతీరాన్ని చేరడం అనేది ఉన్నదా? "ముత్తనార్" (భగవంతుడు సంసార సంబంధం లేనివాడు) అనే విధంగా సంసారసంబంధం ఏమాత్రం లేని నువ్వే నన్ను తీరాన్ని చేర్చాలి - అని భావం

**(తవ చరణయోః కథం పరిచరేయమ్?)** - దుఃఖనివృత్తికి, అసమర్థుడనై (దుఃఖాన్ని తీర్చుకోవడంలో అసమర్థుడనై) ఉండే నేను, నిత్యసూరులు కైంకర్యం చేసే నీ శ్రీచరణాలలో ఏవిధంగా పరిచర్యను చేయగలను? నా దుఃఖ నివృత్తి కూడా నీకు భారమే (బాధ్యతయే). నేను చేసే కైంకర్యాన్ని గ్రహించడంకూడా నీ బాధ్యతయే - అని భావం.



**63.శ్లో॥** రఘువర! యదభూస్త్వం తాదృశో వాయసస్య
ప్రణత ఇతి దయాలు ర్యస్య చైద్యస్య కృష్ణః ।
ప్రతిభవమపరాద్ధు ర్ముగ్ధ! సాయుజ్యదోభూః
వద కిమపద మాగ స్తస్య తేఽస్తి క్షమాయాః ॥

అవ : **(రఘువరేతి)** బుద్ధిపూర్వేణ పణ్ణిన ప్రాతికూల్యఙ్గళై ప్పొఱుక్కప్పోమో? ఎన్న; కాకాపరాధత్తైయుమ్ శిశుపాలాపరాధత్తైయుమ్ పొఱుత్తరుళిన దేవర్క్కు ప్పొఱుక్కముడియాత తుణ్డో ? ఎన్గిఱార్.

వ్యా : **(రఘువర!)** శరణాగతరక్షణమ్ పణ్ణిప్పోన్ద రఘుప్రభృతికళ్ ఘాతుకరెన్నుమ్బడి శరణాగతరక్షణత్తిలే అధికరాయిరుక్కై. రఘురాక్షస సంవాదత్తిల్ శరణాగతరక్షణమ్బణ్ణిప్పోన్దవవర్కళవిణ్టిక్కే "సుగ్రీవం శరణం గతః" (రా-కి-4-19) ఎన్టుమ్, "త్వయి కిఞ్చిత్సమాపన్నే" (రా-యు-41-4)

---

**63.శ్లో॥** అవ : **(రఘువరేతి)** - బుద్ధిపూర్వకంగా చేసిన ప్రతికూలకార్యాలను (పాపాలను) సహించడం సాధ్యమా? అంటే, కాకాసురుని అపరాధాలను, శిశుపాలుని అపరాధాలను సహించిన నీకు ఇక సహించలేనిది ఒకటి ఉన్నదా? అని ఇందులో పల్కుతున్నారు.

వ్యా : శరణాగత రక్షణాన్ని చేసిన రఘువు మొదలైనవారు ఘాతకులు- అనే రీతిలో శరణాగతరక్షణంలో అధికరించినవారనిభావం. (యోగ్యతను కలవారని భావం) రఘురాక్షససంవాదంలో (తెల్పిన) శరణాగతరక్షణం చేసినవారి అవధిలో కాకుండా, "పితా యస్య పురా హ్యాసీత్ శరణ్యో ధర్మవత్సలః, తస్య పుత్రః శరణ్యశ్చ సుగ్రీవం శరణం గతః" (ధర్మంలో ప్రియాన్ని కలవాడైన ఏ శ్రీరాముని తండ్రి పూర్వం ఒకానొక సమయంలో శరణు పొందదగినవాడై ఉన్నాడో, అతని పుత్రుడు, శరణ్యుడైన రాఘువుడు ఇపుడు సుగ్రీవుని శరణు పొందాడు) అని, "త్వయి కించిత్ సమాపన్నే కిం

ఇత్యారభ్య **"భరతే రాజ్యమావేశ్య త్యక్ష్యే దేహమ్" (రా)** ఎన్గిఱతే ఇవర్పడి.

**(తాదృశః)** అప్పడిప్పట్టవన్-ఎన్నుమత్తనైయొழிయ అనుభాషిక్కైతాన్ అసహ్యమామ్పడియితే పణ్ణిన అపరాధమ్.

**(వాయసస్య)** అపరాధమ్ పణ్ణుకైక్కాక ప్రాప్తమాన దేవత్వత్తై విట్టు నిహీనమాన తిర్యక్త్వత్తై ప్పరిగ్రహిత్తాన్ - ఎన్తై.

**(ప్రణత ఇతి) "స పిత్రా చ పరిత్యక్తః" (రా-సు-38-32)** ఎన్గిఱపడియే ఇవనై ప్పరిగ్రహిక్కిల్ నమక్కు మనర్థమామెన్తు సర్వరుము పేక్షిక్క ప్పుకలற்று, **"స తం నిపతితం భూమౌ" (రా-సు-38-34)** ఎన్గిఱపడియే విழுన్దవనై

---

**కార్యం సీతయా మమ?"** (నీకేదయినా కొంచెం ఆపద కల్గితే ఇక నాకు సీతతో ఏమి పని?) అని కదా భగవంతుని రీతి ఉంటుంది.

**(తాదృశః)** - అటువంటివాడు - అని పల్కడం తప్ప, అనువదించడం కూడా అసహ్యంగా ఉండేటట్లుగా కదా అతడు చేసిన అపరాధం ఉన్నది.

**(వాయసస్య)** - అపరాధాన్ని చేయడంకోసం తనకు సహజంగా ఉండే దేవత్వాన్ని విడచిపెట్టి, నిహీనమైన తిర్యక్ (వాయస) రూపాన్ని పరిగ్రహించాడు.

**(ప్రణత ఇతి) - "స పిత్రా చ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః, త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః, సతం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"** (ఆ కాకాసురుడు, తండ్రిచేత, తల్లిచేత, మహర్షులతో కూడిన దేవతలచేత విడువబడినవాడై, మూడు లోకాలను చుట్టి తిరిగి, ఆ శ్రీరామునే శరణు పొందాడు. శరణు పొందినవాడు, భూమిపై పడినవాడైన అతడు, వధించదగినవాడైనా, శరణు పొందదగినవాడైన శ్రీరాముడు తన కృపతో అతనిని కాపాడాడు) అనే విధంగా ఇతనిని పరిగ్రహిస్తే నాకు అనర్థం - అని అందఱు ఉపేక్షించగా, గతి లేక, **"స తం నిపతితం భూమౌ"** (భూమిపై



శరణాగతనెన్తు దయైయై ప్పణ్ణి. ఋషి **"శరణాగతమ్" (రా సుం 38-34)** ఎన్గతుమ్ రామాభిప్రాయత్తాలే

**(త్వం దయాళు రభూ రితి యత్)** బ్రహ్మాస్త్రత్తుక్కు ఇలక్కాక్కుమళవిలే దేవర్, **"కృపయా పర్యపాలయత్" (రా సుం 38-34)** ఎన్గిఱపడియే, దయాళువానీర్, **"క్షిపామి" (గీ-16-19)** ఎన్తుమ్, **"న క్షమామి" (వరాహపు)** ఎన్తుమ్ పణ్ణివైత్త ప్రతిజ్ఞై ఫలియాతే, దేవర్కృపాకార్యమే ఫలిత్తువిట్టతు - పిరాట్టి సన్నిధియాలే యిఱే.

**(యచ్చ)** చశబ్దత్తాలే కాకాపరాధత్తై ప్పొఱుత్తవళవేయో? వేఱు ఉదాహరణాన్తరత్తైయుమ్ సముచ్చయిక్కిఱార్.

---

అలసిపడిన అతనిని) అనేటట్లు భూమిపై పడినవానిని శరణాగతుడని తలచి - అని భావం. మహర్షి **"శరణాగతమ్"** అని అనడం కూడా శ్రీరాముని అభిప్రాయానుసారంగా.

**(త్వం దయాళురభూః)**- బ్రహ్మాస్త్రానికి కాకాసురుడు లక్ష్యం అయ్యేటట్లు, నీవు **"కృపయా పర్యపాలయత్"** (కృపతో కాపాడాడు) అనే రీతిలో కదా దయాళువు అయ్యావు. **"తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు"** (నన్ను ద్వేషించేవారు, క్రూరులు, మానవులలో అధములు, మంచిని లేనివారై ఉండే వారిని నేను సంసారసాగరంలో, అందులోను, ఆసురజన్మలలోకి తోసివేస్తాను) అని, **"మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వంతి యే నరాః, పద్మకోటిశతేనాపి న క్షమామి వసుంధరే!"** (భూదేవీ! ఛండాల జాతికి చెందినవాడైనా, నాభక్తుడైన వానిని ఎవరు దూషిస్తారో, వారిని నేను కోట్లానుకోట్ల సంవత్సరాలకు అయినా క్షమించను) అని చేసిన ప్రతిజ్ఞ ఫలించకుండా, నీ కృపాకార్యమే ఫలించింది, పిరాట్టి సన్నిహితంగా ఉన్నందున.

**(యచ్చ) "చ"** శబ్దంతో "కాకాసురుని అపరాధాన్ని సహించడం మాత్రమేనా?" అని ఉదాహరణాంతరాన్ని సముచ్చీకరిస్తున్నారు.

**(చైద్యస్య)** యదువంశజాతరిఱ్కాట్టిల్ చేదిక్కులోద్భవనెన్ఱు తన్నై ఉత్కృష్టనాక అభిమాని త్తిరుక్కవమన్.

**(ప్రతిభవ మపరాద్ధః)** కాకత్తైప్పోలే ఒరుకాల్ అపరాధత్తై ప్పణ్ణినవళవన్ఱిక్కే జన్మమ్ తోఱుమ్ ప్రాతికూల్యత్తిలే వాసనైపణ్ణినవనుక్కు.

**(సాయుజ్యదోఽభూః)** "బహూనాం జన్మనా మన్తే" (గీ-7-19) ఎన్ఱుమ్, "అనేకజన్మసంసిద్ధః" (గీ) ఎన్ఱుమ్ "ఆస్థితా జనకాదయః" (గీ-3-20) ఎన్ఱుమ్ జన్మన్దోఱుమ్ ఆశ్రయిత్తుప్పోన్దార్ పెఱుమ్పెఱ్ఱయిఱే కొడుత్తతు సాయుజ్యమాకిఱతు - సమానభోగమ్. "సాయుజ్యం ప్రతిపన్నా యే తీవ్ర

---

**(చైద్యస్య)** - యదువంశంలో కంటే, చేదికులంలో పుట్టినవాడనని తనను గొప్పగా అభిమానించేవాడై,

**(ప్రతిభవమపరాద్ధః)** - కాకాసురుడు వలె, ఒక పర్యాయం అపరాధాన్ని చేయడం మాత్రమే కాకుండా, జన్మాల తరబడి ప్రాతికూల్యంలో (ప్రతికూలవర్తనంలో) వాసనను కల్గినవానికి - అని భావం.

**(సాయుజ్యదోఽభూః)** - **"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః"** (పలు జన్మలకు పిమ్మట జ్ఞానాన్ని కలవాడు నన్ను శరణు పొందుతున్నాడు. వాసుదేవుడనైన నేనే ధారకపోషకభోగ్యాలు - అని భావించే ఆమహాత్ముడు చాలా దుర్లభుడు)అని, **"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః, అనేక జన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్"** (అందువల్ల పలు జన్మలలో సిద్ధిని పొందినవాడు, పాపాలు తీరినవాడైన యోగి, ప్రయత్నంలో కూడినవాడైతే గొప్ప గతిని పొందుతాడు) అని పలు జన్మలలో ఆశ్రయించినవారు పొందే ప్రాప్యాన్నే ఇచ్చావు. సాయుజ్యమంటే సమానగుణయోగం. **"సాయుజ్యం ప్రతిపన్నా యే తీవ్రభక్తా స్తపస్వినః, కింకరా మమ తే నిత్యం భవంతి నిరుపద్రవాః"** (ఎవరు గొప్ప భక్తిని కలవారవుతున్నారో, ఎవరు ప్రపత్తి అనే



భక్తా స్తపస్వినః, కిఙ్కరా మమ తే నిత్యం భవన్తి నిరుపద్రవాః" (విష్ణుతత్త్వే-3).

**(ముగ్ధ!)** "ఆయర్కులత్తిఱ్ఱిళమ్బిళ్ళై" (తి-వాయ్-7-6-10) ఎన్గిఱపడియే అపరాధానభిజ్ఞనిఱే కృష్ణన్. అతుక్కుమేలే ఒరు పేఱిఱే ముడికిఱ దశైయిలే సుఖరూపమాన వడివై క్కణ్ణుక్కిలక్కాక్కిన వేఱ్ఱమ్.

**(తస్య తే క్షమాయాః అపదమాగః కిమస్తి?)** కాలభేదత్తాలే దేవర్ వేఱే యొరువరాకిఱీరల్లర్, దేవరుడైయ క్షమైక్కు అవిషయమాన పాపముణ్డో? కిం క్షేపే. అపదమ్ - అస్థానమ్, అవిషయమిత్యర్థః,

**(వద)** సర్వజ్ఞరానదేవర్క్కు మఱుమాఱ్ఱమిల్లై. క్షమైక్కు ఇలక్కాక్కి విషయీకరిక్క మిత్తనైయెన్నై.

---

తపస్సును చేసినవారో, వారే నాతో సాయుజ్యాన్ని పొంది, సంసారమనే ఉపద్రవాన్ని పోగొట్టుకొన్నవారై, సదా నాకు కైంకర్యం చేసేవారవుతారు) అనే ప్రమాణం స్మరణీయం.

**(ముగ్ధ)** - **"ఆయర్కులత్తిఱ్ఱిళమ్బిళ్ళై"** (గొల్ల కులంలో పుట్టిన లేతవయస్సులోని బాలుడు) అనేటట్లు అపరాధాలను తెలియనివాడుకదా శ్రీకృష్ణుడు. అంతకుమించి, ఒక ప్రాప్యాన్ని, మరణించే సమయంలో సుఖరూపమైన రూపాన్ని (తన దివ్యమంగళవిగ్రహాన్ని) కంటికి దర్శింపజేసిన అతిశయం దీనిద్వారా తెలుపబడింది.

**(తస్య తే క్షమాయాః అపద మాగః కిమస్తి?)** - కాలభేదంతో నీవు ఇంకొకడవు కాలేవు; నీకృపకు విషయం కాని (లక్ష్యం కాని) పాపమనేది ఉన్నదా! **"కిమ్"** అనే శబ్దం క్షేపార్థకం లేదని భావం. అపదమ్ అంటే అస్థానం (విషయం కానిదని భావం).

**(వద)** - సర్వజ్ఞుడవైన నీకు కూడా సమాధానం లేదు. క్షమకు విషయంగా చేసి అనుగ్రహిస్తావు - అంతే; అని భావం.

**64.శ్లో॥** నను ప్రపన్న స్సకృదేవ నాథ!
తవాహ మస్మీతి చ యాచమానః ।
తవానుకమ్ప్యః స్మరతః ప్రతిజ్ఞాం
మదేకవర్జం కిమిదం వ్రతం తే ॥

అవ : **(నన్వితి)** స్వతన్త్రరాననామ్ శిలర్తిఅత్తిల్ ఒన్ఱై చ్చెయ్‌తో మెన్ఱాల్, ఇతువే- మర్యాదైయాక క్కడవతో? ఎన్న; కడల్ కరైయిలే ఆశ్రితసామాన్యత్తిలే దేవర్‌పణ్ణిన ప్రతిజ్ఞై ఎన్నై యొరువనైయుమొழியవో? ఎన్గిఱార్.

వ్యా : **(నను ప్రపన్న స్సకృదేవ)** "సకృదేవ ప్రపన్నాయ" **(రా-యు-18-33)** ఎన్గత్తై స్మరిక్కిఱార్. "సకృదేవ" ఎన్గతు- "సహసైవ" ఎన్ఱు ఆழ్వాన్ నిర్వహిక్కుమ్. అనాదికాలమ్ సంసరిత్తు పోన్దవివన్ ఒరు జన్మమెల్లామ్

---

**64.శ్లో॥** అవ : స్వతంత్రుడనైన నేను కొందఱి విషయంలో ఏదో చేశాను- అని అంటే, అదే అందఱికీ చెందే మర్యాదగా కావాలా? - అని భగవంతుడు ప్రశ్నించగా, "సముద్రతీరంలో భక్తులందఱి సమక్షంలో నీవు చేసిన ప్రతిజ్ఞ నా ఒక్కని మాత్రం వదలిపెట్టి చేశావా? అని పల్కుతున్నారు.

వ్యా : **(నమ ప్రపన్నః) - "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం తం మమ"** (ఒక పర్యాయం శరణు పొందినవానికి, నీకు నేను శేషభూతుడనని ప్రార్థించినవానికి సమస్తప్రాణులనుండి అభయాన్ని ఇస్తాను, ఇది నావ్రతం) అని పల్కిన సూక్తిని ఈ ప్రయోగం ద్వారా స్మరిస్తున్నారు. **"సకృదేవ"** అనే పదానికి కూరేశులు **"సహసైవ"** (వెంటనే) అనే అర్థాన్ని నిర్వహించారు. "అనాదికాలంగా సంసారంలో పడి ఉండే ఈజీవుడు ఒకజన్మ అంతా ప్రపత్తిని అనుసంధించినా **"సకృత్"** అని అనడానికి సరిపోతుందా?- అని ఎమ్బార్ అనేవారు. భగవత్ప్రభావాన్ని చూస్తే ఒకసారికి మించి చేస్తే అది ఎక్కువ. అయితే



ప్రపత్తియై అనుసన్ధిత్తాల్ తాన్ **"సకృత్"** ఎన్గైక్కు పోరుమో? ఎన్బర్ ఎమ్బార్. భగవత్ప్రభావత్తై ప్పార్‌త్తాల్ ఒరుకాలైక్కుమేల్ మిహై. ప్రాప్యరుచి- ప్రాప్తియళవుమ్ అనువర్తిక్కు మెన్బర్ భట్టర్.

**(నాథ!)** ఒరుకాల్ పణ్ణిన ప్రపత్తి అమైకిఱతు, వకుత్త నాథనాకైయాలే. ఆభిముఖ్యమాత్రమే అమైన్దిరుక్కిఱతు- ఇழవుపేఱు తన్నతాన కుడల్ తుడక్కాలే. అశరణ్యవిషత్తిల్ ఆర్తప్రపత్తిక్కుమ్ ఫలమ్ పాక్షికమ్. వకుత్తవిషయత్తిల్ దృప్తప్రపత్తిక్కుమ్ ఫలవ్యాప్తియుణ్డు.

**(తవాహ మస్మీతి చ యాచమానః)** "అహం తవాస్మి". భృత్యవస్తువానతు కిఞ్చిత్కరిత్తు తన్‌సత్తైయై లభిక్కవేణుమెన్ఱు యాచిక్కై. ఉత్తరార్ధప్రక్రియైయాలే కైఙ్కర్యత్తైప్రార్థిక్కై. "త్వత్పాదమూలం శరణం ప్రపద్యే"

---

ప్రాప్యరుచి ఆ ప్రాప్యాన్ని పొందేవరకు ప్రపత్తిని చేసేటట్లు చేసి అనువర్తింపజేస్తుంది - అని భట్టర్ పలికేవారు.

**(నాథ!)** - ఒకసారి చేసిన ప్రపత్తి సరిపోతుంది, భగవంతుడు ప్రాప్తశేషి కనుక. ఆభిముఖ్యం మాత్రమే చాలుననడం ఎందుకంటే - భక్తుని లాభనష్టాలు రెండు తనదే అయే గర్భసంబంధం కారణంగా. శరణ్యుని కానివాని విషయంలో ఆర్తప్రపత్తికి కూడా ఫలం పాక్షికం. ప్రాప్తవిషయంలో (భగవద్విషయంలో) దృప్తప్రపత్తికి కూడా ఫలవ్యాప్తి (ఫలం కల్గి తీరడం అనేది) ఉంటుంది.

**(తవాహ మస్మీతి చ యాచమానః) - "అహం తవాస్మి"** (నేను నీకు శేషమై ఉన్నాను) ప్రత్యగ్వస్తు (జీవాత్మ) భగవంతునకు కైంకర్యం చేసి సత్తను పొందాలని యాచించడం. ద్వయంలోని ఉత్తరార్ధ ప్రక్రియలో కైంకర్యాన్ని ప్రార్థించడం. **"త్వత్పాదమూలం శరణం ప్రపద్యే"** అని నా ఆకించన్యాన్ని పురస్కరించుకొని ప్రపత్తి చేశాను. **"ఐకాంతిక నిత్యకింకరః**

ఎన్ఱు ఎన్నుడైయ వెఱువైయై మున్నిట్టుక్కొణ్డు ప్రపత్తి పణ్ణినేన్. "ఐకాన్తికనిత్యకిఙ్కరః ప్రహర్షయిష్యామి" ఎన్ఱు ప్రాప్యాపేక్షైయుమ్ పణ్ణినేన్. ఇరణ్డు పదత్తాలుమ్ భక్తిప్రపత్తికళిరణ్డిలుమ్ అధికరిత్తవధికారికళిరువరైయుమ్ శొల్లుకిఱతు - ఎన్బారుముణ్డు.

(ప్రతిజ్ఞాం స్మరత స్తవానుకమ్ప్యః) "ఏతద్వ్రతం మమ" (రా యు 18-33) ఎన్ఱు కడల్కరైయిల్ పణ్ణిన ప్రతిజ్ఞైయై స్మరియానిన్ఱుకొణ్డు దేవర్క్కు అనుగ్రాహ్యన్.

(తే వ్రత మిదం మదేకవర్జం కిమ్?) సర్వసాధారణభూతరాన దేవరుడైయ సాధారణమాన ఇన్ద సఙ్కల్పమ్ ఎన్నై యొరువనైయుమ్ ఒழிన్దిరుక్కుమో? కిమ్-క్షేపే. ఇన్నానై యొழிయ వెన్ఱు విశేషిత్తతాకిలన్ఱో

---

ప్రహర్షయిష్యామి" (నీకు మాత్రమే నిత్యంగా కైంకర్యాన్ని చేసేవాడై, ఆనందిపజేస్తాను) అని ప్రాప్యాపేక్షను కూడా చేశాను. (ప్రాప్యాన్ని కూడా ప్రార్థించాను) ఇక్కడ ఈ రెండు పదాలతో భక్తిప్రపత్తులను రెండిటిని అనుష్ఠించిన అధికారులిద్దఱు చెప్పబడ్డారని పలికేవారుకూడా ఉన్నారు.

(ప్రతిజ్ఞాం స్మరత స్తవ అనుకమ్ప్యః) - "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదమ్యేతద్వ్రతం మమ" (ఒక్కమారు ప్రపత్తి చేసినవానికి, నీకు నేను శేషమని యాచించినవానికి అభయాన్ని అన్ని ప్రాణుల వల్ల కల్గిస్తాను. ఇది నా వ్రతం) అని సముద్రతీరంలో చేసిన ప్రతిజ్ఞను స్మరిస్తూ నీవు నన్ను అనుగ్రహించాలి.

(తే వ్రత మిదం మదేకవర్జం కిమ్?) సర్వసాధారణ భూతుడవైన (అందఱికి చెందినవాడవైన) నీ అసాధారణమైన ఈ సంకల్పం నన్ను మాత్రం వదలిపెట్టి వర్తిస్తుందా? "కిమ్" - అనే పదం క్షేపార్థకం. "వీనినితప్ప" అని



ఎనక్కు ఇழக్కవేణ్డువతు, దేవర్ సత్యసఙ్కల్పరాకైక్కాక ఎన్నై రక్షిత్తరుళవేణు మెన్ఱై.

65.శ్లో॥ అకృత్రిమత్వచ్చరణారవిన్ద
ప్రేమప్రకర్షావధి మాత్మవన్తమ్।
పితామహం నాథమునిం విలోక్య
ప్రసీద మద్వృత్త మచిన్తయిత్వా ॥

అవ : (అకృత్రిమేతి) "రామో ద్విర్నాభిభాషతే" (రా-అయో-18-30) ఎన్గిఱ సఙ్కల్పత్తై విట్టీరేయాకిలుమ్, పెరియముతలియారోడు విద్యైయాలుమ్, జన్మత్తాలుముణ్డాన సమ్బన్ధత్తైయే పార్త్తరుళి ఎన్నుడైయ నన్మై తీమైకళైప్పారాతే విషయీకరిక్కవేణుమెన్న; అతుక్కు క్కణ్ణழிవిల్లామైయాలే అప్పడి శెయ్కిఱోమెన్ఱు ఈశ్వరన్ అనుమతిపణ్ణ, తాముమ్ అభిమతమ్ పెற்ఱారాయ్ స్తోత్రమ్ తలైక్కట్టుకిఱార్.

---

విశేషించి పల్కినపుడు కదా నేను కోల్పోవలసి ఉన్నది. నీవు సత్యసంకల్పుడవైనందున నన్ను రక్షించాలని భావం.

65.శ్లో॥ అవ : (అకృత్రిమేతి) - "తద్బ్రూహి వచనం దేవి! రాజ్ఞో యదభికాంక్షితమ్, కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే" (దేవీ! ప్రభువులు కోరిన ఆ వచనాన్ని తెల్పు. ఆ విధంగానే చేస్తాను. ప్రతిజ్ఞ చేస్తున్నాను. రాముడు రెండు రీతులలో పలుకడు) అనే సంకల్పాన్ని నీవు విడచిపెట్టినా, పెరియముదలియార్‌తో (నాథమునులతో) విద్యతో, జన్మతో నాకు గల సంబంధాన్ని చూచి, నా మంచి చెడ్డలను చూడకుండా అనుగ్రహించాలి- అని అనగా, దానికి (ప్రార్థనకు) ఏలోపం లేనందున, "ఆ విధంగానే చేస్తాను" అని ఈశ్వరుడు అనుమతించగా, తాము అనుమతిని పొందినవారై, స్తుతిని ముగిస్తున్నారు.

వ్యా : **(అకృత్రిమ)** క్రియయా నివృత్తః- కృతిమః. తద్రహితః- అకృత్రిమః, స్వాభావిక ఇత్యర్థః, కులన్దానే యోగికులమాకైయాలే నైసర్గికమాన ప్రేమ మెన్గై. మెయ్యాన ప్రేమ మెన్నవుమామ్.

**(త్వచ్చరణారవిన్ద)** ఇవ్వాత్మావుక్కు వకుత్త దేవర్తిరువడిత్తామరైకళిలే.

**(ప్రేమప్రకర్షావధిమ్)** భక్త్యుత్కర్షత్తుక్కవధియాయుళ్ళవరై. పరభక్తియుక్తరాయిరుక్కై. అనపాయినియాన ప్రీతిసంసారికళుక్కు శబ్దాదికళిలే, ఇవర్క్కు ఇవ్విషయత్తిలేయితే.

**(ఆత్మవన్తమ్)** భగవచ్ఛేషత్వైకరసరాయుళ్ళవరై. మేల్

---

వ్యా : **(అకృతిమ)** - **"క్రియయా నివృత్త- కృత్రిమః, తద్రహిత అకృత్రిమః స్వాభావిక ఇత్యర్థః"** కృత్రిమమంటే క్రియద్వారా చేయబడినది, ఆవిధంగా కానిది అకృత్రిమం- స్వాభావికమని భావం. తమ కులమే యోగికులమైనందున నిసర్గమైనదని భావం. (లేక) వాస్తవమైన ప్రేమ-అనికూడా భావం.

**(త్వచ్చరణారవింద)** - ఈ ఆత్మకు ప్రాప్తశేషివి అయిన నీ శ్రీచరణపద్మాలలో,

**(ప్రేమప్రకర్షావధిమ్)** - భక్త్యుత్కర్షానికి అవధియై ఉండేవారిని, పరభక్తిని కలవారని భావం. అనపాయిని- ఏనాడూ వీడని- ప్రీతి సంసారులకు శబ్దాది విషయాలలో ఉంటుంది. కాని, వీరికి ఈవిషయంలో (భగవంతుడే విషయంలో) కదా ఉన్నది.

**(ఆత్మవంతమ్)** - భగవచ్ఛేషత్వంలో మాత్రమే ఆసక్తిని కలవారని అర్థం. తరువాత మిక్కిలి ప్రేమను కలిగిఉండడానికి మూలమైన ఆత్మయాథాత్మ్య జ్ఞానాన్ని కలవారని భావం.



ప్రేమప్రకర్షత్తుక్కడియాన ఆత్మయాథాత్మ్యజ్ఞాన ముడైయవరెన్గై.

**(పితామహమ్)** విద్యయా జన్మనా చ.

**(నాథమునిమ్)** శ్రీరఙ్గనాథరెన్ఱు తిరునామత్తై యుడైయవరాయ్, భగవద్జ్ఞాననిధియాయుళ్ళవరై.

**(విలోక్య ప్రసీద)** అవరై ప్పార్త్తు ఎన్నపరాధఙ్గళై ప్పొఱుత్తరుళవేణుమ్.

**(మద్వృత్తమచిన్తయిత్వా)** అసత్కర్మత్తై విస్మరిత్తవోపాతి సత్కర్మత్తైయుమ్ చిన్తియాతే, అవరై ప్పార్త్తు ప్రపన్నరాకవేణు మెన్గై.

**(మద్వృత్తమ్)** ఎన్ఱు సత్కర్మత్తై నినైక్కిఱతు. వృత్తవానెన్ఱాల్ సత్కర్మయుక్తనైయితే శొల్లుకిఱతు. స్వగతమానవ***ఱ్ఱై*** అనాదరిత్తు; పెరియముతలియారోట్టై సమ్బన్ధత్తైయే పార్త్తు రక్షిత్తరుళవేణుమ్.

---

**(పితామహమ్)** - విద్యద్వారా, జన్మద్వారా నాతో సంబంధాన్ని కల నాథమునులను అని భావం.

**(నాథమునిమ్)** - శ్రీరంగనాథులనే తిరునామాన్ని కలవారై, భగవద్జ్ఞాననిధియై ఉండేవారిని.

**(విలోక్య ప్రసీద)** - అటువంటి నాథమునులను చూచి, నా అపరాధాలను సహించాలి.

**(మద్వృత్త మచింతయిత్వా)** - నా అసత్కర్మలను విస్మరించినట్లే, సత్కర్మలను కూడా స్మరించకుండా, నాథమునులను చూచి ప్రసన్నుడవు కావాలి.

**"మద్వృత్తమ్"** - అని అన్నపుడు సత్కర్మను స్మరించాలి. **"వృత్తవాన్"** అంటే - సత్కర్మలను ఆచరించేవాడని కదా అర్థం. తమలో ఉండేవానిని లెక్కించకుండా, శ్రీనాథమునులతో నాకు గల సంబంధాన్నే చూచి అనుగ్రహించాలి.

## పాఠాంతరమ్

**(త్వత్)** ప్రాప్తశేషియాన ఉన్నుడైయ,

**(చరణారవిన్ద)** ఆశ్రితర్క్కు ఇఴియుమ్ భోగ్యమాన తిరువడికళై

**(ప్రేమప్రకర్షావధిమ్)** ప్రేమాతిశయ సీమాభూమియానవర్ నమక్కు ఇతరవిషయఙ్గళిల్ ప్రేమమెల్లామ్ ఇవర్ ఇవర్క్కు వకుత్త విషయత్తిలేయిఱే యిరుప్పతు.

**(ఆత్మవన్తమ్)** భగవచ్ఛేషత్వమ్ స్వరూపమాకవే ఆత్మయాథాత్మ్యజ్ఞాన ముడైయవరెన్నై. "ధనవన్తమ్" ఎన్నుమాపోలే.

**(పితామహం నాథమునిమ్)** కుడల్ తుడక్కైయుడైయరాయ్,

---

## 65వ శ్లోకవ్యాఖ్యానంలో అధికపాఠం

**(త్వత్)** - ప్రాప్తశేషివి అయిన నీ- అని భావం.

**(చరణారవింద)** - ఆశ్రితులు సేవించే ప్రవేశించే రేవువంటిదై, భోగ్యాలైన శ్రీచరణాలను,

**(ప్రేమప్రకర్షావధిమ్)** - ప్రేమాతిశయానికి పరమావధి అయినవారు. మనకు లౌకికవిషయాలలోని ప్రేమ అంతా వీరికి ప్రాప్తవిషయాలలో కదా ఉన్నది.

**(ఆత్మవంతమ్)** - భగవచ్ఛేషత్వైకరసాన్ని కలవారై ఉండేవారిని. భగవానునకు మాత్రమే నేను శేషమనే భావనను కల్గి, తదనుగుణంగా కైంకర్యంచేసి ఆనందించేవారిని - అని భావం. ప్రేమప్రకర్షకు మూలమైన ఆత్మయాథాత్మ్యజ్ఞానాన్ని కలవారని భావం.

**(పితామహం నాథమునిమ్)** - గర్భ (రక్త) సంబంధాన్ని కలవారై,



భగవద్జ్ఞాననిధియాయుళ్ళవరై.

**(విలోక్య)** కటాక్షిత్తు.

**(ప్రసీద)** అపరాధఙ్గళై ప్పొఱుత్తరుళవేణుమ్.

**(మద్వృత్త మచిన్తయిత్వా)** అసత్కర్మత్తై విస్మరిక్కక్కడవరాక వేణుమెన్నై. "మద్వృత్తమ్" ఎన్ఱు సత్కర్మత్తై నినైక్కిఱతు. వృత్తవానెన్ఱాల్ సత్కర్మవృత్తనైయిఱే శొల్లువతు. స్వగతమానవఱ్ఱై అనాదరిత్తు, పెరియముతలియార్ సమ్బన్ధమ్ ఎనక్కు త్తఞ్జమాక వేణుమెన్ఱు ప్రార్థిత్తు స్తోత్రత్తై

---

భగవత్ జ్ఞాననిధియై ఉన్నవారిని - అని భావం.

**(విలోక్య)** - కటాక్షించి

**(ప్రసీద)** - అపరాధాలను క్షమించాలి.

**(మద్వృత్త మచింతయిత్వా)** - నా అసత్కర్మను విస్మరించ గలిగేవారుగా కావాలి - అని భావం. **"మద్వృత్తమ్"** అని సత్కర్మనే భావించాలి. **"వృత్తవాన్"** అంటే - సత్కర్మయుక్తుడని కదా అర్థం. స్వగతమైనవానిని (నాకు చెందినవానిని) అనాదరించి, నాథమునుల సంబంధం నాకు శరణంగా, రక్షకంగా కావాలని ప్రార్థించి, ఈ స్తుతిని శ్రీయామునులు నిగమించారు.

ఈ స్తోత్రరత్నంలో శ్రీయామునులు పల్కినదేమి? అంటే, మొదట అయిదు శ్లోకాలతో భగవద్విషయంలో ప్రవేశించడానికి యోగ్యునిగా చేసిన ఆచార్యులను ఉపకారస్మృతితో శరణు పొందారు. తరువాత నాల్గు శ్లోకాలతో భగవద్విషయంలో ప్రవేశించి, తత్ప్రభావంవల్ల స్తోత్రాక్షేపన సమాధానాలను (స్తోత్రం చేయలేమనే సందేహాన్ని, దానికి బదులును) పలికారు. **"నావేక్షసే"** అనే శ్లోకంనుండి ఆరంభించి, **"త్వదాశ్రితానామ్"** అనేశ్లోకంవరకు శరణ్య ప్రభావాన్ని తెలిపారు. **"నమోనమః"** ఇత్యాది శ్లోకంలో ఆ ప్రభావానికి జితులై, భగవచ్చరణాలలో వాలి, "న ధర్మనిష్ఠోఽస్మి" అని ఆరంభించి,

త్తలైక్కట్టి యరుళుకిఱార్.

స్తోత్రమ్ తన్నిల్ శెయ్‌తతాకిఱతు - ముతలిట్టఇఞ్జు శ్లోకత్తాలే భగవద్విషయత్తిలిழிకైక్కు యోగ్యనాక్కిన ఆచార్యనై ఉపకారస్మృతియాలే శరణమ్పుక్కు, అనన్తరమ్ నాలు శ్లోకత్తాలే భగవద్విషయత్తిలే ఇழிన్ద తత్ప్రభావత్తాలే స్తోత్రాక్షేప సమాధానత్తై ప్పణ్ణి, నావేక్షసే తుడజ్గి త్వదాశ్రితానా మఱుతియాక శరణ్యప్రభావత్తై చ్చొల్లి, నమోనమఃవిలే అన్ద ప్రభావత్తుక్కు త్తోற்றు త్తిరువడికళిలే విழுన్దు, "న ధర్మనిష్ఠోఽస్మి" ఎన్ఱు తొడజ్గి తవామృతస్యన్ది నియళవుమ్ వెఱుమైయై మున్నిట్టు శరణమ్పుక్కు, శరణాగతనుక్కు సమ్భావితమాన స్వభావజ్గలై చ్చొల్లి, త్వదఙ్ఘ్రి తుడజ్గి ఇరణ్డు శ్లోకత్తాలే మనోవాక్కాయజ్గళెల్లావற்றాలుమ్ శరణమ్ పుకవేణ్డా, కాయికమాతల్, మానసమాతలమైయుమ్, అభిమతసిద్ధిక్కెన్ఱు శొల్లి, విలాసతుడజ్గి భవన్తమ్ ముడివాక ప్రాప్యత్తై ప్రార్థిత్తు, తామ్ ప్రార్థిత్తపోతే

ప్రాప్యమ్ సిద్ధియామైయాలే సూరిభోగ్యమాన విషయత్తై నిత్యసంసారియాన నాన్ ఆశైప్పడక్కడవేనో ఎన్ఱు తమ్మై "ధిగశుచిమ్" ఎన్ఱు నిన్దిత్తు, పిన్పుతమ్ముడైయ రుచియాలే అయోగ్యతాహేతువాన పాపత్తైయుమ్, దేవరుడైయ కృపైయాలే పోక్కి యరుళవేణుమెన్ఱు తామ్ పణ్ణిన ప్రపత్తియై స్మరిప్పిత్తు అపరాధసహస్రవిలే అపేక్షిత్తు, అవివేకవెన్ఱు తొడజ్గి మూన్ఱు శ్లోకత్తాలే దేవర్ కృపైక్కు మాకాతారుణ్డో వెన్ఱు శొల్లి, మేలిరణ్డు శ్లోకత్తాలే స్వస్వరూపయాథాత్మ్యత్తైయుమ్ అవబోధితవిలే పరభక్తియైయు మపేక్షిత్తు, మేలిరణ్డు శ్లోకత్తాలే అప్పురుషార్థత్తిల్ చరమావధియాన తదీయశేషత్వత్తై ప్రార్థిత్తు, మేలొరు శ్లోకత్తాలే శేషత్వవిరోధికళై ప్పోక్కిత్తన్దరుళవేణుమెన్ఱపేక్షిత్తు, మేల్ మూన్ఱు శ్లోకత్తాలే "ఇప్పడి ఇచ్చిక్కిఱ నాన్ అశుభాస్పదన్. ఇచ్చైతానుమ్ పోట్కనానాలుమ్ దేవర్‌కృపాదిగుణజ్గళాలే అశుభత్తై ప్పోక్కి నిరుపాధికసంబన్ధత్తాలే ఇచ్చైయుమ్ పిఱప్పిక్కై దేవర్క్కే భర" మెన్ఱుమ్, మేలిరణ్డు శ్లోకత్తాలే విలక్షణసన్తానత్తిల్ జన్మముమ్ పాపప్రాచుర్యత్తాలే

---

"తవామృతస్యందిని" అనే శ్లోకం వరకు తమ ఆకించన్యాన్ని ముందుంచుకొని, శరణు పొంది, శరణాగతునకు సంభావితాలైన స్వభావాలను ప్రస్తావించారు. "త్వదంఘ్రి" అనే శ్లోకంనుండి రెండు శ్లోకాలతో "మనోవాక్కాయాలు అన్నిటితో శరణు పొందనక్కరలేదు. కాయికమైనా, మానసికమైనా, అభిమతం సిద్ధించడానికి చాలు'' అని అన్నారు. "విలాస" ఇత్యాది శ్లోకంనుండి "భవంతమ్" అనేశ్లోకం వరకు ప్రాప్యాన్ని ప్రార్థించి, తాము ప్రార్థించినపుడే ప్రాప్యం సిద్ధించనందున, ''నిత్యసూరి భోగ్యమైన భగవద్విషయాన్ని నిత్యసంసారి అయినా నేను ఆశపడగునా?'' అని తమను గూర్చి "ధిగశుచిమ్" ఇత్యాదిగా నిందించుకొన్నారు. తరువాత తమకు గల కైంకర్యరుచి కారణంగా నా అయోగ్యతాహేతువైన నా పాపాలను నీకృపతో పోగొట్టాలి- అని తాము చేసిన ప్రపత్తిని స్మరింపజేసి, "అపరాధసహస్రమ్" అనే శ్లోకంలో ప్రార్థించి, "అవివేక" ఇత్యాది శ్లోకంనుండి ఆరంభించి మూడు శ్లోకాలతో "నీ కృపకు సాధ్యం కానిది ఉన్నదా?'' అని పల్కి, తరువాత రెండు శ్లోకాలతో స్వస్వరూప యాథాత్మ్యాన్ని, "అవబోధిత" ఇత్యాది శ్లోకంలో పరభక్తిని అపేక్షించారు. తరువాత రెండు శ్లోకాలతో ఆ పురుషార్థంలో చరమావధియైన భాగవతశేషత్వాన్ని అర్థించి, తర్వాత ఒక శ్లోకంతో "శేషత్వవిరోధులను తీర్చి కాపాడాలి'' అని అపేక్షించారు. అనంతరం మూడు శ్లోకాలతో "ఈవిధంగా ఆశపడే నేను అశుభాలకు, పాపాలకు-ఆస్పదుడను. ఆశ అయితే బలమైనదే అయినా, నీవు కృపాదిగుణాలతో నా పాపాలను పోగొట్టి, నిరుపాధిక సంబంధంతో నాకు ఇచ్చను కూడా కల్గించడం నీకే భారం - అని అన్నారు. తరువాత రెండు శ్లోకాలతో ''విలక్షణ సంతానంలో జన్మ అనేది పాపప్రాచుర్యంవల్ల అకించిత్కరం - ఏ ఉపయోగం లేనిది'' అని పల్కి, తరువాత రెండు శ్లోకాలతో "నేను చేసిన ప్రపత్తిని తలచి, ఈ పాపాలను దేవరవారి క్షమకు విషయంగా చేయాలి (దయతో తీర్చాలి)'' అని అర్థించారు. "నేను చేసిన ప్రపత్తిని అనాదరించినా, ప్రపన్నవిషయంగా నీవు చేసిన ప్రతిజ్ఞను

అకిఞ్చిత్కరమెన్తు, మేలిరణ్డుశ్లోకత్తాలే నాన్ పణ్ణిన ప్రపత్తియై నినైత్తు ఇప్పాపత్తై దేవరుడైయ క్షమైక్కు విషయమాక్కవేణుమెన్తు మపేక్షిత్తు, నాన్ పణ్ణిన ప్రపత్తియై అనాదరిక్కిలుమ్, ప్రపన్నవిషయమాక పణ్ణిన ప్రతిజ్ఞైయై అనాదరిక్కిలుమ్ పెరియముతలియార్ పక్కల్దేవర్క్కుణ్డాన రాగత్తై విడవొణ్ణాతిఱే, తత్సమ్బన్ధత్తై ప్పార్త్తు ఎన్నుడైయ నన్మైతీమైకళై ప్పారాతే రక్షిత్తరుళవేణుమెన్తు ముడిక్కిఱార్.

---

అనాదరించినా, నాథమునుల పట్ల నీకు ఉండే ప్రేమను విడువడం నీకు సాధ్యం కాదు కదా! వారితో నాకు ఉండే సంబంధాన్ని చూచి నా మంచిచెడ్డలు గమనించకుండా నన్ను రక్షించాలి - అని పల్కి స్తుతి సమాప్తి చేశారు.



యత్పదామ్భోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః ।
వస్తుతా ముపయాతోऽహం యామునేయం నమామి తమ్ ॥

ఆళవన్దార్తిరువడికళేశరణమ్

పెరియవాచ్చాన్పిళ్ళై యరుళిచ్చెయ్త
ఆళవన్దార్ స్తోత్రవ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు



---

యత్పదామ్భోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః ।
వస్తుతా ముపయాతోऽహం యామునేయం నమామి తమ్ ॥

ఆళవన్దార్తిరువడికళేశరణం

పెరియవాచ్చాన్పిళ్ళై కటాక్షించిన
ఆళవన్దార్ స్తోత్రవ్యాఖ్యానమ్ సంపూర్ణం

